# పీఠిక

ఆధునిక ప్రబంధములలో హంసవింశతి యొక అపూర్వ ప్రబంధము.

హంస వింశతి అలనాఁటి జనసామాన్యము యొక్క స్థితిగతులకు అద్దము. తెలుఁగు పలుకుబళ్ళకుఁ బుట్ట. బహువిషయ విజ్ఞాన సంపత్తికిఁ గాణాచి. చవులూరించు చిన్న చిన్న కథలతో ముద్దులొలుకు మంచి మంచి పద్యములతో రసికజనమును వశీకరించుకొన్న రమణీయప్రబంధము.

ఈప్రబంధమునందలి దేశీయమైన పలుకుబడి విలువ గుర్తించిన భాషాసేవకులలో బ్రౌన్ దొర ప్రథముఁడు. బ్రౌణ్యా నిఘంటువున నెక్కడఁ జూచిన నక్కడ హంస వింశతి పదములు పద్యములు కానవచ్చును.

హంసవింశతి అక్షయ ప్రజాసాహిత్య నిక్షేపము.

## కవి

అయ్యలరాజు నారాయణామాత్యుఁడు. కౌండిన్యస గోత్రుఁడు. కొండమాంబా సూరయార్యుల పుత్రుఁడు.

"మంత్రి మాత్రుండె? దుర్మంత్రి మంత్ర తంత్ర సంత్రాసకరణ స్వతంత్రుఁడు" (1-15)

"వెండియు నఖండ తేజఃకాండ మార్తాండ మండల ప్రచండుండు"

"నిజ వితరణ........వ్యూహుండు, నారాయణామాత్య దేవేంద్రుండు" (1-16)

ఇతఁడు ప్రభువు కాఁడు. తేజశ్శాలియైన మంత్రియా? తన ప్రభువు పేరు చెప్పలేదు. కనుక మంత్రియుఁగాఁడు. నియోగి బ్రాహ్మణ కుటుంబి. అమాత్య నియోగి శబ్దములు గ్రామకరణమున కుపలక్షకములుగా నితఁడు ప్రయోగించెను.

"దిగులుం బొంది నియోగి యెట్టు లనుచున్ దేహంబు కంపింప, నా చిగురుంబోఁడి యమాత్యు వీఁ పడఁచి తాఁ జెన్నొంద" (3-100) ఈపద్యమున 'నియోగి', 'అమాత్యుఁడు' ఊరి కరణమే (పదవ కథ). కనుక నారాయణకవి ఒకరికిఁ బెట్టుటకుఁ దాఁ దినుటకుఁ జాలినంత కలిమిగల సంపన్న గృహస్థు, కరణము అని చెప్ప వచ్చును.

అల్లసాని పెద్దనామాత్యుఁడు కరణమేనా ? అన్నచోఁ గరణముకాఁడు. విద్యా శాఖామాత్యుఁడే. ప్రస్తుతకవి కరణ మని చెప్పుటకు గ్రంథమే సాక్షి.

## దేశము

అవతారిక యందుఁ గవి తన యింటి చాలు జెప్పికొన్నాఁడు.

ఉ. అయ్యలరాజుఁ దిప్ప సచివాగ్రణిఁ బర్వతరాజు రామ భ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుండగు కొండ ధీరునిన్

జయ్యనఁ దిమ్మయ ప్రభుని సత్కవితా రచనాఢ్యులైన మా
యయ్యలరాజు వంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్. (1-12)

అయ్యలరాజు వంశపుఁ గుదురు కడప మండలమున నున్నది. ఆచార్య కె. వి ఆర్. నరసింహముగారు రామాభ్యుదయ పీఠికయందు "రామభద్రకవి పూర్వులు తర తరములనుండియు నేఁటి కడప మండలము లోని యొంటిమిట్ట యందు నివసించుచుండి రనియు నీ కవి గూడఁ దన బాల్య మంతయు నందే గడపి యుండుననియు మనము నిశ్చయముగాఁ జెప్పవచ్చు" నని వ్రాసిరి. కనుక నీకవి యొంటిమిట్ట ప్రాంతమునఁ బుట్టెనని చెప్పవచ్చును.

కీ॥శే॥ కావ్యపురాణస్మృతి తీర్థులు జనమంచి శేషాద్రి శర్మగారు, కడప జిల్లా పుల్లంపేట తాలూకాలోని పొత్తపి యను గ్రామమున నారాయణకవి యుండెనని, ఆ ప్రాంతమునఁ జెప్పుకొనుచున్నా రని వ్రాసిరి. ఆ పొత్తపి యొంటిమిట్ట చేరువ నున్నది.

నగర గ్రామ నామముల పట్టికలోఁ గడప మండలము నందలి చిన్నచిన్న యూళ్ళ పేర్లుగూడ వ్రాసెను గనుక ఈకవి "కడపమండల వాసియే యని నిర్ధారణము సేయ నవకాశము కలుగునే కాని వేఱొక యూహ కవకాశము కల్గదు" అని శ్రీ శర్మగా రుద్ఘాటించిరి. "పుష్పగిరి తిరునాళ్ళను గూడఁ బేర్కొనుటయుఁగూడ నా పై యుద్దేశమును బలపఱచు చున్న" దనిరి.

అంతేకాదు, అయిదవ రాత్రి కథలో గొల్ల దంపతులు పిల్లలు లేక పుష్పగిరి తీర్థము కొంగుముళ్ళతో సేవింతురు. ఈ పుష్పగిరి కడపది. గొడ్రాండ్రు సంతానాపేక్షతోఁ బుష్పగిరి గుట్ట తిరుగుట నేఁటికిని గద్దు.

నదుల పట్టికలో బాహుద, కుముద్వతి కలపు, అదే పట్టికలోఁ బునరుక్తి గాఁ జెయ్యేఱు, కుందు చేర్పఁబడినవి. ఇవి కడప మండలమునఁ బాఱు పను నదులు, అభిమానముతో ఆమ్రేడించినాఁడు.

వాస్తవస్థితి యిట్లుండఁగా నీకవి "నఖగర్త పురాంజనేయ నతజన గేయా" యను మకుటముతో నొక శతకము రచించె నని, నఖగర్త పురము "గోరుగుంతల పాడు" అని, అది నెల్లూరు జిల్లాలో నున్నదని, కనుక ఇతని యునికి గోరుగుంతలపాడేమో యని కొంద ఱూహించుట జరిగినది. ఆంజనేయ శతక ప్రస్తావము గ్రంథమున లేదు. లోకమున ఆ శతక మగుపించుట లేదు. తోఁకను జూచి ఆంజనేయు నూహించుకొనుటయే. శతకము హుళక్కియని త్రోసివేయ నక్కఱ లేదు. ఉండిన నుండుఁగాక. నారాయణకవి రామ మంత్ర సిద్ధి పొందినవాఁడు. ఇతని ప్రసిద్ధి విన్న గోరుగుంతలపాటి వారు ఇతని యింటికి వచ్చి యర్థించి, ఆంజనేయ శతకము వ్రాయించుకొని పోయినారేమో ! ఇప్పుడు సుప్రభాతములు వ్రాయించుకొన్నట్లు, లేకున్న అనాఁడు నఖగర్తపురమే ఒంటిమిట్ట దగ్గర నుండె నేమో ! అదియుఁ గాకున్న "పురం పురి శరీరేచ". (విశ్వకోశము) అన్నారు గనుక నతజన గేయుఁడైన నఖగర్త పురాంజనేయుఁడు రిపు నఖక్షత చిహ్నిత గాత్రుఁడై న రణధీరుఁడైన కపివీరుఁ డేమో ! ఒంటిమిట్ట కవుల దొక ప్రత్యేకపు బాణీ, రఘువీర శతకము చెప్పిన తిప్పయ్య మొదలుకొని వీరందఱు సీతా రామస్తుతితోనే కృతికి శ్రీకారము చుట్టుదురు. కవి స్తుతిలో శ్రీనాథుని పేరెత్తరు పోతన్నకు విశిష్ట స్థానమిత్తురు రామభద్రకవి చూడుఁడు.

"గీ. శబ్దశాసన సుకవి కంజలి యొనర్చి
యుభయకవి మిత్రునకు హస్తయుగళి మోడ్చి
శంభుదాసుని సోము భాస్కరుఁ దలంచి
యాంధ్ర వాగ్భాగవత కర్త నభినుతించి."

(రామాభ్యుదయము. 1-10)

తుదిపాదమంతయుఁ బోతనకే. వీరి రామభక్తి యట్టిది, కాదు. ఆ స్థలమహిమయే అట్టిది. నారాయణకవి పాటించిన వాణిని బట్టి అతఁ డక్కడి వాఁ డనియే చెప్పవలెను.

ఇంత యేల! ఇందలి మాండలిక శబ్ద స్వరూపము మాటతీరు "ఇతఁడు పలానా ప్రాంతమువాఁడు" అని చెప్పక చెప్పుచున్నవి.

## కాలము

నారాయణకవి జీవించిన కాలము గుఱించి, పెద్దలు తలకొక రకముగా నూహించి చెప్పిరి. నికరముగాఁ దేల్చి చెప్పినవారు లేరు. కదిరీపతి కంటె అర్వాచీనుఁ డనిమాత్రము అందఱును గంఠోక్తిగాఁ జెప్పిరి. కదిరీపతి కవి క్రీ.శ. 1660 ప్రాంతమున నుండెనని డా|| నేలటూరి వేంకటరమణయ్యగారు వ్రాసిరి. శ్రీ ఆరుద్రగారు క్రీ.శ. 1648 ప్రాంతాలకే కదిరీపతికి కావ్యనైపుణ్యాదులు పట్టుబడ్డాయన్నారు. "నారాయణ కాలం క్రీ.శ. 1650 అవుతుంది" అన్నారు. ఎవరు ముందో యెవరు వెనుకో అను సందేహము మనకుఁ గలుగును. కాని, కదిరీపతి కావ్యఫక్కి నారాయణకవి "మక్కికిమక్కి అనుకరణ చేశాడు" అన్న పంక్తితో ఆ సందేహము తొలఁగును. సమకాలికులైనచో ఈ వ్యవహారము కోర్టు కెక్కడిది. వారిరువురు సమకాలికులు కారు. దాదాపు ఒక శతాబ్ది కాల మతనికి నితనికి నెడ ముండి యుండును.

వావిళ్ల ప్రతులు అందాజుగా నారాయణకవి క్రీ. శ. 1800 ప్రాంతము వాఁడని ప్రకటించినవి.

అయ్యలరాజువారి వంశవృక్షమున్నది కదా! అది 15 వ శతాబ్ది నుండి లెక్కింపఁబడినది. 16 వ శతాబ్దమున రామభద్ర కవి యున్నాఁడు. 18వ శతాబ్దమున "రెట్టమత శాస్త్ర" కవులున్నారు. వీరొక మంచిపని చేసిరి. తమ గ్రంథము శా|| శ|| 1692 సం||న రచింపఁబడినట్లు గ్రంథాంతమున సీస పద్యమునఁ దామే వ్రాసికొనిరి. అది క్రీ.శ. 1770. ఆ జంట కవులలో నొకఁడగు భాస్కరకవి మనుమఁడే మన నారాయణకవి. కనుక నారాయణకవి క్రీ. శ. 1750 సం||నకు ముందుండుటకు వీలు లేదు.

బ్రౌన్ దొర క్రీ.శ. 1820 స|| న కడపలోఁ గాపుర ముండెను. హంస వింశతి పలుకుబళ్లు అప్పటికే కొన్ని ప్రచారమున లేవు, తమ నిఘంటువులోఁ గొన్నిటికి "అర్థము తెలియలేదు" అని వ్రాసిరి. పలువురు పండితులకు జాబులు వ్రాసి పద్యార్థము గ్రహించుటకు శ్రమపడిరి. కనుక 1820 ప్రాంతమున నారాయణకవి లేఁడనుట స్పష్టము. సరికదా, అతని పలుకుబళ్లు అర్థము కాకపోవు స్థితి కొంత కలుగుటకు అర్ధ శతాబ్ది కాలమైనను అప్పటికి జరగి యుండవలెను. కాఁగా నారాయణకవి క్రీ.శ. 1770-75 ప్రాంతముననుండి యుండునని యూహింప వచ్చును.

## కథా సాహిత్యము

హంస వింశతి తెనుఁగున నొక స్వతంత్ర కథా ప్రబంధము. ప్రాచీన సంస్కృత ప్రాకృత కథలకు అనువాదము కాదు : అనుకరణమును గాదు: అచ్చముగా జీవకళ యుట్టిపడు తెలుఁగుజాతి లోఁగిళ్ల కథాకదంబము. ఈ జాతికిఁ జెందిన కథా ప్రబంధములలో "శుకసప్తతి" మొదటిది; "హంస వింశతి" చివరిది. శుక సప్తతిలోఁ బంజరస్థ శుకము కథలు చెప్పును. హంసవింశతిలో, బంజరస్థ హంసము కథలు చెప్పును. హంస జలపక్షి కదా! పంజరమున నొదుగునా? అని అడుగరాదు. పక్షులు కథలు చెప్పఁగలవా! కవిత్వము జెప్పఁగలవా? అని యడిగినచో, కాదంబరిలోని చిలుక, నైషధములోని అంచ మనకు జవాబు చెప్పఁగలవు. ఇటువంటి కథలు ఏకాంతమున నాయికకుఁ బురుషునితోఁ జెప్పించుట తప్పు. స్త్రీతో

జెప్పించుటయు నంత సరసముగ నుండదు. పక్షితో బలికించుటయే బాగు. సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నమున, శుచిముఖి యను హంసియొక్క వాక్కౌశలముఁజూచి సహస్రాక్షుడు "విహంగయోషవె? భాషాప్రావీణ్యము చూడఁగ వాగ్దేవతవో, కాక, యాకె దిద్దిన కవివో!" అన్నాఁడు. నల దమయంతులకుఁ బొత్తు గూర్చిన హర్షుని హంస మగది. ప్రభావతీ ప్రద్యుమ్నులకుఁ బొత్తు గూర్చిన సూరన్న హంస ఆఁడుది. హంస వింశతి హంస మగదే. ఇరువది రాత్రులు కాలక్షేపము చేసినది. తొలిరాత్రి శుష్కహితోపదేశముతో దెల్లవాఱించినది. మలిరాత్రి నక్కకథ చెప్పి తెల్లవాఱించినది. మూడవరేయి ఆ పప్పు లుడుకవని తెలిసికొని, పచ్చి శృంగారమున ముంచి తేల్చినది. తుదిదాఁక స్థాయి తగ్గకుండఁ బట్టికొన్నది.

మనకు లెక్కలేనన్ని పిట్టకథ లున్నవి. కాని, వాని తీరు వేఱు. దేవతలు, రాక్షసులు, సర్పములు, భూతములు, పిశాచములు, మాంత్రికులు, రాజులు, రాణులు, వేశ్యలు భూమికలుగాఁ గథకట్టి స్వప్నలోకములు సృష్టించి, వినోదము కలిగించుట వాని ధర్మము. అట్టి కథలను బాలసాహిత్యమునఁ జేర్పవచ్చును. హంసవింశతి ప్రౌఢ కథా సాహిత్య ప్రబంధము. కాఁగా హంస వింశతి కథా సాహిత్య ప్రయోజన మేమి ? "తొల్లి పరమేశ్వరుండు సంతోష మొదవఁ బార్వతీదేవి కెఱిఁగించె" నఁట చిత్ర విచిత్రమైన భామల చిత్తవృత్తి రహస్యము. ఆ రహస్యము బట్టబయలుగా విప్పి చెప్పినాఁడు పురోహిత బ్రాహ్మణుఁడు; విన్నాఁడు కొలువై నలమహారాజు. అన్నీ కలియుగ కథలే. ఆ కథలు హంస పక్షి చెప్పినది. ఊరక చెప్పలేదు. ఉబుసుపోకకుఁ జెప్పలేదు. ఆక్కఱపడి చెప్పినది. హేమావతి అందగత్తె. ఆమెను రాజు కోరెను. భర్త దూరదేశ మేఁగెను. అది సందుగా నామె రాజునొద్దకుఁ బయనమయ్యెను. హంస పోనీయ లేదు. పట్టి నిలిపి కథలు చెప్పినది. మంత్రాలకుఁ జింతకాయలు రాలునా? రాలవు. కనుకనే, చక్కగా ముస్తాబై యెప్పుడెప్పుడని త్రొక్కులాడుచు, రాజరతి సుఖ మపేక్షించు రమణిమనస్సు ఏ లోకమున విహరించుచుండెనో కనుగొన్న హంస ఆ లోకమునకు వాకిలి తీసెను. ఆమె మనస్సు కుక్కవలెఁ గథలోనికిఁ దూఱెను. కథ ముగిసెను. మబ్బు విరిసెను. తిరిగి మఱునాఁడు హేమావతి పయనమగుట, హంస అదే మంత్రము ప్రయోగించుట, తూర్పు తెల్లనగుట ఇదే ప్రవృత్తి. ఇరువది రాత్రులు గడచెను. ఇరువది యొకటవ దినమున మగఁ డింటికి వచ్చెను. కథ కంచికిఁ బోయెను. కంచి-కాంచి. కాంచి స్త్రీ మొలనూలు. కథ అక్కడకుఁ బోయెను. సతియుఁ బతియుఁ గలిసి సుఖించుట ప్రధాన కథా పర్యవసానము.

కావ్యాంతమున - ఇన్ని కథలు విన్న యా యన్నుమిన్న "పరపురుషసంగమం బిహపర సుఖ దూరంబు" అన్నది. అనఁగా ఆమెకు బుద్ధి వచ్చినదని యర్థము. ఆమెను గోరిన రాజుకో ? అతనికిని బుద్ధి వచ్చినది. నోరు దెఱచి "ఉర్వీజనావళు లన్యకాంతలన్ బన్నుగఁ గోరరాదు, కడుఁ జాతకము" అన్నాడు. కనుక ఈ కథలు వట్టి కథలు కావు.

ఇంత ప్రయోజనకారియైన యా గ్రంథము క్రీ.శ. 1911 నుండి 1947 వఱకు ముప్పది యాఱేండ్లు అజ్ఞాతవాసమేల చేసినది? ఇది ప్రశ్న. "ఇంటివాఁడే పెట్టె కంటిలో పుల్ల" అను సామిత యంద ఱెఱిఁగినదే. కొందఱు ప్రబుద్ధులు ఆసభ్యసాహిత్యమని ఆంగ్ల ప్రభువులకుఁ జెప్పి కొన్ని గ్రంథములు నిషేధింపఁజేసిరి. నారాయణామాత్యుఁడేకాదు, శ్రీనాథుఁడును దోషియయ్యెను. ఈ లెక్కను జూచినచో గాళిదాస మహాకవి ప్రథమదోషి కావలసివచ్చును. దశమస్కంధముఁ దీసికొన్నచో బమ్మెర పోతన్నకూడఁ దప్పించుకొనలేఁడు. లక్షోపలక్షల తెలుఁగు రసజ్ఞులను ముద్దాయి (ముత్ + దాయి = సంతోషదాయి) యగు హంసవింశతి ముద్దాయి (దోషి) యయ్యెను. అయిన నేమి ! అశేషప్రజ యెన్ని వ్రాతప్రతులు కల్పించుకొనెనో, యెంత శ్రమపడెనో, "ఆంధ్ర కేసరికిఁ" దెలియును. 1947 సం|| న రాహుపీడ తొలఁగి, హంసవింశతికి స్వతంత్ర ప్రకాశము కలిగెను. ఈనాడీగ్రంథ మింత తప్పుల తడకగా మిగులుటకు హేతువు తత్తమోగ్రహ మీ గ్రంథమును మ్రింగి

యుమియుటయే.

కథలు కవికపోల కల్పితములా?

ఈ కథలకు మూలము లేదు. లోకమే మూలము. లోక ప్రవృత్తి చిత్ర విచిత్రముగా నుండును. ఈనాఁడొక సంఘటనము విచారించి చూచినచో దానికి మూలబీజము అష్టాదశ పురాణములలో ఎక్కడనో యొకచోట గోచరింపకపోదు. అంతమాత్రమున దానికిది పుత్రిక యని చెప్పలేము, ముమ్మూర్తుల ముక్కున ఊడిపడినట్లు ఆకథకు ఈ కథకుఁ బోలిక లున్నపుడే చెప్పఁగలము, పురాణకథా సంస్కార పక్వబుద్ధికిఁ దత్కథా రేఖలు భాసించు కల్పనలు స్ఫురింప వచ్చును. లేదా, లోకమున అటనట జరుగు నుదంతములు క్రోడీకరించి యొక కథగా మల్చుటయు జరుగవచ్చును. రెండును గాదని విపరీతముగా యోజించి కథ అల్లను వచ్చును. ఈ ముప్విధముల కథలతో నడిమి తరగతికిఁ జెందిన కథలే హంస వింశతి యందధికము. కథావ్యక్తులు సామాన్య మానవులు. శుకసప్తతి కథల కీకథలు కార్బన్ కాపీలు కావు. పూర్తిగా స్వతంత్ర కథలే. తన కథలను గుఱించి హేమావతితో వాచ్యముగనే కవి యిట్లు చెప్పించినాఁడు.

"మ. కలహంసాధిప! నీ స్వబుద్ధి నిటులన్ గల్పించెదో. కాక పె
ద్దలచేఁ బూర్వము విన్నవాఁడవో, మహా దైవ ప్రసాదంబొ; విం
తలు సుమ్మిట్లు వచింప నన్యులకు మేధాశక్తి నిన్‌బోలు వా
రలు లేరింక, బలారె!" (4-67)

దీనిని బట్టి యితఁడు స్వబుద్ధిచేఁ గల్పించెనో పెద్దలచే వినెనో దైవప్రసాదముచేఁ గనెనో యని త్రిథాప్రకీర్ణ మనస్సుతో విచికిత్సింపఁ బని లేదు. "మేధాశక్తి నిన్ బోలు వారలు లేరు" అనుటనుబట్టి యాకథ లితఁడే కల్పించెనని గట్టిగాఁ జెప్పవచ్చును. హంసను బ్రశంసించు వ్యాజమున నాత్మస్తుతి చేసికొనెనని మన మూహింపవలసిన పనిలేకుండఁ గృత్యాదియందే పదునేనవ పద్యమునఁ దనకీర్తి యెట్టిదో, తన మేధ యెట్టిదో, తన దాతృత్వ మెట్టిదో, తన రూప మెట్టిదో, తానే బాహాటముగా వర్ణించు కొన్నాఁడు. ఇతని మేధ బ్రహ్మ, శేషుఁడు, బుధుఁడు బృహస్పతి యీ నలువురు మేధావుల మేధకుఁ 'బ్రతివిఘాతి' యఁట. అట్టివాఁడు స్వతంత్రముగ యోజింప కుండునా ? అతనికిఁ దెలియకుండ యాదృచ్ఛికముగా నెక్కడనైనఁ బూర్వ కథలతో సంవదించు సందర్భములో సన్నివేశములో యతని కథలలోఁ బొడసూపినచో దాని కతఁడుత్తరవాది కాఁడనియు మనము గ్రహింప వలెను.

హంస వింశతి అష్టమరాత్ర కథ.

వసుమతీ ధనచిత్తులు వైశ్య దంపతులు. భర్త పరస్త్రీ సక్తుఁ డయ్యెను. భార్య పరపురుష సక్త యయ్యెను. ఒకనాఁటి చీకటిలో సంకేత స్థలమున నుభయులు తారసిల్లిరి.

తే. తాను గోరిన కన్య యీతరుణి యనుచుఁ
జేరె నాసక్తిచే ధనచిత్తుఁ డపుడు
ఆ యువాగ్రేసరుం డీతఁ డౌ నటంచుఁ
గదిసె వసుమతి యత్యంత కాంక్షతోడ. (2-247)

ప్రాఁత రోఁత క్రొత్త వింతకదా ! ఆమె నూతన స్త్రీయని యతఁ డనుకొనెను. అతఁడు నూతన పురుషుఁడని యామె యనుకొనెను. ఈ యనుకొనుట. మనస్సు చేసినపని. దాని వికార మెట్లు విజృంభించినదో యీ పద్యముఁ జూడుఁడు.

మ. సహసా సంఘటిత స్తన గ్రహణ సంజాతాంగ రోమోద్గ మం
బు, హఠాచ్చుంబిత పాటలాధర ముఖాంభోజాక్షి గండంబు, దు

స్పహ నీవీచ్యుతి కంచుకాహృతి నఖాంచద్దంత గాఢక్షతా
వహనం బిర్వ్వరకయ్యో సంగమము దిగ్వారార్పితేక్షాళియై. (2-249)

ఇంత జరిగిన తరువాతఁ గాని వారొకళ్లొకళ్లు తెలిసికొనుట జరుగలేదు. దంపతులను గలిపి గమ్మత్తు చేయుట అదొక విలక్షణ శిల్పము. శుకసప్తతియు నిటువంటి దొక కథ చెప్పినది. శుభవతీ మోహన దంపతులు చీఁకటిలోఁ దారస పడుదురు. కాని వారొకళ్లొకళ్లు ముందుగనే గుర్తించు కొందురు. కనుక దానిలో సారస్య మగుపింపదు. ఆ లోపమును హంస వింశతి తీర్చెనా యనిపించును . కాని యీ కథకు శుకసప్తతి కథ యొరవడి కాదు. గీత గోవింద కావ్య పంచమ సర్గమునఁ జెలికత్తె రాధకుఁ జీఁకటి రేయి జరిగిన తమాషా చెప్పినది.

"సీ. ఆశ్లేషా దనుచుంబనా దనునఖోల్లేఖా దనుస్వాంతజ
ప్రోద్బోధా దనుసంభ్రమా దనుర్మతారంభా దనుప్రీతయోః
అన్యార్థంగతయో ర్భ్రమాన్మిళితయో
స్సంభాషణైర్జానతోః
దంపత్యో రిహ కోనకోన తమసి
వ్రీడా విమిశ్రో రసః."

మబ్బులో ఆలుమగలు అదాటుపడిరి. ఆలింగనము, చుంబనము, నఖక్షతము, మన్మథప్రబోధము, సంభ్రమము, సురతము వరుసగాఁ గక్కుర్తిగాఁ జకచక జరిగిపోయినవి. తనిసితీరుబడిగాఁ గూర్చుండి ముచ్చటలకు దిగినారు. అపుడు బయటఁబడినదసలు రహస్యము, అతఁడు భర్త: ఆమె భార్య. ఏమైన నాతురపడినమనస్సు కుదుటఁబడినది. అంతేచాలు. కాని తమ చేష్టితము తలఁచు కొన్నవారు తమలో సిగ్గుపొందరా? అది అనిర్వచనీయమైన రసవిశేషము. జయదేవుని యీ యేకైకశ్లోకమునకు వ్యాఖ్యానప్రాయముగా హంసవింశతి వసుమతీ ధనచిత్త దంపతులకథ చెప్పినది.

మఱొక సన్నివేశము. వశీకరణ ప్రయోగమునకు సంబంధించిన యొక కథ శుకసప్తతిలో నున్నది. సాధకునకు మోహినీదేవత సాక్షాత్కరించి అభీష్టస్త్రీ లాభము గూర్చును, ఆ తంతు హంసవింశతికర్తయు నడిపెను,

శుకసప్తతిలో - " మోహిని నవ్యప్రథమరస విజృంభణవృత్తిన్."

చ. "కనఁబడి కొప్పువీడ, వలిగబ్బిచనుంగవ పైఁటజాఱఁ బూ
సిననెఱితావి గందవొడిచిందఁగ, నందెలుమ్రోయ దీర్ఘలో
చనరుచితోడ వీరమణి జగ్గనవేఁడుచు ముద్దువెట్టుకోఁ
జనుటయు నిర్వికారమతిఁ జాఁగిలి మ్రొక్కి యతండునిల్చినన్."

(శుక. 3-171)

ఈ పద్యమునకుఁ బోటీగా హంసవింశతి.

సీ. మినుకొప్పు నునుగొప్పు మినమినల్ దూలాడఁ
గన్నుల ధళధళల్ మిన్నులాడఁ
బునుఁగిడ్డ నెఱపూఁత భుగభుగల్ చెరలాడ
గుబ్బల చకచకల్ ద్రొబ్బులాడ
జిగిపూని తగుమేని ధగధగల్ దిరుగాడ
నగుమోము నిగనిగల్ నాట్యమాడ
గుమిగూడు విరిదండ ఘుమఘుమల్ పొరలాడ
నందెల ఝుళఝుళల్ చిందులాడ

తే. నెదుట సాక్షాత్కరించు మోహినికి నతఁడు
గరిమతో లేచి మ్రొక్కినఁ గరుణఁజూచి (హంస. 4-98)

ఈ పద్యముఁ జెప్పినది. మోహినిత్రుళ్లుపాటు – మినమినల్, ధళధళల్, భుగభుగల్, చకచకల్, ధగధగల్, నిగనిగల్, ఘుమఘుమల్, ఝుళఝుళల్ కూర్చి విజృంభితముగాఁజెప్పినది. దానికిది తీసిపోదు; మించును.

శుకసప్తతి మోహిని "దీర్ఘలోచనరుచితోడ వేఁడుచు ముద్దువెట్టుకోఁజనుట, అతఁడు నిర్వికారమతిఁ జాఁగిలిమ్రొక్కి నిలుచుట" మనకవికి రుచింపలేదు. అనుచితమని భావించి మోహిని సాక్షాత్కరించెనని మాత్రమే చెప్పినాఁడు. మోహిని లక్ష్మీ పార్వతీ సరస్వతీదేవతలవంటి దేవత యనుకొన్నాఁడు. కాదు. క్షుద్రదేవత. ప్రథమరస విజృంభణవృత్తితో సాక్షాత్కరించు మోహినిని జూచి, సాధకుఁడు మనసుచెదరి తబ్బిబ్బగు ప్రమాద ముండును. ఆదేవత వానికిఁ గామవికారము రేకెత్తించు చిన్నెలెన్నో చూపును. వాఁడు చలించెనా, నెత్తురుక్రక్కి చచ్చును. ఈ రహస్యము సాధకులెఱుఁగుదురు. మనకవియు "గుబ్బల చకచకల్ ద్రొబ్బులాడ" అనుపంక్తిలో మోహిని గాఢపరిరంభమే యభిలషించు చున్నదను భావము వ్యంజితముచేసినాఁడని సరిపెట్టుకొనఁగూడదా? అన్నచో సరిపెట్టుకొనవచ్చును. కవియుద్దేశ మదికాదే: శుకసప్తతియందలి యనౌచిత్యమును బరిహరింపవలెనను పట్టుదల. ఇది సరికాదు. శుకసప్తతిలో బేతాళభటులొక రాజకుమారు నెత్తుకొనిపోయి వేఱొక రాజ శుద్ధాంతమునఁజేర్చి, యద్భుతశృంగార మొలికించుకథ కలదు. అటువంటి కథల జోలికి మనకవి పోలేదు. ఒకనాతికిఁ బాదుకలిప్పించి గగనయానము సాధ్యము చేసినాఁడు. ఒక గోతికి మంత్రమునిప్పించి యాకసమునఁ ద్రిప్పినాఁడు. ఇంతకు మించి అస్వాభావిక సన్నివేశములు సృష్టింపలేదు.

ఇందు 2,6,11, 13,20 కథలైదు బ్రాహ్మణకుటుంబకథలు. తొలికథలో ఱంకు బొంకు లేదు. కాశినుండి లింగముదెచ్చుట, గుడిగట్టించుట యున్నది. 6 కథలోఁ జలిపందిరిలో బాటసారులకు నీళ్లుపోయు ద్విజ జారిణి ద్విజజారునే కోరును. 11 కథలో ద్విజపండితుని పెద్దభార్య ద్విజభిక్షువునే కోరును.13 కథలో నియోగిద్విజునిభార్య జోస్యునే కోరును. 20 కథలో మంత్రికుమారుని భార్యలకు ద్విజులే తటస్థపడుదురు. ఒక నియోగివటువు 5 కథలోఁ బెండ్లికాని గొల్లపడుచును జెఱచును. ఒక వైదికవటువు 19 కథలో గాండ్ల మగనాలిని గవయును. 10 కథలో నొక భూతచికిత్సకుని భార్యతో నూరికరణము సంబంధము పెట్టుకొనును. ఇందు ద్విజస్త్రీలు నీతిదప్పినను, గులము తప్పి చరింపరు: పురుషులు చరింతురు. కోమటి, తొగట (సాలే, తొగట, జాండ్ర నేతనేయు కులములు మూడు) గొల్ల, కంసాలి, చిత్తారి, రెడ్డి (కాఁపు) బెస్త, కుమ్మరి, బలిజ, గాండ్ల కులముల స్త్రీ పురుషులకు నియమము పెట్టలేదు. ఈ కథలలో యథేష్టముగఁ జరింతురు.

## కథల పుట్టుక

భర్తృహరి శృంగార శతకమునఁ జెప్పిన

శ్లో. జల్పంతి సార్థ మన్యేన
పశ్యం త్యన్యం సవిభ్రమాః
హృద్గతం చింతయం త్యన్యం
ప్రియః కో నామ యోషితామ్ ?

(ఒకనితోఁ దియ్యగా మాటాడుదురు. ఒకని నొయ్యారముగాఁ జూతురు. ఒకనిని మనసులోఁ దలఁతురు. స్త్రీలకుఁ బ్రియుఁ డెవఁడు? పచ్చి మోసకత్తెలు.) అను శ్లోకార్థమును బుక్కిటఁ బెట్టికాని, కవి యా కథలు కల్పించెను. దీనికిఁ దోడు మనపాలిటి కింకొక

శ్లోకరత్నము - అందఱకుఁ దెలిసిన దున్నది.

శ్లో. స్త్రీణాం ద్విగుణ ఆహారో
బుద్ధిశ్చాపి చతుర్గుణా
సాహసం షడ్గుణం చైవ
కామోఽష్టగుణ ఉచ్యతే.

నారాయణకవి యీ నాలుగింటిని కోటి కెక్కించి చూపినాఁడు.

తిండి యధికముగాఁ దినుటచేఁ బొడము బెడఁదయు నుడువక విడువలేదు.

తే. పిఱుఁదు పిక్కలు చెక్కులు బెడఁగు దొడలు
వెడఁద యొడలును జన్నులు వెండ్రుకిడను
సందు లేకుండ బలియుట సకియ మనసు
జార సంభోగ కేళికి స్వారి వెడలె. (హంస. 3-133)

గ్రంథము కామినీగర్హణముతోనే మొదలెత్తినాఁడు.

క. మంకులు మాయోపాయలు
బొంకుల పుట్ట లతిపాపపుం జగజంతల్
జంకెనలు సేయు యువతులు
శంకరుఁడుం దగఁడు వారి చర్యలు దెలియన్. (1-37)

బుద్ధిచాతుర్యము, దాని మించిన సాహసము, దాని మించిన కామము, స్త్రీ యందు భాసించు తీరులు చూపినాఁడు. ఆవేకథలు. ఏదో యొక విపత్తు పుట్టి మునిఁగినట్లు తటస్థించుట, బుద్ధిశక్తిచే దానిని దేలికగా దాఁటుట కథా సామాన్య లక్షణము. ఈ కథలను శుద్ధముగా వచనమున రచించి పెట్టినచో ఇంత వన్నె కెక్కవు. కథాచమత్కారము యొక్క తలఁదన్ను పద్య రచనా సంబంధి చమత్కారము లిందుఁ గొల్లలుగా నున్నవి. మనుచరిత్రకుఁ బ్రశస్తి వచ్చినది. కవితా పితామహుని శిష్యుఁడు, గురువును మించిన శిష్యు డనిపించు కొనవలెనని మనుచరిత్ర మార్గము ననుసరించి వసుచరిత్ర వ్రాసెను. శ్రమపడి యక్కడలేని చమత్కారము లెన్నో ప్రదర్శించెను. కథను దీసివేసి, లోకము ఆ చమత్కారములనే కై కొనెను. ఆ శిల్పమునకుఁ బ్రత్యేక స్థితి సిద్ధించెను.

కదిరీపతి శుకసప్తతిని జూచి, దాని మించిన దనిపించుకొన వలెనని, నారాయణామాత్యుడు హంసవింశతి రచించెను. శ్రమపడి యక్కడలేని విశేషము లెన్నో ప్రపంచించి ప్రదర్శించెను. లోకమునకు నా విశేషములే యుపా దేయములైనవి.

## హంసవింశతి విశేషములు.

మృగ పక్షి జాతులు, కోళ్లు, మేకలు, పొట్టేళ్లు, కొండలు, కంపలు, చెట్లు, దీవులు, మనువులు, మానములు, వర్షములు, ఖండములు, దేశములు, పంటలు, వడ్లు, కూరగాయలు, పడవలు, చేపలు, పుణ్యక్షేత్రములు, తీర్థములు, నదులు, సరస్సులు, పుష్కరిణులు, 108 తిరుపతులు, అమ్మవార్లు, గడ్డి, అప్సరసలు, వస్త్రములు, పాత్రలు, భూషణములు, పట్టణములు, పల్లెలు, బాల బాలికలక్రీడలు ఎన్ని రకము లున్నవో అన్నియు గుది గ్రుచ్చి సీసపద్యములు, అవి చాలకున్న సీసమాలికలు, రగడలు, వచనాలు కుప్పవోయుటయందు నారాయణకవి యందెవేసిన చేయి.

భూగోళ ఖగోళ జ్ఞానము, ఆయుర్వేద ధనుర్వేద పరిచితి, భరత సంగీత కళాశాస్త్ర పరిచితి, జ్యోతిర్గణిత మంత్ర యోగశాస్త్ర పరిచితి, శాస్త్రీయ దేశీయ పద్ధతులు కలియఁ గలిపి

చూపించుటకే కొన్ని కథలు సందర్భములు కల్పించుకొనెను.

ఆ కాలపు( దెలు(గు ప్రజల కులాచార వృత్తులు, స్నాన భోజన శయనాదులు, వేష భాషలు, తెలిసికొన( గోరు వారి కీ ప్రబంధ మాదర్శముగా, నుండులాగున రచించెను. పై పెచ్చు జిలుగు తెలు(గు పలుకుబడి నుడికారము సందర్భోచితముగా( బొస(గించెను.

కావ్యోపక్రమము

"సీతాభర్త నన్ బ్రోవుతన్" అన్నాడు. సీత "శ్రీరామాంశజయైన జానకి". తద్భర్త యెవ(డో చెప్పు(డు: ఆయన ఱొమ్మున( బెద్ద యద్దమువంటి మణి యున్నది. జానకి మణ్యభిముఖముగా నుండెనా, ఆమె బొమ్మ యామెకు గన(బడును. ఆమె గోల. కనుక అన్యకాంతయని గోల చేయును. అదొక బెడ(ద( ఆ బెడ(ద( దొల గించుకొనుట కామె యాభిముఖ్యమును బరిహరించి, యామె నంకపీఠి( జేర్చినా(డు. ఆంక శబ్దమునకు( దొడయనియే కాదు, సమీపమనియు నర్థమున్నది. అమ్మవారికి( బ్రక్కన( బీ(ట పెట్టించినా(డు. సీతకు నాలంబమైన యా పేరులేని వ్యక్తి, యేకము నిత్యము విమలము నచలము సర్వధీ సాక్షి భూతము నైన స్థితి పొందినా(డు. అట్టి పరబ్రహ్మము నన్ బ్రోవుతన్ అని ప్రార్థనము.

నరస భూపాలీయ పద్య మిట్టే యున్నది. కాని, తుది మలుపు వేఱు దానితోఁ దాత్పర్యమే తలక్రిందగుచున్నది. చూడు(డు.

"శా|| శ్రీ లీలావతి దా నురోమణి సభా సింహాసనత్కౌస్తుభా
వేలాభా ప్రతిబింబితాంగి యగుచున్ వేఱొక్కతం దాల్చినా(
డౌలే యంచు( దరించునోయని, యమందానందు(డై లక్ష్మి నే
వేళం గౌఁగిఁట(జేర్చు శౌరి నరసోర్వీనాయకున్ బ్రోచుతన్".

ఈ పద్యమున విషయానంద నిష్పందు(డైన శౌరి-వసుదేవుని తండ్రి పేరు శూరు(డు, ఆ యింటివా(డు కృష్ణు(డు-ప్రోచువా( డగును.

హంసవింశతి పద్యము నరసభూపాలీయ పద్యమునకు ఛాయ వలె నున్నదే యను శంక వొడమును. ఈ ప్రాచీన స్రగ్ధరను జూచినచో ఆ ఛాయా శంక తొల(గును.

"వక్షఃపీఠే నిరీక్ష్యస్ఫటిక మణిశిలా మండలస్వచ్ఛ భాసి
స్వచ్ఛాయాం సాభ్యసూయా త్వమియమితి ముహుస్సత్య మాశ్వాసితాఽపి
వామే మే దక్షిణేఽస్యాః శ్రవసి కువలయం నాహ మిత్యాలప స్తీ
దత్తాశ్లేషా సహాసం మదన విజయినా పార్వతీ వః పునాతు"

శ్రీరాము(డు మదన విజయ స్థానమున( జెప్ప(బడినా(డు. 'శ్రీరామాం శజ' యను దళమున ముద్రాలంకారము. ఇదొక విలక్షణమైన కూర్పు.

చిత్రభోగ మహారాజు షట్చక్రవర్తులవలె, షోడశ మహారాజులవలె( బుడమి నేలుచున్నా(డు. ఒకనా(డు "హావ భావ విభ్రమ విలాస వైఖరుల్ విస్తరిల్ల మరుని సామ్రాజ్య లక్ష్ముల హరువు( జెందు చెలులు గొలువంగ( గొలువుండె." ఉండ(గా "చెట్టు డిగివచ్చి నట్టుల" నొక మహాయోగురాలు వచ్చి చెంతనిల్చెను. (మల్లన రాజశేఖర చరితఘుస ఉట్టి పడ్డట్టు యోగిని యోర్తు వచ్చి, లీల నారాజశేఖరు మ్రోల నిలిచెను) రాజు లేచి మ్రొక్కి పీఁట వేయించి కూర్చుండ(బెట్టినా(డు. ఆమె దీవెన లిచ్చినది. తరువాత నిద్దఱు లోకాభిరామయణమున దిగినారు ఆ యోగిని "ఈ నవఖండమండిత మహీస్థలి నెల్ల( జూచిన ద(ట. ఒకతెను మించిన యందగత్తె యొకతె వివిధ దేశములలో నున్నార(ట.

ఆందఱి తలదన్ను ప్రపంచ సుందరి ఆయూరిలోనే యున్నదఁట. ఎవరో కాదు. సాతాని విష్ణుదాసుని పెండ్లాము. హేమవతి యఁట. హేమవతీ సౌందర్య మయిదు పద్యములతో వర్ణించెను. చివరి పద్యము లోకోత్తర చమత్కార హృద్యము.

సీ. కబరీభరమునకుఁ గందంబుసెల్లు, ను
   త్పలమాలికలు నేత్రములకుఁ జెల్లు
   గర్ణంబులకును మంగళమహాశ్రీ సెల్లు
   గాత్రంబునకుఁ జంపకంబు చెల్లు
   మధుర వాగ్వృత్తికి మత్తకోకిల చెల్లుఁ
   జనుగుబ్బకవకు- మంజరియుఁ జెల్లు
   బిరుదైన పిఱుఁదుకుఁ బృథివివృత్తము చెల్లు
   మధ్యంబునకుఁ దనుమధ్య చెల్లుఁ

తే. పాదముల కంబుజము చెల్లుఁ బరఁగు నడకుఁ
   దనరు మత్తేభవిక్రీడితంబు సెల్లుఁ
   గృతుల వర్ణింపఁదగు తదాకృతులె కృతులు
   వాంఛచే దానిఁబొందిన వాఁడె సుకృతి.

(హంస. 1-62)

దీనిచే నతనికిఁ బొందువడునది రతిసామ్రాజ్యము కాదు : సరస్వతీ సామ్రాజ్యము మాత్రమే అని ధ్వని.

శివసత్తి వచ్చి ఆేని యెదలోఁ జిచ్చు రగిల్చి పోయినది. ఆేఁడు దిక్కులేని స్థితిలోఁ బడియుండఁగా హేలయను కుటిలాలక వచ్చెను. హేల మాలిని. తాపికత్తె. కార్యభారము తన నెత్తిన వేసికొనెడు. సాతానిరాణి యింటికి దారితీసెను. రాకపోకలు సాఁగించెను. చనవు బలిసెను. ఒకనాఁడు అటునిటు చూచి, తన గ్రంథము విప్పెను. నీవు చక్కని చుక్కవు. రాజోత్సంగమున నుండఁదగిన దానవు. "మర్కటము వంటివాఁడు నీ మగఁడు చూడ వానితోఁ గూడి రతికేళిఁ బూనుటెట్లు?" (1-91) ఈ రీతిగా మాలిని చేఁదు కాయకోసి మనసు విఱిచి, హేమవతిని దన యంకెకుఁ ద్రిప్పుకొన్నది. తెగువచాలక వెనుక ద్రొక్కుట చూచి.

క. ఎక్కడి మగఁ డెక్కడి సఖు
   లెక్కడి నీ యత్తమామ లెక్కడి చుట్టా
   లిక్కాలఁది దొడ్డ కొంచెము
   లెక్కింపకు మరుని హావళిం బడువేళన్.

అని యామెమేలుకోరి ప్రోత్సహించినది. కనుకనే చెడిపెలకుఁ జెవి యీయ రాదనిరి. మాలినికంటె ధూర్త స్త్రీ యుండదు.

"నరాణాం నాపితో ధూర్తః
   పక్షిణాం చైవ వాయసః
   చతుష్పదాం సృగాలస్తు
   స్త్రీణాం ధూర్తాచ మాలినీ.

హేమవతి రాజసంగతిఁ గోరి మగఁడులేని తఱిఁ బయనము కట్టినది. అత్తమామల శాసనము బంధుమిత్రుల భయము లెక్క చేయలేదు. కవిత్వము నేర్చిన హంస ఆడ్డగాలు వేయఁగాఁ గాలు కదలింపలేక నిల్చినది. ప్రొద్దు గ్రుంకినంతనే ముస్తాబై పొంగులువాఱు

కోర్కులతో గజ్జెల గుఱ్ఱమువలెఁ గడప దాఁటిపో నుంకించు హేమవతిని నిలుపుటకుఁ గవిహంస యుపయోగించిన సామగ్రి, తాను సైకతశ్రోణియగు వాణి నడిగి తెచ్చికొన్న "సుమధు మధుర సుధా వచస్స్ఫూర్తి "యే కాని, అన్యము కాదు. ఆ సామగ్రితో నొకయిల్లు నిలఁబెట్టి పుణ్యము గట్టికొనెను.

## కావ్యోపసంహారము

చూరదేశమేఁగినమగఁడు తిరిగివచ్చుచున్నాఁడన్నవార్త వచ్చెను. హేమావతి మనసున కంటిన మబ్బు విచ్చెను. "తే. కథలు రేల్ తెల్పుటయే కాదు కరుణఁబ్రొద్దుపోని యపుడెల్ల రాయంచ పూనిచెప్పినట్టి నయవాక్యములచేతనైన సన్మనీష" ఆమెయందు మొగ్గదొడగి పరిమళించినది. ఆమె "పరపురుషసంగమం బిహపర సుఖదూరంబుగానఁ బాతివ్రత్యస్ఫురణగల సతులు మదిఁగోర రటంచును నిశ్చయించు" కొనుట తత్సంస్కార ఫలము.

"పతికి నెదురుగనేఁగె నప్పద్మగంధి". పతిముఖసందర్శనముచే హేమవతి యందు అప్రయత్నముగ నొక శృంగారతరంగము పొంగినది. పొంచియున్న మాలిని గుర్తించెను. హేమవతి నిజముగా భర్త్రనురక్తయయ్యెను. 'పద్మగంధి' సాభిప్రాయవిశేషణము. ఈ క్షణస్ఫురణము, ఓష్ఠాగ్రస్ఫురణము, శ్రోణితటస్ఫురణము (5-370) కననయ్యెను. దూతిక దుసికిలిపోయి బుట్టలోఁబడిన పిట్ట తప్పించుకొన్నదని రాజుకుఁజెప్పినది. రాజు "కంపిత శిరస్కుండై కొంత తడవు చింతించి," బుద్ధి తెచ్చికొనెను. కొంతతడవు తానెంత ఘోరముగఁ జింతించెనో! "ఉ. మున్నల రావణాదులు సముద్ధతి సాధ్వులఁగోరి, యేమిసౌఖ్యోన్నతిఁ జెందిరి?" అని ప్రశ్నించుకొన్నాఁడు. రావణుఁడు సీతనెత్తికొనిపోయినట్లు పోఁదలఁచినాఁడు. రౌర్థన్యము వలన లగ్గు కలుగదు. ఎగ్గు కలుగునని తెలిసికొన్నాఁడు. "ఉర్విజనావళు లన్యకాంతలన్ బన్నుగఁగోరరాదు, కడుఁ బాతక మంచుఁ దలఁచి"నాఁడు. పాతకమన్న నిశ్చయమెపుడు కలిగెనో అపుడే "యింతిపై నున్న మనంబు ద్రెక్కొని" యథోచిత పద్ధతి నుండె". (5–374)

ఇక్కడ మనోలక్షణము చెప్పఁబడెను. ఱేనియెదలో జోగురాలు ముట్టించిన యగ్గి, హేమవతి చెవి యొగ్గినదన్న కుంటెనకత్తెమాటతో ధగ్గుమని ప్రజ్వరిల్లి హేమవతి పతిసక్తయయ్యెనన్న మాటతో బుగ్గియై చల్లబడెను.

"మన ఏవ మనుష్యాణాం
కారణం బంధ మోక్షయోః "

## శుకసప్తతికి హంసవింశతికి పోటీ

శుకసప్తతి కృతికర్త కదిరీపతి. చంద్రవంశ క్షత్రియుఁడు. ప్రభువు. "సర్వజ్ఞమౌళి! కంజకరరూప! కదురభూప!" అని విద్యజ్జనములచేఁ గీర్తింపఁబడ్డవాఁడు. కృతి శ్రీరామాంకితము చేసిన ధన్యుఁడు.

హంసవింశతికర్త నారాయణకవి. "అమాత్య దేవేంద్రుండు." "అంబురుడ్భవ కభుగ్ధవ విధూద్భవ మరుద్ధవగురు ప్రతివిఘాతి" మేధాశక్తిగలవాఁడు. కృతి శ్రీరామాంకితము చేసినవాఁడు, కులముచేత, ఇంద్రపదముచేత, మేధచేత, రూపముచేత, అధికుఁడనని వ్రాసికొన్న ధీరుఁడు.

కదిరీపతి ధౌమ్యుఁడను పురోహితునిచే ధర్మజునకుఁ గథలు చెప్పించెను. మూలకథ పార్వతికిఁ బరమేశ్వరుఁడు చెప్పెను.

నారాయణకవి ప్రత్యుత్పన్నమతియను పురోహితునిచే నలునకుఁ జెప్పించెను. మూలకథ పార్వతికిఁ బరమేశ్వరుఁడు చెప్పినదే. ధర్మజునకంటె నలుఁడు పూర్వుఁడు. అధికుఁడు. శుకసప్తతిలోఁ బ్రధాననాయకుఁడు చిత్రభానుఁడు. కథారంగము పద్మావతీపురము.

హంసవింశతిలోఁ బ్రధాననాయకుఁడు చిత్రభోగుఁడు. కథారంగ ముజ్జయినీపురము.

శుకసప్తతిలోఁ గొరవంజి (ఎఱుకత); హంసవింశతిలో శివసత్తి (జోగురాలు).

శుకసప్తతిలో జగదేకసుందరి మదనసేనుఁడను వైశ్యుని భార్య ప్రభావతి.

హంసవింశతిలో జగదేకసుందరి విష్ణుదాసుఁడను సాతానిబేహారిభార్య హేమావతి. మదనుని తండ్రి విష్ణువు. ప్రభకుఁ దల్లి హేమము. కనుక మదనసేన ప్రభావతులకంటె విష్ణుదాస హేమవతులు అధికులు.

భూపతి జగదేకసుందరిని గోరుట, ఆమె యియ్యకొనుట, అంతలో గృహస్థుఁడు దూరదేశమేఁగుట, యిల్లాలు కడపదాఁటి అడుగిడఁజూచుట, పక్షి అడ్డగాలు వేయుట ఉభయత్ర సమానమే, అది శుకోపదేశము. ఇది (పరమ) హంసోపదేశము.

ఇకఁ బద్యము లెట్లు పోటీపడుచున్నవో చూడుఁడు.

సీ. చంద్రమతీనాథు చందాన, నలుని వై
ఖరిఁ బురుకుత్సునిగతిఁ బురూర
వునిమాడ్కి సగరులాగునఁ గార్తవీర్యుని
యనువున గయునట్టు లంబరీషు
పొలుపున శశిబిందువలె నంగుపోలికఁ
బృథునిభాతి మరుత్తురీతి భరతు
కరణి సుహోత్రుని హరువున రఘులీల
రామునిక్రియ భగీరథుని లేవ

తే. శిబితెఱంగున మాంధాతచెలువమున, య
యాతిరీతి దిలీపుమర్యాద రంతి
సరణిఁ బాలించి యలరు నాచక్రవాళ
వసుమతీచక్ర మమ్మహీవల్లభుండు.

(శుక . 1-93)

సీ. వెలయ హరిశ్చంద్రు విధమున నలుని వీఁ
కను బురుకుత్సుచాడ్పునఁ బురూర
వునిలీల సగరులాగునఁ గార్తవీర్యు మ
ర్యాదను గయుక్రియ నంబరీషు
మతమున శశిబిందుమహిమ నంగునితేవఁ
బృథునిమాడ్కి మరుత్తవృత్తి భరతు
నీతి సుహోత్రునిభాతి భార్గవుబలె
రాముపోలిక భగీరథుని పొలుపు

తే. న శిబిసంగతి మాంధాతనయముననుయ
యాతికరణి దిలీపునియట్ల రంతి
రీతి నాచక్రవాళపరీత భూత

ధాత్రిఁబాలించు నవిభుండు తద్విభుండు.

(హంస. 1–42)

ఆరాజున కీరాజు తీసిపోఁడు. ఆద్యుఁడు. ధర్మజునకు పోటి నలుని నిలిపెను. తుదిని యమకము.
రాజదూతి ప్రభావతితోఁ బలికిన పలుకులు –

సీ. బింబోష్ఠి! నీ చంద్రబింబాననము వాని
 వెడఁగునోటను ముద్దువెట్టఁదగునె
 కాంత! నీ సిబ్బెంపు గబ్బిగుబ్బలు వాని
 పరుసుచేతుల నొత్తిపట్టఁదగునె
 యబల! నీ కనకోపమాంగవల్లరి వాని
 కఱకుమేనంటంగ నొఱయఁదగునె
 రామ! నీ మధురాధర ప్రవాళము వాని
 వికటదంతముల కొప్పింపఁదగునె

తే. కొమ్మరో! కుందనపుఁ గీలుబొమ్మకరణి
 నొఱపుగలదాన వీవు వానరమువంటి
 మగనితోఁ గూడి రతికేళిఁ బొగులఁదగునె
 తగదుగా ధాత యీరీతి తగులుసేయ.

(శుక. 1-127.)

సీ. కలికి! నీ సిబ్బెంపు గబ్బిగుబ్బలు వాని
 గడుసుచేతులఁ బట్టి కలఁచఁదగునె
 కాంతరో! నీ తావికావిమో విటువాని
 కొక్కిదంతంబుల నొక్కఁదగునె
 చెలువ! నీ జిగిగోముగల మోము మఱి వాని
 తొట్టినోరున ముద్దువెట్టఁదగునె
 సుదతి! నీ కనకంపు సొంపుదేహము వాని
 కఱకు మేనునఁజేర్చి కలయఁదగునె

తే. కులుకు శృంగార రసములు చిలుకఁ గీలు
 బొమ్మవలె నీటుగలదానవమ్మ! నీవు
 మర్కటమువంటి వాఁడు నీ మగఁడు చూడ
 వానితోఁగూడి రతికేళిఁ బూనుటెట్లు ?

(హంస. 1-91)

వానర శబ్దమునకు బదులు మర్కట శబ్దము వేయఁబడెను. వానరము నందు నరుని పోలిక యున్నది. మర్కటము శాఖామృగము. ఆ కొమ్మను గనిపెట్టుకొని యున్నాఁడు - కోఁతి యని కొట్టవచ్చినట్టున్నది వెక్కిరింత. కదిరీపతి 'రతికేళిఁ బొగులఁ దగునె' ఏడువ వచ్చునా? అను జాతీయోక్తి వాడెను. నారాయణకవి 'పూనుటెట్లు?' ఆరంభ వైముఖ్యమే తెలిపినాఁడు.

సీ. మగని ప్రక్కనె యుండి తగఁజేరి జోకొట్టి
 మోసపుచ్చని దేటి ముద్దరాలు

పసుల గోడలనైన వసుధ నిచ్చెనలేక
యెక్కనేరని దేటి యెమ్మెలాఁడి
తలవరుల్ గనుగొన్నఁ దప్పునొప్పు ఘటించి
బొంకనేరని దేటి పువ్వుఁబోఁడి
దొరలు గద్దింపఁ గల్లరివార్త నిజముగా
నిర్వహింపని జేటి సీటుగత్తె.

తే. అత్తమామల గృహకర్త లగుచు మెలఁగు
నట్టి ధూర్తుల నెల్ల నోరదిమి గదిమి
పొంచి యుపనాథుతోడఁ గ్రీడించి మించి
చక్కటికి దిద్దుకొనని దే సరసురాలు? (శుక. 1.139)

సీ. కోటగోడల నైన మీటుగా నెగఁబ్రాకి
దాఁటనేరని దేటి తలిరుబోఁడి
ఘుమఘుమార్భటితోడ ఘోషించు నదులైన
నీఁదిపోవని దేటి యెమ్మెలాఁడి?
తనమీఁది తప్పు నొక్కనిమీఁద నిజముగాఁ
బెట్టనేరని దేటి బిసరుహాక్షి
ధవుఁడైనఁ దనజాడ తగదని పట్టిన
నిర్వహింపని దేటి నీటుకత్తె

తే. తలవరులు గన్నచో లేని తాల్మిఁబూని
బొంకు తథ్యంబు తథ్యంబు బొంకు గాఁగ
నెంచి యుపనాథుతోడఁ గ్రీడించి మించి
చక్కటికి దేని దదియేటి సరసురాలు? (హంస. 1-102)

పసులదొడ్డి గోడలు దాఁటవలె నన్నాడు కదిరీపతి. అదేమి లెక్క! కోటగోడలు దాఁటవలె నన్నాఁడు నారాయణ కవి. నిండు వఱదలతోడి నదు లీఁదవలెనని కదిరీపతి చెప్పలేదు. దూరదేశమునకుఁ బయనమైన సెట్టికి “టా టా” చెప్పుచుఁ బ్రభావతి,

సీ. మలయుఁబో! మధురాతి మధురాధరల వాఁడి
చిన్నారిగోరు నీ చెక్కుమీఁద
నానుఁబో! రంగస్థలాబ్జగంధుల గబ్బి
మెఱుఁగుఁ జందోయి నీ యురముమీఁద
మించుఁబో! కాంచికా చంచలాక్షుల ముద్దు
మొనపంటి గంటు నీ మోవిమీఁదఁ
జేరుఁబో! నెల్లూరు నారీమణుల కెంపు
పసమించు నడుగు నీ నొసటిమీఁద

సతే. నింట నుండిన నీ సౌఖ్యమేల కల్గు
ననుచుఁ గన్నుల నూరార్చి యక్కుఁ జేర్చి
మోవి చిగురంట నొక్కి తమ్ముల మొసంగి
పోయి రమ్మని పనిచె నప్పువ్వుఁబోఁడి. (శుక. 1-143)

హేమవతి.

సీ. నీ తావి నెమ్మోవి నిలుచుఁబో! కంచి వా

ల్గంటుల మొనపంటి గంటి గుఱుతు
నీ వాలుగన్నుల నెఱయుఁబో! నెల్లూరి
కొమ్మల కపురంపుఁ దమ్మరసము
నీ చెక్కుల రహించుఁబో! చెన్నపట్నంపు
వారిజేక్షణల క్రొవ్వాఁడి గోరు
నీ యురస్స్థలి మించుఁబో! యఖిలక్షమా
కోమలాంగుల కుచకుంకుమంబు

తే. లింటనె మెలంగు వారల కీ సుఖంబు
లెటులఁ జేకూరు నని పల్కి హితము జిల్కి
పోయి రమ్మని మోము మోమున ఘటించి
చుంబన మొనర్చి పనిచె నయ్యంబుజాక్షి. (హంస. 1-108)

కంచి చంచలాక్షులు కొఱికేవారు. చెన్నపట్నపుఁ జెలువలు బరికేవారు. వానర లక్షణములు చెప్పఁబడినవి. ఇఁక నెల్లూరి నారీమణుల వ్యాపారము నారాయణ కవికి నచ్చలేదు. పాదము ప్రియుని నుదుటఁ బెట్టుదురా? దాని కెంపు - పస పెన్నలోఁ గలియుఁగాక! అని, కర్పూర తాంబూల రసరంజితాధరసంపుటితోఁ గనుదమ్ముల మీఁద ముద్దు వెట్టించినాఁడు.

చిలుక తొలిపలుకులు

సీ. దశకంధరుని మోహదశ విచారించెనే
సకల జగన్మాత జనకజాత
నహుష భూపాలు మన్నన కొప్పుకొనియెనే
స్త్రీరత్నమైన శచీపురంధ్రి
యల సింహబలుని మాయలఁ జిక్కి చొక్కెనే
విపుల సద్గుణమాన్య ద్రుపదకన్య
శబరాధిపుని దురాశలకు లోనయ్యెనే
రతినిభాకృతి భీమరాజపుత్రి

తే. తొల్లిటి మహాపతివ్రతల్ దుర్మదాంధ
కాపురుషు లంగభవ శరాఘాత వికల
చిత్తులై తమ్ముఁ జేరి యాచించినపుడు
సిగ్గు వోనాడుకొనిరఁటే! చిగురుబోఁడి! (శుక. 1-155)

అంచ తొలిపలుకులు.

సీ. పంక్తికఁరుని మోహపరితాప మెంచెనే
భువనమాత జగత్పూతపూత సీత
యల పుళిందుని బొంద నాసక్తి జెందునే
ప్రియహితామితనయ భీమతనయ
నహుషుని విరహంపుఁ దహతహల్ చూచెనే
సాంద్ర సద్గుణచర్య యింద్రుభార్య
మఱి సింహబలుని పెన్మాయలఁ జిక్కెనే
యాఱడి పనిఁబూని యాజ్ఞసేని

తే. మునుపటి పతివ్రతలు మహామూర్ఖచిత్తు
లైన దుర్జను లతిఘోర సూనసాయ

కాస్త్ర జర్ఝరితాత్ములై యాసపడిన
మాన ముడివుచ్చుకొనిరఁటే! మచ్చెకంటి! (హంస. 1-127)

'మచ్చెకంటి' సంబోధనము నాయికా కామేంగిత సూచకము . 'చిగురుబోఁడికి' పైచేయి.

సీ. "రాజులు కుటిల సర్ప విషోగ్రతర మూర్తు
లధరబింబము పంట నదుముటెట్లు"

ఇట్లు సాఁగిన శుక సప్తతి సీసమునకు - "అధిపుల్ క్రూర ఫణిస్వరూపు లధరం బాసించు టేరీతి" అని హంసవింశతి మత్తేభవిక్రీడిత వృత్తము పోటీ. ఇట్టివి పెక్కులు.

సీ. ఏకుతోఁ జెలఁగు కేలెత్తుచో భుజమూల
కాంతులు బయలు బంగారు సేయ (శుక. 2-422)

సీ. కేలెత్తుచో బాహుమూల జాత ప్రభా
చకచకల్ పైఁడి వసంత మాడ (హంస. 2–22)

క. రేపటికిఁ గథల్ వినిపించిన నరఁటి
పండ్ల వేయుము చెలియా! (శుక. 3-596)

మ. వినిపో! నిల్పి ననంటి పండ్లనె
ననున్ వేయింపు మంతన్ వెసన్. (హంస. 2-70)

చిలుక అరటిపండ్లు తినును. హంస కౌచు తినును. ఆ పక్షి వనచరము. ఈ పక్షి జలచరము. అయినను బాముకుఁ బాలు నేర్పినట్లు హంసకు ననఁటిపండ్లు నేర్పవచ్చును.

ఆ. తెగువయే దేవేంద్ర పదవి యనెడు
బుద్ధి పొదలఁబోలు. (శుక. 1-156)

క. తెగువయె యింద్రపదవి యనఁ
దగు బుద్ధి జనింపఁబోలుఁ దరుణీ ! నీకున్. (హంస. 1-126)

తే. మరుఁడు ప్రక్కలు పొడిచి సమ్మతము జెందు
మనుచు నిర్బంధ మొనరింప (శుక . 2-479)

ఉ. మారుఁడున్ బ్రక్కలు నెక్కొనన్ బొడువ. (హంస. 1-237)

తే. అరయ నిక్షేప ముంచిన యట్టివారె తెలియవలెఁ గాక. (శుక. 1-539)

క. ఎవ్వరిడు నిక్షేపం బేమఱక వారె కనవలె. (హంస. 2-121)

తే. గుడ్లుమై పుట్టి యీగోడు గుడువవలసె. (శుక. 3-405)

తే. గోడిగై పుట్టియును గోడు గుడువవలసె. (హంస. 5-42)

వర్షము కురిపించుట.

సీ. గళదనర్గళ గళద్గళ దుద్ధత ధ్వని. (శుక. 1-276)

సీ. బిబిబిబి ద్ధగగరద్భేక భీమధ్వని. (హంస. 5-59)

ఈ రీతిగా గ్రంథమంతయుఁ బోటిపడుచుండుట చూడవచ్చును.

ఈ క్రింది పద్యము వసుచరిత్ర యందీతనికిఁ గల తాత్పర్యమును దెలుపును.

ఉ. ఆరయ నేరెటేటి యసలందుల వెన్నెల తేటనించి తొ
ల్కారు మెఱుంగు రంగులిడి కమ్మసుధన్ బదనిచ్చి మేటి శృం
గార రసంబుతోడఁ బొసఁగంగ ననంగవిధాత చేసెఁగా
కీ రమణిన్ విధాత సృజియించుచు నంటినఁ గందకుండునే! (హంస. 5-168)

తే. మేటి జమ్మేటి యసటఁ గ్రొమ్మించు మించుఁ
బొదివి మదన ప్రతాపాగ్నిఁ బుటమువెట్టి
తమ్మిగద్దియ దాకటఁ గ్రమ్మి యట్టి
కొమ్మఁ గావింపఁబోలు నెత్తమ్మిచూలి. (వసుచరిత్ర. 2-32)

పద్యము పద్యమంతయు విఱుపు లేని సంస్కృత సమాసమునఁ గ్రుచ్చి కూర్చుటయు నొక వింతయే. అట్టి వింతలు పూర్వకవి ప్రహత మార్గమున హంసవింశతికవియు నటనటఁ జేసెను. "మేఘేందు కార్ముక మీనదర్పణ వజ్ర" (4-140) అబలావర్ణన సీసమట్టిది. అబల చాల నిఱుకునఁ బడినది. ఈ పద్యమును జూచినచో నితనికిఁ దెనుఁగు ఒదిగి వచ్చినంత సుకరముగా సంస్కృతము ఒదిగి రాలేదని తోఁచును.

శ్రీనాథుని "పతిపాణి పల్లవచ్యుత నీవిబంధన వ్యగ్ర బాలాహస్త వనరుహంబు" పద్యము ననుసరించి పెద్దన "సహసా నఖంపచస్తన దత్త పరిరంభ" పద్యము రచించెను. ఆ సురతవర్ణన పద్ధతి తరువాతి ప్రబంధకవులకు మేలుబంతి యయ్యెను. సారంగు తమ్మయ తన వైజయంతీ విలాసమున "జార రతి" నిట్లు వర్ణించెను.

మ. అసుగంధాంగ విలేపనం బనఖ దంతాంకం బతాంబూల మ
ప్రసవాలంకరణం బనుక్త మణితారావం బశయ్యాతలం
బసుఖస్వాప మబంధ నైపుణ మసంప్రాప్తాంగ సంక్షాళనం
బసిధారాటము నైన జారరతి కృత్యం బత్తఱిన్ వర్తిలెన్.

(వైజయంతి 2-40)

జారరతి కృత్యము కత్తిమీఁద నడచుటవంటిదన్న మాట నారాయణకవి మనసున నాటుకొన్నది. "అసిధారా వ్రత" మని వర్ణించెను. అయిదవ రాత్రి కథలో

"జారశేఖరుఁ డను బ్రహ్మచారి మీఁటి
యెంటిపాటైనఁ దెరువులో నొడిసి పట్టి."

మ. "అసమాలాప మచుంబితాధర మశయ్యాన్యోన్య విక్రీడితం
బసమాలింగన మస్థిరోత్సవ మధైర్యస్తంబ తాంబూలితం
బసుదంతాంక మనిర్భయం బమణితం బస్రస్తనీవ్యాదికం
బసిధారావ్రతమైన చోరరతి కార్యంబప్డు సంధించినన్. (హంస. 2-107)

"తిరిగి చూచుచుఁ దనయింటి తెరువుఁబట్టి
గొల్ల ప్రాయంపుఁ జిల్కలకొల్కి చనియె"

పిల్లలమఱ్ఱి పిన వీరభద్రకవి కుక్కలకుఁ బేర్లుపెట్టి సీసము వ్రాసెను. నారాయణకవి కోళ్లకుఁ బేళ్లు పెట్టి సీసము వ్రాసెను.

సీ. పులిమల్లఁ డడవిపోతులరాజు గరుఁడుండు
గాలివేగంబు పందేల పసిఁడి

విష్ణు ప్రసాదంబు వెండిగుండుల పరి
పచ్చిమిర్యము వెట్టిపుచ్చకాయ
పేఁట మాణిక్యంబు విరవాది మెడబల్మి
పెట్టుకాఁడు వకారి పిడుగు తునుక
జిగురుఁడు చిత్రాంగి శ్రీరామబాణంబు
పులియండు కస్తూరి బొడ్డుమల్లె

తే. యనఁగ మఱియును బెక్కుతోయముల పేళ్లు
దారకులు దేరవచ్చె నుద్దండవృత్తి
వేఁటకుక్కలు మృగరాజ విగ్రహములు
పటుకనాథుని వాహ్యాళివాహనములు.

(శృంగార శాకుంతలము. 1-108)

సీ. గరుఁడండు శరథంబు కంచుడమారము
రణభేరి కార్చిచ్చు జాతిబొమ్మ
రాముబాణము .... .... (హంస. 3-215 చూడుఁడు.)

శ్రీనాథుఁడు ప్రమథుల గుంపును. “ఆగడీలు మహాధూర్తు లగడుఁగాకు లుద్ధతులు గొంట్లు పలుగాకు లుదురుమిడుకు లాకతాయులు శరులు గయ్యాళులు ...” (హర విలాసము. 5-10)

అన్నాఁడుగదా! 15 వ రాత్రికథలో నొక బలిజెసెట్టికొడుకును గుఱించి నారాయణకవి యొక సీసమాలికనే వ్రాసెను.

“ఆకతాయి బికారి యడిబండగుండఁడు మొండికట్టె గులాము మొప్పె...”

(హంస. 5-113 చూ||)

ఇంతే కాదు. ఒకటికిఁ బది, నూఱు కల్పింపఁగల నేర్పు, నోర్పుగూడ నారాయణ కవికిఁ గలవు.

తల్లికడుపునఁ గొఱగాని కొడుకు పుట్టుట చెఱకుతుద వెన్నుపుట్టుట వంటిదని చెప్పిన నితనికిఁ దృప్తి లేదు. ఈ క్రింది సీసము చిత్తగింతురు.

సీ. గుడిమీఁదఁబడు రావి కడిలోని చెడుగీఁగ
పుణ్యనదీతీర్థమునను మొసలి
కంటిలోఁగొరవెండ్రుకయు రచ్చమట్టిని
బ్రహ్మరాక్షసి కాపురమ్ము సేయు
భవనసీమను ద్రాఁచుపాము కల్పకుజంబు
కడ గచ్చపొద పాలకడలి విషము
వనమునఁ జిచ్చు దివ్యౌషధికినిఁబుప్పి
బ్రతుకు బాలెడునింటఁ బరశురాము

తే. హస్త ముదకాన గ్రుడ్డు సస్యమునమల్లె
జీవవితతికి రోగంబు చెఱకువెన్ను
మణికి దోషంబు నృపునందు మార్దవంబు
పుట్టుచందానఁ బుట్టెను బుత్త్రుఁడొకఁడు.

(హంస. 5-109)

## కథాసంబంధి పద్యశిల్పము

నారాయణకవి చిత్రవాగ్లక్ష్మీ సంపన్నుఁడు. ఏకవింశతి నాయికల నెన్నికొని, యెక్కడ కక్కడఁ గ్రొత్త యనిపించి, బహుముఖమైన ప్రతిభాజ్యోతిని వెలిగించి వర్ణించినాఁడు. ఇతని గ్రంథమున కీ కొమ్మలే పట్టుగొమ్మలు.

ప్రధాన నాయిక హేమవతి. ఆమె రూపరేఖలు సిద్ధస్త్రీ వర్ణించెను. ఱేఁడు మరులుకొనెను. యత్నించెను. కాని, యత్నము ఫలించలేదు.

"కబరీభరమునకుఁ గందంబు సెల్లు, నుత్పలమాలికలు నేత్రములకుఁజెల్లు " (1-62) అను పద్యమున ఆ మూర్తి మనసున కందునదేకాని, చేతికందునది కాదు అను ధ్వనివిశేషము చమత్కారము నతిశయించి పొడగట్టును.

ఇట్టిదే మఱొక పద్యము. అది బ్రాహ్మణీ రమణీయ భావము. బ్రహ్మవేత్తలను జీకాకుపఱచుట.

సీ. నెఱిగొప్పు నెఱరంగు నీలంపు సద్రుచుల్
 నారదభావంబు చూఱగొనఁగఁ
 గలికి కాటుకకంటి చెలువు భారద్వాజ
 గరిమంబునైనఁ జీకాకుపఱుప
 మించి సిబ్బెపు గుబ్బమినుకులు కుంభజ
 సద్వృత్తమంతయు జడియఁజేయ
 మందయానపుఁబ్రౌఢిమము మతంగజ ధైర్య
 పర్యాయమెంతయుఁ బగులఁజేయ

తే. నవ సుధామయ మధురోక్తి నైపుణములు
 శుకమనోవృత్తి నెంతయుఁ జులుకఁజేయ
 మెఱుఁగు జిగినిచ్చువగ జగ్గు నెఱతనంబు
 వెలయఁ జరియించు నదియు నవ్వీటిలోన.

(హంస. 3-130)

నారద భరద్వాజ కుంభజ (అగస్త్య) మతంగ శుకమహర్షులు జితేంద్రియులు. ఆమె జిగిబిగి ఋషుల కొంపలు గూల్చుచుండెనని ఝటితిస్ఫూర్తి. నారదము = మేఘము. భరద్వాజము = ఏట్రింత పక్షి. కుంభము = కుండ, మతంగజము = ఏనుఁగు. శుకము = చిలుక. కొప్పు మేఘమును, కన్నులు ఏట్రింత పులుగును, గుబ్బలు కుండలను, నడక యేనికలను, పలుకులు చిలుకలను భంగించుచుండెనని కవిసమయ వస్తుసిద్ధమగు ప్రకృతార్థము.

చ. పొలఁతుకవేణి కృష్ణతను బొందిన యంతనె మోము సూడుచేఁ
 దలఁకి విధుస్థితిన్ దనరెఁ దాళక చన్నులు నచ్యుతాకృతిం
 బొలిచె, సహింపలేక నడుమున్ హరిరూపు వహించె, నిట్టి వా
 ర్తలకు మధుద్విషత్త్వమును దాల్చెను జక్కెర లొల్కు మోవియున్.

(2-235)

ఈ పద్యమున వసుమతి యను వణిక్సతి సౌందర్యము చెప్పఁబడినది.

కృష్ణవిధ్యచ్యుతహరి మధుద్విషచ్ఛబ్దములు విష్ణుపర్యాయ శబ్దములు. వేణి (జడ) కృష్ణత్వమును (నల్లదనమును) బొందెను. దానిఁజూచి యీర్ష్యచే మొగము విధుస్థితి (చంద్రుని పోడిమి) దనరెను. దానిఁజూచి తాళలేక చనులు అచ్యుతాకృతి (జాఱని బిగి) బొలిచెను. దానిఁజూచి సహింపలేక నడుము హరిరూపు (సింహము నడుమువంటి సన్ననిరూపు) వహించెను. ఈ వార్తలెఱిఁగి పెదవి మధుద్విషత్త్వమును (తేనెను ద్వేషించుపాటి స్థితి) దాల్చెను. వేణ్యాదులు విష్ణుసారూప్యముఁబొందెను. చిత్తశుద్ధితోఁగాదు-పోటీపడి. ఏమైన అది పవిత్రమైన సిద్ధియే. ఈ సిద్ధి బహిరంగములకే చెప్పఁబడెను. అంతరంగ విషయము చెప్పఁ బడలేదు. కనుక, ఇతర నాయికలవలెనే యీమెయు నభిసరింపఁబోవును. సంకేతమున మునిచీఁకటిలో విటుఁడై వచ్చిన తన భర్తను గదిసి భోగించును. ఈలువు చెడదు. తదాదిగా నామె భర్తృసాముఖ్యమునకుఁ బాత్రమయ్యెను. పవిత్రస్త్రీ యయ్యెను. అదియే విష్ణుసారూప్య ఫలము, అది ఘుణాక్షర న్యాయమునఁ గుదిరినది.

పండ్రెండవరాత్రి కథలో నాయిక విశాల. ఆమెభర్త పంచాక్షరీజపపరాయణుఁడు-శివదత్తయోగి. కవి పంచాక్షర ప్రాసపద్యముతో విశాలను వర్ణించెను.

ఉ. సారసమా, నవీనఘృణి సంపదఁ గాంచును నెమ్మొగంబు కా
 సారసమాన విభ్రమము సారె జయించును నాభియున్ సుధా
 సార సమాన మాధురిని జాల రహించును మోవి చంద్రికా౽
 సార సమాన హృద్య రుచిసంతతి మించును గాంతహాసముల్.

(3-195)

మగని పంచాక్షరీ మంత్రగతమైన మనస్సును స్వమంత్రగతము గావించు కొనుటకు విశాల యెంత ప్రయాసపడుచుండెనో మఱొక పద్యమున విస్పష్టముగాఁ జెప్పెను.

ఆమెరక్తి యతని విరక్తి యౌగపద్యముగ వాన-యెండ తోఁచినట్లెంత విచిత్రముగ నుండెనో చూడుఁడు.

సీ. పదము లొత్తెదనంచుఁ బతిజంఘికలు తన
 తొడలపై వేసికో మిడిసిపడును
 నడుము పట్టెదనంచు నాథుని చిఱుదొడల్
 పుడికినఁ 'జీ' యని పొరలు నవల
 నుతబర్హ మెగద్రోయ నుంకించి మోముపై
 మోముఁ జేర్చినఁ జూచి ముదుగులాడు
 వ్రేల్మెటికలు దీయ వెసనెత్తి హస్తంబు
 కుచములపై వేసికొనినఁ దిట్టుఁ

తే. బ్రక్కలోఁజేరి కౌఁగిటఁ జిక్కఁబట్టి
 కులుకు గుబ్బల నెద ఝొమ్ముఁగ్రుమ్మి క్రుమ్మి
 రతి బలాత్కారమునఁ జేయ ధృతివహించు
 ప్రేయసిని జూచి రోయుచుఁ ద్రోయునతఁడు. (3-201)

పదునాఱవ రాత్రి కథలో నొక బెస్తవాఁ డున్నాఁడు.

తే. మేలు బలువాలుగల నేలు మిసిమిఁగ్రాలు
 కన్నుగవడాలు మరునాలు కరణిఁబోలు
 మురిపెముల ప్రోలు కలదొక్క ముద్దరాలు

వాని యిల్లాలు దొమ్మరవాని డోలు. (4-139)

వాలుగలు చేపలు. ఆమె లోచనకాంతి వాలుగల నేలుచుండెను. అనఁగా ఆమె కన్నులు కన్నులవలె లేవు. మిలమిలలాడు మీనముల వలె నున్నవి. "ఈక్షణే విచలతః కూపోదరే మత్స్యవత్... కామేంగితే యోషితామ్." ఆ కన్నులు ఇంగిత మెఱిఁగించుచున్నవి. మగవానిఁ జూచినచోఁ దట్టుకొన లేదు. కనుకనే "వాని యిల్లాలు దొమ్మరవాని డోలు" అన్నాఁడు. డోలుకు దాపటి దెబ్బ, వలపటి దెబ్బ. ఇంటఁ బతిఁ బయట నుపపతి.

జాలరి చేపలను బట్టి చంపును. వాని చెలి చేపల నేలును. ఇదెట్లు? చేపలు లోచనములకు దీప్తి నిచ్చు నాహారము. విటమిన్ ఏ. ప్రభావము నూహింపవలెను.

పదునేడవ రాత్రి కథలోఁ గుమ్మరి ముద్దుగుమ్మ కుచకుంభము లొక యుత్పలమాలతోఁ బ్రత్యేకముగా వర్ణింపఁబడెను. కుమ్మరి సుంత మృత్పిండముఁ గొని, యింతకుండ చేయుట యెట్లుండునో యూహకందునట్లు పరిణామ పేశలముగా వర్ణింపఁబడెను. కుంభకారున కొక దున్నపోతుండెను. అది పోతరించి, ఉక్కు పోఁతపోసినట్లుండెను. వాని భార్య "యింటి యెనుబోతున కంటె మదంబు హెచ్చి" తలవాకిలి కాఁపురముగా నుండెను. నెర మాటలు - అర మాటలు మాటాడును. నెర మాటలు కలుపుగోలుతనముతో మాటాడు మాటలు కావచ్చును. అరమాట లనఁగా నేమి? శకట రేఫమైనచో అఱ = పేటికాదుల అంతర్భాగము. అపుడు మనసులో దాఁచుకొన్న మాటలగును. ఆ మాటల వెనుక నొక చిలిపితనము, దాని వెనుక నొక లెక్కచేయని పొగరుబోతుతనము నుండును. అవి యెట్టివో బాటసారితోఁ ఘటకారనారి జరిపిన సంభాషణక్రమమునఁ జూపఁబడెను.

సీ. దప్పికిమ్మన మదిదప్పినదా? యను
  చెంబుదెమ్మనిన కుచంబె? యనును
  కూరఁబెట్టుమనఁ జేకూరెనా? హితమను
  నన్న మడిగిన నధ్వాన్న మనును
  సున్న మిమ్మన్నఁ గూసున్న మేలనుఁ, బోక
  వక్క లేవనిన గుర్వక్కె యనును
  నిప్పని పలుకఁగా నిప్పనికని యను
  నాకిమ్మనిన మసియాకె యనును

తే. దేహ మలసె నటన్న సందేహమా య
  టంచు నిట్లేపురేఁగి యమ్మించుబోఁడి
  యతని మాటల కరమాట లాడుకొనుచుఁ
  గేరి నవ్విన... (5-70)

ఈ క్రమముఁ జూచినచోఁ, బాప మామెకుఁ జెవుడేమో యనిపించును. కాని చివరఁ గేరి నవ్వుటచేఁ జెవుడు కాదని, కావలసి యన్యార్థముఁ గల్పించి మాటాడుచున్నదని, అరమాటలు వికటోక్తు లని తేటపడుచున్నది.

## చమత్కార పద్య శిల్పము

ఈ చమత్కార మధిక భాగము ఛందస్సంబంధియై భాసించును. ఈకవి యేమి? ప్రబంధ కవులందఱు ఈ శిల్పమున కగ్రతాంబూల మిచ్చిన వారే. కని సమయక్లృప్తసామగ్రి చేతఁబట్టుకొని భావప్రపంచమున మేడమీఁద మేడ యెన్ని మేడలైనఁ గట్టుదురు. పద్యగత ప్రాసస్థాన మొక క్రీడా స్థానము. వెయ్యి యొయ్యారములు చూపింతురు. కందములు, సీసములు, ఆఁటవెలఁదులు చేయి దిరిగిన కవిచేతిలో ఎన్ని సొంపులు వోవునో చెప్పలేము.

ఇవిగాక, పద్యము పద్య మంతయు నేక సమాస ఘటితముగా నిర్మించుట, అచ్చ తెలుఁగులు గుది గ్రుచ్చుట, సర్వగురు, సర్వలఘు, ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, నిరోష్ఠ్య పద్యములు రచించుట, శ్లేష, బంధ, గర్భ, అనులోమ, విలోమ, పాదభ్రమక ప్రముఖ చిత్ర పద్యములు సాధించుట కొద్దిగనో గొప్పగనో చేసి తీరవలయుట యొక మర్యాద యయ్యెను. హంసవింశతి యందు ఆ మర్యాదకు లోటు లేదు.

నారాయణకవి రామరాజ భూషణకవి వలె శ్లేషోక్తి వైచిత్ర్యముఁ జూప యత్నించినాఁడు. కాని యితని కా త్రోవ సుగమము కాలేదు. కారణము తెల్లమే. రామరాజ భూషణుఁడు పిండికలవాఁడు. అతని చేతిలో సంస్కృత వాణి తడిపిన గోదుమ పిండివలె సాఁగును. ఇతనికిఁ జేమకూర వేంకటకవి త్రోవ చక్కగాఁ బట్టువడినది. ఆ ముద్ర యితని కృతిలో సర్వత్ర బారసాఁచి నగుమొగముతోఁ బొడకట్టును. చతుర్థాశ్వాసము 74వ పద్యము, పంచమాశ్వాసము 277వ పద్యము చూడఁగలరు.

### కందముల చిందులు

తొడలందము కటిచందము
   నడుగుందమ్ముల బెడంగు లాస్యము రంగుల్
   జడతళుకున్ మెడకులుకున్
   నడబెళుకుం జూడ నా ఘనస్తని కమరున్ . (2-17)

విరులా? నగవులు, నీలపు
   సరులా? కురు, లుబ్బు గబ్బి చన్నులు జాళ్వా
   గిరులా? యూరు లనంటుల
   సిరులా? యని జనులు మెచ్చఁ జెలువ చెలంగున్ . (4-71)

### ఆటవెలఁది యొయ్యారములు

వాలుమీలఁ బోలు వామాక్షి చూపులు
   సోము సాము గోము భామ మోము
   మంచు మించు సంచు నెంచు మై తులకించు
   మిన్ను చెన్నుఁ దన్ను సన్న నడుము. (3-69)

మొగము నిండియుండు మోహంపుఁ గన్గవ
   యురము నిండియుండు నుబ్బుచనులు
   వీఁపు నిండియుండు వేనలి జొంపంబు
   దానిఁ బొగడఁ దరమె! మానవులకు. (4-77)

ఇఁక సీసాల విలాసాలకు గ్రంథమే చూడవలెను.

"గోళ్లు రిక్కలజోళ్లు వ్రేళ్లు మావిచిగుళ్లు
   చెల్లు పొక్కిళ్లులుల్లసిల్లు సుళ్లు" (2-224)

ఇదొక లయ.

4-55 సీసమున నిరువదియేడు నక్షత్రములు, పండ్రెండు రాసులు కూర్చఁబడినవి. సంచారి భావములు ముప్పదిమూడు, సాత్త్విక భావములెనిమిది తడఁబడి తబ్బిబ్బయినవి. శబ్దముగూడ దెబ్బతిన్నది. వచనము వ్రాసియుండిన శుభ్రముగా నుండెడిది.

గీర్వాణ భాషా క్లృప్తి.

అశీర్నమస్క్రియా సందర్భము లందు గీర్వాణభాష చొనిపి తెనుఁగు పద్యము వ్రాయుట కద్దు. ఇతర సందర్భములందుఁ బ్రాయికముగా వ్రాయరు . వ్రాసినచో విశేషమున్న దన్నమాట.

రెండవ రాత్రి కథలో-

తే. ప్రాము జఠరాగ్నిచేఁ 'గిం కరోమి' యనుచు
నడరు వేదనచేఁ 'గ్వ యాస్యామి' యనుచు
విస్మయపు మూర్ఛచే 'నాహతోఽస్మి' యనుచుఁ
బలువరింపంగ సాఁగె నబ్బక్క నక్క. (1-191)

ఈ నక్క పంచతంత్ర కథలోని కరటక దమనక జంబుక సంతతికిఁ జెందినదేమో! సంస్కృతము పలుకుచున్నదని నవ్వవచ్చును. ఈ శిల్పము నవ్వులాటకుఁ జేసిన శిల్పము కాదు. సద్బ్రాహ్మణుఁడు కాశికిఁ బోయి తెచ్చిన లింగమును బ్రతిష్ఠించి తదర్థము త్రవ్వించిన బావియొద్ద నక్క చావఁబోవుచున్న దన్న భావ్యర్థసూచనము చేయుటకుఁ జేసిన శిల్పము. జీవుఁడు వేల్పునేల పొలిమేరలు చూచుచున్నాఁడు. నక్క యెక్కడ? నాకలోక మెక్కడ ? అను నానుడి యిక్కడఁ బట్టదు. స్థలమహిమకు విలువకట్టవలెను.

పదునొకండవ రాత్రికథలో నొక పండితునిభార్య కఱవునఁబడి, యొకనాఁ డొక భిక్షువును గూడెను. ఆ భిక్షువు బ్రాహ్మణుఁడే కానీ, పొట్ట చించినను అక్షరము లేనివాఁడు. ఆకతాయి. రతి పారవశ్యమున బాపెత సంస్కృతము మాటాడును. అతఁడును మాటాడును. పండిత పత్ని కనుక ఆమె నాలుగు మాటలు కఱచి యుండును. ఇతనికి దేశాటన లాభముచే అబ్బియుండును. వింతయేమి? అనవచ్చు, నిజమే, కాని, తనుఁ దామఱచిన మైకమున నప్రయత్నముగా సంస్కృతభాష వెలువడునా? అని చూడవలెను. వీటి విటుల మనస్సులు మహానంద రసప్రవాహమునఁ దేలుచు మర్త్యలోకావరణమును దాఁటి స్వర్గలోకపు టంచున విహరించుచున్నవని చెప్పుట కవ్యభిప్రేత విషయము. ఆమాట వాచ్యముగా ననఁడు. సంస్కృత ప్రసంగముచే ధ్వనింపఁజేయును.

చ. "కురు సురతక్రియాం ప్రణయకోప మతిం త్యజ పూర్వసంగమం
పరిచిను దేహి గాఢ భుజబంధన మంగజ శాస్త్రవాసనాం
స్మర, రదఖండనం ఘటయ, మామవ మారశరా, నఖక్షతం
విరచయ" యంచుఁ బల్మఱును వేడ్క వచింతురు జారదంపతుల్. (3-161)

కల్పనా చమత్కారము

దుర్గములను పరంగులు పిరంగులతో భేదించు కాలము వచ్చినది. అపుడు కవి యిట్లు వ్రాయును.

చ. పొలుపగు మావి లేఁజిగురు పొందిక పోఁత పిరంగిలోన నె
క్కొలిపిన పుష్పగుచ్ఛమను గుండు పరాగపు మందు నించి, వె
గ్గలపుఁ బరాక్రమాగ్నిఁగొని కంతుఁడనేటి పరంగి భామ గు
బ్బలనెడు దుర్గముల్ పగులువాఱ గుభుల్లున నేసి యార్చినన్ . (1-230)

ఆ కాలమున దొంగలు నిలువు దోపిడి (చీరలతోఁ గూడ) చేసెడివారు. ఈ కల్పన మనోహరము.

తే. కలయఁ గొమ్మలతోఁ గూడి కాననమున

నుండు విటపుల ననిలచోరుండు పట్టు
కొని దళాంబరములు దోచుకొనియె ననఁగఁ
బండుటాకులు గాడ్పులు పర్వ రాలె. (5-223)

కొమ్మలతోఁ గూడిన విటపులు శాఖలలోఁ గూడిన వృక్షములు: స్త్రీలతోఁ గూడిన (విట + ప) జార ప్రభువులు.

తే. తనయుఁడగు రాజు ఘనమార్గముననుు రాఁగఁ
గోట యా త్రోవ నరికట్టుకొన్న సుద్ది
విని, జలధి దాని చుట్టును విడిసె ననఁగ
నా రసాతల నిమ్న ఖేయంబు ధనరు. (5-7)

కోట వెలుపలి అగడ్త చాలఁబెద్దది, చాల లోతైనది. అయినచో సముద్రమా? సముద్రమే! ఇక్కడ కెందుకు వచ్చినది? కోట మీఁది కోపముతో వచ్చినది. కోటమీఁదఁ గోపమెందుకు? సముద్రము కన్నకొడుకైన చంద్రుఁడు గగనమార్గమున రాఁగాఁ గోట అడ్డగించినదఁట. అందుచేత ససైన్యముగాఁ బోరుకు వచ్చినదఁట సముద్రము. ఈ యుత్ప్రేక్ష యపూర్వము.

కుమ్మరి తొయ్యాలి పొక్కిలి పాముల బుట్ట. నూఁగారు నల్ల త్రాచు. దాని నాడించువాఁడు మన్మథుఁడు, ఈ యాట చూడుఁడు.

ఉ. పంచశరాహి తుండికుఁడు భామిని పొక్కిలిపెట్టెలోనఁ దా
నుంచిన కాలసర్పము సమున్నతి నాడఁగ లేవమీఱ బు
స్సంచు ఫణాగ్రమెత్తి యలరారెడు బాడ్పు న రోమరాజి య
భ్యంచితలీల మించి మది హర్షముఁ జేయు జనాళికెప్పుడున్. (5-19)

గొల్లపిల్ల నూఁగారు వర్ణించిన వైఖరి యింతకంటెఁ జారువుగా నున్నది.

తే. కొమిరె పొక్కిలి బంగారు కుందియందు
రతియు శృంగారమను ధాన్యరాశి నించి
దంచనిడినట్టి రోకలి సంచు మీఱి
రోమరాజి దనర్చు నారూఢిగాఁగ. (2–100)

పొక్కిలి వడ్లు దంచుకొనెడు నేలరోలు. నూఁగారు నల్లని చేవ రోకలి. ఇట్టి ముచ్చటలు కొల్లలు.

సుదతీ రతిక్షుభిత స్థితి అతిశయోక్తిలేక, స్వభావోక్తిమధురముగా నున్నది.

సీ. చిఱుచెమ్మటలతోడ బెరసిన ఫాలమ్ము
కసవంటి వీడిన కప్పుకొప్పు
కడు రక్తిమము గల్గు గండస్థలంబులు
వెనుకకు దిగజాఱి వ్రేలు సరులు
పులకలు నిండారఁ బొడమిన దేహంబు
ధూళిధూసరితమై దొరయు వీఁపు
మందస్మితంబగు మధురాధరంబును
మంద వీక్షణ నమ్ర మస్తకంబు

తే. తడఁబడ వడంకుచుండెడు తలిరుదొడలు
వదలిన బిగించి సడలించు వలువదనరఁ
దిరిగి చూచుచుఁ దనయింటి తెరువుఁబట్టి

గొల్ల ప్రాయంపుఁ జిల్కలకొల్కి చనియె. (2-108)

లోకజ్ఞత

నారాయణకవి నవీనుఁడు. కవిత్వము నేర్చిన కరణము బిడ్డ. గ్రంథములను జదివి నేర్చికొన్న విషయ పరిజ్ఞానము వేఱు. లోకమును బొదివి కూర్చికొన్న విషయ పరిజ్ఞానము వేఱు. మొదటిది చాలమందికి సంగతము కావచ్చు. రెండవది దుర్లభము. ఈ కవి లోకజ్ఞతా విశేషమునకు ఈ ప్రబంధము పంట పొలము.

పదునేనవ రాత్రి కథలో గాఁపుటిల్లు వర్ణించెను. గొడ్డు గోదము, గింజ గిట్ర గల సంపన్న గృహస్థుని యింటి పోడిమి కనులఁ గట్టినట్లు వర్ణించెను.

ధాన్యముల రకములు చెప్పెను. వడ్ల రకములు చెప్పెను. ఎత్తుగీతిగాక 24 పెద్ద పాదముల సీసమాలిక వడ్ల పేరులు చెప్పుటకే సరిపోయినది. కూరగాయలు, కూరాకులు, పండ్లు, ఊరుగాయలు, వీనికి వేర్వేఱు సీసములు. "రామ గుమ్మడి, యోబరాజు గుమ్మడి, చార గుమ్మడి, బూడిద గుమ్మడులును" అని చతుర్విధ కూష్మాండ భేదములు చెప్పెను. దూరదేశమేఁగు విష్ణుదాసుఁడు తనవెంటఁ గావళ్లలోఁ గొంపోయిన తిండ్లు చిఱుతిండ్లు అలనాఁటి తెలుఁగువారి భోక్తృత్వమును, గవి విశేషజ్ఞత్వమును బ్రకటించును.

బోగమువారి యింటిని జూపెట్టుకొనియుండు అనుజీవు లెందఱుందురో, వారి నందఱిని సంతుష్టులఁజేయవలసిన కష్టము విటుల కెంత యున్నదో చక్కగా వ్రాసెను. ఒక విటుఁడు-

సీ. పంచాంగమయ్యకు బాగ సమర్పించు
నట్టువకానికిఁ బెట్టు మురువు
భరతంపు టొజ్జకుఁ బచ్చడం బొగిఁగప్పుఁ
బొగడు బట్టుకుఁ జేర్చుఁ బోగుజోడు
కథ చెప్పు భూసురాగ్రణికి దోవతొసంగు
ననువుకానికి బత్తె మెనయ నడుపుఁ
బూల్గట్టు సాతానిబోటి కుంగర మిచ్చు
గందొడివానికి విందు సేయుఁ

తే. జతురికకుఁ జీర దూతికి సందిబొందె
కడెము పరిచారికకు సారికకును రవిక
తాపికకు సొమ్ము వేశ్యమాతకును గాన్క
లిచ్చి చెప్పించు రతిసేన కెచ్చుతమిని. (5-134)

వీరుగాక గుండఁడు అడిబండఁడను రౌడీలున్నారు. లండి, గుమ్మెతకాఁడు, భృత్యుఁడు, ఆఁడంగివాఁడు తరువాతి పద్యమునఁ జెప్పఁబడిరి. ఇంత బలగముతో వేశ్యానిలయము కలకల లాడుచుండునఁట.

ఎద్దు, గుఱ్ఱము, తమపాట్లు దున్నపోతుతోఁ జెప్పికొనును.

సీ. తలయేరు బెట్టి బీడులు దున్ని పడఁగొట్టి .
కాలు చిక్కిన బండ్లఁగట్టి మొత్తి
పొలముకాండ్లకుఁ బంచి తలదిమ్ము బట్టించి
పట్టుడు కవిలెలఁ బదను జెఱిచి
పాపనమ్ములఁ జిక్కుపఱచియు రెండేసి
గొర్లకాఁడి యమర్చి గొట్టుచేసి

బలుగుంటకల చేనుపాయుచో సాఁగని
తావుల సెలకోలఁ దాఁక మొత్తి

తే. గానుగలఁ ద్రిప్పి సరువళ గలచి బంతి
దుడ్డు బరువెత్తి యెకరింత దోలి యొడలు
గల్లిపడి రెండు దుక్కులు వెళ్ల దున్ని
యఱ్ఱుగడిగి పోఁదోల విఱ్ఱైతిఁ జుమ్మి! (5-35)

రైతు దాని రక్తమాంసములు పిండి యెండించి, అఱ్ఱుగడిగి వదలెను. ఇఁక దాని చావు దానిది.

గుఱ్ఱపు గోడు.

సీ. ప్రేమ నెదుర్కోలు పెండ్లివారల కిచ్చి
తెవులైన వారి కద్దెలకు నొసఁగి
మేయఁబోయిన చోట మెడవెండ్రుకలు బట్టి
యాకతాయులును వాహ్యాళి దోలి
సారె గృహప్రవేశమువారి నెక్కించి
సంతసారెకులందు స్వారి వెడలి
పల్లె పట్రల నుండి బర్వువేసుక వచ్చి
వలసల చే కంట్లముల ఘటించి

తే. తీరకున్నట్టి కష్ట సంసారమునకుఁ
గసవు కట్టెల లద్దుల గాసి పఱచి
లావు సత్తువ చెడఁగొట్టి లాడెపోవఁ
జేసి తోలిన నిటకు విచ్చేసినాఁడ. (5-40)

వృషభఘోటకముల కంటె సైరిభమే ధన్యజీవి. దానియొడయఁడు కుంభకారుఁడు వచ్చి, "లంపులమారిదాన! నిను లాచుక మాదిగవాఁడు గోయ" (5–66) అని తిట్టుచుఁ దోలికొని పోవును. తిట్టిన నేమి! కోయఁదగినంత కండ దానిమేన నున్నది. సరిగాఁ బశువుల నట్లే తిట్టుదురు. లోకజ్ఞుఁడైన కవి వాని నెఱిఁగి యుండును.

దారిద్ర్యదోషమెట్టిదో యొక సీసమునఁ జెప్పినాఁడు (2-150). అది "శశిముఖీ దృక్పాత సంరోధి జంబీర ఫలరసం" బఁట. దరిద్రునిఁ జూచినచో ముద్దియలకుఁ గన్నులలో నిమ్మపులుసు పిండినట్లుండునేమో! ఎంత మంట!!

పర్యాయ పదములు పట్టిగట్టి ప్రదర్శించుటయందు సిద్ధహస్తుఁడగు ఈ కవి కూర్పు 1. "దాక్షిణ్య మనురక్తి దయ" (2–42) 2. "సొగసు మిటారంబు సొంపు నొయ్యారంబు" {5-86) సీసములందు; 3. "ఆకతాయి బికారి" (5-113) సీసమాలిక యందుఁ జూడనగును.

విష్ణుదాసుఁడు ఖరీదు చేసి తెచ్చిన విదేశసామగ్రి పట్టిక గ్రంథాంతమునఁ గలదు. పతి సహచరుఁడు వచ్చి, "మదవేదండ లసద్గమనతో సుధారసధారా పాండిత్య మండితోక్తులఁ బండితమండలికిఁ జెవుల పండువుగాఁగన్" (5-346) చెప్పెను. ఆపట్టిక ఆమె కొఱకుఁ గాదు. మనకొఱకు. ఆ పట్టు చూడుఁడు.

శ్రీరామభక్తుల యింటఁ బుట్టి, కృత్యారంభమునఁ బ్రహ్లాద రుక్మాంగదాది భాగవతుల స్మరించి; కృతి రామాంకితముచేసిన నారాయణ నామధేయుఁ డగు నీకవి

పదునాఱవరాత్రికథలోఁ బుణ్యక్షేత్రములను మహానదులను సరస్సులను బుష్కరిణులను దీర్థములను 108 తిరుపతులను అమ్మవార్లను దర్శించి సేవించి దానధర్మములు కావించి తరించి వట్టి చేతులతోఁ దిరిగివచ్చు పోలిసెట్టి కొడుకు హిరణ్యకుఁడు (బంగారు సెట్టి) వానకుఁ దడిసి, తలదాఁచుకొనఁ బోయి, బెస్త చెలియతో "వివాహ హీనుఁడన్", "ఆలికే నంగలార్చుచు నన్యసతులఁజూచి గ్రుక్కిళ్లు మ్రింగుచు సుఖములేని కతన యాత్రఁ జరించెడి కతయె కాని, మనసు సంభోగవాంఛల మరగి తిరుగు" (4-229) అని పలుకులాగునఁ గథతీర్చుట, అంగరసము అంగిరసమును మ్రింగివేయకుండ జాగరూకత వహించుటయే యని సమాధానపడుద మన్నను, 'భక్తుఁ డీపని చేయవచ్చునా?' యను బాధయే మిగులుచున్నది.

ఇరువదవరాత్రి కథ వింతకథ. మంత్రి కుమారుఁడు స్త్రీ విముఖుఁడు. "ఆఁడు రూపములు వ్రాసిన యింటను నిల్తురే బుధుల్?" అనువాఁడు. మఱి తన తల్లియొడిలో నెట్లు పెరిగి పెద్దవాఁ డయ్యెనో! పెండ్లి యొల్ల ననువాని నొప్పించి, పెద్ద లిద్దరు పెండ్లముల నంటఁగట్టినారు. అతఁడు వారిని ఒంటి కంబపు మేడలోఁ బెట్టినాఁడు కనుక లోలోపల సొరంగములు త్రవ్వుకొనిపోయి, అంకాడుటకు వీలులేదు. ఆకసమున నెగిరి పోవుటకు స్త్రీలకు ఱెక్కలు లేవు కదా! ఱెక్కలు లేకున్నను వారు గగనయానము చేసిరి. మగని కంటఁబడి, వానికి మసిబూసి తప్పించుకొనిరి? ఈ కథ తక్కిన కథల వంటి సాధారణ కథ కాదు; స్వాభావిక కథ కాదు. దీనిని వానితో జోడింపకుండిన బాగుండెడిది. పింగళి సూరన్న విద్యమీఁది మక్కువ మనసును బీకుటచే మన కవి యీ కథ కల్పించి యుండును.

ఛందో వ్యాకరణ స్ఖాలిత్యములు

దక్షిణాంధ్రదేశమున యక్షగాన సాహిత్య నికుంజములు తీవలుసాఁగి దేశీయ సంస్కృతి సంప్రదాయ సౌరభములు గుబాళించు కాలమునఁ బుట్టిన ప్రబంధములలో ఆ వాసన పుంజుకొన్నది. పద్యమునఁ గొన్ని మెత్తనిమాటలు పొదుగుట, పాటవలె నడిపింపఁజూచుట, ఛందోవ్యాకరణ నియమాదుల అంత గణింపకుండుట అప్పుడే మొదలైనది. రచన మాధుర్య గుణ ప్రధానము గనుక రసికులను ముగ్ధులను జేయును. తేనె మాక్షికమే యైనను సేవ్యము కదా!

దక్షిణ శృంగార ప్రబంధముల క్రేవకుఁ జెందినదే హంసవింశతి.

యతి భంగములు

తే. ఉగ్ర భీమాది నామధేయ ప్రసిద్ధ. (1-168)

ఇది ముక్తపద గ్రస్త పద్యము. ఇక్కడ యతి పోయినది. శృంగార కావ్య గ్రంథమండలివారి ప్రతిలో- "ఉగ్ర భీమాది నామధేయోత్రసిద్ధ" అను పాఠము కనఁబడును. యతిని సమర్థించుటకుఁ జేసిన దిద్దుబాటు కాఁబోలు.

తే. దర్శనోత్సాహి పతిచపేట ప్రదాయి (2-52)- యతిభంగము. మద్దులపల్లివారు 'పతి దోహద ప్రదాయి' అని దిద్దిరి.

తథ దధలకు, టఠడఢలు సబిందుకములు చెల్లును. నిర్బిందుకములు చెల్లవు. ఇక్కడ 'దర్శన'మునకు 'డర్శన' మను రూపముగూడ నున్నచోఁ జెల్లింపవచ్చు-దక్కు, డక్కు, దగ్గఱ, డగ్గర వలె. 'త'కు 'ఢ' యతి కల్పించిన వారును ఒక రిద్దఱున్నారు. అది సరికాదు.

తే. జంగమార్చనలకు బాలదాస భోజనములకు (5-14) - యతి భంగము.

4-36, 37 పద్యములందును యతి సడలినది.

సి. వైకుంఠ కేశవ వాసుదేవ పతంజ
లి విరజ ధన్వంతరి కురుభోగ. (4-209)

ల-ర లకు యతి

## ప్రాస భంగములు

ఉ. చూచినయంతలో మరుఁడు చొక్కపుఁ గప్రపుటాల పుంతలన్
లే చివురాకు...(2–81)
లేఁత + చిగురాకు = లేఁజివురాకు అయి, ప్రాస చెడును.

క. ఆతనికి విశాల యనం
గాఁ దరుణి యొకర్తు దనరుఁ గమ్మవిరి లకో
రీ తురక రౌతు లాయము
లోఁ దేజీరతనమనుచు లోకులు వొగడన్. (3-190)

2,4 చరణములఁ బ్రాస విపర్యాసము.

క. నీవైతె జాణ వౌదువు
కావోలున్— (3-226)

కాఁబోలును కావోలు చేయరాదు. ద్రుతబాధ తప్పదు. ఇట్టి యతిప్రాస భంగము లక్కడక్కడ గోచరించును.

తే. పరమ స్వోచ్చాంశ లగ్నముల్ పదిల పఱచి. (3-56)

ఇట్టి గణభంగములును గోచరించును,

## సంధి విశేషములు.

ఎవని మేధంబురుద్భవ (మేధ + అంబు) 1-15

అని దీవిం చక్షతపు 1-48

మహి మెట్టిదియో 1-96

నిల్పి ననంటి పండ్లనె (నిల్పినన్ + అనంటి) 2-70

వరములు దంపతుల్ వడ యవారిగ (వడయ + అవారిగ) 2-85

మహావీర్లకు 2-91

నెలం తదిగాక 2-128

విడివడున్న కంతు మదదంతి 2-148

ఆ వాచా లిరుమాళ్ల 3-30

బో టొప్పగున్ (బోటి + ఒప్పగున్ ) 3-70

పోక ము డూడిపో 3-219

ఆయుధోపజీ వటకు 4-143

సంపద లల రల కాఁపువధూటి 4-162

మహాసర సభ్రసరసి (మహాసరసి + అభ్రసరసి) 4-208

తలద్రి ప్పెనుబోతనియె (5-36)

ఆ జవరాలు దా ల్చొగిన్ (దాల్చి + ఒగిన్) (5-84)

చ. "ఖరకరుఁ డస్తమించుదనుకా నొకరీతి"

(దనుకన్ + ఒకరీతి) ద్రుతముపై నచ్చునకు సంశ్లేషము గూర్చిన నొక విధముగ నుండెడిది. ఇతఁడు కావలసియే కాకు దీర్ఘమిచ్చినాఁడు. వైజయంతీ విలాసమున సారంగు తమ్మయ ప్రయోగ మిట్లే యున్నది.

సీ. "నే నిద్రబోవు దాకా నిద్ర బోవదు" (వైజ. 2–126)

ఇవి వ్యావహారిక సంధులు. వీనినిఁ దప్పు అని చెప్పుటయే తప్పు. చెవి కింపుగా నున్నవా? లేవా? అన్నదే విచారము. ఎబ్బెట్టుగా నున్నచోఁ దప్పులే.

'శుభవాటి' అను సుందరిని వర్ణించునపుడు 'టీ' ల కొఱకు ఏదారిఁ ద్రొక్కినాఁడో చూడుఁడు - గడుసరి.

తే. అతని వధూటి శుకఘోటి నలరు మేటి
యొడయఁ డేలేటి సీమాటి యొఱపు గోటి
కొన నెగయ మీటి యిదియేటి కులుకనేటి
బోటి కెదిరేటి శుభవాటి నీటు మెఱయు. (2–185)

తెనాలి రామకృష్ణుఁడు, పింగళి సూరన్న, 'నుయిదాటే వానికిన్', 'గుడి మ్రింగే వానికిన్' అను ప్రయోగములు చేసిరి, ధూర్జటి శైవకవుల త్రోవఁ ద్రొక్కి మఱీ స్వతంత్రించి, 'చేసిందేటిది', క్రీడించుక' (క్రీడి + ఇంచుక) వంటి సంధులును దీర్చెను. పుచ్చుకొనుటకు 'పుచ్చుక' రూపమిచ్చెను. హంసవింశతి కవి తృతీయా విభక్తి ప్రత్యయ మగు 'తో' హ్రస్వాంతముగాఁ గూడ వాడెను. "ఉపనాయకులతొ" రతికేళి (5-312) ఈ పద్ధతి కందార్థములలో దరువులలో గోచరించును. "మా నెఱజాణవు" (4-104) (మహా + నెఱజాణ) వ్యావహారిక ప్రయోగము. "వలపు రేఖాతిశయ వైభవము" (1-78) ప్రౌఢతనము (1-235) ఓ మగరాజ (1-107) అపసిరి (1-126) సర్వబంధకత్తెర (1-206) ఏక తాళాటతాళాదులు (5-122) బహువెలల్‌వెట్టి {5-353) వంటి వైరి సమాసములు నిశ్శంకముగా వాడఁబడెను. వ్యతిరేకక్త్వార్థకములు ద్రుతాంతములు గావించెను. కమండలంబు (5-12) (కమండలువు) ధృవము (ధ్రువము) (5-122) వంటి శబ్దవికారములు, పరోపకారిణి భాగ్యశాలిని అనుటకు 'పరోపకారిరా యిక్కలకంఠకంఠి' (1–237) 'పరమ భాగీరథివి మహాభాగ్యశాలి వనుచు దీవించి' (3-138) వంటి పుంలింగ రూపములు రచింపఁబడెను. 18వ రాత్రి కథలో వొకనారికి "విహారి" యను నామకరణము చేసెను.

## సంభాషణ ధోరణి

తే. పంటితో నీళ్లుపట్టుక యింటిలోకిఁ
బోయి, 'యేడుంటి వీసరి ప్రొద్దుదనుక?" (4-235)

మగని గద్దించి బెస్తబిత్తరి ప్రశ్నించు సందర్భమిది. ఇంటిలోకి, ఇంట్లోకి ఏడుంటివి?

యాడికి పొయ్యుంటివి? ఇవి కవి ప్రాంతీయపు మాటలు.

'పోతు వెడలి పొయ్యాని, వాకిలివేయు మనుచు మగనితోఁ' గుమ్మరి యెమ్మెలాడి పలుకును. (5-78)

'అరుగుమింద కూచోబెట్టినావు. బిడ్డ కిందపడీని' అనుట కలదుకదా! వీనివిఁ దక్కువ తరగతి స్త్రీలు మాటాడుమాట లనరాదు. ఎక్కువ తరగతి సుదతియు- "చేనంట, అమ్మ! నొచ్చినె యనును" (రాధికాసాంత్వనము. 1-124)

గ్రంథ పరిస్థితి

1964 సం.న వావిళ్ళవారు హంసవింశతి కొక నూతనరూప మిప్పించిరి. కీ. శే. మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు మిక్కిలి శ్రమించి పరిశోధించి, చాలఁబద్యములకు నర్థ తాత్పర్యాదులుగూడా వ్రాసిరి. అర్థాన్వయ నియమాదులు పొసఁగని పద్యములను దిద్దితీర్చి పొసఁగించిరి. అభేద్యములుగానున్న పద్యము లను దొలఁగించి, తద్రచనయకాఁ బూరించి యలంకరించిరి. ఒట్టుమొత్తముమీఁదఁ జాల గొప్పపనిచేసిరి. కనుక, "మణౌవజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః" అని నేను సంబరపడి కనులు మూసికొని వావిళ్లవారి క్రొత్తప్రతి ననుసరింపఁ జూచితిని. కాని, "గోషుపేషు" శబ్దము నాకనులు తెఱిపించినది. పూర్వముద్రణమున "సంపఁగివిరి.... పాగ, శిరీషపు గోషుపేషు" (4-86} కలవు, నూత్న ముద్రణమున "పాగ"కడ "పాయపోసులు" చేరినవి. పాయపోసులు = ముచ్చెలు. 'గోషుపేషు' తొలఁగించి వీనినిఁజేర్చిరి. మన నిఘంటువులలో 'గోషుపేషు' కనఁబడదు. బ్రౌన్‌దొరగారు అరబ్బీ హిందుస్తానీ పదముల పట్టికలో దీనియర్థము వివరించిరి. "గోషుపేషు=పాగామీఁద సొగసుగా కట్టుకోబడ్డ వస్త్రము." దవతు, హుశారు, సుపాణి శబ్దములు కవి ప్రయుక్తములే. అయినను నిట్టివి తొలఁగింపఁ బడినవి. పంచమాశ్వాసము నందలి 285 వ పద్యమున "తోడుబోతుల రవంబు" "సివంబు"గా మార్పఁబడినది, తోడుబోతులనగా సహచరులని శాస్త్రిగారు తలఁచిరి. కాదు. మాంత్రికులు, సాహిత్య అకాడెమి ప్రకటించిన "పదబంధ పారిజాతము"న తోడుబోతు చేయు=మంత్రాలద్వారా ఎదుటివారికి కీడు గలిగించు ఆభిచారికక్రియ చేయు అని యున్నది. ఇది రాయలసీమవాడుక అనియు నున్నది. ఇంకొకటి మాత్రము చూపింతును.

క. పన్నీట జలక మొనరిచి
కన్నురి రానున్న మిన్నగన్నన్నకు మున్
మున్నొసఁగి సన్నబియ్యపు
టన్నము మితభుక్తిచేసి యమితోత్సుకుఁడై .

పూర్వప్రతి. (5-139)

క. పన్నీట జలక మొనరిచి
కన్నెటి సిరియన్నుమిన్న గన్నన్నకు

నూత్నప్రతి. (5-139)

శాస్త్రిగారు కన్నెటి=కంటికాహ్లాదకరమైన సౌందర్యముగల, సిరియన్ను మిన్న గన్నన్న = మన్మథుఁడు అని వివరించిరి. అది కన్నురికాదు, కన్నెటి కాదు. కన్నర (ఱ). ఈ కవి తాతగారు 'కన్నర' శబ్దమును 'వెత' అను నర్థమునఁ బ్రయోగించిరి. (రామాభ్యుదయము. 2-41). ప్రస్తుత పద్యమున 'వెత' కేమి ప్రసక్తియో సందర్భము చూడవలెను. వల్లపుఁడను వాఁడు రతిసేనయను వేశ్యను గూడుటకుఁ దహతహపడుచున్నాఁడు. స్నానముచేసి, "కన్నర రానున్న మిన్ను గన్నన్నకు" = చంద్రునకు నివేదించి, సన్నబియ్యపుటన్నము

భుజించినాఁడు. విటులకుఁ జంద్రోదయము 'కన్నర' - పీడ. ఇక్కడ మన్మథప్రసక్తికిఁ దావు లేదు. కనుక, రానున్నవాఁడు మిన్నుగన్నయ్యయే, చంద్రుఁడే. "కన్నర రా నున్న మిన్నుగన్నయ్య" అను పాఠము సరియైనదని నాతలఁపు.

చమత్కార కవిత్వప్రియులగు శాస్త్రిగారు హంసవింశతి కృతి నభిమానించి, నిండుమనస్సుతో నోర్పుతో సరిచేసి ప్రకటించిరి. వారి కృషి నిస్సంశయముగాఁ జాల దొడ్డది. నేఁడు నాకుఁ జాల నక్కఱకువచ్చినది.

దొరకినంతవఱకు దొరగారి పాఠములను బట్టికొని నడచితిని, 150 ఏండ్ల క్రితము దొరగారి పండితులకుఁ గొఱుకుడు వడని పద్యములు, పదములు, మద్రాసు, బందరు గ్రంథ ప్రకాశకుల పరిష్కర్తలకుఁ గొఱుకుడు వడని పద్యములు, పదములు మిగిలినవి-నేఁటికిని మిగిలియే యున్నవి. అట్టివానిని సవరించు పనికిఁ బూనుకొన లేదు, ఇప్పటి కింతమాత్రము చేయఁగలిగితిని. తప్పులున్న మన్నింప వేఁడుచున్నాను.

నాకీ అవకాశము కల్పించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి సారథి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, రథి డా॥బెజవాడ గోపాలరెడ్డిగారికిఁ గృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

– సి. వి. సుబ్బన్న శతావధాని

—: o :—



# పీఠిక.



అయ్యలరాజు నారాయణామాత్యకవి.

"నిందతునందతు వా సన్నసూయు రనసూయు రత్ర కింతేన,
యత్సన్మానసగమనా యైవేదం మమ తు పాథేయమ్"

ప్రాచీనకవి.

హంసవింశతి యనునీపద్యకావ్యమును రచించిన యీమహాకవి యాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు, సూరనార్యునకుం బుత్త్రుడు. ఈయన తల్లి కొండమాంబ. ఇంటిపే రయ్యలరాజువారు. ఇక్కవి స్వవిషయము నిట్లు చెప్పుకొన్నాఁడు.

"వ. వెండియు నఖండతేజఃకాండమార్తాండమండల ప్రచండుండును,
నిజవితరణాకర్ణనకృశీభూతపారావారపునరభ్యుదయకారణానూనదానధారాప్రవాహసంజాతమహా
నిస్తులప్రశస్తసద్గుణరత్నాకరుండును, .......... నారాయణామాత్య దేవేంద్రుఁడు కొండొక
శుభవాసరంబున నత్యంతసంతోషితాంతఃకరుణుండై" అని

దీనింబట్టి చూడఁ గవులకు నైజమగు దరిద్రము తన్ను బాధింపఁ జాలకుండఁగా ధనసంపన్నుండై గొప్పదాతయై యున్నట్టు పొడకట్టుచున్నది. తన్నొకరు పురికొల్పఁ గాఁ గవిత్వమున కారంభించినట్లుగూడ నీతఁడు చెప్పుకొనకపోవుటంజూడఁ బైవిషయము స్థిరపడుచున్నది. ఇష్టదైవమగు శ్రీరామమూర్తి స్వప్నమున సాక్షాత్కరించి నట్లు, గ్రంథమొనర్పం బురికొలిపినట్లు గూడఁ జెప్పుకొనలేదు. కారణమేమో. ఆశ్వాసాంత్యగద్యమునందు

"నిస్సహాయకవితానిర్మాణచాతుర్యనిస్తంద్ర,
శ్రీరామనామపారాయణ నారాయణామాత్య ప్రణీతము.

అని చెప్పుకొనుటంబట్టి పరికింపఁగా గ్రంథమును జెప్పి యితరులకుంజూపి వారిసంస్కరణముల నంగీకరించుకవి కాఁడనియుఁ బండితకవియనియు, శ్రీరామభక్తుఁడనియు స్పష్టము గాక మానదు. మఱియు భగవద్భక్తాగ్రగణ్యులనం బ్రఖ్యాతివహించినప్రహ్లాదాదిపరమభాగవతుల నిష్టదేవతాస్తుతిలోఁ జేర్చుటంజూడ నీమహాకవి భక్తుఁడనుమాట దృఢపడకపోదు. ఈమహాకవి యీగ్రంథమున నింతకుముందు

దానుఁ గ్రంథముల నొనరించినట్లు చెప్పుకొన కుండుటం జూడ నిదియే ప్రథమగ్రంథమని తేట పడుచున్నది.

ఆంజనేయశతకము తొలుత రచించి తరువాత హంసవింశతి నొనరించి యాపిదప దశావతారకథాసంగ్రహమును రచించినట్లు కొందఱు వ్రాసియున్నారు. కాని ఆంజనేయ శతకవిషయమిందు వ్రాసియుండక పోవుటచే నిర్ధారణముచేయ వీలులేదు. ఒకప్పు డది శతకమైనందున నీస్వల్పవిషయము నేల చెప్పు కొనవలయు నని యూరక విడిచియున్న నుండవచ్చును. దశావతారకథాసంగ్రహము నాచేతఁ బడలేదు కాన నావిషయమును నేను జర్చింపఁజాలకున్నాఁడను.

ఇఁక నీతఁ డేగ్రామమునఁ గాపురముండెనో యనువిషయము చర్చింపఁదగిన దైయున్నది. అయ్యలరాజురామభద్రమహాకవి ఒంటిమెట్ట యనంబడు నేకశిలానగర వాసియనుట సర్వజనాంగీకృత మగువిషయము. రామాభ్యుదయము రామభద్రవిరచితముగదా. అయ్యలరాజు, భాస్కరకవి యాయిరువురును రెట్టమతమును రచించినమహాకవులు. వీరు కర్నూలు మండలములోని యెఱ్ఱపాలెమునకు బాలకుఁ డయి, యహోబలక్షేత్రమునకు ధర్మకర్త యయిన వేంకటరాజునకు రెట్టమతగ్రంథము నంకితముచేసియన్నారు. కనుక వీరిరువురును గర్నూలుమండలములో నివసించువారే యనుట స్పష్టము. రాజాశ్రయమునకై యితరమండలములలోనున్నవారు రాఁగూడదా యన్నఁ బైవేంకటరాజు పాళెగాఁడే కాని గొప్పరాజ్యము కలవాఁడు కాఁడు. అట్టివానినాశ్రయించుట కెంతయో దూరమునుండి కవులు చనుదెంచి రన్నమాట విశ్వాసపాత్రము గాదు; ఆప్రాంతముల నివసించువారికి వారియందు విశ్వాసము గల్గియుండును గాన వారాశ్రయించియుండుట స్వభావము. కాఁబట్టి పైయిద్దరును గర్నూలుమండలవాసులో లేక యాచెంతనున్న కడపమండలవాసులో యై యుందురు. కడపమండలమున కహోబిలము మిగుల సమీపము.

ఈనారాయణకవి హంసవింశతిలోఁ బూర్వకవిస్తుతింజేయుచు

"ఉ. ఆయ్యలరాజు తిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుండగుకొండధీరునిం
జయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైనమా
యయ్యలరాజువంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్."

అని చెప్పుకొన్నాడు. దీనిం బరికించి చూడఁగాఁ దమపూర్వులు మహాకవులైనట్లును దానావంశసంభూతుఁడననియు, నయ్యలరాజు వారికుటుంబము విద్వత్కవికుటుంబ మనియుఁ జెప్పుకొన్నట్లు స్పష్టము. ఇందతిశయోక్తి యెంతమాత్రములేదు. పయిపద్యమునఁ బేర్కొనఁబడిన రామభద్రాదికవులు కడప కర్నూలు మండలములోని వారయినట్లు స్పష్టమైనందున నీతఁడుగూడ నీప్రాంతముల నివసించినవాఁడే యని తోపక మానదు. ఇతని దీగ్రామ మని నిశ్చయింపఁ దగినయాధారము లీ గ్రంథమున లేవు. ఊహ లెవరి కెట్లుతోఁచునో యట్లు నిర్ధారణము చేయునవకాశ మిందువలనఁ గలగుచున్నది. ఇటీవల నాకుఁ దెలియవచ్చిన విషయ మేమనఁగా ఈనారాయణకవి కడప మండలములోని పుల్లంపేట తాలూకాలోనున్న పొత్తపియనుగ్రామములోనివాఁ డని, దానికిం దగినన్ని సాధనములు దొరకినంగాని 'ఇదమిత్థ' మ్మని సిద్ధాంతము సేయఁజాల కున్నాను.

కొందఱు నారాయణకవి నెల్లూరుమండలములోని గోరుగుంతలపా డనుగ్రామమున నుండినవాఁడనియుఁ గావున తనయొక్కయు తన మేనమామయొక్కయు గ్రామములకుఁ జెంతనున్న కంభము, మార్కాపురము మొదలగు గ్రామముల పేరులు చెప్పె ననియు వ్రాసిరి. ఆమాట విశ్వాసపాత్రముమాత్రము గాదు.

హంసవింశతి పంచమాశ్వాసములో గ్రామములపట్టికలో "రాయదుర్గము, గుత్తి, రాయవేలూ, రానుగొంది, మాహురి, కాశి, గోలకొండ,..." అని ప్రారంభించి కలగూరగంపగా నామములు చెప్పఁబడియున్నందున దత్తమండలవాసియే యని స్పష్టమగునేకాని యితరవిధముగాదు, మఱియుఁ దక్కిన కొన్ని మండలములోని పెద్ద పెద్ద గ్రామములపేరులు చెప్పి దత్తమండలములోనున్న చిన్నపల్లెలపేరులు కూడఁ జెప్పియున్నందున బైయూహకుఁ బ్రబల మగునాధారము కనఁబడక పోదు. అందును గడపమండలములోనున్న పోరుమామిళ్ల, సిద్ధవటము, కనూరు, (కసునూరు) గండికోట, సింహాద్రిపల్లి, పుట్లూరు, చింతగుంట మొదలగు గ్రామముల పేరులు చెప్పబడియుండుటంబట్టి పరికించినను దత్తమండలములలో గడపమండలవాసియే యని నిర్ధారణము చేయ నవకాశముగల్గునే కాని వేఱొకయూహ కవకాశము కల్గదు. ఇంతమాత్రముచేతనే యీ నాయూహయు నిశ్చయముకానేరదు. దత్తమండలకవి చరిత్రమును, వ్రాయుచున్నాఁడను గాన, నప్పుడు చర్చించి వ్రాసెద పుష్పగిరితిరు ణాళ్ళనుగూడఁ బేర్కొనుటయుఁ గూడ నాపైయుద్దేశ్యమును బలపఱచుచు న న్నాచరిత్రమునమిగుల శ్రమించి చర్చింపఁ బురికొలుపు చున్నది.

పంచమాశ్వాసములో "ముంగిస, సివంగి, జోఁణంగి, యింగిలీషు, కుక్కగుంపులఁ గోతులఁ గొన్ని గొనియె" అని చెప్పియుండుటంబట్టి చూడ నూఱు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నున్నవాఁ డని చెప్పవచ్చునేమో ఇఁక నీవిషయమును వదలి ప్రకృతవిషయమునకుం గడంగెదను.

ఇక్కవికవితాశక్తి యెట్టిదనియే యిపుడు విచారింపవలయు. దేశకాలాదుల నిర్ణయించు గ్రంథములు వేఱుగా నున్నవి. ఆవిషయ మిట నంతగాఁ జర్చింపఁ దగినది కాకపోయినను సందర్భమును బట్టి మూఁడుమాటలు వ్రాయవలసివచ్చినది. ఈహంసవింశతి యైదాశ్వాసముల గ్రంథము, హంస హేమావతికి నిరువదిదినములు కథలు చెప్పి యామె పరునింటికిఁ బోకుండఁజేసినది. కావున హంసవింశతి యని గ్రంథమునకు నామముగల్గినది. గ్రంథ మంతపెద్దదిగాకపోయినను నవరత్నములను దిరస్కరించు పద్యము లిందుఁగూర్పఁబడియుండుటచే నిది వరమణిహారమని చెప్పకతప్పదు. ఒక్కదానినిమించి వేఱొక్క పద్య మలరారుచుండును. శైలియో రసికజనహృదయానందజనకము. కథలో నొకదానిని మించి వేఱొకటి బుద్ధిచమత్కారమును జూపుచున్నవి. ఇట్టి యుత్కృష్టగ్రంథరాజమునువ్రాసి యిమ్మహాకవి సమానులలో నుత్తమశ్లోకుఁ డయ్యెను. వేయిమాటలేలగాని యిక్కవిమహేంద్రునివలెఁ గవిత్వము చెప్పుట కడుదుర్లభము. కందమునకుఁ గవిబ్రహ్మ యగుతిక్కయజ్వ యని విని యుంటిమి. తరువాత నే నని యాధునికులలోని కవిచౌడప్ప చెప్పుకొనియెను. ఇమ్మహాకవి కందపద్యముల నల్లుటలోఁ దిక్కయజ్వను మించె నని చెప్పి మహాపాతకము నార్జించుకొన నభిలషింపనుగాని యంతవాఁ డని చెప్ప జంకుపడి వెనుకంజవేయను. ఒక్క కందములేగా దేపద్యము చదివినను సెబాసని శిరఃకంపము చేయవలసియే వచ్చును. నారాయణకవిని నోటికసి దీరఁ దిట్టవలయు నని పూనుకొన్న కఠినాత్ముఁడుగూడ సాంతముగాఁ జదివినచో నమస్కరించి శతథాసహస్రథా పొగడునే గాని వేఱొక మాట నోటఁ జెప్పఁజాలడని నానిశ్చయ మని త్రికరణశుద్ధిగాఁ జెప్ప సాహసింపు చున్నాను.

ఈ గ్రంథము నీతిబోధకము గా దనియుఁ జెడుతలంపులను వృద్ధిచేయు ననియుఁ గాన ససద్గ్రంథమనియు నిట్టి గ్రంథమునఁ దనశక్తిని వినియోగించి కవి తనజీవితమును వ్యర్థముచేసికొనియె ననియును గొందఱ తాత్పర్యము, నే నట్లనఁ జాలకున్నాను, అల్ప మతినగుటచే నే నొక్కఁడనెకాదు నిష్పక్షపాతమతు లగుపెక్కుమంది యట్లనక తప్పదనియు నాభావము.

ఇందు హేమావతి యిరువదిదినములు భర్త దేశాంతరము పోయిన కారణముచేతను,

హేల యను నొకదూతిక ప్రోత్సాహముచేయుట చేతను, జిత్రభోగుఁడను నాపురపాలకుఁ డైనరాజు నొద్దకుఁ బోవఁ బ్రయత్నింపఁగా నామె యింటనున్న హంస యాహేమావతి కేమోకథలు చెప్పి యాబుద్ధిమాన్పె నని చెప్పఁబడి యున్నది,

పరసంగమమునకై యువ్విళ్ళూరుచు నింటదండించుపెద్దలు లేక తానే యధికారముగలదిగా వున్న నవయువతికి నాబుద్ధిమాన్పుటకు వేదాంతవాక్యములు పనికివచ్చునో, ఆమెకు విన రుచించునట్లు అలాటి కథలనే చెప్పి, యట్టికృత్యములలో రాఁగల కష్టములందెల్పి, చిక్కులు సంభవించినపుడు తప్పించుకొనునంత శక్తి నీకుఁ గలదా యని ప్రశ్నించి, యామె చెప్పఁజాలక యూరకుండఁగాఁ దా నాయుక్తిని దెల్పి, నీకిట్టిశక్తికూడ లేదే యె ట్లిప్పునికిఁ బూనెద వని చీవాట్లుపెట్టి, యామె బుద్ధిని మరలించి సద్బుద్ధిని నెలకొల్పిన నామాటలుపనికి వచ్చునో, బుద్ధిమంతులే నిశ్చయింతురుగాక.

దుర్జనుని సజ్జనునిగాఁ జేయుటకు దండనముపనికిరాదు. సామోపాయ మావశ్యకము. శ్రోతకు హితముగా ముందు మాటలాడి, సమయోచితముగా నీతులునేర్పి, యతనిమార్గము తప్పుగా నున్నదని యతనికేతోఁచునట్లు చేసి క్రమముగా సజ్జనుల మార్గమునకు నతని దేవచ్చునే గాని గుబాలున నొక్క పెట్టున నీతివాక్యములు తాను జిన్నతనమున వల్లించినవి చదివి వెంటనే వానిని సజ్జనశిఖామణి జనకునిజనకునిగాఁ జేయ శక్యముగా దని నానమ్మకము.

మొత్తముమీఁద నట్టివిషయములు గలగ్రంథము తొలుదొల్త నీతిబాహ్య మనియే తోఁపకపోదు. అంతమాత్రముననే దానిని దూషింపఁగూడదు. అట్టి గ్రంధమునఁ జివఱకుఁ దేలునీతి యేమని విచారింపవలయు.

ఆనీతి చెడుత్రోవలఁ బోవఁ జూచునొక యన్నులమిన్నను సన్మార్గమునఁ బోవునట్లు చేయుట యని తేలినపుడు దానిని మెచ్చవలయునేకాని యందున్న కథాంతర్భూతములగు పద్యముల నాల్గింటిని వ్రాసిచూపి యిట్టియవినీతి బోధకపద్యములున్నవి గాన నీగ్రంథము దుర్ణయమును బోధించుననరాదు. ఈవిషయమై యీ గ్రంథమున నైదవ యాశ్వాసమునందు

క. పరపురుషసంగమంబిహ, పరసుఖదూరంబుగానఁ బాతి వ్రత్య
స్ఫురణగలసతులు మదిఁగో,రరటంచునునిశ్చయించి ప్రమదం బెసఁగఁ

అనియు,

ఉ. మున్నలరావణాదులుసముద్ధతి సాధ్వులఁ గోరి యేమిసౌ
ఖ్యోన్నతిఁ జెందిరిట్లగుట నుర్విజ నావళులన్య కాంతలం
బన్నుగఁగోరరాదు కడుఁ బాతకమంచుఁ దలంచి యింతపై
నున్నమనంబు ద్రెక్కొనియథోచితపద్ధతినుండె భూవరా.

అనియుఁ జెప్పఁబడి యున్నయదె. ఈనీతులను మనంబునం దుంచుకొనియే యీమహాకవి యింతగ్రంథమును బెంచివ్రాసియున్నాఁడు.

## కథాచమత్కారములు.

ఇంక నిందలి కథాచమత్కారములం గూర్చి యించుక తెలుపవలసియున్నది. తొలిరేయి హేమావతి హేలయను దూతిక పురికొల్ప శృంగారించుకొని చిత్రభోగునింటికిఁ బయనమై ప్రాణపద మనఁదగియున్న హంసయొద్దకు వచ్చి తన యుద్యమమును దెల్పఁగా హంస యామెకు భర్తలేనితఱి నిల్లువెడలి పోఁగూడఁదనియు బరపురుషసాంగత్యము

మహాపాపహేతు వనియుఁ జెప్పెను. అప్పట్టునందు

ఉ. అక్కట! భర్తఁ గాపురము నారడిపుచ్చి నృపాలమౌళితోఁ
   జొక్కి రమించు నందులకుఁ జొచ్చినఁ దావకబంధువర్గముల్
   దక్కువసేతురమ్మ చరితవ్రతముల్ చెడునమ్మ జాతికిం
   బక్కున నిందఁజెంది తలవంపులు దెత్తు రఁటమ్మ మానినీ. 124

సీ. అత్తమామలు గన్న నారడిపుత్తురు బావ పరీక్షింప నేవగించు
   మఱఁదులు గాంచిన గఱకఱి నెంతురు వదినె లెఱింగిన వాసిచెడును
   బంధువుల్ గనినచో బరఁగనిందింతురు తోడికోడలు చూడ నాడికొనును
   బతి గనుఁగొన్నచోఁ బ్రాణహాని యొనర్చు నాడవా రెఱిఁగిన వన్నెదఱుగు
   నరయ నిది గాక యన్నిట నాఁడుపుట్టు
   పుట్టఁ బాపంబు ఫుట్టినఁ బుట్టినింటి
   కేని మఱి చొచ్చినింటికిఁ గీర్తి ఘనత
   దేక యపకీర్తి దెత్తురే తెఱవ లెచట. 125

సీ. పంక్తికంఠునిమోహపరితాప మెంచెనే భువనమాత జగత్ప్రపూత సీత
   యలపుళిందునిబొంద నాసక్తిఁ జెందెనే ప్రియహితామితనయభీమతనయ
   నహుషునివిరహంపుఁ దహతహ ల్బాచెనే సాంద్రసద్గుణచర్య యింద్రుభార్య
   మఱి సింహబలునిపెన్మాయలఁ జిక్కెనే యారడి పనిఁబూని యాజ్ఞసేని

తే. మునుపటిపతివ్రతలు మహామూర్ఖచిత్తు
   లైనదుర్జను లతిఘోరసూనసాయ
   కాస్త్రజర్ఝరితాత్ము లై యాసపడిన
   మాన ముడిపుచ్చుకొని రటే మచ్చకంటి. 127

చ. పతిహితభక్తిచే వెలయు పద్మదళప్రతిమాననేత్రకుఁ
   వ్రతములసోద లేటికి ధ్రువంబుగఁ బుణ్యము లబ్బు నెప్పుడుం
   బతిని దిరస్కరించి పరభర్తలఁ జెందినభామపుణ్యముల్
   గతజలసేతుబంధములు గావె వచింపఁగ నెంతనోచినన్. 123

అను నీ మొదలగుపద్యరత్నములను గ్రంథకర్త కూర్చి యీ గ్రంథము నలరారఁజేసి యున్నాఁడు. ఆమెచిత్తస్థితి నెఱింగి తగినయుపాయము నాలోచించి యెట్టులేని కాలము పుచ్చవలెనని యూహించియే

మ. ఆధిపుల్ క్రూరఫణిస్వరూపుల............లీడేర్చుకో. 135

అను మొదలగు మాటలు చెప్పి నాఁటిరేయి పుచ్చెను. మఱుదినము రాత్రి ఆమె యథాపూర్వముగ సింగారించుకొని రాఁగా నిఁక నీతులవలన లాభములేదని యుపాయము తెలిసినఁగాని యిప్పనిలో మెలఁగరా దనిచెప్పి య దెట్లని యామె ప్రశ్నించునట్లు చేసి యొకకథచెప్పి కథాంతమున నిట్టి యిక్కట్టున నెట్లు బొంకవలెనో తెల్పుమని యడిగి యామె చెప్పలేకపోఁగా తానే యాపద్ధతిని జెప్పుచు నాటిరేయిని బుచ్చెను. అట్లే యిరువది దినములు గడిపెను. ఇందలి కథలన్నియు నొక దానికన్న నింకొకటి యుక్తిలో మించునట్లుండును. ఒకకథకన్న నింకొకకథలో నడిగిన ప్రశ్నమునకు సమాధానము చెప్పుటకు బుద్ధిచమత్కార మెక్కువ కావలసియుండును. పోనుపోను కథలు మిగులఁ జమత్కృతి గలిగి చెన్నారుచుండును . ఇట్టు లిరువదిదినములు గడిపి హంస హేమావతిని దుర్వృత్తికి లోనుగాకుండఁ జేసెనని కవి గ్రంథరూపమునఁ దెలియఁజేసెను.

ఒక్కొక్కకథయు వ్యభిచారమునే బోధించుచున్నదే యెట్లిది నీతిబోధకమగు ననరాదు. హేమావతిదుర్వృత్తిని రూపుమాపుటకు నితరోపాయము సాధ్యముకాదు గాన నీయపాయమే తగినదని భావించి యామార్గముననే తుట్టతుద కామెను సచ్ఛీలాలంకార భూషితనుగా నొనరించెను. కావున మొత్తముమీఁద గ్రంథము దుర్ణీతిబోధక మనరాదు. గ్రంథకర్తయాశయముగూడ నట్టిది కాదు.

వేడినీరు పోసిన నిండ్లు మండిపోవునేమో యని శంకనొందినట్లు ఒక్కొక్క కథను బఠించి కొంప మునిఁగిపోయేనే యని విభ్రాంతినొందుధీరస్వాంతుల కొక్కనమస్కార మనుటకన్న నెక్కువవ్రాయ నా కవసర మిటఁ గనఁబడలేదు.

ఇంతట నీవిషయ ముజ్జగించి యిమహాగ్రంథమునం గల పద్యములయందలి చమత్కృతింగూర్చి యించుక తెలిపెదను.

ఇమ్మహానుభావునకుం గలలోకజ్ఞాన మసమానమనుట యతిశయోక్తియని యెవ్వ రన రని నానమ్మకము, ఒక్కొక్క కథలో బ్రస్తాపమునకుం దగిలినకులముల వారివిషయములు చర్చించునపు డీయనకుంగలలోకజ్ఞానము తేటపడఁగలదు. ఒక్కొక్క తెగవారికిం గావలసిన వస్తువులపేరులు, వారియాఁడువారికింగల యాభరణముల నామము లెట్లు తెలిసికొని కూర్చెనో యని యోజించునపుడు మనస్సు ఆశ్చర్యమును బొందక పోదు. పెక్కుప్రదేశములుతిరిగి యందున్న వారియాచారములు పరిశీలించుటలో నీతని శక్తి యనుపమానము. ఇంతమాత్రమే కాదు. ఒక్కయర్థముగలపదము లెన్నిగలవో యన్నియు నీతఁడు కూర్చి కవులకు మహోపకార మొనర్చెను. ఈక్రిందిపద్యములం బఠింపుఁడు.

సీ. వెలయ హరిశ్చంద్రువిధమున నలుని వీఁకను బురుకుత్సుచాడ్పునఁ బురూర
వునిలీల, సగరు లాగునఁ, గార్తవీర్యుమర్యాదను గయుక్రియ నంబరీషు
మతమున శశిబిందుమహిమ నంగుని తేవఁ బృథునిమాడ్కి మరుత్తవృత్తిభరతు
నీతి సుహోత్రునిభాతి భార్గవుబలె రాముపోలిక భగీరథునిపోలుపు
న, శిబిసంగతి, మాంధాత నయమునను, యయాతికరణి దిలీపునియట్ల రంతి
రీతి నాచక్రవాళపరీతభూతధాత్రిపాలించుసవిభుండుదద్విభుండు. ౧ ఆ. 42ప.

ఇట్టిపద్యము లింకనుం గలవు. 2 ఆ. 14 ప. 5 ఆ. 86 పద్యములను జూచునది.

ఇంతియకాక శ్రుతిస్మృతి శాస్త్రపురాణేతిహాసాదుల నామములను, ధాన్యవిశేషముల పేర్లను, గూర్చినపద్యముల నొక్కసారి చదివినయెడలఁ బరమానందమును బాఠకు లనుభవింపకపోరు. సంస్కృతసమాసములు గలపద్యములను, దేశ్యపదములు గలపద్యములను జూచితిమా శిరఃకంప మొనర్చి బళీ యనకుండ వీలుండదు.

ఈయుదాహరణములు పైవిషయమును సిద్ధాంతీకరింపఁగలవు.

సీ. వ్రీడావహిత్థప్రవేగోన్మదోగ్రరోషప్రదోష వితర్క చపలధైర్య
.... ...... .. ............ జడిసి తెలిసి. 4ఆ. 83 ప.

ఉ. అంత వసంతవేళఁ జెలు వంతట నెంతయు సంతసిల్లె న
త్యంతలతాంతకుంతదళపత్ర నిశాంతదురంతతాంతతా
శాంతికరంబు ........... .......... ......... 5 ఆ 222 ప

దేశ్యపదములకూర్పు

చం. సకినెలకీలుకంతమునఁ జాయమెఱుంగులసొంపు కెంపు ము
క్కుకొనల పచ్చరాచిలుక కోళ్లఁ దనర్చినపట్టు పట్టెయ

ల్లికపయి జాఫరాజినుఁ గులేపునఁ జెందుపలంగుపోషుత
క్కికగలజాళువాగొలుసు గీల్కొను మంచముపై మహోన్నతిన్. 1 అ. 239 ప.

ఇట్టిపద్యముల నింకనుం జూపుటకంటె బుస్తకమునే పఠించి చూడుఁ డని చెప్పుట మేలని తోఁచుచున్నది.

అర్థచమత్కృతి యీతనికి నుగ్గుతోఁబెట్టినట్లున్నదని యీ క్రిందిపద్యము తేట పఱుపకపోదు.

సీ. కువలయానందంబుఁ గూర్చి యేలు ఘనుండు విబుధులఁబ్రోచుసద్వ్రతరణుండు
సర్వజ్ఞమౌళిభూషణ మైనధన్యుండు లలితవిభ్రమరూపలక్షణుండు
సరవిగళల్నించు శ్యామాభిరాముండు వఱలెడుసన్మార్గవర్తనుండు
విష్ణుపదార్చితవిహితశుభ్రకరుండు శమితతమోహారి యమితశీలుఁ
డమ్మహారాజచంద్రుఁ డాయననిజాంత, రంగమంతయు నినుఁజేర్చి రమణతోడ
నేలఁగలఁడమ్మ నీపుణ్యమెసఁగెనమ్మ, తమిని నీడేర్చనమ్మ కుందనపుబొమ్మ 1 అ. 93 ప.

ముక్తపదగ్రస్తము.

సీ. శ్రీపార్వతీకుచశిఖరస్థలవిహార హారాయమాణమహాభుజంగ
జంగమస్థానరసంచారసమభాస, భావజరూప ప్రభావహరణ
రణరంగనిర్జితరౌద్రమహాసుర, సురయక్షసేవితచరణయుగళ
గళదరస్థాపితకాలకూటక్షీర, క్షీరాబ్ధిపుత్రీశఘోరబాణ
బాణనామకరాక్షసత్రాణదక్ష, దక్షకల్పితయాగవిచారణోగ్ర
యుగ్రభీమాదినామధేయప్రసిద్ధ, సిద్ధ భయభంగ కాశివిశ్వేశలింగ. 1 అ. 168 ప

శృంగారము.

సీ. జల్లిమాటలుగాక సరిచేయవచ్చునే సవరంబు లీశిరోజాతములకుఁ
బూఁతసుద్దులు గాక పోల్పంగవచ్చునే చందనం బీమేనిగందమునకు
.......................... నొక్కొకవేళనదియు. 1ఆ. 210ప.

కందము.

గమ్మత్తు చిమ్మ నొకకథఁ గ్రమ్మఱఁ దెల్పెదను వేణిఁ గ్రమ్మవిరులపైఁ
దుమ్మెదలు జుమ్ముజుమ్మనఁ గొమ్మా తలయూఁచి మెచ్చు కొమ్మా నన్నున్. 2 ఆ. 6 ప.

స్వభావోక్తి.

ఉ. మోమువహించెఁ దెల్వి జగిమోవి రుచు ల్దగ సందడించె మృ
త్స్నామతి మించెఁ జన్మొనలు శ్యామలకాంతి వహించె యానముల్
వేమఱు మందగించెఁ గడువృద్ధి భజించెను గౌను చిట్టుముల్
రామకు సంభవించె నభిరామతరంబుగఁ జీరచిక్కినన్. 2 ఆ. 93 ప.

కల్పనలు.

తే. కొమరె పొక్కిలి బంగారుకుందెయందు రతియు శృంగార మనుధాన్యరాశి నించి
దంచ నిడినట్టిరోకలిసంచుమీఁటి, రోమరాజి దనర్చు నారూఢిగాఁగ. 2 ఆ. 100 ప.

తే. వక్రయానంబుతో నాగచక్రకుచలు, నిలువుఁ గన్నులతో దేవనీలకచలు
నాతిమృదుగతిచపలేక్షణములకలికి, క్రిందుమీదయ్యెఁ గాదె పూర్ణేందువదన.

2 ఆ. 141 ప.

ఇట్లెన్నెన్నివిషయముల నెత్తిచూపినను దృప్తికాఁజాలదు. ఇంకను బెంచి వ్రాయుట గ్రంథమంతయు నిందు వ్రాసినట్టులగును. కాన వదలితిని.

ఎట్టి మహాత్ములకైనను బ్రమాదము లుండకపోవు. "ప్రమాదోధీమతామసి" అనుట స్పష్టమేకదా. ఇమ్మహాకవియన్నివిషయములలోఁ బండితుఁడై, లోకానుభవము గలిగి సొంపుగఁ గవిత్వముఁ జెప్పనేర్చియు వ్యాకరణమును బెక్కుతావుల మఱచిపోయి స్వేచ్ఛగాఁ బ్రవర్తించి "నిరంకుశాఃకవయః" అనుమాటను సార్థకము చేయఁ జూచెనని చెప్పవలసి వచ్చెఁగదాయని చింతించెదను. కొన్నికొన్నితావులఁ బద్యములలోఁ గూర్చినపదములు శ్రుతికటువులై కనఁబడుచున్నవి. అందుఁ గొన్నిఁటినిం దుదాహరించెదను.

తత్సమసంధులు

| అసాధువు | సాధువు |
|---|---|
| నెలంతదిగాక 2 ఆ. 128 ప. | నెలంతయదిగాక |
| కుటిలకుంతలయ్యెడన్ 5 ఆ 77 ప | కుటికుంతలయయ్యెడన్ |
| ఆరతిసేనపుడు 5 అ. 137 ప. | ఆరతిసేనయపుడు |

ద్రుతముపై నున్నయచ్చునకు సంశ్లేషము.

జలాభిపూర్ణమగుచున్నాబావి 1 ఆ. 185 ప.

అటుకన్నెలమిన్ 3 ఆ. 91 ప.

ఈక్రిందిసంధికి దేవుఁడే శరణము.

ఖరకరుఁ డస్తమించుదనుకా నొకరీతి. 5 ఆ. 83 ప.

విభక్తి ప్రత్యయపుఁ జమత్కారము.

ఉపనాయకులతొ రతి 5 ఆ. 312 ప.

క్త్వార్థకసంధులు.

| అసాధువు. | సాధువు |
|---|---|
| అనిదీవించక్షత 1 ఆ. 48 ప. | అనిదీవించియక్షత |
| చూచిదితెలియదు 3 ఆ. 43 ప. | చూచియిది తెలియదు |
| చూచిటురమ్ము 3 ఆ. 157 ప. | చూచియిటురమ్ము |
| చూచదయత 4 ఆ. 30 ప. | చూచియదయత |
| తాల్చొగిన్ 5 ఆ. 84 ప. | తాల్చియొగిన్ |
| తలఁచటు 5 ఆ. 195 ప. | తలఁచియటు |
| వచ్చిట 5 ఆ. 171 ప. | వచ్చియిట |

వచ్చిట యనునది యడిదము సూరకవిమతమునుబట్టి సాధువే. "ఇడఁగవచ్చు నుల్యప్పుపై నిత్యసంధి" అని. అయినను శ్రుతి కటువుగా నున్నది.

కువర్ణమునకు ముందునగాగములేమి

బరుదైనపిఱుఁదుకు 1 ఆ. 62 ప.

వాదుకెదిరి 1 ఆ. 233 ప.

## ద్రుతసంధులు.

ఏఁటిమీఁదాఱునెలలు 3 ఆ.ఏఁటిమీఁదనాఱునెలలు
151 ప.
తోడితెచ్చితింటికి 5 ఆ. 151 ప.తోడితెచ్చితినింటికి అనవలయు
నుగాగమము రాకుండుటకు

నోరవెడలగ్ని దీప్తులు. 5 ఆ. 58 ప. వెడలునగ్నిదీప్తు లనియుండవలయు

## ఈక్రిందివి వింతరూపములు.

| తప్పులు | ఒప్పులు |
|---|---|
| పొందుపఱచుక 1 ఆ. 182 ప | పొందుపఱచుకొని |
| హత్తుక 1 ఆ. 199 ప. | హత్తుకొని |
| తెలుసుక 1 ఆ. 231 ప | తెలిసికొని |
| కట్టుక 1 ఆ. 259 ప | కట్టుకొని |
| అలవఱచుక 2 ఆ. 111 ప | అలవఱచుకొని |
| అక్కునఁజేర్చుక 2 ఆ. 164 ప | అక్కునఁజేర్చుకొని |
| అలవరించుక 2 ఆ. 205ప | అలవరించుకొని |
| త్రొక్కుక 2ఆ. 236ప | త్రొక్కుకొని |
| పెట్టుక 4 ఆ. 113ప | పెట్టుకొని |
| తెఱచుక 4ఆ. 168ప | తెఱచుకొని |

ఇట్టి వింక నెన్నియో కలవు. గ్రంథవిస్తృతి భీతి మానితి.

## ధాతువులు.

చేతురమ్మ 1 ఆ. 124 ప. ఈరూపము పెక్కుతావుల నీగ్రంథమునఁ గానఁబడుచున్నది. "చువర్ణకంబుతోడ దుగ్దకారంబు తకారంబగు" బాలవ్యాకరణము క్రియాపరిచ్ఛేదము 108 సూ. "చేతురు కోతురిత్యాదు లసాధువులని యెఱుంగునది. కొంద ఱివి సాధువే యని యుపయోగించుచున్నారు. ప్రయోగములు గలవనుచున్నారు.

## తప్పుసమాసములు.

అష్టోత్తరశతతిరుపతులు 4 ఆ. 215 వచనము.

## అఖండయతి.

క్రుక్కిళులు మ్రింగుకొనుచు నొక్కొక్కరొకరె. 4 ఆ. 35 పద్యము ఈ యఖండయతిని సాధింపఁబూని కొందఱు భారత ద్రోణపర్వమున నాల్గవయాశ్వాసమున సాత్యకితో భూరిశ్రవుఁడు చెప్పుమాటలలో నున్న "తేఁకులేక పుత్తెంచినయప్పాండవజ్యేష్ఠునకుఁ దలవంపుగాఁగ" అనుపద్యమును "తేఁకువలేక పుత్తెంచిన యప్పాండవాగ్రజునకుఁ దలవంపుగాఁగ" అను తప్పుపాఠముగా గ్రహించి సాధువే యనుచున్నారు.

## మఱికొన్నితప్పురూపములు.

కండ్లు 5 అ. 153 ప. ఎలవిన్, శాయి, ప్రౌఢతనము ఇత్యాదికములు పెక్కులు గానంబడుచున్నవి. వీనిని బ్రమాణములుగాఁ గైకొనినచో భాషాలలనామణి శృంగారము చెడుననుటకు సందియముండదు.

ఇట్టి వెన్నియో యిందున్నవి. కొన్నియతులుకూడఁ జెడినవి. వానినెల్ల వ్రాయుట

యనవసరమని మానితి. చూపినవానిలోఁ గొన్ని సాధువులని తమకుఁ దోఁచిన నన్ను మన్నింతురుగాక. నాకుఁ దోఁచినవానిని మీకుఁ దెలియఁజేసితిని.

ఇట్టి వెన్ని తప్పు లుండినను ఈమహామహుని కవిత్వము నిరుపమానమై శృంగారసాగరమని చెప్పఁదగి సుజననుతికిం దగియున్నదని మూటికిముమ్మాటికి నిరాఘాటముగాఁ జెప్పఁగలను. ఈగ్రంథమునఁ బ్రమాదపతితములగు తప్పులను ద్రోసివైచి సాధురూపములం గైకొని యీసుకవిశైలి నవలంబించి కవిత్వము చెప్పినఁ గర్ణరసాయనమై యుండుననుట కావంతయుసంశయములేదు. ఇంకను బెంచివ్రాసిన గ్రంథవిస్తర మగు నన్నభీతిచే మానితిని.

కడప
ఇట్లు విన్నవించువిధేయుఁడు,

10-10-1919
జనమంచి శేషాద్రిశర్మ.

# కథా సంగ్రహము

## ప్రధాన కథ

చిత్రభోగుఁడు రాజు. శివసత్తి నానాదేశములు చూచిన జోగురాలు. ఆమె వచ్చి, హేమవతియను ఆయూరి సాతాని చిన్నది- విష్ణుదాసుని యిల్లాలు- అన్నులమిన్నయని చెప్పి, రాజుకు మోజు కలిగించెను. రాజదూతిక వెళ్లి హేమవతికి రాజుపై మోజు కలిగించెను. ఇంతలో విష్ణుదాసుఁడు దూరదేశమేఁగుట సంభవించెను. ఇదే సందని ఆ యిల్లాలు ప్రొద్దు గ్రుంకినంతనే రాజునొద్దకుఁ బయనమయ్యెను. పెంపుడు హంస పోనీయలేదు. నిలిపి కథ చెప్పుచుండెను. ఈ రీతిగా నిరువది రోజులు గడచెను. ఇరువది యొకటవ రోజున ఇంటివాఁడు దిగెను. సతి పతివ్రత యయ్యెను. రాజు సద్బుద్ధియయ్యెను.

హంస ఒక కథల పుస్తకము. వింశతి విభావరులు కాలక్షేపము జరిగెను.

## మొదటి రాత్రి కథ

ఇల్లాండ్రు అంకాడరాదని ధర్మోపదేశము. కథ లేదు.

## రెండవ రాత్రి కథ

చారుశీలా గుణదీపకులు బ్రాహ్మణ దంపతులు. వారి సుపుత్రుఁడు కాశీలింగము తెచ్చి శివాలయము కట్టించెను. ఆలయపుఁ బూలతోఁట బావికడ, ఏతపువాఱు కొఱకి, యొక నక్క చచ్చెను. ఆ నక్క 'ఆహారంబె చూచెఁగాని, తనచేటు తెలియదయ్యె'. అట్లే-ఱేనిపట్ల కక్కుర్తి పడినచోఁ జేటు తప్పదని హెచ్చరిక.

## మూడవ రాత్రి కథ

అసహాయుఁడు నాయకుఁడు. అతనిభార్య హేమరేఖ. ఆ విలాసిని యొకనాఁడు తలుపువేసి, గుప్తగుణుఁడను వైద్యునితోఁ గ్రీడించుచుండెను. ఆసమయ మున మగఁడువచ్చి, తలుపు తట్టెను. హేమరేఖ జంకక కొంకక, యిట్లు బొంకెను. "నాథా! నాకుఁ దీవ్రముగాఁ గడుపునొప్పి లేచెను. చచ్చెడిదాననే. ఇతఁడు వచ్చి బ్రతికించెను"

అసహాయుఁ డది విని ఓహో! మేలు చేసితివని వైద్యుని సత్కరించి సాఁగనంపెను.

## నాలుగవ రాత్రి కథ

ఒక తొఁగటసెట్టి భార్య ఒకనాఁడొక పారుపత్తెగానిఁ జూచి వలచినది, ఒక మంత్రసాని ముదుకును బతిమాలుకొని వాని నింటికి రప్పించుకొన్నది. ఇద్దఱు గూడియుండిరి. సంతకు బట్ట లమ్మఁబోయిన భర్త అప్పుడేవచ్చి తలుపు దీయుమనెను. ఆ తొఁగటబోటి దిసమొలతోఁబోయి తటాలునఁ దలుపుదీసి పతి కన్నులు మూసి పారుపత్తెగాని వెళ్లిపొమ్మని సైగ చేసి మఱలఁ దలుపువేసి సిగ్గున కడ్డముగాఁ బతిపంచె చుట్టుకొని, "చీరవిప్పి జలకమాడఁ బోవుచుంటిని. నీ కంఠధ్వని విని ఆదరబాదర వచ్చితి"నని చెప్పుచుఁ గౌఁగిలించుకొనెను.

## ఐదవ రాత్రి కథ

విజయుఁడు-మంజుల గొల్ల దంపతులు. చాలఁ ద్రిప్పలుపడి ఒక పిల్లను గనిరి. ఆ పిల్ల

పిల్లకాదు; పిడుగు. అందుచేతఁ ద్వరపడి తలిదండ్రులు పెండ్లి చేయించి సాఁగనంపిరి. నూతన వధూవరులు వెనుక ముందు పోవుచున్నారు. దారిలో మఱ్ఱిచెట్టు వచ్చెను. అక్కడ జారశేఖరుఁడను ప్రాత నేస్తుఁ డెదురుపడెను. ఆ పిల్ల వానిని హత్తుకొనెను. భర్త తిరిగిచూచెను. ఇద్దఱొకఁడై యుండిరి. అపుడాపిల్ల తన వీఁపు తట్టుచుండుమని జారునికిఁ జెప్పెను. 'ఏమి ఏ' మని భర్త సమీపించెను. పిల్ల యిట్లనెను. "ఈ దయ్యాల మఱ్ఱి చెట్టును జూడఁగనే నా గుండెలు వకావక లయ్యెను. ఈ మహానుభావుఁడు నన్నుఁ గాపాడెను."

## ఆఱవ రాత్రి కథ

గాఁపురము చేయుచుండెను. ఈమె పేరు చారు భాస్వతి. ఆలు మగలిద్దఱును వేసవిలోఁ గూళికిఁ జలివెందర నడపుచుండిరి. ఒకనాఁ డొక బ్రాహ్మణసుందరుఁడు దప్పిగొని వచ్చెను. తమకము పట్టలేక చారు భాస్వతి పట్టపగలే పతి కట్టెదుటనే వానినిఁ గౌఁగిలించుకొనెను. హరిశర్మ అదలించినను వినక యితఁడు మా మేనమామకొడుకని చెప్పి మఱిమఱి కౌఁగిలించుకొనెను. ఇంటిలోఁ గొన్నాళ్లు వాని నుంచుకొని సుఖించెను.

## ఏడవ రాత్రి కథ

శుభవాటీ భద్రకారులు కంసాలి దంపతులు. దూర్తుఁడనువాఁడు వారికి శిష్యుడు - పేరుకుఁ దగినవాఁడు. బయట భద్రకారుఁడు, ఇంట శుభవాటి వానికి విద్య నేర్పుచుండిరి. ఒకనాఁడు చిన్న త్రాసుఁ దెమ్మని గురుఁడు శిష్యునకుఁ జెప్పెను. శిష్యుఁ డింటిలోనికిఁ బోయెను. గురుపత్ని తలుపు బిగించెను. ఎంత సేపటికిఁ ద్రాసు తేలేదు . గురుఁడు లేచి వచ్చెను. తలుపు చూచి శిష్యుని గద్దించి పిల్చెను. శుభవాటి పుటపుట త్రాసు త్రాళ్లు త్రెంచి వాని చేతఁబెట్టి వాకిలితీసి మటమటలాడుచు శిష్యుఁడు పనికిమాలినవాఁడని త్రాళ్లు త్రెంచి ముడివేసికొనుచున్నాఁడని భయపడి వాకిలి మూసికొన్నాఁడని పలికెను. భద్రకారుఁడు శిష్యుని తప్పు సర్ది భార్య ననునయించెను.

## ఎనిమిదవ రాత్రి కథ

వసుమతీ ధనచిత్తులు వైశ్యదంపతులు. ఇద్దఱిద్దరే. పతి ముండల పాలు; సతి మిండల పాలు. ఒకనాఁటి చీఁకటిలో సంకేతమున-పొరపాటున-ఆలుమగలే కలిసికొన్నారు. పతి గుర్తించి కనిసి "ఈ నిశిలో నీవిటకు నొంటి నేమిటికిఁగా వచ్చితి?" వని ప్రశ్నించెను. ఆమె యిట్లనెను, "నా గోడు కాళికాదేవికి విన్నవించుకొనఁగా ఆమె యిపుడే నీకు నీపతి పొందు గలుగును. పొమ్మనెను. నేను వచ్చితిని. అంతా ఆ తల్లి ప్రసాదము" అప్పటికి ఆమెకై వచ్చియుండిన విటుఁడు పొదచాటుననుండి 'ఔ నిజ' మని - ఆకాశవాణీ ప్రసారము చేసెను. ఈ రీతిగాఁ గాళికా ప్రసాదముఁ గన్న సతికి సాష్టాంగపడి ప్రశంసించి సెట్టి యింటికిఁ దోడ్కొని పోయి సుఖముండెను.

## తొమ్మిదవ రాత్రి కథ

చిత్రఘనుఁడు చిత్తారివాఁడు. అతని భార్య వాచాలి. ఎన్నో తంటాలుపడి ఒక కొడుకును బుట్టించుకొనెను. అయినను స్వైర విహారము మానలేదు. ఒకనాఁటి ముని మాపునఁ గాళికాలయ ప్రాంతమునఁ దారాడుచు "ఏరా! తాళఁగ లేరా! రారా!" అని ఉపపతిని బిలుచుచుండెను. దాని గొంతువిని ఆదారిఁబోవు దాని భర్త దగ్గరి యెవరిఁబిల్చుచుంటి వని యడిగెను. వాచాలి అన్నది గదా! "అయ్యో! పసివాఁ డింటికి రాలేదు. నీ వెంబడి వచ్చి నాఁడేమో అని పిల్చుచున్నాను" అని. వాఁడు శిశుగతప్రాణి. అడలెత్తి వెదుకఁబోయెను. ఆమె యింటికిఁ బోయి తిరిగి, ఊరిలో బాలుని వెదకుచున్న పతి కెదురేఁగి "పసివాఁడు వచ్చి

పండుకొని నిద్రబోవుచున్నాఁడు. రండి” అని తోడ్కొని పోయెను.

### పదవ రాత్రి కథ.

భూతవైద్యుని భార్య ఘనురాలు. ఘనురాలికి ఉపపతులు నలుగురు: 1. కరణము 2. రెడ్డి 3. పారు పెత్తెగాఁడు 4. తలారి. ఒక నాఁటిరేయి వరుసగా నలుగురు, నొకరి పిదప నొకరు వచ్చిరి. ఆమె యందఱి నలరించెను. అయిదవ వాఁడు, వెళ్ళియుండిన పతి వచ్చెను. విటులు నలుగురు నాలుగు దిక్కుల నటుకలపై నుండిరి. తెచ్చిన బహుమానములు జూపుమని ఘనురాలు పతి నడిగెను. అతఁడు దివ్వె తెమ్మనెను. దివ్వె తెచ్చునంతలో అటుకలమీఁది వారు నలుగురు గబ గబ దూఁకి యుఱికిరి. ‘ఎవరు వీరు. చెప్పు’మని కను లెఱ్ఱచేసి, కత్తి దూసి భూతవైద్యుఁడు భార్యనడిగెను. ఆమె యిట్లనెను. “నీవు పొరుగూరికిఁ బోయి చికిత్స చేయుచుంటివి. ఆ భూతము లిక్కడకు వచ్చి, నా మీఁదఁ బడి త్రొక్కుచున్నవి. నేను తాళఁజాల కున్నాను. నీవు భూతముల జోలికిఁ బోఁగూడ దఁట. పోయినచో నన్నుఁ జంపునఁట. ఇపుడు నిన్నుఁజూచి పరుగెత్తినవి. భూతముల చేతిలోఁ జచ్చుటకంటె నీ చేతిలోఁ జచ్చుట మేలుకదా ! చంపుము.”

అతఁడు మెత్తబడి చేరఁదీసి మంత్రించి భయము బాపెను.

### పదునొకండవ రాత్రి కథ.

చండరశ్మి కిద్దఱు భార్యలు. చీటికి మాటికిఁ గొట్లాడుచుండిరి. ఆ బ్రాహ్మణుఁడు పెద్దభార్యను బయటికిఁ ద్రోసెను. ఆమె కడగానుండెను. ఉండి తట్టుకొనలేక, ఒకనాఁడొక ఆకతాయి భిక్షువురాఁగా, వానితో సంబంధము పెట్టుకొనెను. వాఁడు పగలు ఊరిలో అడిగికొనితిని, రేయి బ్రాహ్మణియొద్ద నిదురించుచుండెను. ఒకనాఁటి రేయి, చిన్న భార్యతో జగడమాడి, భర్త పెద్దభార్య యింటికి వచ్చెను. అపుడామె జారుని రెట్టబట్టుకొని తలుపుమూల నిలిపి తలుపు తెఱచి, భర్త పాదములకు మ్రొక్కి లోపలికిఁ బిల్చుకొని శయ్యఁజేర్చి, తలుపువంకఁ జూచి, “నేఁ డెయ్యెడకైన నేఁగవె చెలీ!” యనెను. ఆ సంకేతము గ్రహించి విటుఁడు వెడలి పోయెను. ఎవతెయో ఆఁడుతోడు కాఁబోలు ననుకొనునట్లు చేసెను.

### పండ్రెండవ రాత్రి కథ.

శివదత్తుఁడు భక్తుఁడు, సాధకుఁడు. అతని భార్య విశాల, విశాలలోచన. ఆమె నతఁడు చెంతఁ జేరనీయఁడు. చేరెనా? “చీ! అంకులాఁడి! చను” మనెడువాఁడు. ఆమె చూచి, చూచి, తెగించి, ఒకని నింటికిఁ దెచ్చికొని రమించుచుండెను. పతి వచ్చి చూచి మండిపడెను. అపుడామె యేమన్నది ? “అయో! మగఁడా! నీవే నా కొంప దీసితివి. “అంకులాఁడి, అంకులాఁడి” యంటివి. నీ వాక్కు తాఁకి నే నిట్లైతిని. యోగులపలుకు రిత్తపోదు. పతివ్రతవు గమ్మని పలుమాఱు పల్కుము. లేకున్న నేను ఆత్మహత్యకుఁ బాల్పడుదును” అన్నది. శివదత్తుఁడు తన వాక్కునకు అంతటి ప్రభావ మబ్బినదని మిక్కిలి సంతోషించెను; ఆశీర్వదించెను.

### పదుమూడవ రాత్రి కథ.

శరుఁడను ద్విజుని సతి సుఖమతి. ఆమె నడవడిక సరిగా లేదని అతని కనుమానము గలిగెను. కావలసి యొకనాఁడు దూరదేశ మేఁగుచున్నానని చెప్పి వేకువజామున బయలుదేరెను. సుఖమతి ఊరి వెలుపలిదనుక సాగనంపి, బహి శ్శంక కేఁగెను. శరుఁడు కికురించి యింటికిఁబోయి, దూలము మీఁది యట్టుకఁ జేరి దాఁగియుండెను. తెల్లవాఱెను. సుఖమతి మహోల్లాసముతో నొకజోస్యుని లంకించుకొని యింటికిఁ దెచ్చెను. కలియఁబోవు నదనునఁ బతి యునికి గనిపెట్టెను. కనిపెట్టి ప్లేటు త్రిప్పెను. “అయ్యా! జోస్యుఁడా! నాపతి

చాల శ్రమపడుచున్నాఁడు. పోయినపని అగునా? కాదా? ఎప్పుడింటికి వచ్చును?" అని వక్కాకిడి ప్రశ్నించెను. సైగ తెలిసికొన్న జోస్యుఁడు- "నీ భర్త నేఁడే వచ్చును. చూడు నా మాట" అని వెడలిపోయెను. శరుఁ డప్పుడే అటుక దిగి, "సెబాసు! నీ పాతివ్రత్య " మని శ్లాఘించి, సుఖమతినిఁ గౌఁగిలించుకొనెను.

## పదునాల్గవ రాత్రి కథ.

హిరణ్యగుప్తుని భార్య హస్తిని. ఆమెను జూచి సుంకరి కొల్వుకాఁడొకఁడు మోహించెను. మోహినీ శక్తిని బ్రయోగించి వశపఱచుకొనెను. ఇరువురకుఁ జనవు బలిసెను. వారు క్రీడించుచుండఁగా నొకనాఁడు గృహస్థుఁడు వచ్చి తలుపు దీయు మనెను. హస్తిని విటునకు ముసుఁగుబెట్టి యరుగు మీఁదం బరుండఁబెట్టి వాకిలిఁదీసి "తడవాయెను సుంకరీఁడు తమ లెక్కలకై పడియున్నాఁ డిదె" యని హీన స్వరముతోఁ జెప్పి చూపించెను. సెట్టి చప్పుడు గాకుండ వైదొలఁగి పొరుగింటఁ దల దాఁచుకొనెను. తరువాత విటుని సంతుష్టుని జేసి పంపించి, పతిని బిల్చెను. పతి వచ్చి సతిచర్య నభినందించెను.

## పదునైదవ రాత్రి కథ.

సత్యకేశిని రెడ్డిసాని. ఒక బంట్రౌతును మరగి యుండెను. ఒకనాఁడు రత్నగుప్తుఁడను సెట్టిని లోఁగొని, రమించుచుండఁగా బంట్రౌతు వచ్చి తలుపు దట్టెను. సెట్టిని గాదెలో దాఁచి, తలుపు దీసి బంట్రౌతుతో రమించుచుండఁగా, రెడ్డి వచ్చెను. రెడ్డిసాని తలుపు దెఱచి, పగ చాటుచు వదరుకొనుచుఁ బొమ్మని బంట్రౌతును బంపెను. వాఁడు తిట్టుకొనుచుఁ బోయెను. "ఏమి వాఁ డెందుకు వచ్చినాఁడు? వదరుకొనుచుఁ బోవుచున్నాఁడే!" అని రెడ్డి గద్దించి యడిగెను. రెడ్డిసాని నవ్వుచు గాదెను జూపి, "ఈ సెట్టిగానిఁ దఱుముకొనుచు వచ్చెను. వీఁడు మనయింట దూఱెను. నేను వాకిలి వేసితిని. వాడు దూఁకి వచ్చి, సెట్టిని బట్టుకొనఁబోయెను. నేనడ్డపడి, రెడ్డి లేఁడు. నీవు రావద్దు, పొమ్మంటిని. ఇంతలో నీవు వచ్చితివి. వాఁడు నామీఁదఁబడి యేడ్చి పోవుచున్నాఁడు." అని చెప్పి సెట్టిని బయటికి రమ్మనెను. రెడ్డి సెట్టికి అభయమిచ్చి, తన యౌదార్యము ప్రకటించి, పొమ్మనెను.

## పదునాఱవ రాత్రి కథ.

హిరణ్యకుఁ డనువాఁడు తీర్థయాత్ర చేసి తిరిగి వచ్చుచు, నొకనాఁడు వానకుఁ దడిసి, బెస్తవాని పంచఁ జేరెను. ఆ యింటి మచ్చెకంటి వానిని వలలో వేసికొనెను. ఇద్దరు కలిసియుండఁగా ఇంటివాఁడు వచ్చి, "ఎవరది?" యనెను. ఆ యిల్లాలు ముసుఁగులోనుండి పండుకొనియే మాఱుగొంతు వెట్టి "మేము యాత్రికులము. తలదాఁచుకొన్నాము. తెల్లవాఱఁగనే వెళ్ళిపోదు" మనెను. అతఁడు మంచిదని లోపలికిఁ బోయెను. ఈమె లేచి, నీళ్ళకుండ యెత్తుకొని, మగని వెనుకనే యింటి లోనికిఁబోయి, "ఏడుంటి వీసరి ప్రొద్దుదనుక?"అని గద్దించెను .

## పదునేడవ రాత్రి కథ

రూపసేన యను కుమ్మరి బిత్తరి సారణుఁడను సాలెవానిఁ గూడియుండఁగా మగఁడు తలుపు దట్టెను.

ఆమె దున్నపోతు తలుగువిప్పి హడావిడి చేసి తలుపు దీసి, తలుపు వేయుమని మగనిఁ దొందరించెను. దున్నపోతు విడిపించుకొని చెలరేఁగినది. ఈ తెరువరి సాయము వచ్చినాఁడని చెప్పెను. అతఁడు నమ్మెను .

## పదునెనిమిదవ రాత్రి కథ

విహారి బలిజెసెట్టి భార్య. చెడి యొక కొడుకును గనెను, వాఁడు పెద్దవాఁడై బోగముదాని పంచఁబడెను, వాని గృహిణి, విధి లేక, జారిణి యయ్యెను, వానితల్లి పూర్వసాంగత్యమును విడువదయ్యెను. ఇంట ఆత్త కోడలు చెటి యొక దారి యైరి. ఒకనాఁడు కోడలు లేదుగదా యని అత్త ఒక జెట్టితోఁ బెనఁగుచుండెను. అత్త లేదుగదా యని కోడలు అపుడొక విటునిఁదెచ్చికొనెను. అత్తకోడండ్రు ఒకరిమొగ మొకరు చూచుకొనిరి. గడిదేఱినది గదా అత్త “వీఁడెవఁడే? సంజకడ, ఇంటికిఁదెచ్చినావు” అని యడిగెను. కోడలు మెత్తగా బదులిచ్చెను. “అత్తా! యీ మహానుభావుడు ఆలుమగలకు అనురక్తి ఘటించువాఁడు, నేను చిన్నదానను. అనుభవము లేనిదానను, ఇతనినడిగి ఆ తంతు నీవే నడిపింపుము”. అత్త అందుకొన్నది. “నేనును అదే ఆలోచించి వైద్యుని బిల్చుకొనివచ్చినాను. పని చేసినాఁడు ఈతనితోఁ గాకున్నచోఁ జూడవచ్చు. ఆతనిఁ బంపించు”మనెను. విటులిద్దఱు వెడలిపోయిరి. అత్త అనుమానించలేదు. కోడలు అనుమానించలేదు. ఎవరిగుట్టు వారిది.

## పందొమ్మిదవ రాత్రి కథ

గాండ్లసెట్టిభార్య మణిచిత్రిణి. మేకపోతును బట్టికొనిపోవు బ్రాహ్మణకుమారుని బట్టికొని భోగించుచుండఁగా మగఁడువచ్చెను. మేక పోతును విడిచి “పట్టుకో పోనీకు” అని అఱచుచు వచ్చి, వాకిలి దీసెను, మగఁడువచ్చి, మేషమును బట్టియిచ్చి బ్రాహ్మణునిఁ బంపెను.

## ఇరువదవ రాత్రి కథ

మంత్రికొడుకు పెండ్లి వద్దని కూర్చుండెను. ఏమిరా? అనిన, స్త్రీలను నమ్మరాదనెను. చుట్టపక్కాలు పెద్దలంతా వానికి నచ్చఁజెప్పి, ఒకేసారి యిద్దఱిని ముడివేసిరి, వాఁడు భార్యల నిద్దఱిని వేర్వేఱు గదులలో నాకసమంటు నొంటికంబపు మేడలో నిలిపెను. వారికి సతతమైథునచింత. పెద్దామె సువర్ణ. చిన్నామె సుప్రభ.

ఒకనాఁడు సువర్ణముంగిట రెండు పాదుకలు పడెను. వానివెంట నొక బాపఁడు దిగెను. సువర్ణ అతని కాతిథ్యమిచ్చి, పాదుకాసాహాయ్యమున ఉపవనికి దోడ్కొనిపోయి సుఖమిచ్చి పంపెను. ఒకనాఁడు సుప్రభ దిక్కుతోఁపక పాడుకొనుచుండఁగా నాకసమునఁబోవు ముని యొకఁడు దిగివచ్చెను. ఈమె యతనిఁ గవయఁ బోయెను. ఆతఁడు జితేంద్రియుఁడు. అతనికిఁ గావలసినది సంగీతమేకాని సాంగత్యము కాదు. దయ దలఁచి యతఁడొక మంత్రమిచ్చి పోయెను. ఆ మంత్రప్రభావమున సుప్రభయు నుపవనికిఁ బోయి వనపాలకుని గూడెను.

సవతు లిద్దఱు యథేచ్ఛముగాఁ దమ యుపవనిలోఁ దమ యుపపతులతోఁ గేళి సలుపుచుండిరి.

ఒకనాఁటిరేయి భర్త రాఁడని తెలిసి భార్య లుపవనికిఁ బోయిరి. ఏదో మూలిక కావలెనని భర్తయు నపుడే యుపవనికిఁ బోయేను. భార్య లిద్దఱు భర్త కంటఁబడిరి. అతఁడు ఘర్షించి ప్రశ్నించెను. సతులు నవ్వి “మేము నీ భార్యలము కాము. వనదేవతలము. నీ భార్యలు మా యంశజలు. మేము వసంతుని శాపముచే మానవసేవ చేయవలసిన వారము. ఆ కర్మము మా యంశజల కిచ్చి, బతిమాలుకొని మేము బయటఁ బడితిమి. అందుచేత మా పోలికలు నీ సతులందుఁ గలవు పొ” మ్మనిరి. ఆతఁడు విశ్వసింపక, తన మేడకుఁ జూడఁ బోయెను. వారతనికంటె ముందుగనే పోయి పవళించియుండిరి. అతఁడు వారినిఁ జూచి విశ్వసించి సుఖపడెను.

# విషయ సూచిక

పదునాల్గవ రాత్రి కథ.

కోమటిబోటి సుంకరి కొల్వుకానిఁ గూడుట.

వశీకరణ మంత్ర ప్రయోగము.

పదునేనవ రాత్రి కథ.

రెడ్డిసాని యొుక పగ లిద్దఱినిఁ గూడుట.

కృషీవలు నిల్లు, ధాన్యములు, కాయలు.

పదునాఱవ రాత్రి కథ.

జాలరి బిత్తరి తైర్థికునిఁ గూడుట.

పడవలు, వలలు, జలచరములు

పుణ్యక్షేత్ర తీర్థ విశేషములు.

పంచమాశ్వాసము.

పదునేడవ రాత్రి కథ.

కుమ్మరి గుమ్మ సాలెవానిఁ గూడుట.

కుమ్మరి పరిశ్రమ.

గడ్డి రకములు.

గాలి - వాన.

పదునెనిమిదవ రాత్రి కథ.

అత్తకోడండ్రు ఉపపతులఁ గూడుట.

కొఱగాని కొడుకు.

నృత్య గాన విశేషములు.

స్త్రీ వశీకరణౌషధములు.

మర్లు మందు.

పందొమ్మిదవ రాత్రి కథ.

గాండ్లచేడె ద్విజవటువును గూడుట.

వసంతము.

ఇరువదవ రాత్రి కథ.

మంత్రికుమారుని భార్యలిద్దఱు నిద్దఱిని గూడుట.

కామినీ గర్హణము.

విదేశముల నుండి దిగుమతి యగు వస్తువులు.

భారతదేశ పుర గ్రామములు.

—: o :—

శ్రీ

# ప్రథమాశ్వాసము

## అవతారిక

### శ్రీరామస్తుతి

శా. శ్రీరామాంశజయైన జానకి యురస్సీమాంతరాత్యంతవి
స్తారప్రోజ్జ్వలహారనాయకమణీసందర్శితంబౌ నిజా
కారం బరసి యన్యకాంత యను శంకం జెందు నంచెంచి త
న్నారీరత్నము నంకపీఠి నిడు సీతాభర్త నన్ బ్రోవుతన్. 1

### సీతాస్తుతి

చ. తనకిది కేశిపద్మమయి తద్దయుఁ బద్దు వహించి తొల్లి లో
చన ముఖ హస్త పాదయుగ సామ్యముఁ జెంది సుగంధసంపదన్
దనరఁ దొడంగె నిప్పుడని తా దయమీఱఁగఁ జేతఁ బట్టెనో
యన వనజాతపాణియగునట్టి మహీసుత మమ్ముఁ బ్రోవుతన్. 2

### పార్వతీపరమేశ్వర స్తుతి

క. యమునాగంగార్ఝురసం
గమవిభ్రమ మాత్మసేవకప్రవితతికిన్
దమ రుచులిడ నెడయక లో
కము లేలు భవాని శివుఁడు గడు మముఁ బ్రోచున్. 3

### బ్రహ్మస్తుతి

ఉ. మేరునగప్రపాతమున మించి, రహించు కనన్మణిప్రభాం
కూరకదంబకం బనఁగఁ గుంకుమగంధరసంబు భారతీ
క్రూరకుచద్వయీనిహతి గొప్పయురంబున డంబుఁ జూపఁ బొ
ల్పారు సరోజపీఠిఁ గొలువయ్యెడు దేవుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 4

### సరస్వతీస్తుతి

తే. వాణి నజురాణి ఘననీలవేణి మధుర
వాణిఁ బల్లవసంకాశపాణిఁ బృథుల
సైకతశ్రోణి నాత్మలో సన్నుతింతు
సుమధుమధురసుధవచస్స్ఫూర్తికొఱకు. 5

## వినాయకస్తుతి

శా. లీలాకేళి కృతస్వకందుకములై లెక్కింపఁగా రాని యు
ద్వేలాత్మశ్రవణద్వయప్రచలనావిర్భూతవాతోత్థగో
త్రాళు ల్భ్రామినభోఽంతరాళమున నృత్యంబాడ నర్తించు గౌ
రీలీలావతిపట్టి మత్కృతికి నిర్విఘ్నత్వ మిచ్చున్ గృపన్. 6

## ఆంజనేయస్తుతి

ఉ. తావకపాదపద్మముల తాడన మొక్కటి దక్క నేపనుల్
గావు మదీయపాణులకుఁ గావునఁ జూడుము వీనినంచు సీ
తావిభుమ్రోల నిల్చి, ప్రమదంబునఁ జూపెడురీతి మోడ్పుకేల్
పావనభక్తిఁ బూనెడు కృపావని పానని నెంతు నామదిన్. 7

## గరుడస్తుతి

చ. తన తనుకాంతిఁ గాంచనకృతంబుల రీతి రహించు మారుతా
శనపరభూషణౌఘముల సారెఁ గనుంగొని చేయిసాఁచి కై
కొనఁ బటుపుత్త్కృతుల్ నిగుడ ఘోరఫణావళు లెత్త భీతి చా
లనము వహించు నైజసతులన్ గని నవ్వు సుపర్ణుఁ వేఁడెదన్. 8

## భాగవత స్తుతి

తే. ఆత్మఁ బ్రహ్లాద రుక్మాంగదాంబరీష
శౌనక వ్యాస శుక పరాశర విభీష
ణార్జున వసిష్ఠ పుండరీకాఖ్య భీష్మ
దాల్భ్య నారదముఖ్యులఁ దలఁతు భక్తి. 9

## సుకవి స్తుతి

సీ. వాక్యనిర్జితశేషవాల్మీకి వాల్మీకి
హరిభక్తియుక్తిధీవ్యాసు వ్యాసు
ఘనభావకాళిదాసును గాళిదాసును
జారుమాధుర్యవాచోరుఁ జోరు
దివిజేంద్రధనదవైభవభూతి భవభూతి
ధర్మబుద్ధినవీనదండి దండిఁ
గవితాభ్రహృష్టమాధవమయూరు మయూరు
భాసరాకృతిపుష్పబాణ బాణు

తే. మానితాచార మథితాసమాఘు మాఘు
ధ్యానబద్ధమురారి మురారి గాత్ర
పటువిభారవి భారవిఁ బ్రస్తుతింతు
సర్వశబ్దార్థవిజ్ఞానసరణి కొఱకు. 10

ఉ. నన్నయభట్టు భీమకవినాథునిఁ దిక్కనసోమయాజిఁ బె

ద్దన్నను ముక్కుతిమ్మనసచివాగ్రణి బమ్మెరపోతరాజు గౌ
రన్నను రంగనాథుని మహామహుఁ బిల్లలమఱ్ఱి వీరభ
ద్రు న్నుతియింతు నాంధ్రకవిరుద్రుల సత్కరుణాసముద్రులన్. 11

ఉ. అయ్యలరాజుఁ దిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుండగు కొండధీరునిన్
జయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైన మా
యయ్యలరాజవంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్. 12

చ. సరసులు గద్యపద్యముల చాతురికిన్ దలలూఁచి మెచ్చఁగా
విరసు లసూయచేత మఱి వేడ్కవహింపరు, తేఁటిమొత్తముల్
శరదరవిందబృందఘనసారమరందసుగంధసంగ్రహ
స్ఫురణ వహించుఁగాని, పురసూకరపంక్తులు చెందనేర్చునే! 13

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవి స్మరణంబును గుకవి తిరస్కరణంబును గావించి,
తదనంతరంబ. 14

## ఆత్మ స్తుతి

సీ. ఎవనికీరితి కుభృద్భవ కుభృద్ధర బుధ
కరిసైంధవ సమిద్ధహరిణరుచిర
మెవనిమేధంబు రుడ్భవ కభుగ్భవ విధూ
ద్భవ మరుద్భవ గురుప్రతివిఘాతి
యెవని యీ వహిమరుగ్భవ సరిద్భవ లస
ద్భువనభృత్త్రిపురభిద్భూరిమహిమ
యెవనిరూ పమృతభుగ్భవసుతోడ్వీడ్రతీ
డుడ్వీడ్భృదాప్తపుత్త్రోల్లసనము

తే. మంత్రిమాత్రుండె యతఁడు దుర్మంత్రిమంత్ర
తంత్రసంత్రాసకరణస్వతంత్రుఁడయల
రాజవంశసుధావార్ధిరాజ సూర
యార్య నారాయణామాత్యవర్యుఁ డలరు. 15

వ. వెండియు నఖండతేజఃకాండమార్తాండమండలప్రచండుండును, నిజవిత
రణాకర్ణనకృశీభూతపారావారపునరభ్యుదయకారణానూనదానధారా
ప్రవాహసంజాతమహావాహినీవ్యూహుండును, నిస్తులప్రశస్తసమస్త
సద్గుణరత్నరత్నాకరుండును, గౌండిన్యగోత్రపవిత్రుండును గొండమాం
బాగర్భవారాశిచంద్రుండుననగు నయ్యలరాజు నారాయణామాత్యదే
వేంద్రుండు గొండొకశుభవాసరంబున నత్యంతసంతోషితాంతఃకరణుండై. 16

## కృతి శ్రీరామచంద్రున కంకితము చేయుట.

## షష్ఠ్యంతకందములు

క. వారణ భయవారణ జయ
కారణ చక్రాహతారి కరవారునకున్.

నీరాకర ధారాధర
భారాజీ భాసురప్రభాపూరునకున్! 17

క. భీషణ ఖరదూషణ పరి
శోషణ సురపోషణోగ్ర శోభనమతికిన్
శేషాహిప భాషాధిప
యోషాహిపరాశ్వకీర్తి యోగోన్నతికిన్! 18

క. సింధుసుపుత్రీకుచధర
కంధరశుభవిగ్రహునకుఁ గమలజసురరా
ట్సింధురముఖ సింధురముఖ
బంధుర జాతస్తవార్హపదనివహునకున్! 19

క. తక్షక కులశిక్షక చల
పక్షకళాత్యరుణహేమపటసంభృతికిన్
దక్షాధ్వరశిక్షాకర
రక్షాచరణప్రవీణ రాజద్గతికిన్! 20

క. వక్రత్రయచక్రకుచా
వక్రతనూరూప వైభవదచారునకున్
జక్రాహిత శక్రాహిత
చక్ర మహాపక్రమోపసంహారునకున్! 21

క. భామాయుత కామాయిత
కోమలసుందరశరీరగురుధామునకున్
భీమరిపుస్తోమ వపు
స్స్థేమతమస్సోమునకును శ్రీరామునకున్! 22

వ. అంకితంబుగా రచియింపబూనిన హంసవింశతి యను మహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టిదనిన. 23

## కథా ప్రారంభము.

## చిత్రమహారాజ చరిత్రము.

సీ. నానాగమస్ఫూర్తిఁ బూని హంసాశ్వస
న్మహిమంబుఁగను ధరామరులు హరులు
తేజోమదంబుల దిక్కుంభినీశుల
నురుమాడనోపు భూవరులుఁ గరులు
మణిచక్రములు భూరిగుణకోటి కేతువు
ఖలరఁగా నొప్పు వైశ్యులు రథములుఁ
బరజీవ జీవనోద్ధరణధర్మఖ్యాతి
విలసిల్లు శూద్రులు వీరభటులు
తే. విమల సుమనఃప్రమోదరాగములఁ దనరి
పల్లవప్రాప్తిచే మించు ప్రౌఢవార
వనిత లారామములు గల్గి వినుతికెక్కు

భూమిరత్నంబు నైషధపురవరంబు. 24

క. కలిత మహాబల సఖ్యో
జ్జ్వలవిక్రమనిహతవిమతసాలోరుయశోఽ
నలరాజభరిత మప్పుర
తిలకము సమమనఁగవచ్చుఁ దేజోవతికిన్. 25

క. ఆపురము ధరాలలనా
నూపురమై రత్నసౌధనూతనరుచికిన్
దాపురమై యభ్రంకష
గోపురమై పొగడ నెగడుఁ గుంభినిలోనన్. 26

వ. మఱియు నప్పట్టణంబు దివ్యసాలోచ్ఛ్రాయకలితంబు గావున నాకలోకంబును, మహాశుద్ధాంతరంగంబు గావున యోగిజనంబును, నీలగవాక్షప్రబ లంబు గావునఁ గిష్కింధానగరంబును, గుంభీనసరభసంబు గావున రసాతలంబును, గంధర్వప్రచురంబు గావున దేవలోకంబును, గురుగవిబుధద్విజరాజభాసమానంబు గావున గ్రహమండలంబును ననుకరించి మత్స్యకూర్మాదిమహిమంబులు వహించి కమలాలంకృతంబులై శ్రీమహావిష్ణువుం బురుడించు సరోవరంబులు గలిగి యొప్పు నెప్పుడు. 27

ఉ. ఆపుర మేలు మేలు భళి యంచు నుతింప జనుల్ నవద్వయ
ద్వీపవసుంధరాస్థలి సుదీర్ణజయాంకలిపు ల్లిఖించి, బా
హాపటుశక్తి నిల్పిన మహారజతద్యుతు లొల్కు కంబముల్
ప్రాపితశౌర్యలేఖలయి ధాసిలఁగా నలనాముఁ డున్నతిన్. 28

తే. ప్రబలరాజాధిరాజ వీరప్రతాప
రాజ పరమేశ్వరాష్టదిగ్రాజకుల మ
నోభయంకరబిరుదైకవైభవా య
టంచు మాగధు లెంచంగ మించు నతఁడు. 29

వ. ఇట్లు మహీశాసనంబు సేయుచు నొక్కనాఁడు. 30

ఉ. ఆ తరణీప్రభుండు గొలువై చెలువై బలవైరిభోగసం
ప్రీతి దలిర్పఁగా నృపవరేణ్యులు మాన్యు లగణ్యపుణ్యసం
ఘాతు లమాత్యు లార్యు లధికారులు వీరులు చారు లష్టది
గ్జాతవిచిత్రవస్తువులు గానుక దెచ్చినవారు గొల్వఁగన్. 31

క. ఉన్నయెడ నాల్గువేదము
లెన్నఁగఁదగు శాస్త్రచయము లితిహాసాదుల్
పన్నుగఁ దెలిసిన ప్రత్యు
త్పన్నమతి యనెడు పురోహితద్విజుఁ డెలమిన్. 32

ఉ. వచ్చి ఫలోపవీతములు “స్వస్తిచ తేఽస్త్వితి”సూక్తి మున్నుగా
నిచ్చిన నాదరించి వసియింపఁగఁజేసి నృపాలుఁ డెంతయున్
ముచ్చటయున్ బ్రసంగములు మున్నటిరాజుల చర్యలున్ గథల్
చెచ్చెర నానతిమ్మనినఁ జిత్తము రంజిల నాతఁ డత్తఱిన్. 33

ఉ. చెప్పఁదొడంగెఁ దేనియలు చిల్కఁగ ద్రాక్షలు రాలఁ గప్రపుం

దిప్పలు చిమ్మిరేఁగఁ గడుఁదీయని యిక్షురసప్రపూరముల్
చిప్పిలి పర్వఁగా నమృతశీకరముల్ వడిఁ గ్రుమ్మరింప న
ప్పప్ప యిదౌర యంచు జనులందఱు నౌదల లూఁచి మెచ్చఁగన్. 34

తే. చెప్పుచుండఁగ భామల చిత్తవృత్తి
తెలియ బ్రహ్మకైనను గొలఁదిగాదు
ధాత్రిఁ జిత్రవిచిత్రంబు దలఁచిచూడ
దాని నెఱిఁగింపు బ్రాహ్మణోత్తమ మృగాంక! 35

వ. అని యడిగిన నతనికిఁ బురోహితుం డిట్లనియె. 36

క. మంకులు మాయోపాయలు
బొంకులపుట్ట లతిపాపపుం జగజంతల్
జంకెనలు సేయు యువతులు
శంకరుఁడున్ దగఁడు వారి చర్యలు దెలియన్. 37

తే. అయిన నొకకథ కలదు రాజాగ్రగణ్య!
తొల్లి పరమేశ్వరుండు సంతోష మొదవఁ
బార్వతీదేవి కెఱిఁగించె బాగుమీఱ
నది యెఱింగింతు వినుము నీ వవధరించి. 38

వ. అని యిట్లనియె. 39

సీ. మంజులమాణిక్యపుంజరంజితఘన
ప్రాకారచుంబితాభ్రస్థలంబు
చంద్రకాంతోపలసౌధపాండురకళా
మ్రేడితప్రాలేయఘృణికరంబు
రత్నకుడ్యావళీరమ్యాంశుసందోహ
బహుళీకృతార్కప్రభాచయంబు
గంభీరపరిఘాసితాంభశ్చటాతమో
లోకీకృతాధరలోకవితతి

తే. యామికాహతిజాతదిశాధినాథ
పురభయంకరభేరికాభూరిదంధ
ణంధణధణధ్వనిప్రతినాదదాయి
గోపురం బొప్పు నుజ్జయినీపురంబు. 40

క. ఆ పుటభేదనమునకు ది
శాపుటభేదనకఠోరసంగరజయభే
రీపటలధణంధణుఁ డొక
భూపాలుఁడు గలఁడు చిత్రభోగుం డనఁగన్. 41

సీ. వెలయ హరిశ్చంద్రువిధమున, నలుని వీఁ
కను, బురుకుత్సు చాడ్పునం, బురూర
వునిలీల, సగరులాగున, గార్తవీర్యుమ
ర్యాదను, గయుక్రియ, నంబరీషు
మతమున, శశిబిందుమహిమ, నంగునిఠేవఁ,
బృథునిమాడ్కి, మరుత్తవృత్తి, భరతు

నీతి, సుహోత్రునిభాతి, భార్గవుబలె,
రాముపోలిక, భగీరథునిపొలుపు

తే. న, శిబిసంగతి, మాంధాతనయమునను, య
యాతికరణి దిలీపునియట్ల, రంతి
రీతి, నాచక్రవాళపరీతభూత
ధాత్రిఁ బాలించు నవిభుండు తద్విభుండు. 42

తే. అతఁ డంతిపురంబులో హావభావ
విభ్రమవిలాసవైఖరుల్ విస్తరిల్లు
మరుని సామ్రాజ్యలక్ష్మల హరువుఁ జెందు
చెలులు గొలువంగఁ గొలువుండెఁ జెలువుమీఱ. 43

వ. ఉన్న సమయంబున. 44

సీ. పొడవైన జిలుగుఁగెంజెడల కీల్గంటును
నిండారెడు విభూతిపెండెకట్లు
వీనులఁ బటికంపు వింతకామాక్షులు
కనుబొమల్ సందునఁ గావిబొట్టు
కుచములపైఁ గావికుబులసంబు గళమున
నలరారు రుద్రాక్షహారతతులు
చే నాగబెత్తంబు చిన్నికృష్ణాజిన
మక్షిగోళంబుల నంజనంబు

తే. కావివస్త్రంబు పావాలు కక్షపాల
తామ్రకటకంబు సింగినాదంబు క్రోవి
పొందు సిద్ధక్రియలు చిదానందభూతి
యొనరఁ దాలిచి యొక మహాయోగురాలు. 45

తే. చెట్టుడిగి వచ్చినట్టులఁ జెంతనిలువఁ
జూచి లేచి నృపుండు సంస్తుతుల మ్రొక్కి
పీఁట వేయించి కూర్చుండఁబెట్టి తా సు
ఖాసీనుఁడై యున్న యవసరమున. 46

సీ. శ్రీరస్తు శుభమస్తు ధీరస్తు విజయోఽస్తు
పుత్రరంజనమస్తు పుణ్యమస్తు
ధనమస్తు ధాన్యమస్త్వనవద్యసుఖమస్తు
చిరతరసంకల్పసిద్ధిరస్తు
సత్యమస్తు మహోఽస్తు శౌర్యమస్తు యశోఽస్తు
స్వస్త్యస్తు సుగుణోఽస్తు శక్తిరస్తు
సామ్రాజ్యమస్తు శాశ్వతధర్మఫలమస్తు
వృద్ధిరస్తు మహాప్రసిద్ధిరస్తు

తే. జ్ఞానమస్తు శ్రియఃపతిధ్యానమస్తు
గురుచరణభక్తిరస్తు సత్కుశలమస్తు
శాంతిరస్తు నిరంతరైశ్వర్యమస్తు
భాగ్యమస్తు మహాసార్వభౌమ! నీకు. 47

క. అని దీవి చక్షత పు
ష్పనిచయము విభూతిపండ్లు ఫలములు దివ్యాం
జనములు సిద్ధక్రియలును
దనరఁగ శివసత్తి భూమిధవున కొసంగెన్. 48

వ. ఇట్లొసంగిన వినయంబున లేచి కైకొని స్వాగతం బడిగిన సంతోషించి మనోరంజనార్థంబు ధర్మార్థకామమోక్షంబులు రాజ్యలక్షణంబులుఁ బురాణేతిహాసంబులుఁ గొన్ని లోకాభిరామంబులు ననాగతవర్తనంబులు నుచితానుకథాస్వారస్యంబులుఁ దెలిపిన విని మహాత్మురాలా! నీవు వినని కనని కార్యంబులు ముల్లోకంబుల నెవ్వియు లేవైన నొక్కటి యడిగెద నాన తిమ్మని యిట్లనియె. 49

క. ఏ యే భూములఁ జూచితి
వేయే రాజ్యములఁ గలరు శృంగారకళా
ప్రాయలగు రూపరేఖా
శ్రీయుతి గల కన్నె లనిన శివసత్తి యనెన్. 50

మ. మది రంజిల్లఁగఁ జెప్పెదన్ వినుము ప్రేమన్ సచ్చిదానంద సం
పదచేతన్ గరజంభలంబుగతిఁ గన్పట్టున్ ధరాధీశ! యీ
యుదయాస్తాచలసేతుశీతనగమధ్యోద్యద్ధరాచక్ర మిం
పొదవన్ దేశములందు నుండుదురు విద్యుద్వల్లికాభాంగనల్. 51

ఉ. డెబ్బదిరెండు పాళెముల ఠీవిఁ దనర్చు సమస్తదుర్గముల్
జొబ్బిలుకల్మిఁ బట్నములుఁ జొక్కపుఁబేఁటలుఁ బాతకంబు పో
ద్రొబ్బెడులీలఁ జాల్తిరుపతుల్ గనుగొంటిని నుందు రందులన్
సిబ్బెపు నిబ్బరంపుజిగిఁ జిక్కని చక్కని గుబ్బ గుబ్బెతల్. 52

క. వెలనాడు వేఁగినాడును
బులుగులనా డ్వాకనాడు పొత్తపినాడున్
గల ములికినాడు రేనా
డలయక కనుఁగొంటి నచటి యబలలఁ గంటిన్. 53

సీ. లాట కర్ణాట మరాట వధూటులఁ
బాండ్య పౌండ్ర విదర్భ పద్మముఖుల బంగాళ వంగ కళింగ లతాంగులఁ
గుకురు కేరళ కురు కోకకుచల
మళయాళ నేపాళ మాళవ యువతుల
మత్స్య వత్స కరూశ మానవతులఁ
గోస లాంధ్ర వరాట కుంతల స్త్రీలను
బాంచాల బర్బర భామినులను

తే. ద్రవిళ గాంధార కాశ్మీర ధరణిసతుల
మగధ కొంకణ టెంకణ మానినులను
మఱియుఁ దక్కిన ధారుణీమండలములఁ
దనరు చెలువలఁ జూచితి ధరణినాథ! 54

తే. రాజ వశ్యౌషధాకృతుల్ రమ్యతర ర
తిస్వరూపలు మోహన దివ్యమూర్తు
లతులతర కామమంత్ర దేవతలు వీర

లనఁగ నుందురు సుందరు లచట నచట. 55

## సాతానిసతి హేమావతి

ఉ. ఈ నవఖండమండితమహీస్థలి నెల్లఁ గనంగ దేవ! నే
నీ నగరీలలామమున నెంతయు రేఖఁ జెలంగు మన్మథా
ధీనసుమోహనాకృతి రతిన్నగు మిన్నగు సొరుగల్గు సా
తాని బిసప్రసూనదళ ధాళధళీ తరళాక్షిఁ జూచితిన్. 56

తే. దాని ప్రియనాయకుఁడు విష్ణుదాసుఁ డనెడు
పేరు గలవాఁడు కలవాఁడు పెద్దవాఁడు
హేమవతి యనఁదనరు నయ్యింతిఁ బొగడఁ
దరమె బ్రహ్మకునైన శంకరునకైన. 57

ఉ. ఆ మధురాధరకచాళికనద్ఘననైగనిగ్యమా
యామృదులోరుసారరుచిరాంబురుహాక్షుల ధాళధళ్య మా
యా మెఱుఁగారుఁబోఁడి జిగియబ్బెడి గుబ్బల చాకచక్యమా
యేమని చెప్పవచ్చు జగతీశ్వర! శాశ్వతరూపసంపదల్. 58

క. దాని జిగి దాని కులుకును
దాని తనుద్యుతులసొంపు దాని విధంబున్
దాని వగ దాని యందము
మానవవర! మరుఁడు గన్న మగ్నుఁడు గాఁడే! 59

క. వగ లొలుకు ధాగధగ్యపు
జిగి గుల్కెడు నుబ్బుగబ్బిసిబ్బెపుగుబ్బల్
నిగనిగలు గులుకు కొప్పును
సొగసుం దెలికనులు దాని సొమ్మై పరఁగున్. 60

ఉ. విండ్లకు మేల్తరంబు ఘనవేణి కనుంబొమదోయి బంగరుం
గిండ్లకు మేటిసాటి తులకించు చనుంగవ లేఁతతమ్మి పూఁ
దూండ్లకు మిన్నయన్న జిగిఁదొల్కెడు చేతులు లోకమందుఁ బూఁ
బోండ్లను గానమో వినమొ పోలరు తత్సతి కాలిగోటికిన్. 61

సీ. కబరీభరమునకుఁ గందంబు సెల్లు ను
త్పలమాలికలు నేత్రములకుఁ జెల్లుఁ
గర్ణంబులకును మంగళమహాశ్రీ సెల్లు
గాత్రంబునకుఁ జంపకంబు జెల్లు
మధురవాగ్వృత్తికి మత్తకోకిల సెల్లుఁ
జనుగుబ్బకవకు మంజరియుఁ జెల్లు
బిరుదైన పిఱుఁదుకుఁ బృథ్వీవృత్తము చెల్లు
మధ్యంబునకుఁ దనుమధ్య చెల్లుఁ

తే. బాదముల కంబుజము చెల్లుఁ బరఁగు నడకుఁ
దనరు మత్తేభవిక్రీడితంబు సెల్లుఁ
గృతుల వర్ణింపఁదగు తదాకృతులె కృతులు
వాంఛలే దానిఁ బొందినవాఁడె సుకృతి. 62

తే. చండదోర్దండమండితమండలాగ్ర
ఖండితోద్దండరిపుకాండభండనమునఁ
బండితుండగు రాజవేదండమునకుఁ
గాక, యొకపాటివాని కాకన్నె తగునె? 63

ఉ. సౌరభ మొందు కాంచనపు జంత్రపుఁబుత్త్రిక వాగ్విలాసము
ల్వారక నేర్చు రత్నపుసలాక తిరంబగు రూపుఁ జెందు తొ
త్కారమెఱుంగు జీవకళఁ గాంచిన చిత్తరుబొమ్మ యానశృం
గారిణియౌ సుధాసరసిఁగా నుతి సేయఁగవచ్చు నెచ్చెలిన్. 64

క. అని సిద్ధురాలు సెప్పినఁ
బొనపొనగా భ్రమలు చెందఁ బులకలు వొడమెన్
మనసిజ శిఖి యెనసినచోఁ
గనఁబడు ధూమాంకురములగతి నృపుమేనన్. 65

క. అంతట సిద్ధాంగన యా
ద్యంతంబును జెప్పి తన మహాశ్రమ మహికిన్
సంతోషంబునఁ జనె భూ
కాంతుఁడు హేమవతిమీఁది కాంక్ష జనింపన్. 66

మ. కరుణాదృష్టులు నాగవాసముల సోఁకంజూచి వేడ్క న్మనో
హరముల్ కోకలు రూకలున్ మణులు హారాలంకృతిస్తోమముల్
సరసత్వంబున నిచ్చి పంచి కొలువున్ జాలించి తాఁబోయె భూ
ప రతీశుండు మనంబు హేమవతిపై బాళిన్ దువాళింపఁగన్. 67

క. మిన్నందు సౌధవీథి స
మున్నతమగు మేలుమచ్చు లొప్పెడుచోటన్
మిన్నగు చిత్తరువులచేఁ
బన్నుగఁదగు నొక రహస్యభవనము పజ్జన్. 68

చ. అకలుషదివ్యరత్నమయమౌ నొకకేళిగృహంబులోపలం
జికిలి కిరీటిపచ్చల రచించిన చిల్కలకోళ్ళ నందమౌ
సకినెల పట్టెమంచమునఁ జాయనఖాసు తివాసిపైఁ దురం
గిక మొకమాలు లేపున నొగిన్ శయనించి మనోభవవ్యథన్. 69

క. ప్రీతిని హేమావతిపై
నాతీరున మనసు నిలిపి యతివిరహార్తిన్
జేతోజాతధనుర్భవ
శాతశరవ్రాతసారచకితాత్మకుఁడై. 70

క. ఉలుకున్ వెన్నెలవేఁడిమి
కలుకున్ శుకపికమిళిందహంసార్భటికిన్
బెళుకున్ మలయానిలునకు
జెళుకున్ బూఁబాన్పునందుఁ జిరవిరహార్తిన్. 71

ఉ. చెక్కిటఁ జేయిఁ జేర్చుకొని చింతిలు నుస్సురటంచుఁ జూపులన్
వెక్కసమంది లేమ సరవిన్ బొడగట్టినయట్టు లుండఁగా
నక్కునఁ జేర్పఁబోవు భ్రమమంది వెసన్ దలయూఁచు నంతలోఁ

బక్కున నవ్వు నింతిపయిబాళి నృపాలకమౌళి ఖిన్నతన్. 72

వ. మఱియు నారాజు విరహంబు తాపాతిశయకరంబు గావున నిదాఘంబును, విరళీకృతాశ్వాసంబు గావున సత్ప్రబంధంబును, విచ్ఛిన్నాలంకారంబు గావున యవనవివాహంబును, నిమీలితతారకంబు గావున నహర్ముఖంబును, విప్రలాభముఖరంబు గావున సాయంకాలంబును ననుకరించె నప్పుడు. 73

క. అటువలె నృప నిటలాక్షుఁడు
పటుతరవిరహంబుఁ జెంది బాధపడంగా
నటనమున హేల యనియెడు
కుటిలాలక వచ్చెఁ దెలివిఁగొనఁజేయుటకున్! 74

శా. పన్నీట న్నయనంబు లొత్తెఁ దనువున్ బాటీరపంకంబుతోఁ
జెన్నారన్ బదనిచ్చె గీరి సిగవేసెన్ దాయెతుల్ సుట్టె జీ న్నొన్నాపట్టె రుమాలుగట్టె
జరతాచుట్టంచు డాల్మించు మే
ల్మిన్నాసన్నపుదుప్పటంబుఁ దగహాళిన్ గప్పె సొంపారఁగన్. 75

వ. ఇ ట్లుపచారంబులఁ గొంతతాపంబు శాంతం బొనర్చి, నృపాలునకు హేల యిట్లనియె. 76

ఉ. స్వామి! పరాకు, నీమదికి సమ్మతియౌ పని యేమి చెప్పుమా!
ప్రేమ దలిర్ప నేర్పు దలఁపింప నదెంతటి కార్యమైన నే
నే మఱి తీర్చి, నీకుఁగల నెంజిలిఁ బాపెదఁ జూడుమన్న నా
శ్రీమహనీయవైభవుఁడు శీతకరాస్యకు హేల కిట్లనున్. 77

తే. సిద్ధురాలు హేమావతీ సితకరాస్య
వలపు రేఖాతిశయవైభవమును దెలుప
వినఁగ నగు మోహముననైన వెతను మాన్పు
కరుణ ననుఁ జేర్చి యమ్మచ్చెకంటిఁ గూర్చి. 78

క. అని చీనీచీనాంబర
ఘనమణిహారములు మేలు కాల్కడియంబుల్
గొనబున్ మెఱుఁగుంగరములు
చనవమరఁగ నిచ్చి పనుప సముచితరీతిన్. 79

ఉ. పూని ముదంబు లుప్పతిల భూవరముఖ్యునిచేత వీడికో
లై నవరత్నకీలితమహారజతోన్నతదివ్యదీధితి
శ్రీనిధు లెల్లదిక్కుల దిసించుచు మించిన విష్ణుదాసు స
న్మానితగేహసీమకు సుమాళముతోఁ జనె హేల హేలలన్. 80

సీ. కస్తూరివీణలుఁ గపురంపు లప్పలు
నిండిన గృహములు నెరయ దాఁటి
కుంకుమాగరుఖండసంకుమదంబులు
గలుగు బిడారులు గడచిపోయి
గౌళముల్ పచ్చాకు కచ్చూరములు చాల
నించిన కొట్టడీ ల్మించి యేఁగి
పునుఁగు చట్టంబులు బుక్కారజంబులు
పొంకమౌ మళిగల పొంతఁ దరలి

తే. చూచె నొకదివ్యరత్ననిస్తులగృహంబు
నందు హేమావతీ కన్య నలరు ధన్య
వఱలు సొంపుల టెంకి జవాది వంకి
జాతి రతిలీల నా రాజదూతి హేల. 81

వ. ఇట్లు తన్నుఁ జేరవచ్చిన రాజదూతిం గనుంగొని మహారాజు మన్ననల మనియెడు పడంతుక యని రత్నంపుగద్దియపై వసియింపంజేసి స్వాగతం బడిగిన నబ్బాలకు హేల యిట్లనియె. 82

క. నీ చాతుర్యము నీవా
చాచిత్రపటుత్వరూపసంపద లెపుడున్
నీ చుట్టంబులు సెప్పఁగఁ
జూచెదనని వచ్చినాను సుదతీ నిన్నున్. 83

ఉ. చక్కనివారిలో మిగులఁజక్కనిదాన వటంచు వేడ్కతోఁ
జొక్కుచుఁ జెప్పి రందులకుఁ జూచినయందుకు నా మనోరథం
బక్కడ సిద్ధమయ్యె ఫల మబ్బెను హా యిటులుండ వద్దె? యో
చక్కెరబొమ్మ! యంచు సరసప్రతిభాషల నిచ్చగింపుచున్.84

సీ. దీనచకోరాళి తృష్ణఁ దీర్చుఁ గదమ్మ
భామ! నీ వదనచంద్రామృతమ్ము
బీదబర్హిణముల నాదరించుఁ గదమ్మ
మెలఁత! నీ వేణికామేఘపంక్తి
ఘనదరిద్రపికాళిఁ దనియఁ జేయుఁ గదమ్మ
చెలియ! నీ వాతెఱ చివురడంబు
బడుగుజక్కవల నింపడరఁ బ్రోచుఁగదమ్మ
ముగుద! నీ చనుఁదమ్మి మొగ్గదోయి

తే. పేదకీరసందోహము నేదునమ్మ
నీ వచోబృందమకరందనిర్ఝరంబు
లిట్టి పస మిసి జిగి బిగి యా విధంబు
ప్రణుతి సేయంగఁ దరమె యా బ్రహ్మకైన. 85

క. ఇదిగాక యత్తమామల
ముద మొదవఁగ బంధుసంఘముల దాసీదా
సదళంబుల బహువిశ్వా
సదయల నీరీతి మనుచు సతులన్ గానన్. 86

వ. అని యిత్తెఱంగున. 87

ఆ. దాని యత్తతోడఁ దగ మామతో బంధు
దాసజనముతోడఁ దగిన మైత్రిఁ
గూడి యాడుచుండి కొన్నిదినంబులు
చన్న పిదప నొంటి నున్నవేళ. 88

ఉ. ఒక్క సుధాంశురత్నరుచిరోన్నతవేదికమీఁద నిద్దఱున్
మక్కువ మీఱ నుండి యనుమానముతో నొక కొంత కొంకికొం
చక్కట! నీ కొకందులకు నచ్చిక లేక మెలంగ విష్ణుదా

సెక్కడి భర్తఁ గాఁగ సృజియించె నజుండని హేల నవ్వుచున్. 89

క. ఈ రూప మీ పటుత్వం
బీ రేఖావైభవంబు లీ నెఱప్రాయం
బీ రసికత నీకును మఱి
మా రాజున కగును నితరమనుజుల కగునే! 90

సీ. కలికి! నీ సిబ్బెంపు గబ్బి గుబ్బలు వాని
గడుసు చేతులఁబట్టి కలఁచఁదగునె?
కాంతరో! నీ తావి కావిమోవిటు వాని
కొక్కిదంతంబుల నొక్కఁదగునె?
చెలువ! నీ జిగి గోముగల మోము మఱి వాని
తొట్టినోరున ముద్దు వెట్టఁదగునె?
సుదతి! నీ కనకంపు సొంపు దేహము వాని
కఱకుమేనునఁ జేర్చి కలయఁదగునె?

తే. కులుకు శృంగారరసములు చిలుకఁ గీలు
బొమ్మవలె నీటు గలదానవమ్మ! నీవు
మర్కటము వంటివాఁడు నీ మగఁడు చూడ
వానితోఁ గూడి రతికేళిఁ బూనుటెట్లు? 91

క. నీవంటి రూపవతికిని
నీవంటి ప్రియుండు గలుగ నిర్మింప కయో!
యీ విధిని దగులు చేసిన
యా విధి నిటు దూర నింక నగు ఫలమేమీ? 92

తే. అయిన మగఁడెంత నీటుకాఁడైన నేమి!
ప్రాణప్రదమైన చౌశీతిబంధగతుల
నింపు సొంపును జూచి చొక్కింప నగునె?
రతికిఁ జొచ్చిన తఱి మానవతుల కెపుడు. 93

ఉ. కేరఁగరాదు, నవ్వి గిలిగింతలు వెట్టఁగరాదు చెక్కులన్
జీరఁగరాదు, గుబ్బలు ఖచిక్కునఁ గ్రుమ్మగఁరాదు కేళిలో
మీఱఁగరాదు, పైకొని రమింపఁగరాదు, గళారవంబు లిం
పారఁగ సల్పరాదు మదిరాక్షులు భర్తలఁ గూడు వేళలన్.94

వ. అదియునుం గాక. 95

క. పదివేల మదను లొక్కట
నుదయించిన లీల మెఱయు నురుగుణుఁడు సుమీ!
మదిరాక్షి! చిత్రభోగుఁడు
మదిఁ గోరెను నీదు భాగ్య మహి మెట్టిదియో!96

సీ. కువలయానందంబుఁ గూర్చి యేలు ఘనుండు
విబుధులఁ బ్రోచు సద్వ్రతరణుండు
సర్వజ్ఞమౌళి భూషణమైన ధన్యుండు
లలితవిభ్రమరూపలక్షణుండు
సరవికళల్ నించు శ్యామాభిరాముండు

వఱలెడు సన్మార్గవర్తనుండు
విష్ణుపదార్చితవిహితశుభ్రకరుండు
వితతతమోహారి వినుతశీలుఁ

తే. డమ్మహారాజచంద్రుఁ డాయన నిజాంత
రంగమంతయు నినుఁజేర్చి రమణతోడ
నేలఁ గలఁ డమ్మ! నీ పుణ్య మెనఁగె నమ్మ!
తమిని నీడేర్పవమ్మ! కుందనపుబొమ్మ! 97

వ. అనిన విని సంభ్రమభయవిస్మయలజ్జాహాసకాంక్షలు మనంబునం బెనంగొన
నమ్రముఖియై హేమావతి రాజదూతి కిట్లనియె. 98

ఉ. అమ్మకు చెల్ల! యిట్టి పలుకాడుదురే? మఱి యత్తమామలున్
గ్రమ్మి తలారులై మెలఁగఁగా మగఁడున్ బులిరీతిఁ దెంపుగా
బమ్మెర రొప్పుచుండఁగను బాంధవు లెల్లను గాంచియుండఁగాఁ
గొమ్మరొ! యిట్టికార్య మొనఁగూడునె? కూడిన హాని చెందదే? 99

తే. అనిన హేమావతికి నిట్టు లనియె హేల
రేపటికి నేఁటి ప్రాయంపుటేపు గలదె?
మోహ మెక్కొనఁ జక్కని ముద్దుజాణ
యొకని బిగికౌఁగిఁటను జేర్చి యుండవలయు. 100

క. ఎక్కడి మగఁ డెక్కడ సఖు
లెక్కడి నీయత్తమామ లెక్కడి చుట్టా
లిక్కొలఁది దొడ్డ కొంచెము
లెక్కింపకు మరుని హావళిన్ బడువేళన్. 101

సీ. కోటగోడలనైన మీటుగా నెగఁబ్రాకి
దాఁట నేరని దేటి తలిరుఁబోఁడి
ఘుమఘుమార్భటితోడ ఘోషించు నదులైన
నీఁది పోవని దేటి యెమ్మెలాఁడి
తనమీఁది తప్పు నొక్కనిమీఁద నిజముగాఁ
బెట్టనేరని దేటి బిసరుహాక్షి
ధవుఁడైనఁ దనజాడ తగదని పట్టిన
నిర్వహింపని దేటి నీటుకత్తె
తే. తలవరులు గన్నచో లేని తాల్మిఁబూవి
బొంకు తథ్యంబు తథ్యంబు బొంకుఁ గాఁగ
నెంచి యుపనాథుతోడఁ గ్రీడించి మించి
చక్కటికిఁ దేని దది యేటి సరసురాలు. 102

వ. అని మఱియు బోధింప నంగంబు పులకాంకురానుషంగంబుగా నిజాంతరంగంబునం
బొడము వ్రీడాభరం బుడిపికొని దరస్మితానతముఖాంబుజ యై యెట్టకేలకుఁ జెవి యొగ్గిన
నగ్గజరాజగామినినిన్ బాసి తనరాక కెదురు చూచుచున్న రాజసన్నిధికిం జని తాఁ
బోయివచ్చిన కార్యం బెఱింగించె నంతట దైవయోగంబున విష్ణుదాసునకు
దూరప్రయాణంబు సంభవించె నంత. 103

## విష్ణుదాసుని విదేశప్రయాణసన్నాహము

తే. పయనమున కైనయవి యమర్పంగ నపుడు
పరిచరుల కానతిచ్చినఁ బటకుటీర
పాత్ర సామగ్రి మొదలైన బరువులెల్ల
శకటవామ్యశ్వవృషమహోష్ట్రముల కెత్తి. 104

వ. మఱియుం గలమాన్నంబులుం, గల వంటకంబులుఁ బొంగలి పులియోగిరంబు దధ్యోదనంబు, నానవాలు, జున్నులు, మీఁగడ పెరుగులు, నవనీతంపు ఘుటికలు, నొలుపుఁ బప్పు, నప్పడంబులు, వఱుగులు, వడియంబులుఁ, బెరుగు వడియంబులు, మిరియపుంబొడి, మెంతికూటువ, సంబారంబుఁ, జింతపండులు, బజ్జు, లుసిరికలుఁ, బచ్చ ళ్ళూరుఁబిం, డ్లూరుఁగాయలు, మామిడితొక్కులు, నివి మొదలుగాఁగల పరికరంబులును, మఱియు వడపప్పు, బేడలు వేఁపుళ్ళు, ననుఁప గుగ్గిళ్ళు, బొరుగులుఁ, బొడులుఁ, బాకపుఁ జలిమిడి, కాయమ్ములుం, జిమ్మిరుంటలు, నటుకులు, మూఁగలు, లాజలుఁ, బేలాలుఁ, జిటి కాఱుకులు, నువ్వులు నానబియ్యంబులుఁ బేలపిండిఁ, బ్రేలసత్తు, దోసగింజలు, వెల్లగిసెలు, గోఁగులు, గరింగరుము, లుపిళ్ళు, సెనగపప్పు, బొరుగుపప్పు, సారపప్పు, జీడిపప్పు, బాదంగి పలుకులుఁ, గొబ్బెర, గసగసాలు, ఖర్జూరములు, ద్రాక్ష, లాదియైన ఫలహారంబులును, మఱియు నుండ్రంబులు, మండెఁగలుఁ, గుడుములు, దోసె, లరిసెలు, రొట్టెలు, నిప్ప, ట్లప్పంబు, లతిరసంబులు, సుకియ, లమృతకలశమ్ములు, సోగులుఁ, జక్కెర బుడగలుఁ, గరిజులుఁ, బొరివిళంగాయలుఁ, దేమనంబును, బాలకాయలుఁ, జక్కిలమ్ములు, మినుఁప చక్కిలమ్ములు, మినుప పోకలు, మనోహరంబులు, గారెలు, బూరెలు, మోరుండ, లంగ రొల్లెలు, మణుఁగుఁ బువ్వులుం, బేణీలు, నీరువత్తిగెలు, మడతలుఁ, బప్పు బూరెలు, సజ్జబూరెలు, వడ, లామవడ, లొబ్బట్లు, సారసత్తులు, సేవలుఁ, జిరిమిళ్ళు, సరడాలుఁ, బరిడ గవ్వలుఁ, జాపట్లు, నిడ్డెనలు, తేనె తొలలు, బొరుగులు, నేలకికాయలు, వెన్న మెఱుంగులు, నిడికుడకలు, సడకుడకలు, ముత్తెఁపుఁజిప్పలుఁ, జంద్రకాంతలుఁ, గరిజకాయలు, బెడదలు, లడ్వాలుఁ, గోడబళ్ళు, గూడు పరిగెలుఁ, దెలుపరిగెలుఁ, బూరీలు, గూళ్ళాపిడ, లాదిగాఁ గల భక్ష్యంబులు, గూడలనించి, జాతి సాతానులు గావళ్ళంబూని వెంటనంటిరా, నప్పుడు.105

తే. తనకు నిలవేల్పులౌ తల్లిదండ్రులకును
భక్తితో మ్రొక్కి దన ప్రాణపదము నైన
భార్యతోఁ దెల్పి యక్కునఁ బట్టి చేర్ప
నా వధూటియు నధికదీనాస్య యగుచు. 106

ఉ. ఓ మగరాజ! నీవు చన నొంటిగ నేనిట నుండ నేర్తునే?
నామదిఁ జూడఁగోరి యిటు న న్నలయించెద వంచు బాష్పధా
రామిళితాక్షియై ఘనతరంబగు శోకముఁ జెంద విష్ణుదా
సా మధురోక్తి నూఱడిలుమంచు ముదంబునఁ గుస్తరింపఁగన్. 107

సీ. నీ తావి కెమ్మోవి నిలుచుఁబో! కంచివా
ల్లంటుల మొలపంటి గంటి గుఱుతు
నీ వాలుఁగన్నుల నెఱయుఁబో! నెల్లూరి
కొమ్మల కపురంపుఁ దమ్మరసము
నీ చెక్కుల రహించుఁబో! చెన్నపట్నంపు
వారిజేక్షణల క్రొవ్వాఁడి గోరు
నీ యురస్స్థలి మించుఁబో! యఖిలక్షమా
కోమలాంగుల కుచకుంకుమంబు

తే. లింటనె మెలంగు వారల కీసుఖంబు
లెటులఁ జేకూరు? నని పల్కి హితముఁ జిల్కి
పోయి రమ్మని మోము మోమున ఘటించి
చుంబన మొనర్చి పనిచె నయ్యంబుజాక్షి. 108

వ. అంత. 109

తే. మణిఖచితహేమపంజరమధ్యమునఁ
బ్రేమ నాబాల్యముగఁ దాను బెంచినట్టి
హంసరాజంబుఁ గదియంగ నరిగి, తనదు
పయన మెఱిఁగించి యింటిలో భద్ర మనుచు. 110

క. చెప్పంగఁ దగిన మాటలు
సెప్పి మరాళంబు వనుపఁ జిత్తంబున సొం
పుప్పతిల నిల్లు వెలువడి
యప్పగిదిన్ విష్ణుదాసుఁ డరిగెడువేళన్. 111

తే. ఈడము వళంద బందర యింగిలీషు
కళము మొదలైన పేఁటల గౌరలెల్ల
సౌరభద్రవ్యములు బేరసార మాడఁ
బిలువనంపిరి తమతమపేఁటలకును. 112

చ. అటువలె విష్ణుదాసుఁడు హితావళి గొల్వఁగఁ దోడిబేర మం
దుటకుఁ జనంగ హేమవతి తోడనె శంబరవైరి శాతవి
స్ఫుటచటులోగ్రపంకరుహసూననవీనశరవ్రజంబు హృ
త్పుటమున గాఁడనేయ నృపపుంగవుఁ జేరఁగఁగోరి యున్నెడన్. 113

చ. విలసితమోహదాహపరివేదన పొమ్మని యెత్తు పెట్టఁగా
వలపులవింటివాఁడు నెఱవాదితనంబునఁ ద్రోవఁజూపఁగా
నలమిన భీతి లజ్జ వలదం చరికట్టఁగ నింతి నంతలో
జలజహితుండు గ్రుంకె నల చానవెతల్ కనలేని కైవడిన్. 114

వ. అయ్యవసరంబున. 115

తే. తరణి తురగ ఖురోద్ధూత చరమశైల
గైరికస్థలపాంసువు ల్గప్పె ననఁగఁ
బశ్చిమంబునఁ గుంకుమపంక మటుల
సాంధ్యరాగంబు మించె నిస్తంద్ర మగుచు. 116

ఉ. కాలకలాదమౌళి దినకాంతి హసంతికలోన యామినీ
బాలకు సొమ్ము సేయుటకు భాస్కరుఁడన్ కనకంబుఁ గ్రాఁచి క
ల్లోలవతీవరాంతరములో నిడఁ దోఁచిన ధూమమున్ తమో
జాలము పర్వె, నా రవలచాడ్పునఁ దారలు వొల్చె నెంతయున్. 117

## మొదటిరాత్రి

సాతాని భామిని తేనికడకుఁ బయన మగుట. హంస వారించి బుద్ధిసెప్పుట.

క. అప్పుడు హేమవతి తమి
ముప్పిరిఁ గొనఁ జిత్రభోగ భూపాలునితో
నప్పుష్పబాణకదనము
చొప్పడ నొనరించు వాంఛ చొరఁ దమకమునన్. 118

చ. పరఁగెడు రస్తు కొట్టుడులు భద్రముగా నొగి బీగముద్రలున్
గరిమ నొనర్చి తొత్తులకు గ్రాస మొసంగి నికాయకృత్యముల్
దరలిచి యత్తమామల పదంబుల నొత్తుచు నిద్రపుచ్చి మై
మెఱపుగ శీతలాంబువుల మిన్నగ మజ్జనమాడి వేడుకన్. 119

సీ. మెఱుఁగుఁగుచ్చెలమీఁద జరతారుపని మీఱు
చెంగావిరంగారు చీరఁ గట్టి గుజరాతి జిగిసిస్తు గోట్లదాఁపిన డాలు
రహి మించు పైఠణీరవికఁ దొడిగి
ఘుమ్ముఘుమ్మని తావి గ్రమ్ము చొకాటంపుఁ
గలపంబు సొగసుగాఁ గలయ నలఁది
తళుకుతళ్కునఁ గాంతి చిలుకఁ గుల్కెడు జాతి
మణిభూషణంబులు మమతఁ దాల్చి

తే. తిలక మొగిఁదీర్చి మితభుక్తి సలిపి వెంట
బూమె లెఱుఁగని యొకపాటి బుడుత, యాకు
మడుపు లందీయ మోహంబు మరులు గొల్ప
వెడలె నల భామ నిజకేళివేశ్మసీమ. 120

వ. అటుల వెలువడి. 121

తే. తనదు ప్రాణంబు దైవంబు తల్లి తండ్రి
యనుచుఁ జెలియైన యల రాజహంసమున్న
దివ్యనవరత్నఖచితదేదీప్యమాన
కనకపంజర మొక్కింత గదిసి నిలిచె. 122

చ. నిలిచి దరస్మితంబయిన నెమ్మొగ మించుక వంచి యాత్మఁ దాఁ
దలఁచినకార్యమెల్లఁ బ్రమదంబునఁ దిన్నని కల్కిపల్కులం
దెలిపిన రాజహంస సుదతీమణిఁ గన్గొని పక్షయుగ్మముం
దలఁ గదలించి యందుకు మనంబునఁ జింతిలి యప్పు డిట్లనున్. 123

ఉ. అక్కట! భర్తకాఁపురము నాఱడిపుచ్చి నృపాలమౌళితోఁ
జొక్కి రమించునందులకుఁ జొచ్చినఁ, దావక బంధువర్గముల్
తక్కువ సేతురమ్మ! చరితవ్రతముల్ చెడునమ్మ! జాతికిన్
బక్కున నిందఁ జెంది తలవంపులు దెత్తురఁటమ్మ! మానినీ! 124

సీ. అత్తమామలు గన్న నాఱడిపుత్తురు
బావ పరీక్షింప నేవగించు
మఱఁదులు గాంచినఁ గఱకటి నెంతురు
వదినె లెఱింగిన వాసి చెడును
బంధువుల్ గనినచోఁ బరఁగ నిందింతురు
తోడికోడలు చూడ నాడికొనును
బతి కనుఁగొన్నచోఁ బ్రాణహాని యొనర్చు

వాడవా రెఱఁగిగిన వన్నె దఱుఁగు

తే. నరయ నిదిగాక యన్నిఁట నాఁడుపుట్టు
పుట్టఁ బాపంబు, పుట్టినఁ బుట్టినింటి
కేని మఱి చొచ్చినింటికేన్ గీర్తిఘనతఁ
దేక, యపకీర్తిఁ దెత్తురే? తెఱవ లెచట. 126

క. అగుఁ బ్రాణహాని యపసిరి
యగణిత మగు మానభంగ మహహా! తెలిసెన్
దెగువయె యింద్రపదవి యనఁ
దగు బుద్ధి జనియింపఁబోలుఁ దరుణీ! నీకున్. 126

సీ. పంక్తికంఠుని మోహ పరితాప మెంచెనే
భువనమాత జగత్ప్రపూత సీత
యల పులిందునిఁ బొంద నాసక్తిఁ జెందెనే
ప్రియ హితామితనయ భీమతనయ
నహుషుని విరహంపుఁ దహదహల్ సూచెనే
సాంద్రసద్గుణచర్య యింద్రుభార్య
మఱి సింహబలుని పెన్మాయలఁ జిక్కెనే
యాఱడి పనిఁబూని యాజ్ఞసేని

తే. మునుపటి పతివ్రతలు మహామూర్ఖచిత్తు
లైన దుర్జను లతిఘోరసూనసాయ కాస్త్ర జర్జరితాత్ములై యాసపడిన
మాన ముడిపుచ్చుకొనిరఁటే మచ్చెకంటి! 127

చ. పతిహితభక్తిచే వెలయు పద్మదళప్రతిమాననేత్రకున్
వ్రతముల సోదు లేటికి? ధ్రువంబుగఁ బుణ్యము లబ్బు నెప్పుడున్
బతినిఁ దిరస్కరించి పరభర్తలఁ జెందిన భామ పుణ్యముల్
గతజలసేతుబంధములు గావె? వచింపఁగ నెంత నోచినన్. 128

క. పతిసేవయె భూషణములు
పతిసేవయె జీవనంబు భామామణికిన్
బతిసేవయె సువ్రతములు
పతిసేవయె యిహముఁ బరము భాగ్యము లనుచున్. 129

క. లలి జాగ్రత్స్వప్నసుషు
ప్తులను మనోవాక్శరీరములచే నేవే
ళలనైన సతులు పరపురు
షులఁ గోరిన వన్నెలేదు చూవె! ధరిత్రిన్. 130

క. ఈరీతి హంస పలికిన
నారీమణి చెవుల నవియు నారాచములై
దూఱి చుఱుక్కున నాటినఁ
గ్రూరకటాక్షములఁ గ్రేటుకొని తనుఁ జూడన్. 131

వ. అత్తెఱవ చిత్తం బెఱింగి మరాళం బక్కటా! యిత్తరుణి దుష్కర్మాయత్తతం
బరాయత్తచిత్తవృత్తి యయ్యె, నిట్లగుట మదీయసునీతివాక్యంబులు దీనికిం బరుషంబులై
తోఁచుచున్నవి. సమదమదనప్రదరవేదనాదోదూయమానంబైన దీని మానసంబు

సామంబునం గాని చక్కంబడదని కొంత తడ వంతరంగంబునఁ జింతించి వెండియు నా
రాజహంసంబు హంసగమన కిట్లనియె. 132

తే. మానవతి! నీవు పరసంగమమున కాస
పడఁ దలంచితి వేనిఁ జేపట్టు కొంచె
మైన చక్కని యొక యందగాని తోడఁ
గూడి యాడక, రాజులఁ గోరఁదగునె? 133

మ. అధిపుల్ క్రూరఫణిస్వరూపు లధరం భాసించు టేరీతి? భూ
మిధవుల్ కాలకరాళకీలిసదృశుల్ మేన్మేనఁ బొందించు టె
ట్లు? ధరాధీశులు మత్తదంతిసము, లేలా నీకుఁ జెల్లాట మా
డ? ధరాభృత్కుచ! యిత్తెఱం గెఱిఁగి, వేడ్కన్ గోర్కు లీడేర్చుకో! 134

క. ఇలపతుల చిత్తవృత్తులు
గలయికలం దెలిసి మెలఁగు కాంతల కెలమిన్
జెలు వొనరు జయము చేకుఱు
నలఘు శ్రీసౌఖ్య మబ్బు నంబుజగంధీ! 135

వ. ఇట్లు గావున నిత్తెఱంగునఁ దత్తరంబు లేక నృపవరోత్తముల చిత్తవృత్తి దెలిసి హత్తుకొన
వర్తిల్లు మని హంసంబు ప్రత్యుత్తరం బిచ్చు నవసరంబున. 136

సీ. పిసవెట్టి కసరెత్తి యెసరేఁగు నసగూఁటి
పూఁబోండ్లు తమ యిండ్ల పొంతకరుగఁ
బరుసొమ్ములకు నిమ్మువడఁ గ్రమ్ము నెఱహమ్ము
తస్కరుల్ దిగులొంది తావుఁ జేరఁ
దనరారు సిరిసారు తనివారఁ గలవారు
కనుగూర్కు మదిఁ గోరి కన్నుమూయ
రతిరూపు పసమాపుగతి చూపుగల కాఁపు
గుబ్బెత లెసటికై కుండ లరయ

తే. దూరదేశసమాగతధూర్తపాంథ
జనసమూహంబు పయనంబు సాఁగ లేవ
ఱెక్క లలరించి కుత్తుకల్ నిక్క మించి
కొక్కొరోకో యటంచును గోళ్ళు గూసె. 137

క. తెలతెల నయ్యెను దిక్కులు
పలపల నుడుగణము మాయఁ బాఱెను బక్షుల్
కలకలనఁ గూయఁ జొచ్చెను
దులదులఁ దుమ్మెదలు తమ్మితుటుముల వెడలెన్. 138

తే. అపుడు హేమవతీకన్య హంసనుడుపు
నీతిచాతురి వినురీతి నేర్పు మాని
పడుకటిలు సేరి కళవళపడుచు నిమిష
మొక్క యేడుగఁ బవలెల్ల నొనరఁ గడపె. 139

క. ఉదయోపరి రవి సింహము
మది మీఱఁగ నస్తశైల మత్త ద్విపమున్
బొదువ గమకించి దుమికిన

యదొ యన దినకరుఁడు పశ్చిమాశకుఁ జేరెన్. 140

తే. రసికుఁ డైనట్టి కాలంపు వ్రాతకాఁడు
తనరు బ్రహ్మాండ మను పెద్ద దవతిలోన
శాయి నిండారఁ బోసిన చందముునను
గారు తిమిరంపు గుంపు సొంపారఁ బర్వె. 141

చ. పనుపడ మిన్ననుం గడితపాళెఁ దమంబునఁ గట్టిపెట్టి శో
భనతరచంద్రదీధితులపంక్తి జమాఖరుచుల్ లిఖించి యిం
తనుకొని కాలమన్ గణకుఁ డప్పుడు తీర్చి లిఖించినట్టి యా
దినవహి లెక్కవ్రా లనఁగఁ దెల్విగఁ జుక్కల పర్వె నత్తఱిన్. 142

చ. జలకము లాడి జీని బురుసాపని వస్త్రముఁ గట్టి మోమునన్
దిలకముఁ దీర్చి క్రొవ్విరులు నించి కచాళిని గబ్బిగుబ్బలున్
గలపనులంది గందవొడి గమ్మనఁ బూసి, నృపాలునింటికిన్
జెలియ చనం దలంచె రతిశిక్షకు రెండవనాఁటి మాపునన్. 143

తే. పోవుచో నమ్మరాళంబు పొంత నిల్వఁ
జెలియ పూనిన జిగినీటు కులుకుఁ జూచి
రాజహంసంబు వలికె, నో రాజవదన!
పోయెదవు గాని యుపమతోఁ బొసఁగి చనుము. 144

క. ఉపమ యెఱుంగని వారల
కపరిమితావస్థ లొందు నది యెట్లన న
య్యుపమ యెఱుంగక కాదే
చపలత మున్నొక్క నక్క సమసెన్ బెలుచన్. 145

వ. అనిన విని హేమావతి యిట్లనియె. 146

## రెండవ రాత్రి కథ.

### కక్కుఱితిబడి చచ్చిన నక్క

క. ఆకథ వినియెద నుడువు, సు
ధాకరకలు రాలఁ దేనె ధారలు చిలుకన్
లోకేశ తురంగమ! యన
నా కలికికి రాజహంస మపు డిట్లనియెన్. 147

క. వినవమ్మా! హేమావతి!
కనవమ్మా! స్థూలసూక్ష్మకార్యములు దగన్
మనవమ్మా! నన్నొ చ
క్కని కొమ్మా! మెచ్చుకొమ్మ! కథ విని పొమ్మా! 148

క. విభ్రమమణిమండనమస
నభ్రంకషసౌధకేతనాంశుకజనితా
దభ్రానిలహతగతిజా
తాభ్రమణిహయశ్రమోద మప్పుర మమరున్. 149

క. ఆ పురవరమణిలో గుణ
దీపక నామమున భూమిదేవుం డలరున్
జూపట్టి వేదశాస్త్ర
వ్యాపారముచేత రెండవవిధాత యనన్. 150

సీ. అరఁగులసున్నపుటెఱమట్టి పట్టెలు
దీర్చిన గోడలు తేజరిల్ల
నిండుసున్నపుఁబూత నెఱచాలు బోదెలు
దిద్దిన దేవరమిద్దె దనర
నారికేళపుమట్టతీరుగా నలికిన
ముంగిలి మలెసాల ముద్దుగులుకఁ
బంచవన్నియ మ్రుగ్గు పద్మముల్ నించిన
బృందావనము లోఁగిలందె వెలయ

తే. నుదికిన మడుంగుదోవతు లుంచినట్టి
దండె మౌపాసనము సేయు కుండ మమరఁ
బడలిక లడంచు పసపాకు పంది రలర
నుండు నా బ్రాహ్మణుని గృహం బుత్పలాక్షి! 151

చ. అతనికిఁ జారుశీల యను నంబుజగంధసుగంధి యొప్పుఁ ద
త్సతి తనయుండు లేమిఁ బరితాపముతోఁ గడుఁ బుణ్యభూము లా
యతమతిఁ ద్రొక్కఁ బూర్వసుకృతాంశముచే నొకఁ డుద్భవించె సం
తతశుధాముఁ డప్రతిమధాముఁడు రామగుణాభిరాముఁడై. 152

## బ్రాహ్మణ కుమారుని చదువు సంధ్యలు — తీర్థయాత్ర

వ. అంత గర్భాదాన పుంసవన సీమంత జాతకర్మ నామకర ణాన్నప్రాశన చౌలోపనయన
వివాహ ప్రాజాపత్య సౌమ్యాగ్నేయ వైశ్వదేవ గోదాన స్నాతక పితమేధంబులను
షోడశకర్మంబు లెఱుంగంజేసి. 153

తే. వాని తలిదండ్రు లత్యంతవత్సలతను
బూఁటపూఁటకు గోముచేఁ బొసఁగఁ బెంచి
ప్రాభవం బొప్ప నసమానవైభవమున
ఘనత షోడశకర్మాధికారుఁ జేయ. 154

వ. అంత నత్యంతకుశలస్వాంతంబున నవ్వటుశిఖామమి వేదవేదాంగాది
బ్రహ్మవిద్యాభ్యాసానంతరంబు గానంబును గవిత్వంబును గొక్కోకంబును జూదంబును
దేశభాషల విజ్ఞానంబును లిపిలేఖనంబును జరాచరాన్యధాకరణంబును
విలువిద్యయును సర్వజ్ఞానపరిజ్ఞానంబును శాకునంబును సాముద్రికంబును
రత్నపరీక్షయు నరదంబుఁ బఱపుటయుఁ దురగారోహణంబును గజారోహణంబును
మల్లశాస్త్రంబును బాకచమత్కారంబును దోహదప్రకారంబును
ధాతుగంధరసఖనిజవాదంబులును గుట్టుపనుల వినోదంబు మహేంద్రజాలంబును
జలాగ్నిఖడ్గస్తంభనంబును మొనకట్టును వాకట్టును రయస్తంభనంబును
వశ్యాకర్షణమోహనంబులును విద్వేషణోచ్చాటనసంహరణంబులును
గాలవంచనంబులును బక్షిగతిభేదంబులును యోగవాదంబులును వచనసిద్ధులును
ఘుటికాసిద్ధులును బరకాయప్రవేశంబును నింద్రజాలంబును నంజనభేదంబులును

ధ్వనివిశేషజ్ఞానంబులును దృష్టివంచనంబులును స్వరవంచనంబును
మణిమంత్రక్రియలును జోరత్వంబును జిత్తరువు వ్రాయుటయు లోహకారకత్వంబును
శిలాభేదకర్మంబును గులాలకర్మంబు రథకారకర్మం బును శూర్పకారకర్మంబును జోళ్ళు
నిర్మించుటయుఁ బటకారకర్మంబును నదృశ్యకరణంబును దౌత్యకర్మంబును
వేఁటసన్నాహంబును బేరంబును బాశుపాల్యంబును గృషియు మైరేయంబుఁ
గూర్చుటయు లావుక కుక్కుట మేషాదుల పోరు హత్తించుటయు ననియెడు
చౌషష్టివిద్యలమర్మంబు లెఱింగి యొప్పుచుండు. 155

క. ఈ రీతి సకలవిద్యల
నారూఢిగ నారితేఱి యవ్వటుఁడు సదా
చారస్థితి గంగాయా
త్రారంభవిజృంభమాణహర్షోదయుఁడై. 156

సీ. సకలాతు కుళ్ళాయి యొకయింత కాన్పింపఁ
జుట్టియుండిన పంచె సొంపు దనరఁ
బడెఁడు బియ్యము వండఁ బాటైన తపెల యుం
చిన చిన్నియసిమి దోస్సీమ వెలయ
ముంజిపైఁ గనుపట్టు ముద్దుగాఁ గట్టిన
యంగవస్త్రపుగుడ్డ చెంగులలర
మాంజిష్ఠి గలిపిన మంత్రాక్షతంబులు
పోసిన మారేడుబుఱ్ఱ యమర

తే. ధౌతశాటియుఁ బరిపాటి ధావళియును
వఱల వేదాంతశాస్త్రంబు వ్రాసినట్టి
తాళదళపుస్తకము చంకఁదనరఁ బూని
చనియె గడిదేఱి యా బ్రహ్మచారి మీఱి. 157

క. ఈ లీల సకలపురములు
శైలంబులు నదులు నిధులు శాఖిచయంబుల్
గాలువలుఁ బల్లె పట్టము
లాలోకింపుచును బోయి యవ్వటు వెదుటన్. 158

సీ. ప్రాలేయశైలాధిపాలకసంజాత
కర్పూరధౌతలోకప్రపూత
జలధినాయకుఁ డేలు సరసంపు టిల్లాలు
పటు భగీరథతపఃఫలము మేలు
తారాధ్వఘట్టనోద్ధతవేగకల్లోల
యఘమహారణ్యదావాగ్నికీల
చంద్రశేఖరశిరస్స్థలశుభ్రసుమదామ
చందనకుందేందుసదృశభామ

తే. రంగదుత్తుంగదీర్ఘతరంగసంఘ
ఘుమఘుమధ్వానమేఘనిర్ఘోషనృత్య
దహిభుగుద్వేలవాలాంశుయామనోర్మి
సంగమభ్రాంతి దాభంగ గంగఁ గనియె. 159

మ. కని యభ్యంచితదివ్యతీర్థములలోఁ గౌతూహలం బొప్పఁగా

ఘననిష్ఠారతి మీఱ భైరవున కర్ఘ్యం బిచ్చి సంకల్పమున్
వినతుల్ స్నాన మొనర్చి తత్తటమహోర్వీవాసవిద్యాతివృ
ద్ధనికాయం బొగిఁ దెల్ప జాహ్నవిమహత్త్వంబుల్ వినెన్ భక్తితోన్. 160

వ. అంత నాబ్రాహ్మణకుమారుండును దత్తీరవాసులకు నిజార్చితద్రవ్యంబులు వ్యయంబు
చేసి గో భూ తిల హిరణ్యాజ్య వాసోధాన్య గుడ రౌప్య లవణంబులను దశదానంబులను
దులాపురుష హిరణ్యగర్భ హిరణ్యరథ హేమహస్తి హేమలాంగూల పంచలాంగూల
విశ్వచక్ర కల్పలతా సప్తసాగర రత్నధేను భూత సంఘట్టనంబులను
షోడశమహాదానంబులు చేసి కాశికాపురంబున కరిగె నప్పుడు. 161

సీ. చిత్రకూటసమాన చిత్రకూటవిమాన
భాసురంబు విశిష్టభూసురంబు
వైజయంత వితాన వైజయంత వితాన
భూషణంబు నృపాల భీషణంబు
భాసమాన శశిప్రభాసమాన క్షౌమ
సుందరంబు కిరాటమందిరంబు
సుమనస్సుతోద్దామ సుమనస్సుతారామ
బంధురం బురుశూద్రసింధురంబు

తే. సతతబహువైభవాసదృశప్రభావ
కీర్తిరాజితకుండలీకృతసుధీర
వజ్రమణిదీప్తవప్రాంశువలయలలిత
గోపురంబై రహించుఁ గాశీపురంబు. 162

ఉ. ఆ పుటభేదనేంద్ర దృషదావళి కల్పితగోపురాశిపై
నేపున మాపు ఱేపుఁ జను నిందు దినేంద్రులఁ బర్వఁ దద్ద్యుతుల్
బాపురె! వీనికిన్ గ్రహణబాధ యపర్వములందు నేక్రియన్
బ్రాపిత మయ్యె నంచు మది భ్రాంతి వహింతురు తాంత్రికోత్తముల్. 163

తే. అట్టి పుణ్యస్థలంబున కరిగి వేడ్క
గడలుకొన మణికర్ణికాఘట్టముననుస
నిలిచి జలకచ్ఛమున స్నాననిష్ఠఁ బూని
వెడి మాధ్యాహ్నికక్రియల్ వేగఁ దీర్చి. 164

క. మణికర్ణిక మణికర్ణిక
మణికర్ణిక యనుచు నుడువు మనుజుల కెల్లన్
గణనాతీతపు దోషము
లణఁగి శతక్రతుఫలంబు లగునని తలఁచెన్. 165

వ. అంతట నవ్వటుశిఖామణి నమకచమకంబుల రుద్రన్యాసయుక్తంబుగా విశ్వేశ్వరు
నభిషిక్తుం జేసి పూజించి ప్రదక్షిణనమస్కారంబులు గావించి యిట్లని స్తుతియించె. 166

సీ. జయ భక్తమందార! జయ దుష్టజనదూర!
జయ జగదాధార! శరణు శరణు
జయ నిత్యకల్యాణ! జయ భృత్యసంత్రాణ!
జయ రమాధిపబాణ! శరణు శరణు
జయ గోత్రపుత్రీశ! జయ రక్షితసురేశ!

జయ పంచశరనాశ! శరణు శరణు
జయ శరద్ఘనగాత్ర! జయ పావనచరిత్ర!
జయ కేందుశిఖినేత్ర! శరణు శరణు

తే. జయ నిశితశూలసాధన! శరణు శరణు
జయ మఖామోఘనాశన! శరణు శరణు
జయ హయాకృతనందీశ! శరణు శరణు
జయ మహాదేవ! విశ్వేశ! శరణు శరణు. 167

సీ. శ్రీపార్వతీకుచశిఖరిస్థలవిహార!
హారాయమానమహాభుజంగ!
జంగమస్థావరసంచారసమభావ!
భావజరూపప్రభావహరణ!
రణరంగనిర్జితరౌద్రమహాసుర!
సురయక్షసేవితచరణయుగళ!
గళదరస్థాపితకాలకూటక్షీర!
క్షీరాబ్ధిపుత్రీశఘోరబాణ!

తే. బాణనామకరాక్షసత్రాణదక్ష!
దక్షకల్పితయాగవిదారణోగ్ర!
[1]యుగ్రభీమాదినామధేయప్రసిద్ధ!
సిద్ధబయభంగ! కాశి విశ్వేశలింగ! 168

క. అని సన్నుతించి వేడ్కలు
గొనలొత్తఁగ బ్రహ్మచారికుంజరుఁడు క్రమం
బున దేవతాధివాసము
లనువొందఁగఁ గాంచి భక్తి యలమిన మదితోన్. 169

క. డుంఠి గణాధ్యక్షుని శితి
కంఠుని భైరవునిఁ జండికన్ బటు విద్వ
త్కంఠీరవ మపుడు మహా
కుంఠితతాత్పర్యమునను గొలిచి భజించెన్. 170

వ. తదనంతరంబునఁ బంచక్రోశంబునం గల మహాదివ్యలింగంబుల సేవించి యచ్చోటు వాసి
తైర్థికజనహితసమ్యగయగు గయకుఁ జని గదాధరుం గొనియాడి ప్రయాగ కరిగి
త్రివేణీసంగమంబునం గృతస్నానదానాద్యనుష్ఠానుండై మాధవు నారాధించి
సప్తపర్ణపటంబుం గనుంగొని త్రివేణీతీర్థంబులు నించిన కావడిఁ గైకొని పంచక్రోశంబున
నొక్కమరకతలింగంబు సంగ్రహించి నిజస్థానగమనోన్ముఖుండై. 171

సీ. కావడిపై నంటఁగట్టిన యొక కావి
శాటి కంబళి యాత్రసంచి యలర
నేతి లడ్డిగ నీళ్ళు నించిన సొఱకాయ
బుఱ్ఱ లిర్వంకలఁ బొసఁగి యుండ
నెగనెత్తి కుఱుచగా బిగియఁగట్టిన పంచె
పై బిగించిన ప్రాఁతబట్ట యొప్ప
ముఖఘర్మములఁ డోసి మునుఁగఁ జుట్టిన పల్లె
కొనలు మారుత లౌల్యమున హరింప

తే. గమనజవమున నల్లాడు కావడదరి
కిల్లుకిల్లని భుజమునఁ గేళి సల్ప
గౌడరుద్రాక్షమాలికల్ కంఠసీమఁ
దనర వచ్చెను వేడ్క నత్తైర్థికుండు. 172

క. ఈ రీతిఁ దన గృహంబున
కారయఁ జనుదెంచి కావ డటు దించి మహా
ధీరుఁడు జననీ జనకుల
కారూఢిగ సంఘటించె సాష్టాంగమ్ముల్. 173

క. తత్సమయంబున వారలు
వత్సా! మఱి యాత్ర సలిపి వచ్చితె? యని యు
ద్యత్సంతోషంబునఁ దమ
వత్స స్థలిఁజేర్చి ప్రేమ వర్ధిలి చెలఁగన్. 174

తే. శిరము మూర్కొని వదనంబు చెమటఁ దుడిచి
యాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి
గాను దీవించి యత్యంతకరుణ మెఱయఁ
గొడుకు తోడను నిట్లని నుడివి రపుడు. 175

క. ఏ యే పుణ్యస్థానము
లే యే తీర్థస్థలంబు లేయే ద్వీపా
లేయే భూములు సూచితి
వాయా మహిమలు వచింపు మర్భక మాకున్. 176

క. అని యడిగిన తలిదండ్రుల
కనునయమునఁ గాశి గయ ప్రయాగము మొదలౌ
ఘన పుణ్యక్షేత్రంబులు
గని వచ్చితి, లింగ మిదిగొ! కౌతుక మమరన్. 177

క. ఈ పురవరమణి చెంగట
నీ పరమేశ్వరుఁ బ్రతిష్ఠ నెంతయుఁ జేతున్
దాఁపురము మోక్షలక్ష్మికిఁ
గాఁపుర మభివృద్ధిఁ బొందుఁగద మన కనియెన్. 178

తే. పుత్రకుని వాక్యవిస్ఫురద్బోధమునకుఁ
దల్లిదండ్రులు సంతోష ముల్లసిల్ల
నపుడు పాషాణభేదుల కర్థ మిచ్చి
ఠీవి నొక దేవళంబుఁ గట్టించి రపుడు. 179

సీ. డంబైన గర్భగృహం బంతరాళికం
బును ముఖమంటపంబును జెలంగ
గాలిమంటపము ప్రాకారంబు లోపలు
బోదెలు చుట్టలు పొందు పడఁగఁ
గప్పట చట్టముల్ ఘన గోపురమ్ములు
జగతియుఁ జప్పటల్ సొగసు గులుక
గచ్చుగోడలు ఔాతికంబముల్ పాలను

న్నము సువర్ణము ద్వారసమితి వెలయ

తే. దృష్టిపాత్రపు బొమ్మలు తేజరిల్ల
నుఱుకు సింగంబు లరగూళ్ళు మెఱుఁగుఁ దోర
ణములు చిత్తర్వు క్రొంబనుల్ రమణ కెక్క
దేవళము మించె నత్యంతదివ్య మగుచు. 180

క. ఆ దేవళంబులోన మ
హాదేవుని నొక్క దివ్యమగు శుభవేళన్
బాదుగఁ బ్రతిష్ఠ చేసిరి
వేదాగమశాస్త్రరీతి వేడ్క దలిర్పన్. 181

సీ. చెఱఁగు దోవతి పైనిఁ జీరాడఁగా బోడి
తలచుట్టు ధౌతవస్త్రంబు మెఱయఁ
జెక్కులకును దిగి పెక్కటిల్లు విభూతి
పెండెకట్లు లలాటభిత్తి నమర
గళమున నులిగొన్న కావిదారముతోడి
రుద్రాక్షమాలికల్ రూఢిఁ దనర
మారేడు బుఱ్ఱలో మక్కళించిన సందిఁ
గట్టిన చంద్రశేఖరుఁడు వెలయఁ

తే. బెట్టె మూఁకుడు లోపల బిల్వపత్రి
మట్టి ధూపార్తి దీపముఁ బెట్టు చమురుఁ
బొందుపఱచుక మునిమాపు పూజసేయఁ
గ్రొత్త కాణాచి తంబళి హత్తుకొనియె. 182

క. ఈ తీరున నల తంబళి
భూతేశుని పూజ సేయఁ బుష్పంబుల సం
ఘాతముఁ గొని తేలేమని
యా తట్టున నొక్కతోఁట నమరఁగఁ జేసెన్. 183

సీ. సంపెఁగల్ మొల్లలు జాజులు గన్నేర్లు
విరజాజులును మంచి కురువకములు
పొద్దుదిరుగుడు పూల్ పొన్నలు మల్లెలు
పారిజాతములు సేవంతి విరులు
తామరల్ సూర్యకాంతమ్ములు కల్వలు
బొండుమల్లెల పొదల్ పొగడ తరువు
లల్లి పువ్వులును నంద్యావర్తములు వాడ
గన్నేరులు తురాయి గట్టిపూలు

తే. మాచిపత్తిరి గగ్గెర మరువము కురు
వేరు దవనమ్ములును వట్టివేళ్ల గుములు
బిల్వవృక్షము లాదిగాఁ బేరుగలవి
ప్రబల నొక తోఁట వేయించి బావిఁ ద్రవ్వె. 184

మ. అమితానర్ఘ్యనిబద్ధశుద్ధశశికాంతాయామసోపానసం
గమ, మంబుగ్రహణాగతోరుపథికాక్రాంతస్ఫురత్కుట్టిమం

బమలాంభోరుహషండపాండుకుముదాచ్ఛామోదసంవాసితం
బమృతప్రాయజలాభిపూర్ణ మగుచు న్నాబావి యొప్పుం గడున్. 185

క. అబ్బావికిఁ జేయేతం
బుబ్బుచుఁ దంబళి యొనర్చి యుత్సాహంబున్
గుబ్బతిలఁ గొన్ని చెట్లకు
నిబ్బరమున జలములెత్తి నిస్త్రాణుండై. 186

తే. ఎలమి మఱికొన్ని చెట్టుల కెత్తి యెత్తి
యలసి ముంగిసమ్రానితో నానియుండఁ
గుండ నిండారఁగా ముంచి కూడుదినఁగ
నింటి కేఁగెను బడలిక లంటి పెనఁగ. 187

వ. అంత నొక్క బక్క నక్క గుక్కు మిక్కనుచు డొక్కం బిక్కటిల్లిన క్షుధానలంబున
దందహ్యామానంబై డస్సి. 188

తే. పుట్టలను దిట్టలను జెట్లఁ బొట్ల గట్ల
వంకలను డొంక లను బీళ్లఁ బాళ్ల ఱాళ్ల
గుప్పలను దిప్పలను మళ్ల గుళ్ల నూళ్ల
దిరిగి యాహార మందక సొరిగి యరిగి. 189

సీ. వాణికై పోరాడవచ్చి యెందఱు బ్రహ్మ
దేవుల మనువారు తీఱి చనిరి
పార్వతీ రతులకై బహుపోరి యెందఱు
రుద్రుల మనువారు రోసి చనిరి
సిరినిఁ జేపట్టఁగాఁ జేరి యెన్ని దశావ
తారముల్ కలహించి తీఱిపోయె
శచి మాఱుమనువు రచ్చలఁబెట్టి యెందఱే
నింద్రుల మనువార లేఁగి రహహ!

తే. చూడ నవియెల్ల యుగచర్య సుద్దులయ్యె
బోయెఁగాలంబు పూర్వవిస్ఫురణ దప్పె
దార్ఢ్య మాలోచనము తెల్వి తగ్గుపడియె
నౌర! విధి నేఁటి కిట్లాయె ననుచు నడరి. 190

తే. ప్రాము జఠరాగ్నిచేఁ “గింకరోమి” యనుచు
నడరు వేదనచేఁ “గ్వ యాస్యామి” యనుచు
విస్మయపు మూర్ఛచే “నాహతొఽస్మి” యనుచుఁ
బలుపరింపంగ సాగె నబ్బక్క నక్క. 191

వ. ఇట్లు క్షుధాతురత్వంబునఁ గంఠగతప్రాణంబై నోరం దడిలేక మాటిమాటికిఁ బొడము
మూర్ఛల నలసి సొగయుచు మెత్తమెత్తగా వచ్చి తత్కూపతటస్థితద్రోణికాగ్రంబున నున్న
యల్పజలంబులం దన కంఠంబు దడిపికొని యయ్యేతంబు ముంగిసమ్రానికి వెదురునకు
నంటఁగట్టిన వారు పరిమళం బాఘ్రాణించి దోనింబడి చని నేఁడీపశుకృత్తి రజ్జువున
క్షుధాభరంబు హరించెద నని తలంచి, యుబ్బుచు నెక్కొను తమకంబును ముంగిసమ్రాని
పైకిఁ జివుక్కున నెక్కి యబ్బక్క నక్క దారువేణు బంధనంబగు చర్మరజ్జువుం దెగం
గొఱికిన. 192

తే. మ్రాను మీటుగ నెగయ గోమాయు పప్పు
డేకతాళప్రమాణ మట్లెగసి కూన
గుంతలోఁ బడి గుడ్లు వెల్కుఱుక నాల్క
నడుము గఱచుక నఱచుచు బెడసి మడిసె. 193

వ. అట్లు క్షుధాతురత్వంబున నాహారంబె చూచెఁ గాని తన చేటుఁ దెలియ దయ్యె. నీవా నక్క తెఱుంగున రాజసంయోగంబె చూచెదవు గాని యితరోపద్రవంబులు విచారింప వయిన నిత్తెఱంగునఁ జిత్తంబునఁ దత్తరంబు లేక తెలిసి మెలంగుమని హంసంబు నయోక్తులు పలుకు సమయంబున. 194

చ. అలమినవేడ్క ఘోష కనకాంగులు మజ్జిగఁ జిల్క, గాఁపుఁగూఁ
తులు తెలియావనాళములు ద్రొక్కఁగ జారగభీరనాయికల్
నిలయముఁ జేరఁ దస్కరులు నెక్కొను భీతిని దావులెక్కఁగాఁ
జెలఁగుచు వేగుఁజుక్క పొడిచెన్ బలసూదను దిక్తటంబునన్. 195

క. అంతట హేమావతి గే
హాంతరమున కేఁగి పార్థివాయత్తమతిన్
గంతు సుమకుంతదళిత
స్వాంతంబున నా దినాంతసంతమసమునన్. 196

చ. కలపము గబ్బిగుబ్బలను గమ్మను పూలసరాలు కొప్పునన్
గులికెడి చంద్రకావి నెఱికుచ్చెలఁ దీరినకోక శ్రోణినిన్
దిలకము మోమునన్ మణులఁ దీరిన సొమ్ములు మేన వేడుకన్
వెలయ నమర్చి మేల్ముసుగు వేసి నృపాలుని కేళిఁ దేలఁగన్. 197

## మూడవ రాత్రి కథ

### నాయకుని భార్య హేమరేఖ గుప్తగుణుఁడను వైద్యునిఁ గూడుట

క. కలహంసోజ్జ్వలరత్నశ
కలహంసకయుగము ఘల్లుఘల్లని మ్రోయన్
గలహంసగమన చనఁగాఁ
గలహంసము హేమవతిని గని యిట్లనియెన్. 198

ఉ. ఇంకొక గాథ కద్దు విను మింతటిలోఁబడి పాటిపోవఁ డో
పంకరుహాయతాక్షి! యుపభర్తల హత్తుక తత్తరాన మీ
నాంకుని కేళిఁ దేలఁగఁ జనంగ నొకానొక మాటవచ్చినన్
బొంకఁగ “లేదు బంతి” యని బొంకవలెన్ గులటావధూటికిన్. 199

క. అని రాజహంసమణి ప
ల్కిన హేమావతి వినోదకేళిగతి గిరు
క్కున మరలివచ్చి యా కథ
వినియెద ననుఁబొందఁ దెల్పు విహగోత్తంసా! 200

వ. అని యడిగిన హేమావతికి హంసం బిట్లనియె. 201

క. విను మనఁగా ననగా నొక

కనకోజ్జ్వలకూటఝూటఘనగోపురశో
భనకృతకదరీకృతనా
కనగరి మణిభద్రపురము గల దొక భూమిన్. 202

క. ఆ నగరము భోగప్రతి
భానగరిపుఁ డైన మానిభద్రుఁడు భద్రా
నూనచరిత్రుఁడు కాంతిసు
ధానిధి నృపు లెంచ శాశ్వతమ్ముగ నేలున్. 203

తే. అతని చెంగట నసహాయుఁ డనెడువాఁడు
చండదోర్దండమండితమండలాగ్ర
దండితారాతి, "రిపుతలగుండు గండఁ"
డనెడి బిరు దొంది తిరుగు నాయకులలోన. 204

## నాయకుని ఆయుధములు, పరిశ్రమ

సీ. భిండిపాలాసి కోదండ భల్లాతక
నారాచ రోహణ నఖర వజ్ర
ముష్టిముద్గర శూల ముసల భుసుండిక
ప్రాస ప్రకూర్మ కర్పట కటారి
కాగ రాయోదండ కణయ కుంతాంతళ
పరశు తోమర చక్ర పరిఘ పట్టి
సములు వంకిణీకాది సబలంబు చివ్వీఁటె
సెలకట్టె యాదిగా నిల నుతింపఁ

తే. దనరు ముప్పది రెం డాయుధములు మఱియుఁ
జిఱుత చెయ్యమ్ము గండకత్తెర తుపాకి
గొరక నుసుగాలమును గ్రద్దగోళ్లు బుట్టె
చూరి బాణా ధరించు న వ్వీరుఁ డెపుడు. 205

వ. వెండియు నవ్వీరుండు సమదండ, గజదండ, భృంగిదండ, యెడమ వరభృంగి, కుడి వరభృంగి, భృంగిపటలము, పయిసరపుదండ, సింగంపుదండ, పొదలికదండ, యడుగడుగు పొదలికదండ, మద్దెలసంచుదండ, కుక్కుటపుదండ మొదలుగా గల పదిరెండు దండల యఖండపాండిత్యంబుఁ దెలిసి యెడమడుగు పరువడి, కుడియడుగు పరువడి, కదలు పరువడి, దాఁటడుగు పరువడి, కోపు పరువడి, ఆంత్రటీక నాట్యము, ధారు ధాణు థోడ, ఉరుథోడ ఝూటుధాణు, కపాలు, ధారుక, ధారుక ధాకు, రాణుధాకు, ఝూటు నివి మొదలైన పదునాలుగు విసరుల మర్మంబులుం జూచి, కక్కి కొక్కిస డొక్కెర ముత్తైన డొక్కెరము కుమ్మరింపు బోడింపు సందు సీసంబును గొంతుమారును సమసంబును సురాటంబును జేవయుఁ గందనంబును గల్లంబును దొట్టును గిర్ణయుం బరిబొంచుటయు రొండివేటును ఫణంబును గన్నాతును భారంబును చొంగిణియుఁ బెట్లాగును దూణింపును సరిచిత్తరంబును లాగును విట్టాలయంబును దిణింగిణియుఁ బాదనివారణంబును బాదగళాప్తియు గళకత్తెరయుఁ గాసె నిల్కడయు నృసింహంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి, యొంటి యడుగు కత్తెర, సర్వబంధ కత్తెర, పొదలిక కత్తెర, చిట్టడుగు కత్తెర, పావుపావులు, జాగినపావు మొదలుగాఁగల పదిరెండు పరువళ్ల యగణ్యప్రావీణ్యం బెఱింగి, హరిగతి, గజగతి, వ్యాఘ్రగతి, మహిషగతి, జంబుకంబుగతి, మర్కటగతి, మార్జాలగతి, హరిణగతి,

చటకగతి, పక్షిగతి, తాండవగతి, నరగతి మొదలైన పదిరెండుగతుల
యవార్యచాతుర్యంబు నేర్చి, విష్ణుచక్రంబును రామబాణంబును నాగబంధనంబును
దొలకరి మెఱుపును అల్లిమత్తును విస్సందును హస్తాభరణంబును బదఖండనంబును
బరిత్రాడును లోబిత్తరి వెలిబిత్తరి సర్పాంకుశంబు మొదలుగాఁగల పదిరెండు
కాయమానంబుల భేదంబులు విచారించి లోమొన వెలిమొన యుసిమొన ఘుమ్మొన
చతురమొన పుణ్యమొన పాపపుమొన చాటడుగుమొన కదలుమొన అరమీటుమొన
నెఱమీటుమొన సరితాళంపుమొన యాదిగాఁగల పదిరెండుమొనల నాఱితేఱి లోవెలి
గజ్జదుముకు చూరణనఱకు మొదలగు నఱుకుల దగులుం గనుంగొని దండనిల్కడ
కదలు తుటుము కలయిక మెలఁకువ కింగళింపు దిశాపదిశలు పాదపుపారువ
హస్తపుపారువ దేహపుపారువ నయనపుపారువ వివరాకడ ఎకసరపైసర
భృంగిపటలము ఝుంపు టెక్కు కరలాఘవంబు లాదియౌ షోడశోపవీతంబుల రీతులు
నేర్చి భ్రాంతంబును ద్రాంతంబును ఆప్లుతంబును ఆవిష్కృతంబును ఆప్టికంబును
ఆకరంబును అవికరంబును మిశ్రితంబును మానుషంబును నిర్మర్యాదయు విచిత్రంబును
ఛిన్నంబును సవ్యజానువు ఆపసవ్యజానువు క్షిప్తంబును ధృతంబును గుడంబును
లంబనంబును సవ్యబాహువు వినీతబాహువు త్రిబాహువు సవ్యోత్తరంబును
ఉత్తరంబును తుంగబాహువు సవ్యకరంబును బ్రథితంబును యౌధికంబును
అపృష్టప్రహారంబును వల్గితంబును స్వస్తికంబు లనెడి ద్వాత్రింశత్ప్రచారంబులు
విచారించి యవక్రపరాక్రమంబున సాటి లేక మెలంగు మఱియును. 206

ఉ. సాదనమేలు, చెంపపయి జగ్గుగ వ్రేలు రుమాలు, మీసముల్
మీఁదను జీరుకేలు, జిగిమించఁగఁ గప్పినశాలు, వైరులన్
వాదులగెల్చువాలు, చెలువంబుగఁ దాల్చినపూలు నొప్పఁగా
నా దొరయొద్ద సంబళిక లందుచునుండు నతండు ధీరతన్. 207

తే. అతని కులభామ గుణధామ యలఘుకామ
యతులితారామ యసమరూపాభిరామ
వదనజితసోమ యధికలావణ్యసీమ
హేమరేఖాసనామయై యింతి వెలయు. 208

ఉ. కన్నులచందమున్ నగుమొగంబు విధంబును గళ్కిపల్కులుం
జన్నులపొంకమున్ నడుముచక్కదనంబును బాహులందముం
బెన్నెఱిగుంపు సోయగము బిత్తరి యా చెలియందకాక యే
కన్నియలందుఁ గల్గిన మెగాదిగ చూడమె మూడులోకముల్! 209

సీ. జల్లి మాటలుగాక సరిచేయవచ్చునే
సవరంబు లీ శిరోజాతములకుఁ
మూఁతసుద్దులు గాక పోల్పంగవచ్చునే
చందనం బీ మేనిగంధమునకు
మాటమాత్రముగాక దీటుగావచ్చునే
గగన మీ నడుముసోయగమునకును
వదరుపల్కులుగాక తుదిసాటివచ్చునే
కిన్నెరకాయ లీ చనుఁగవకుఁ

తే. చక్కఁదనమెల్ల ముల్లెగా సంతరించి
బ్రహ్మదేవుండు తన నేర్పు ప్రౌఢిచేతఁ
దీర్చి సృజియించెఁగాఁబోలు దీని నసఁగ

వీటఁజరియించు నొక్కొక్కవేళ నదియు. 210

తే. దానిఁ దనివారఁ జూడని మానవుండు
చూచి తలయూఁచి మెచ్చని సుజనవరుఁడు
మెచ్చి విరహా ర్తినొందని మేటిఘనుఁడు
కలుగఁ డెందైన మూఁడులోకములయందు. 211

క. మదమొదవు కోడెవిటులకు
హృదయపుటాంతరములోన హేమాహేమిన్
బదివేల మన్మథులు పు
ట్టుదు రా సీమాటి కుచపటుత్వముఁ గన్నన్. 212

వ. అది మఱియును. 213

తే. బిడ్డపాపలఁ గని పెంచు జిడ్డులేక
తిండిచేఁ గండమెండైన దండికతన
నెసఁగు నసగూఁటి పిసవెట్టి కసరు రేఁగి
జారవాంఛావిహారంబు సలుపసాఁగె. 214

చ. విటులకుఁ గొంగుబంగరము, వేడుకకాండ్రకుఁ బట్టుగొమ్మ యు
త్కటతరమన్మథార్తులకుఁ గల్పకుజంబు, భుజంగకోటికిన్
ఘటితనిధానసీమ, యుపకాంతుల చేరువపంట, జారస
త్పటలికిఁ బంచదార యను దానివిలాస మయారె! యారయన్. 215

సీ. కుఱుమాపు మైనున్న కఱలచీరటువిప్పి
చెలువైన సరిగంచు చీరఁ గట్టు
మెఱుఁగంచుకమ్మలు దొరయవం చటుడించి
మణుల రంజిల్లు కమ్మలు ధరించుఁ
[2]జిటి పొటి సొమ్ములు దీసి మెఱుంగు కట్టాణి
పూసల హారముల్ పొసఁగఁ దాల్చు
గుత్తంపు రవికఁ దా హత్తకుండఁగఁ జేసి
కలపంబు కులుకు గుబ్బలను బూయు

తే. నడర బెడఁగైన నిడువాలు జడ సడల్చి
కుప్పె గన్పడ సవరంపుఁ గొప్పుఁ బెట్టు
మరియు ముంగిట నిలుచుండి మొలకనగవు
లెసఁగ విటభాగ్యరేఖ యా హేమరేఖ. 216

చ. కిలకిల నవ్వు, మోవి పలుగెంటుల దీటుఁ గుచంబులోరఁగా
వెలువడఁ బైటవేయు, నెఱవింతగఁగేరు, మరుల్కొనంగ, బె
ళ్కులు గొనఁజూచు, లేని వగలుంగొని, మాటికిఁ గుల్కుఁ, గోటి చి
మ్ములు నొనరించు నవ్వెలఁది మోహపుఁబ్రాయమువానిఁ జూచినన్. 217

సీ. ఏటినీటి కటంచుఁ బాటిపంటెత్తుక
పలుమాఱు దిరుగు నిబ్బరముతోడ
రోలు రోకలికంచు రూఢిగా నిల్లిల్లు
దిరుగు నేప్రొద్దుఁ దత్తరముతోడఁ
గూరగాయల కంచుఁ గోరి తా బాజారు

కును మఱిమఱి నేఁగుఁ గొమరుతోడఁ
బరిలేని పనిజోలిఁ గొని వాడవాడలఁ
జరియించు సారె కచ్చెరువుతోడఁ

తే. బోలికల నెంచు వలరాచ పొగరు నిగుడఁ
గులుకుఁ బ్రాయంపు నెఱనీటు కోడెకాండ్ర
గమికిఁ దన జగ్గు జిగి సంచకార మొసఁగి
వలపు రెట్టింప మెలఁగు నవ్వనజగంధి. 218

క. తన కంటికిఁ బ్రియమయ్యెడు
ఘను నొక్కని వెంటనంటి కౌతుక మొప్పన్
మనసంటి కౌఁగిలింపక
చన దింటికి దాని బల్వ్యసన మేమంచున్!219

సీ. ఆసువోసెడు దాని హస్తంబురీతిని
గుంచె దీసెడు దాని కొమరు మిగుల
జడ చిక్కు దయ్యంబు చందంబునను జెట్టు
విడిచిన భూతంబు కడఁక తోడ
మద్దెలలో నెల్క మర్యాద, నర్థార్జ
నాసక్తిఁ దిరుగు సన్న్యాసిమాడ్కి
వల్లంబు పోనాడు వైశ్యుని తేవను
గాలు గాలిన పిల్లి క్రమము దోపఁ

తే. గంతుమాయల నుమ్మెత్తకాయఁ దినిన
వెఱ్ఱితెఱఁగున వ్యసనంపు వెఱ్ఱి వొడమి
చికిలి నెఱ వన్నెకాండ్రకు సివములెత్త
నెవనసి చరియించు వీఁట నాహేమరేఖ. 220

క. ఈ లీలఁ బురము లోపల
మేలౌ ప్రాయంపు రూపు మీటగు బారిం
జాలి భయ లజ్జ లన్నియుఁ
దూలి చనన్ వెన్నుఁ జఱచి తొలఁగక కలయున్. 221

వ. ఇత్తెఱంగున. 222

చ. చవిఁగొని జారవీరరతిసౌఖ్యము దెప్పలఁదేల నెప్పుడున్
దివురుచు మోహవార్ధిని మునింగి యొకానొక కాలమందునన్
శివశివ! కాపురంబుపయిఁ జింత యొకింతయు లేక చిత్తసం
భపు నిజమాయ గప్పి కలఁపం దలవాకిట నుండు నెప్పుడున్. 223

శా. ఈ మర్యాదను గొన్నినాళ్ళు చనఁగా హెచ్చైన కార్యానకై
భూమీశుం డొకనాఁడు పొమ్మనినచో ఫూత్కారుఁడై యాగతిన్
"స్వామీ! కట్టడఁజేసితే" యనుచుఁ "జీ! జన్మం బిదే" లంచుఁ జిం
తామగ్నముఁ జెంది మందిరములోనం జేరి పెండ్లాముతోన్. 224

వ. అసహాయుం డిట్లనియె. 225

తే. భూవరుం డొక్క పయనంబు పొమ్మటన్న

మంచిదని వచ్చితిని సమ్మతించి నేడు
సంబళము, కంబళము, కత్తి, చద్ది, చల్ల
డంబు, కేడెండు, ధట్టి తెమ్మంబుజాక్షి! 226

క. అని పల్కరించి నప్పుడె
ఘనకుంతల "తొడుసువాసెఁ గదరా" యని యిం
పొనర నవి యిచ్చి పనిచినఁ
జనె నాతఁడు పయనమయి విచారముతోడన్. 227

వ. అట్లసహాయుం డరిగిన పిమ్మట. 228

క. ఆ హేమరేఖ మదిఁగల
మోహావేశమునఁ దోడి ముద్దియ తోడన్
బాహా బాహిఁ బెనంగెను
సాహోయని కంతు పాదుశహి రహిఁ గేరన్. 229

చ. పొలుపగు మావి లేఁజిగురు పొందక పోఁతపిరంగిలోన నె
క్కొలిపిన పుష్పగుచ్ఛమను గుండు పరాగపు మందునించి వె
గ్గలపుఁ బరాక్రమాగ్నిఁ గొని కంతుఁ డనేటి పరంగి భామగు
బ్బలనెడు దుర్గముల్ పగులు వాఱ గుభిల్లున నేసి యార్చినన్. 230

క. అళుకుచు మూర్ఛిలి తెలుసుక
కళవళ పడి లేచి మనసు గాసిల్లంగా
భళిరా! యని వెలువడి తన
నెళవరులను జూచికొనుచు నిలుచున్నంతన్. 231

## వైద్యుఁడు - వాని పరిశ్రమ

చ. మెలివడు తీఁగచుట్ల జిగిమించిన పాగ జినుంగు పచ్చడం
బలవడు చల్వదోవతి యొయారపు గందపుఁబూఁత డొల్లుపోఁ
గులు మణిముద్రికల్ వలపుగుల్కెడు వీడ్యము చలకవత్ర మం
ఘ్రులతుద ముచ్చెలున్ వెలయ గుప్తగుణుండను వైద్యుఁ డొప్పుగన్. 232

తే. వైద్య మాత్రంబునన కాదు, వజలునట్టి
నిరుపమాకారసౌష్ఠవస్ఫురణచేత
నాశ్వినేయులతో నైన నతఁడు వాదు
కెదిరి యోజింపకయె జవాబీయఁ గలఁడు. 233

వ. మఱియు నశ్వగంధాదిఘృతంబును నైలేయకఘృతంబును షట్పలఘృతంబును
దూర్వాదిఘృతంబును బంచగవ్యఘృతంబును నార్ధ్రకఘృతంబును
గదలీకందఘృతంబును గల్యాణఘృతంబును దండులీయక ఘృతంబును
గూశ్మాండఘృతంబును మొదలయిన ఘృతంబులు సేయు నేర్పునుఁ
బంచాగ్నిచూర్ణంబును జిత్రకాదిచూర్ణంబును బడబానలచూర్ణంబును
మాణిమండచూర్ణంబును మరీచ్యాదిచూర్ణంబును దాళిసచూర్ణంబును
నేలాదిచూర్ణంబును దుంబురుచూర్ణంబును గర్పూరాదిచూర్ణంబును
బంచబాణచూర్ణంబును భుగ్వాదిచూర్ణంబును నాదియైన చూర్ణంబు లొనరించుచు
నుపమయుఁ జించిల్యాదిలేహ్యంబును క్షుద్రాభయాదిలేహ్యంబును

జతుష్షష్టిమరీచ్యాదిలేహ్యంబును గుసుమార్ద్రాదిలేహ్యంబును చిప్పల్యాదిలేహ్యంబును బిల్వాదిలేహ్యంబును గుండల్యాదిలేహ్యంబును మొదలుగా గల లేహ్యంబు లొనరించు నైపుణ్యంబును నారికేళాదిరసాయనంబును గుడనాగరాదిరసాయనంబును శిగ్రుపుష్పరసాయనంబును జాతఫలరసాయనంబును సుకుమారరసాయనంబును భల్లాతకీరసాయనంబును సుదర్శనరసాయనంబును వారాహీరసాయనంబును విళంగాదిరసాయనంబును నమృతరసాయనంబును నాదిగాఁగల రసాయనంబులు సేయు పొందిక లెఱుంగువిధంబును శరపుంఖాదితైలంబును లక్ష్మీనారాయణతైలంబును లావాడతైలంబును ధన్వంతరితైలంబును బంచార్కతైలంబును బాశ్చాత్యనింబతైలంబును విషముష్టితైలంబును కేతకీతైలంబును స్నేహార్కతైలంబును వాతాంతకతైలంబును బూతికాతైలంబును భూనాగతైలంబును భృంగామలకతైలంబును మొదలగు తైలంబుల పరిజ్ఞానంబును నారికేళాంజనంబును సౌవీరాంజనంబును వీరభద్రాంజనంబును నీలాంజనంబును గరుడాంజనంబును గపోతాంజనంబును గర్పూరాంజనంబును మొదలుగాగల యంజనభేదంబులఁ గూర్చు చమత్కారంబును నగ్నికుమారకము రాజమృగాంకము పూర్ణచంద్రోదయము వసంతకుసుమాకరము వాతరాక్షసము చంద్రహాసము చంద్రప్రభావతిరసము కందర్పాంకురరసము షణ్ముఖరసము కాలాగ్నిరుద్రరసము తాళకేశ్వరరసము ప్రతాపలంకేశ్వరము చాతుర్థికరామబాణము విష్ణుచక్రరసము విశ్వంభరరసము బడబానలరసము నారాయణరసము మదనభైరవరసము భార్గవరసము జ్వరాంకుశము స్వచ్ఛందభైరవము సంజీవనరసము రసభూపతిచింతామణి మొదలైన దివ్యరసౌషధంబుల గంధక రస నాభుల లక్షణంబు లెఱింగి విఱుచు ప్రావీణ్యంబును లోహభస్మ తామ్రభస్మ వంగభస్మ సీసభస్మ నాగభస్మ శంఖభస్మ సువర్ణభస్మంబులు సేయు మర్యాదయు శీతభంజి అరళ్యాది మాణిభద్ర తాళీస మాత్రలుగట్టు నవధానంబును క్షౌరద్రావక గుగ్గులు పిష్టకషాయంబులు మూలికలు కైకర్ణికలు సేయు నౌచిత్యంబును సూత్రస్థాన శారీర నిదాన శాస్త్రంబుల పరిచితియును డెబ్బది రెండు నాడిభేదంబులును వాత పైత్య శ్లేష్మంబుల నుల్బణంబులైన త్రిశతషష్టి రోగంబులకుఁ దత్తచ్చికిత్సలు చేయు చాతుర్యంబును గలిగి రెండవ ధన్వంతరి యనంబరగు నతఁడు. 234

తే. వీథివెంటను రాఁజూచి వెలఁది యనియె
నౌర! యిట్లుండ వలదె యొయార మహహ!
వీనిఁ జిక్కించికొని మారవిగ్రహమున
భంగపడఁజేయనిది యేటి ప్రౌఢతనము. 235

క. అని తన మనమున ననుకొను
చును నిలుచున్నంత దాని సొగసు నొయారం
బును గని మనసిజ సమ్మో
హనవిద్యను జొక్కి యాతఁ డంచుకు రాఁగన్. 236

ఉ. "ఎక్కడనుండి యెక్కడికి నేమి ప్రయోజనముండి వోయొ, దీ
వక్కట! నామమే?" మనిన నన్నియుఁజెప్పి "పరోపకారిరా!
యిక్కలకంఠకంఠి" యని యెంతయు డగ్గరఁజేర మారుఁడున్
బ్రక్కలు నెక్కొనన్ బొడువఁ బై కొను మోహముచేత లేమయున్. 237

తే. అమల శశికాంతకాంత శుద్ధాంతకేళి
కా నిశాంతాంతరమ్మున ఘుమ్ము రనెడు
పచ్చ బచ్చెన చిత్తరు పనుల మించు
ప్రతిమ సంఘట్టనల మంటపంబులోన. 238

చ. సకినెల కీలుకంఠమున జాయమెఱుంగుల సొంపుకెంపు ము
క్కుకొనల పచ్చకాచిలుకకోళ్లఁ దనర్చిన పట్టుపట్టె య
ల్లికపయి జాఫరాజినుఁగు లేపునఁజెందు పలంగుపోషు త
క్కికగల జాళువాగొలుసు గీల్కొను మంచముపై మహోన్నతిన్. 239

తే. అపుడు గుప్తగుణాహ్వయుం డనెడి వైద్యు
నెలమిఁ గూర్చుండఁబెట్టి యా హేమరేఖ
పండుటాకులు కప్రంపు భాగములను
వేడ్కతోడుత నిద్దఱు వేసికొనుచు. 240

మ. సరసాలుం జిఱునవ్వులున్ మురిపెముల్ సయ్యాటముల్ వింతలున్
గరఁగింతల్ వలపించుటల్ చతురతల్ కాంక్షల్ వినోదంబులున్
దరితీపుల్ వలపుల్ మిటారితనముల్ దాటింపులున్ దచ్చనల్
నెఱిచిన్నెల్ మఱపించుటల్ సొగసులున్ నీటుల్ పచారింపుచున్. 241

సీ. ఆసక్తి దీఱని యాలింగనంబులు
నురువాంఛ దరుగని ఘురితవితతు
లనురక్తి వాయనియట్టి చుంబనములు
తమి వెలిగాని దంతక్షతంబు
లభిలాష లుడుగని యతిటపేటంబులు
తాత్పర్య మెడలని తాడనమ్ము
లాశలు మానని చౌశీతిబంధముల్
భావమూనని కళాస్పర్శనములు

తే. లలిత కలకంఠ కలహంస కలరవములు
పలుకు కివకివ కవకవ ప్రకట టకుట
కకుట కహకహ హసనముల్ గళరవములు
చెలఁగ నిద్దఱు రతికేళి సలుపునపుడు. 242

చ. తెమలను నిన్నుఁ బాసి సుదతీ! యని తీయని నీదుమోవి కా
యమృతరసోర్మియేని సమమా? యని మాయని మోహదాహ సం
భ్రమ మెదలోన నెంత తలఁపా? యని పాయని కూర్మితోడి నా
తమి పరభామలందుఁ గలదా? యని దా యని కౌగిలింపుచున్. 243

వ. ఇట్లన్యోన్యసరససల్లాపంబుల గుప్తగుణుండు సురతకేళికాలోలుఁడై హేమరేఖతోఁ బెనంగు
సమయంబున. 244

సీ. కొప్పెరపెట్టుగాఁ గొమరొప్ప నొనరించి
పై రుమాలు బిగించి పచ్చడంబు
నాగవల్లీదళ పూగ పూరితమైన
యొడిలోన నిడికొన్న యడపమొకటి
చాయలఁ దనరారు సకలాతు నొరతోడి
పృథు భుజస్థలి నొప్పు పెద్దకత్తి
చీర్ణంపుఁబనిచేత జిగిమించు కరమున
సొంపైన సత్తు సున్నంపుఁగాయ

తే. పాదముల మెట్లు మొలఁదాల్పఁబడిన బాఁకు

చల్దిగట్టిన వస్త్రంబు చంకదుడ్డు
నమర గమన జవోద్భవ శ్రమముఁ జెంది
యప్పు డసహాయుఁ డింటికి నరుగుదెంచె. 245

క. అరుదెంచి పురుషుఁ డుండెడి
యరుదెంచి నిజప్రసిద్ధి కందఱు నళికే
బిరుదెంచి రోషవశుఁడై
సరిదంచిత ఘోష భాషఁ జానను బిలిచెన్. 246

క. జడియక యిపుడా సతి యే
వడువున బొంకంగవలయు? వనరుహగంధీ!
యడుగుం దప్పినయప్పుడె
పిడుగుం దప్పునను మాట పేర్కొన వినవే! 247

వ. అని. 248

ఉ. ఈవిధి హంసలోకవిబుధేంద్రుఁడు ప్రశ్న మొనర్చి పల్క హే
మావతి కొంతకొంత యనుమానముతో బొటవ్రేల నేల రే
ఖావిధ మొప్ప వ్రాయఁ గుతుకంబున నీకిది తోఁచెనేని ను
ర్వీవరుఁ జేర నేఁగుమని వేఁడిన నప్పువుబోఁడి యిట్లనున్. 249

క. నినువంటి కతలకారిని
గని వినియెడివారి నడుగఁగావలెఁ గానీ
ననువంటి దాని నడిగిన
వినిపింతునె యెట్లు బొంక వివరింపఁగదే! 250

క. అని యడిగిన హేమావతి
కనురాగంబొప్ప రాజహంసకలాపం
బనియె, ససహాయుఁ డటువలె
ఘనరోషం బుట్టిపడఁగ ఘర్జించుటయున్. 251

తే. వైద్యుఁ డప్పుడు గడగడ వడఁకి నాకు
బుద్ధి యేమని పల్క నప్పువ్వుఁబోఁడి
వెఱవకు మటంచు దిట్టయై వెన్నుఁ జఱచి
సంచి విడిపించి యపుడు స్వస్వామి కనియె. 252

చ. కడుపున శూలయెత్తి వడిగాసిలి ప్రాణము లేఁగునట్లయై
తొడిఁబడ నీవులేమి ఘనదుఃఖముచే వెతఁబొంది యా మహా
త్ముఁడు పురినేఁగఁ గావుమని తోడ్కొనివచ్చితి నీతఁడౌషధం
బిడుటను నేను జీవము వహించితిఁ గ్రమ్మఱ, నేమి సెప్పుదున్. 253

క. అని యుస్సు రస్సు రనుచును
నన్నతోదరరోగమునఁ బ్రియాంగన పొరలన్
గని కుస్తరించి వైద్యుని
మనమున రంజిల్లఁ జేసి మమత దలిర్పన్. 254

తే. నీబుణముఁ దీర్పఁగలవాఁడనే! యటంచుఁ
బచ్చడంబిడి బహుమానమెచ్చ వైద్యుఁ

బంపి సందేహమందక భార్యతోడ
నిండు వేడుక నుండె నో నీరజాక్షి! 255

వ. అని మరాళశేఖరంబు చెప్పిన నరాళకచ యగు హేమవతి తన మనంబున. 256

క. సురుచిర మణి తాటంక
స్ఫురితప్రభ చెక్కులందుఁ బొలయ శిరంబున్
మఱి త్రిప్పి పొగడె నహహా!
గరితలమిన్నదియకాక, కలదే పుడమిన్? 257

వ. ఆ సమయంబున. 258

తే. మై వియల్లక్ష్మి కస్తూరిమళ్ళ చీర
రేయిఁగట్టుక సడలించి రేపటికడ
నుదయరాగంబుఁ దాల్చిన యొఱపు దోప
దమము జాఱంగ సాంధ్యరాగము జనించె. 259

చ. పలపలనయ్యెఁ దారకలు పక్షులు కూయఁ దొడంగె, దీపముల్
దెలతెలఁబాఱె దిక్కులను దెల్వి బనించె, బిసప్రసూనముల్
దులదుల విచ్చెఁ దాపులకు దొందడిఁ జేరి జారచోరు లా
మలయసమీరణంబు కడుమందగతిన్ విహరించె నత్తఱిన్. 260

తే. తఱియను కళాదుఁ డుదయభూధర హసంతి
నరుణహేమంబునకు వన్నియలను నింప
గ్రాఁచి, నీరార్చ నెత్తిన కరడునాఁగ
సూర్యబింబంబు పొడిచె నవార్యగతిని. 261

క. మణిఘంటల మొలనూలున్
ఝణఝణ యని మ్రోయఁ గేళిశాలకుఁ జని య
య్యణుమధ్య నృపార్పితగుణ
గణయై వసియించె దినము కల్పముగాఁగన్. 262

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పిన విని సంతోషించి నలుండు తరువాతి వృత్తాంతం
బానతిమ్మని పలికిన. 263

మ. హర కోదండ విఖండన ప్రచుర బాహాదండ! దండాయుధా
ద్యురుధిక్పాల సురానివార్యతర బాహోర్దండ! దండాంకభి
ద్ధరిణాక్షీమణి జీవనాకృతి నిజాఖ్యాఖండ! ఖందాబ్జభృ
ద్భురసాభృద్రిపువాహ సన్నిభ యశోభాకాండ! కాండోదరా! 264

క. ధారాధర ఘృణివారా!
వారణ రాజన్య వైరివారణ ధీరా!
ధీరాజిత శుభకారా!
కారణ పురుషావతార! కరుణోదారా! 265

కలహంసోత్సాహ వృత్తము
కలుషదూర! భవవిదూర! కమలసారలోచనా!
కలితహార! వరవిచార! ఖరవిహారమోచనా!
లలితనీరనిధిగభీర! లసదుదార కీర్తిని

ర్దళిత హార శరపటీర దర సుధారసోత్కరా! 266

గద్యము.

ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధి
పూర్ణిమాచంద్ర నిస్సహాయ కవిత్వనిర్మాణ చాతుర్యనిస్తంద్ర
శ్రీరామనామపారాయణ నారాయణామాత్య
ప్రణీతంబయిన హంసవింశతియను
మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

—: o :—

[1] యతిభంగము శోచనీయము
[2] ఇచటి ఛందోనియమభంగము చింత్యము.

# ద్వితీయాశ్వాసము

శ్రీశాంకరీశ చాప వి
నాశ! దినాధీశవంశ నలిన దినేశా!
క్లేశ హరాకాశ దరా
కాశ ఝరాబ్జాభిరామ కాంతియశోమా! 1

వ. అవధరింపుము. నలరాజన్యునకుఁ బ్రత్యుత్పన్నమతి యిట్లనియె. అట్లు హేమావతి కేళినిశాంతంబుఁ జేరి రాజవిరహంబున నొండొకరీతిఁ బొద్దు గడపుచున్నంత దినాంతంబు గావచ్చిన. 2

శా. ఆ హేమావతి మానసాటవి సముద్యద్దీప్తిమై౯ఁ బేర్చు మా
రాహంకార పరాక్రమానలము బాహ్యస్థాన కేళ్యర్థమై
యోహో! వెల్వడి పెక్కురూపములచే నొప్పారి కన్పట్టునా
గేహాంతంబుల దీపపంక్తులు చెలంగెన్ రంగు పొంగారఁగన్. 3

సీ. నునుపెక్కు జిగిచెక్కులను మిక్కుటప్పుఁ డెక్కు
గ్రమ్ముడు పంజుల కమ్మ లలర
నిడువాలుగల కీలుజడ మేలు వగఁ గ్రాలు
గొప్పైన సవరంపుఁ గుప్పె దనరఁ
దెలిపువ్వు కళ క్రొవ్వు వెలిరువ్వు చిఱునవ్వు
గలుగు నెమ్మోమునఁ దిలక మమర
రహి గుబ్బలుల నిబ్బరము ద్రొబ్బఁగల గుబ్బ
కవమీఁది పైఠిణి ఱవిక మెఱయ

తే. బళుకు బళుకున గతులయం దళికి బెళుకు
కులుకుఁ గౌనున జాళువా తళుకు లొలుకు
మేటి యొడ్డాణ మలరార నీటుఁ బూని
వచ్చి రాయంచకడ నిల్చె వనరుహాక్షి. 4

వ. ఇత్తెఱంగున నిరుపమ శృంగారతరంగితాంగయై రాజపుంగవసంగమార్థం బరుగుచుఁ దనచెంగట నిల్చిన యా రాజాననావతంసంబునకు రాజహంసం బిట్లనియె. 5

## నాల్గవరాత్రి కథ

### తొగట మగువ పారుపత్తెగానిఁ గూడుట

క. గమ్మత్తు చిమ్ము నొక కథఁ
గ్రమ్మఱఁ దెల్పెదను వేణిఁగ్రమ్ము విరులపైఁ
దుమ్మెదలు జుమ్ముజుమ్మనఁ
గొమ్మా! తలయూఁచి మెచ్చుకొమ్మా? నన్నున్. 6

వ. అని యిట్లు చెప్పఁ దొడంగె. 7

క. కల దభ్రంకష కేతన

చలదభ్రం బైన చైత్రశక మను పుర ము
జ్జ్వల దభ్రకచా దర్శన
దలదభ్రపురీ సుపర్వదారోదరమై. 8

సీ. వేద శాస్త్ర పురాణ విద్యాగరిష్ఠులై
విలసిల్లుచుండెడి విప్రవరులు
గరిడిలో నెఱ హొంతకారులై సాముల
మీఱిన రాజకుమారమణులుఁ
గోటికిఁ బడగెత్తుకొని యున్న టెక్కెముల్
బెక్కులై వర్ధిల్లు బేరిజనులు
గడు ధాన్యరాసులు గగనంబుతో రాయు
కలిమిచే ముంచిన కాఁపు ప్రజలు

తే. భూరి మదధార లూరెడి వారణములు
ధాటిపాటవమున నొప్పు ఘోటకములు
ఘోరరణరంగపటులైన వీరభటులు
బ్రబలి యుండఁగ వెలయు నప్పట్టణంబు. 9

క. ఆ పట్టణంటు లోపలఁ
జూపట్టును దంతువాయ చూడామణి రే
ఖాపట్టభద్రుఁడై సిరి
నేపట్టున నోరపోర మింతయు లేకన్. 10

## నేతగాని యిల్లు

సీ. కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు
పంటె త్రొక్కుడుపట్టె పలక దోనె
పరిపరియచ్చులు చరికుండ యూడిత
చీడు డబ్బలు దండె నాడె క్రోవి
కోతిపుల్లలు నాల్క కుడుతరి కొయ్యలుఁ
జొప్పయూఁచలు గోఁతచూఱకత్తి
కారంపుఁ బడుగులు గండెల కప్పెర
గోలెము లాకలు నీలికడవ

తే. గంప డొల్ల కలాసంబు కదురు చెమికె
నూలురాట్నంబు జాలంబు గ్రాలు గోడ
మఱల నాశుభభద్రు నివాసభూమి
యప్పురంబున సంతతం బొప్పుచుండు. 11

తే. గొప్పకన్నులు చిఱునవ్వు గులుకు మోము
బవరిగడ్డము చక్కనై పరగు ముక్కు
నెగుభుజంబులు విపులత్వ మెసఁగు ఱొమ్ము
జిగి మిగులు లీలఁ గనుపట్టుఁ దొగటసెట్టి. 12

ఉ. ఆఁటది నేర్పుతో నగల యందముఁజందముఁ జూపఁబూని కో
లాటము చేయు కైవడిని లాలితదృక్తరళప్రభావళుల్
పాటిగఁ బోఁగు వెంబడిని బార్శ్వములం జరియింప వస్త్రముల్

ధాటిగ నేయు నప్పలుక తట్టున బెట్టు ఖణిల్ఖణిల్లనన్. 13

తే. అరవిరుల తేనియల చాలు మరునివాలు
మిసమిసలప్రోలు వలరాజు మేటిరాడాలు
మురిపెముల మెచ్చుకొనఁజాలు ముద్దరాలు
వాని యిల్లాలు దొమ్మరవాని డోలు. 14

ఉ. దాని ముఖప్రభాగరిమ దాని కపోలకళావిశేషముల్
దాని బెడంగుచూపులును దాని కుచంబులఁ జెందు నందమున్
దాని వచోవిలాసములు దాని కచాళిరుచుల్ గణింపఁగా
మానవతీలలామ! విను మర్త్యు లమర్త్యులు నైన శక్తులే? 15

క. జిగిఁజిలుకు కులుకు గుబ్బలు
నిగనిగలు చెలంగు నెఱులు నిద్దపుఁ గన్నుల్
నగవు దళుకొత్తు మోమును
మగువా! యాబిడకె కాక మఱి కలదటవే? 16

క. తొడలందము కటిచందము
నడుగుందమ్ముల బెడంగు లాస్యము రంగుల్
జడతళుకున్ మెడకులుకున్
నడబెళుకున్ జూడ నాఘనస్తని కమరున్. 17

తే. చిన్నచీమల నునుబారు చెలువయారు
కదళికాకాండముల మీఱుఁ గాంతయూరు
లందములఁ జెందు రతిఁగేరు నతివసొారు
దానికెనయైన నారు లిద్ధరణి లేరు. 18

క. కందర మా చెలిపొక్కిలి
కంద రమా విలసనములు కచములు, రదముల్
కుంద రమా సమములు నా
కుం దరమా? పొగడ నల కుకుందరసుకటిన్. 19

సీ. మిళదంబు జలదంబు బలుడంబు చెలువంబు
దులకించు నమ్ముద్దుఁగలికివేణి
సిరిపట్టుగల గట్టుజిగిగుట్టు వెలిఁబెట్టు
చెన్నారు నక్కన్నె చన్నుదోయి
నునుకందు పైఁజెందునని యిందురుచిఁ గ్రించు
పఱుపఁగాఁ జాలు నబ్బాలమోము
తెలిదమ్ములను గ్రమ్ము కళఁ జిమ్ము ననయమ్ము
మిన్నయౌ నబ్బోటి కన్నుఁగవయుఁ

తే. దావి తేనియబావి యందముల దీవి
మావి చిగురుచెంగావి మారుఠీవి
కప్పురంబుల క్రోవి యక్కాంతమోవి
యనుచు వినుతింప నానేఁతవనిత యలరు. 20

తే. పరిమళ మెసంగు బంగారు ప్రతిమవంటి
తొగటవాల్గంటి జిగినీటు తొలకరింప

సొగసుకొండకు మోహరాసులు జనింప
నూర నొకయోరఁ జెలువార బారసాఁచి. 21

సీ. పోఁగువెంబడిఁబర్వి పొల్చు వాల్చూపుల
ధళధళల్ పూదండకళల నీనఁ
బుంజంపుఁ గట్లు దెంపుటకుఁ బర్వెత్తుచో
మట్టెల ఖణఖణల్ బెట్టు మ్రోయఁ
గేలెత్తుచో బాహుమూలజాతప్రభా
చకచకల్ పైఁడి వసంతమాడ
బరిటఁ ద్రిప్పఁగ జాఱు పైఁటలోఁ గన్పట్టు
గుబ్బల మిసమిసల్ ద్రొబ్బులాడ

తే. వింతవగ కప్పునెఱిగొప్పు వీడ మెఱయు
నిగనిగల్ జాతినీలాల నిగ్గునింపఁ
గుచభరంబున నడుము కొంకుచు వడంక
నూలు దోడును వేడ్క నవ్వాలుఁగంటి. 22

చ. కరములఁ గంకణాళి ఘలుఘల్లన రాట్నముఁ ద్రిప్పువేళఁ బైఁ
టరదిగజాఱ వెల్కుఱుకు నబ్బురపున్ వెలిగబ్బిగుబ్బపై
సరు లిసుమంత చిందుగొనఁ జక్కనిచూడ్కులుచూచువారి పే
రురమైన గాఁడ నవ్వెలఁది యోర్పునఁ గండెలుచుట్టు నేర్పునన్. 23

ఆ. పడుగుఁజేయువేళఁ బటములల్లెడువేళఁ
గూడుదినెడువేళఁ గూర్కువేళ
మగని కన్మొరంగి మార్మగలను గూడు
నింటిపొరుగుసఖుల యిండ్లలోన. 24

క. గడిదేఱి జారవిద్యకు
వడిఁగట్టి దురంతకంతు వనజశరార్తిన్
బడఁజాలనికతమున నా
వడువున నత్తొగటబోటి వర్తిలఁదొడఁన్. 25

వ. ఇత్తెఱంగున నత్తెఱవ చిత్తజాయత్తచిత్తయై వర్తింపుచున్న సమయంబున. 26

సీ. నొసలిపైఁ జుక్కలమిసిమి నామపురేఖ
లనువొంద భుజముపై నసిమిసంచి
వాలువీనుల గాజునీలాల పోఁగులు
పై నొప్పు పప్పళి పచ్చడంబు
మెలిగొనఁ జుట్టిన తలపాగ చెఱఁగుంచి
పైఁటపేటాచుట్టు పట్టుశాలు
కడిఁది మీఱఁగఁ జతనిడిన బొట్టియకోల
డాక మ్రోసెడు డుబుడక్క కేల

తే. వఱల దిక్కులనెంచి దుర్వారమైన
కీడుమేలును దెల్పుచుఁ గేక లిడుచుఁ
గెర్లికొనుచును దనపేరు కేరికొనుచు
వచ్చె నచటికి డుబుడక్కి వాఁడొకండు. 27

ఉ. ఆ డుబుడక్కివానికి రయంబున భిక్ష యొసంగ నేత్రపూఁ
బోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ బోయి తనున్ గొనియాడువాని నా
మ్రేడితసూక్తి పైఁబెదవిమీఁదను లేనగ వంకురించి చిం
దాడఁగ ముష్టిఁబెట్టి బహిరంగణభూమిని నిల్చియుండఁగన్. 28

సీ. మెలిఁబెట్టి చుట్టిన తెలిపైఠిణీపాగ
చెవిసందిపాగలోఁ జెక్కు కలముఁ
దొడిగిన నెఱచల్వ నడరు నంగీజోడు
జీరాడు నడికట్టు చెఱఁగుకొనలుఁ
బదతలంబుల నెఱ్ఱవాఱు పాపోసులు
టెక్కుగాఁ జంకఁ జీటీఖలీతి
నడికట్టులో మొలనిడిన కలందాను
హస్తాగ్రమున వ్రేలు దస్తరంబు

తే. మించుబాహువుమీఁదఁ గాశ్మీరుశాలుఁ
జెవుల ముత్యాలపోఁగులు చెలువుదనర
నలఁతి నీర్కావిదోవతి యమర నటకుఁ
బారుపత్తెంబు సేయు వ్యాపారి వచ్చె. 29

తే. వచ్చుచుండెడి వ్యాపారి పెచ్చువగలు
మెచ్చి యచ్చలి తమి హెచ్చి రచ్చ సేయఁ
బగటు వగమీఱఁ గోర్కులు బారుదీరఁ
బొగరుఁ జూపులతోఁ బడావగలఁ జూచె. 30

ఉ. చూచినయంతలో మరుఁడు చొక్కపుఁ గప్రపుటాలపుంటలన్
లేఁజివురాకుఁగ్రోవి నల లేమ పయోధరచక్రవాకముల్
వే చలియింప హృత్పుటము బీటలువాఱఁగఁ దెప్పు తెప్పునన్
గోచిలఁదాఁకనూఁది మదిగోలుపడన్ వడినార్చి వ్రేసినన్. 31

క. ఊహలు కుత్తుకబంటై
మోహము తలమునుక లగుచు ముద్దియ మదిలో
బాహాబాహి కచాకచి,
కూహకమతిఁబట్టి పెనఁగి, కోయనుచు వడిన్. 32

తే. అంత నయ్యింతి యింతింత యనఁగరాని
వంత మదిఁగొంత చింతించి కంతు నిశిత
కుంతహతి కోర్వలేక దినాంతవేళ
మంచనంబున వెడలి గేహాంతరమున. 33

చ. ఉరిసిన పల్లవెండ్రుకలు నూడినదంతము లంబకంబులం
గురిసెడు బాష్పజాలములు గూను వడంకెడు మస్తకంబుఁ గల
ధరఁదగుతోలు పాదములు దర్శనముల్వడి చీరపోతు నూ
ల్మెఱసెడు మంత్రసానిఁ గని మించెడువేడ్క నుతించి మ్రొక్కినన్. 34

ఆ. ఆలకించి లేచి యది యెవ్వరని చీరి
యమ్మ! నీవఁటే యఁటంచుఁ బొదివి
యేమిపనికి వచ్చి తీసందెవేళలో

నసుచు నడుగఁ దొగటవనిత పలికె. 35

ఉ. ఆరయ నిమ్మహాపురికి హాసము మీసముమీఁదఁజిల్క వ్యా
పారియొకండు నిండు రతిభర్తను బోలినవాఁడు వచ్చె, నే
నా రసికాగ్రణిన్ గదియునాస వహించితినమ్మ! వానితోఁ
గోరిన పొందు నాకు నొనఁగూర్చిన నీ కొనరింతు సంపదల్. 36

సీ. నవురైన రతనాల బవిరికమ్మల నిత్తు
నవి నీకు మనసురా వంటివేని
యాణిముత్యమ్ముల హారమ్ము లొసఁగుదు
వానిపై నీ కిచ్చ పూనదేని
గరుడపచ్చల కీలు కడియంబు లర్పింతు
నందుకు నీ యాస చెందదేని
తళుకుఁ గెంపుల సందిదండలు చెల్లింతు
వానిపై నీబుద్ధి యానదేని

తే. సూసకము తీఁగ మెడనూలు సొబగునాను
గుండ్లపేరును గైకొన్క కోరి సేతు
నమ్మ! నా విన్నపంబు నీ వాలకించి
వాని నను గూర్పు నీ నేర్పు పూని మెఱసి. 37

మ. అనుచున్ వేఁడిన మంత్రసాని విని నెయ్యంబారఁగాఁ బల్కె నో
ననఁబోఁడీ! నినుఁజూడ మన్మథునకైనన్ మోహముల్ పుట్టఁగా
మనుజుం డీతఁడు భీష్ముఁడో సనకుఁడో మౌనీంద్రుఁడో వ్యాసనం
దనుఁడో యెంతటివాఁడు వీఁడనఁగ బందాకోరుఁగాఁ జేసెదన్. 38

క. సొనమందు రసముఁ బసరును
ఘనమణిమంత్రౌషధములుఁ గైకర్ణిక కా
వును మగసిరిక్రియ బంతిబ
దనిక గుళికె మూల్కె బూతిఁ దవిలిచి దెత్తున్. 39

వ. అని చెప్పి వీడ్కొల్పిన. 40

క. తన యింటికి హేమంతిని
చనె నానిశిఁ గడిపి మంత్రసాని రహస్యం
బునఁ బారుపత్తెగాఁ డుం
డిన చక్కికిఁ బోయి మ్రొక్కి నిపుణత మెఱయన్. 41

సీ. దాక్షిణ్య మనురక్తి దయయు విశ్వాసంబు
బాంధవ్యము హితంబు భయము భక్తి
యంతఃకరణము సఖ్యంబుఁ బోరామియు
నేస్తంబుఁ జెలిమియు నెనరుఁ బ్రేమఁ
జల్లఁదనంబు వాత్సల్యంబుఁ గలుపుగో
లుతనముం బ్రీతియు మంచితనము మైత్రి
ప్రాణపదంబుఁ దాత్పర్యంబు గారాబ
మనుగుణ మనుబంధ మనుసరింపు

తే. మచ్చికయు; జుట్టఱిక మైక్య మిచ్చకంబు

స్నేహ మనురాగ మాసక్తి మోహనియతి
సలిపి కడుఁ జక్కె ననిపించి సొలయఁజేసి
నెగడుపడ కప్పు దాత్మప్రవీణ మహిమ. 42

చ. స్తుతులు ప్రసంగముల్ కథలు సుద్దులు వార్తలు రాచకార్యముల్
చతురతరేతిహాసములు శాస్త్రములం దగు జాతిగాథలున్
సతకడముల్ పురాణములు సామెతలున్ బరిహాసకంబు లిం
గితములు జారజారిణుల కేళిచరిత్రములన్ వచించుచున్. 43

ఉ. దేవ? పరాకు, హౌసుకళఁ దేఱెడు నీ దగు రూపవైభవం
బే విధినో కనుంగొన రతీచ్ఛకుఁ బాల్పడి చిక్కి సొక్కి నీ
సేవయ చేయఁగోరి నిను శీఘ్రమె రమ్మని చెప్పి పంపె నో
రావణరూప! యా తొగటభామిని కామవికారచిత్తయై. 44

తే. హత్తుకొనవచ్చు నీవంటి యందగాని
కట్టి ముద్దుగుమ్మను గుట్టుతోడ
ననిన మనసిచ్చి మదిలోన హర్ష మెచ్చి
మంత్రసానికి విడెమిచ్చి మమత తోడ. 45

క. ఆ పనులకె యేఁకారెడు
తాపము గలవాఁడు గనుకఁ దగనాతఁడు ని
క్షేపముఁ గనిన దరిద్రుని
యేపున ముదమంది దాని కిట్లని పలికెన్. 46

ఉ. అచ్చటి కేను వచ్చు సమయంబగువేళ యెఱుంగఁ దెల్పినన్
ముచ్చటఁ దీర్తునంచు ముది ముద్దియతో వివరించి పంపగాఁ
నచ్చెలి తంతువాయ కులటాంగన చెంగట నీ ప్రసంగముల్
చెచ్చరఁ జేయు నత్తఱిని సెట్టి దుకూలము లమ్ము వేడుకన్. 47

సీ. కల సమీపపుటూళ్ళ కాఁపుగుబ్బెతల నె
మ్మదుల నాకర్షింప మంత్రవిద్య
బచ్చుఁ జాయపు వృషభవ్యూహములనెల్ల
వఱలంగ గుమిగూర్చ వల్లెత్రాడు
చిల్లరసరకుల సెట్టి బేరాల కిం
పుగ లాభమొందింపఁ బూఁటకాఁపు
పెనుకోటకాండ్రకు జనసమూహంబుల
గణితి చూపెడు నాయకప్రభుండు

తే.ముద్రగరిఁటియ భుజముపై మొనయఁబెట్టి
ఘంట ఖంగని మ్రోయ సంగళ్ళఁ బడిని
మరగి తిరుగు సళాదికి మణియకాండ్ర
కవనిఁ బడికాఁపునా వింత నలరు సంత. 48

క. అంతటఁ నాసంతకుఁ దన
కాంతుఁడు వస్త్రమ్ము లమ్మఁగా నేఁగిన హే
మంతిని వ్యాపారి విటో
పాంతమునకు మంత్రసాని నడిపిన నదియున్. 49

తే. పోయి సమయంబుఁ దెలుప నబ్బోజుఁగు వేడ్క
వింత నెఱపూఁత గందంబు విరులు సరులు
కప్రపు విడెంబు జిగిచెల్వుఁ గులుక సొగసుఁ
దనర హేమంతి యిలు సేరెఁ దత్క్షణమున. 50

ఉ. చేరినఁ దంతువాయసతి సిస్తుగ నిస్తుల రత్నవస్తు వి
స్తా సువర్ణవర్ణముల సంపద లింపొనరించు కేళికా
గారములోన దివ్యమగు కమ్మనితావుల హంసతూలికం
జేరిచి మేరమీఱు తమిఁ జీరగ మారుని పోరి కయ్యెడన్. 51

చ. త్వరపడి గబ్బిగుబ్బకవ వాఁడి నఖంబులఁ జీరి చీరి పై
సిరి తళుకొత్త తేట నునుఁజెక్కులు ముద్దులు వెట్టివెట్టి వా
తెఱ మొనపంటికొద్ది కసిదీఱఁ జుఱుక్కున నొక్కినొక్కి యా
కరణిఁ బరస్పరంబు జయకాంక్ష బెనంగఁగ నింతి పై కొనెన్. 52

సీ. చిటిలెడు గందంబుఁ బెటిలెడు కస్తూరి
చలియించు రత్నకుండలయుగంబు
గదలెడు నెఱివేణి వదలెడు పువ్వులు
జెమటఁ గరంగు కుంకుమపుబొట్టు
వికసించు కన్నులఁ బ్రకటించు మణితముల్
కంగణ ఝుణఝుణత్కారరవముఁ
బొదలెడు చనుదోయి కదలెడు హారముల్
ఘననితంబాఘాతనినద మడర

తే. నిటల సంచల దలక ముత్కటసఖాంక
మమిత నిశ్వాసమారుతం బతనుగేహ
[1]దర్శనోత్సాహి పతిచపేటప్రదాయి
యైన పుంభావసురత మయ్యతివ సలిపె. 53

వ. మఱియు నయ్యుపరిసురతంబు తమి యెక్కువయై దృఢకుచాశ్లేషంబు విడువఁజేయంజాలక శీతకాలంబును బ్రకటీకృతతారకంబును సంశ్లిష్టప్రియతముంబును గావున నిశాసమయంబును సంచలితపయోధరంబును నిర్గళితకృష్ణవేణ్యాది కమలంబుఁ గావున శరత్కాలంబును బల్లవరాగసంపాదకంబును గలకంఠకూజితంబునుం గావున వసంతకాలంబును ధ్వనిప్రధానంబును గలితవిశ్రమంబును గావున సత్రబంధంబును గళితవసనంబుసు బహుబంధబంధురంబును గావునఁ బ్రబుద్ధసిద్ధమార్గంబును బోలి వెలయుచుండె. 54

ఉ. ఆ సమయమ్మునన్ జెమట లాస్యముఁ గప్పఁగ నిండు బళ్ళికల్
గాసిలఁ జేయఁగాఁ గబళకాంక్షకు జీవము వేగురింప, ని
శ్వాసము బారుఁదీర నిజవల్లభుఁడౌ శుభభద్రుఁ డట్లు సం
వాసముఁ జేరవచ్చి తలవాకిలిఁ దీ యని పిల్చె వల్లభన్. 55

తే. అప్పు డేరీతి నుపనాథు నవల కనుప
సుందరీ! యే యుపాయంబుఁ జూడవలయు?
జాణవౌదువు జారవాంఛలకు నైతె
తెలుపు మని పల్కెఁ గలహంస దేవవిభుఁడు. 56

క. అని యడిగిన హేమావతి
విని దీర్ఘోచ్ఛ్వాస మొనర విడిచి నిజాంఘ్రిన్
గనుదృష్టి నిలిపి మెల్లన
మునివ్రేలన్ నేలగీచి మునుకొని పలికెన్. 57

క. తెలియ దెటు పనుపవలెనో
పలుమఱు నే బ్రహ్మలోకపర్యంతంబున్
గలయ వివరించి చూచితి
నలవడ దది నీవె తెలుపు హంసబిడౌజా! 58

క. అని యడిగిన హేమావతి
కనురాగం బొప్ప రాజహంసం బనియెన్
వినుము నిజాధిపుఁ డటువలెఁ
దనుఁ బిలిచిన యువతి లేచి తరలక ప్రీతిన్. 59

క. పిలిచిన గుండె లొటుక్కనఁ
గలఁగుచు వ్యాపారి వెడలఁగా నెటు లనుచున్
దలఁచినచో వెఱవకు మని
నిలిచిన దార్ఢ్యమున మానినీమణి వేడ్కన్. 60

ఉ. అత్తఱి చిత్తలై ఘనముదాత్తసుబిత్తపుమత్తుపొత్తుతో
బిత్తరి తత్తలం పరయ పేర్కొని వాకిలిఁ దీసి, వేగమే
చిత్తజువంటి నాయకుని చెంతను నిల్చి తదీయనేత్రముల్
మెత్తనిచేత మూసి దయ మించఁగఁ దోడ్కొనివచ్చెఁ జెచ్చరన్. 61

ఉ. ఆ వగఁ జూచి యవ్విట మహామకరాంకుఁడు చిత్తవీథిలో
నౌ వగమాని మానిని నయంబొదవం గనుసైగ చేసినం
దావగు చోటి కేఁగెఁ దదనంతర, “మక్షు లివేల మూసితే?
పోవఁగరా” దటంచుఁ బతి ముద్దియ నిట్లడిగెన్ బ్రియంబునన్. 62

తే. అటుల నడిగిన ప్రియభర్త యంబకముల
మూత చాలించి యామించు ముద్దుగుమ్మ
సిగ్గు కడ్డంబుగాఁ బతిచేల మలిమి
కొనుచుఁ బలికెను జిన్నెలు కొసరు జూప. 63

చ. జలకములాడఁ గోరి బురుసాపని చీర సడల్చి సందులో
పలికిఁ జనంగ నీదు నునుఁ బల్కు వినంబడఁ దల్పుఁదీయఁగా
వెలువడి వచ్చితిన్ వలపు వెల్లువ దొట్టఁగ, నంచు నాయకున్
గులుకుమిటారి గబ్బిచనుగుబ్బలఁ గౌఁగిటఁ జేర్చి పల్కినన్. 64.

తే. భామ తనమీఁద నెనరైన బాగుఁ జూచి
చిత్తము గరంగి శుభభద్ర శేఖరుండు
గుణవతివటంచుఁ బ్రియురాలిఁ గుస్తరించి
నిండుమోదమ్మున సుఖాన నుండె నపుడు. 65

క. ఇంత యుపాయము గలిగిన
నింతీ! చనవచ్చు జారునెనయఁగ, లేదా
కాంతుఁ డెఱింగిన నృపమణి

చెంతకు నేమొగముతోడఁ జేరెదొ చెపుమా! 66

తే. అనుచు రాయంచ నుడివిన విని శిరంబుఁ
ద్రిప్పి హేమావతి ప్రమోద మొప్పఁ బలికె
నౌనె! మజ్ఝారె! యదిగాక యాఁడువారి
తెలివి యనుచును జిఱునవ్వు దలకొనంగ. 67

క. తెలవాఱె నపుడు దీపపుఁ
గళికలతో వెల్లఁ బాఱఁగాఁ దనమోమున్
భళిర! కథాలాపంబని
జలజేక్షణ చనియెఁ గేళిసదనంబునకున్. 68

చ. చని జలజాప్తుఁ డస్తగిరి చాటున కేఁగినయంత మజ్జనం
బొనరించి వ్రాఁతనుంబనులనొప్పు దుకూలముఁ గట్టి రత్నకాం
చకమయ భూషణంలును సారపు మేల్తిలకం బమర్చి ఘ
మ్మను విరు లూని యచ్చెలి నృపాగ్రణి చెంగటి కేఁగు చున్నెడన్. 69

మ. కని చక్రాంగబిడౌజుఁ డిట్లనియె, శృంగారంబు లెస్సాయె మే
ల్దనరారెన్ భళి! హొంతకారివి గదే తన్వంగి! రాజాంతికం
బునకుం బోయెదవేమొ! యొక్క కథ యొప్పున్, దచ్చమత్కారముల్
వినిపో! నిల్పి ననంటిపండ్లనె ననున్ ప్రేయించుమంతన్ వెసన్. 70

క. అన విని హేమావతి మో
మున నవ్వు జనింపఁ గతల మునిపుట్ట సుమీ!
కన నీదు కడుపు బ్రహ్మకు
వినఁ దరమా! యనుచుఁ బలికి వినిపింపుమనన్. 71

క. కప్పురపుఁ దునుక లలవడ
విప్పుగ విరితేనెవాన విడివడి కురియం
జొప్పడర హంససురపతి
చెప్పెను హేమావతీ కుశేశయముఖికిన్. 72

## అయిదవ రాత్రి కథ

### గొల్లచిన్నది బాపన చిన్న వానిఁ గూడుట

క. ఆలింపు మహాభ్రంకష
కేళీప్రాసాద నీలఘృణి గాఢ తమః
పాళీ సతత విహారి సు
రాళీ పురజాల కులటమై సర మనఁగన్. 73

తే. పురమొకటి యుల్లసిల్లు, సంస్ఫురిత పూర్ణ
మా నిశాకర ధిక్కరి మంజులాస్య
మందు నొక గొల్ల సంపల్లతాంగిపిల్ల (బిడ్డ)
విజయుఁ డను పేర సిరులచే వెలయుచుండు. 74

### గోప గృహము - గొబ్బెలు

సీ. కంబళి తలదడ్డు కవ్వము మజ్జిగ
బాన గొడ్డలి నుచ్చు ప్రాతల గుది
కావడి యుట్లు చిక్కము సందికడియంబు
సూకల తోప పొగాకుతిత్తి
బొప్పి మజ్జిగముంత బొటమంచి పిల్లల
గూడు దామెనత్రాడు కోతకత్తి
తొర్లుగట్టెయు జలచుబ్బు చిల్కుడుగుంజ
పూజబిందెలు వెన్నపూస చట్టి
తే. పాలబుడిగలు వడిసెల ప్రాతమెట్లు
మలపమందుల పొడిబుట్టి మన్నెముల్లు
తోలుకుళ్ళాయి తొడుపును దొడ్డికంప
చుట్టు చవికెయుఁ గొమరొప్పు సొలయు నతడు. 75

చ. కుఱుబవి దొరచాఱ నలగొండ్లెఱగొండిలి మూజ బొల్లివిన్
నఱిగివి నెట్టుజోడు పులనల్లని వెల్లవి పుల్ల చిల్లవిన్
బఱిగివి మొట్టివిన్ గరకపల్లవి నాఁదగుపేళ్ల నొప్పెడున్
గొఱియలు వేనవేలుఁగలగుంపు లసంఖ్యము లుండు వానికిన్. 76

తే. బోడి పొడమట్టి నామంబు బొల్లిపూరి
జాలవల ఫుల్ల వెఱిబట్ట చాఱ బఱిగి
కఱుకుగడ్డము తెలమొట్టి గవర దొర
వనెడు పేరుల మేఁకగుం పతని కుండు. 77

తే. మట్టె చేమట్టె కఱె పస్సె మైల బట్ట
కోర తలపూజ వెల్లనిచాఱ బోడ
పొడ కపిలకన్నె బొలిచుక్క పుల్లవి యను
పేళ్ల నొప్పారి మందకోఁ బెక్కు గలవు. 78

క. పల్లవి నల్లవి యెనుములు
బిల్లలనిడు గోడిగలును బెంపుడు పెద పొ
ట్టేళ్లును దుక్కెడ్లును విల
సిల్లగ నా విజయుఁ డచట సిస్తుగ నుండున్. 79

క. అతనికి మంజుల యనఁగా
సతి యొక్కతె గలదు దాని సరియెన్నుటకున్
గొతుకుపడు రతికిఁ జతురత
యితరుల నిఁక నెన్న నేల యిందునిభాస్యా! 80

క. ఆ కుల్కు లా యొయారము
లా కనుఁదమ్ముల మెఱుంగు లా కౌను బెడం
గా కుచయుగ్మము బింకం
బా కోయిల ముద్దుఁబల్కు లతివకె చెల్లున్. 81

క. ఆబిడ గర్భోత్పత్తికి
నై బగిసియు మాలి పతి రతాదృతి మీఁదన్
లోఁ బొడమిన రుచి మించినఁ
బ్రాబల్యము గలుగు విటుల పాలిది యయ్యెన్. 82

సీ. వేశ్యాపతి చకోరవిసరంబునకు నురి
విట లతావళికి లవిత్రకంబు
యువరాజి కరులకు నొసరారు నోదంబు
కాముకవ్యాఘ్రంపు గమికి బోను
పాంథమానసమత్స్యపటలికి గాలంబు
పల్లవోక్షములకు వల్లెత్రాడు
షిద్గకపోతరాశికి జీరు దీమంబు
లలి భుజంగవిహంగములకుఁ జివురు

తే. జార కిరి పంక్తులకు మోటు, సరస శశక
ములకు గట్టువ, యుపకాంత ముఖ్య చటక
సంఘములకును గుబ్బిక శంబరారి
ఘోర రణహోరి జయభేరి ఘోషనారి. 83

తే. ఇత్తెఱంగునఁ జిత్తనాయత్తచిత్త
వృత్తి గైకొని బారుల పొత్తు సలిపె
నలసటయు వేసటయు లేక, యట్టులయ్యు
జూలు గాంచఁగలేక యా సుదతి కుంది. 84

చ. తిరుమల కంచి పుష్పగిరి తీర్థములుం జని కొంగుముళ్లతో
వరములు దంపతుల్ వడయ వారిగఁ గాన్కలు వైచి యంతటన్
బరికలు దృష్టిదీపములుఁ బన్నిన గద్దెలు పెట్టి యేమిటన్
గరమగు పుత్రవాంఛ కడఁగానఁగలేక విచారఖిన్నులై. 85

వ. ఉన్న సమయంబున. 86

ఉ. కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు వ్రాఁతల కృష్ణలీలలం
గ్రమ్ము గుడార్లు వీరుఁడగు కాటమరాజు కథానులాపముల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిక కట్టు రుమాలలున్ నెఱా
సొమ్ములు నామముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చి రెంతయున్. 87

వ. ఇట్లు వచ్చి. 88

సీ. ఫెళఫెళ వీరణాల్ ఖళిఫెళి వాయించి
పోటుబోఁ గొమ్ములు నాట నూఁది
దొనకొండ గంగను దొలుత సన్నుతి చేసి
కృష్ణున కతిభక్తిఁ గేలుమోడ్చి
యాదికాలపు గౌండ్ర నందఱఁ గొనియాడి
తాత తండ్రుల పేళ్ళు తలఁచి పొగడి
బిరుదుల నరుదుగాఁ బేర్కొని మొరయించి
దీవించి వీరుల త్రోవ లెన్ని

తే. కులము పెద్దల కత లాముకొనఁగఁ జెప్పి
సివము పుట్టించి పుత్రులఁ జెందఁ గలరు
వీరులను గొల్వుఁడని తెల్పి వీడుకొల్పఁ
జనిరి సుద్దుల గొల్లలు సంతసిల్లి. 89

వ. ఇట్లు వారలు సెప్పిపోయిన నత్యంతభక్తిప్రియపూర్వకంబుగా నంతట. 90

మ. కొలిచెన్ గాటమరాజు సన్నుతులు చేకూర్చెన్ మహావీర్లకున్
బొలమున్ రాజుల నెంతొ భక్తిపరతన్ బూజించె నా గంగకున్
వెలయన్ వేఁటలు బోనమున్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై
చెలి యాలాగున నల్ప దైవముకృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్. 91

వ. అంత. 92

ఉ. మోము వహించెఁ దెల్వి జిగి మోవిరుచుల్ దగ సందడించె మృ
త్స్నామతి మించెఁ జన్మొనలు శ్యామలకాంతి వహించె యానముల్
వేమఱు మందగించెఁ గడు వృద్ధి భజించెను గౌను చిట్టుముల్
రామకు సంభవించె, నభిరామతరంబుగఁ జీర చిక్కినన్. 93

తే. అంత నొకనాఁడు శుభముహూర్తాంతరమున
మంజులాంగన రంగైన మంచి మణుల
నొఱపుగాఁ దీర్చికట్టిన యొక్క దివ్య
మందిరములోనఁ జిన్ని కుమారిఁ గనియె. 94

చ. వడఁకెడు కౌనురంగు తలవాసెన గట్టిన కొంగు పుక్కిటన్
విడియపుఁ జొంగు మైలఁగొని వ్రేలెడు చేలచెఱంగు పాలచేఁ
పుడు చనుదోయిపొంగు వసపూతఁల వింతబెడంగు నూనె క్రొ
మ్ముడి రుచి హంగు బిట్టమర ముద్దియ యొప్పెను బిడ్డ కాన్పునన్. 95

వ. అంత. 96

క. అది ప్రతిపచ్ఛశిరేఖా
భ్యుదయమువలె దినదినమ్ముఁ బొదలెడు కళలం
బొడువంబడి లేఁబ్రాయపు
మద మెక్కఁగ ముద్దు గులికె మనమలరారన్. 97

క. చన్నులపస యట మీఁదటఁ
గన్నులపస ముద్దు గులుకఁగల ముఖమున మేల్
క్రొన్నెలమిస జిగిబిగి వగ
చిన్నెల మసఁ జూచి వలచుఁ జిత్తజుఁ డయినన్. 98

తే. తమకమున కొగ్గ దనెడు నేరము ఘటించి
తరుణతను వెళ్లఁగొట్టింపఁ దలఁచి మదనుఁ
డీర్ష్య గుండలు వెల్లవేయించె ననఁగ
బాల్యము చనంగఁ గుచము లేర్పడియె సతికి. 99

తే. కొమిరె బంగారు పొక్కిలి కుంది యందు
రతియు శృంగార మను ధాన్యరాశి నించి
దంచ నిడినట్టి రోకలి సంచు మీఱి
రోమరాజి దనర్చు నారూఢిగాఁగ. 100

క. చెందిర మా మెయిసిరి, సిరి
మందిర మా మోము గోము, మదనారి లస
న్మందిర మా కుచయుగ మిం
దిందిర మా వేణి యనఁగ నెలఁత రహించున్. 101

సీ. రాణించు నెఱికురుల్ వేణి కందకమున్న
కనుబొమల్ వక్రిమఁ గనక మున్న
జిగి గుబ్బలు మొగాన కెగయ నిక్కక మున్న
నునుఁబల్కు నేర్పుఁ గైకొనక మున్న
చూపులఁ జుఱుకుగాఁ జూడనేరక మున్న
వీనుల మరుకథల్ వినక మున్న
లలితయానము మదాలసతఁ బూనక మున్న
కటిసీమ విస్తృతిఁ గనక మున్న

తే. చిత్తజుఁడు తమ్మిపూఁదూఁపు చెఱకువింటఁ
గూర్చి గుఱిచేసి తనునేయ గొల్లవనిత
మమతఁగని చోరసురతసామ్రాజ్యమునకు
దిట్టతనమునఁ బట్టంబు గట్టుకొనియె. 102

వ. అవ్విధంబున ఘోషకన్యారత్నంబు శైశవయౌవనసమయంబున మన్మథప్రేరితయై
విజృంభించి వర్తించు నప్పుడు. 103

సీ. చిన్నిచన్నులు గోళ్లఁ జీరఁ జెక్కులు గొట్టుఁ
గౌగిలించు మటంచుఁ గదియఁ దివురు
గిలిగింత లొక కొన్ని కలయంగ నెనయించి
మోవి నొక్కు మటంచు మొనసి నిలుచు
నిచ్చకం బిగురొత్తఁ బచ్చిదేరఁగఁ బల్కు
ముద్దిడరా యని యొద్ది కరుగు
బకదారి కివకివ లొకదారి మైఁజూపు
తమిఁ గూడరాయంచు దరికి నేగు

తే. నుపరతికి నెంచుఁ బరిహాస కోక్తులాడుఁ
జేష్ట లెనయించుఁ బొలయల్క చేతఁ గుందు
వెతల నేఁ కారు మదినిట్లు విటులఁ జూచి
చిత్తజోన్మత్తయై గొల్ల చిన్నెలాఁడి. 104

చ. జిగినెఱ వన్నెకాఁ డెదుటఁ జేరినవేళల ముద్దు గుల్క మె
ల్లఁగ నడవందొడంగు ఘన లౌల్యము చూపులఁజూపి మోహపుం
బిగువునఁ బల్కరింపఁజను బెళ్కుచుఁ బయ్యెద కొంగుదీటుఁ, డె
క్కగఁ జిఱునవ్వు నవ్వు నొడఁగూడిన సిగ్గున నేఁగునవ్వలన్. 105

తే. ఇట్లు చరియించు నయ్యింతి యెమ్మె లెఱిఁగి
పొరుగుననె యుండెడు నియోగిపుత్త్రుఁ డొకఁడు
జారశేఖరుఁ డను బ్రహ్మచారి మీఱి
యొంటి పాటైనఁ దెరువులో నొడిసి పట్టి. 106

మ. అసమాలాప మచుంబితాధర మశయ్యాన్యోన్యవిక్రీడితం
బసమాలింగన మస్థిరోత్సవ మధైర్యస్తంబకాంబూలితం
బసుదంతాంక మనిర్భయం బమణికం బస్రస్తనీవ్యాదికం
బసిధారావ్రతమైన చోరరతికార్యం బప్డు సంధించినన్. 107

సీ. చిఱుచెమ్మటలతోడ బెరసిన ఫాలంబు

కసవంటి వీడిన కప్పుఁ గొప్పు
కడురక్తిమము గల్గు గండస్థలంబులు
వెనుకకు దిగజాఱీ వ్రేలు సరులు
పులకలు నిండారఁ బొడమిన దేహంబు
ధూళిధూసరితమై దొరయు వీఁపు
మందస్మితంబగు మధురాధరంబును
మందవీక్షణ నమ్రమస్తకంబు

తే. తడఁబడ వడంకుచుండెడు తలిరుఁదొడలు
వదలిన బిగించి సవరించు వలువ దసరఁ
దిరిగి చూచుచుఁ దనయింటి తెరువుఁబట్టి
గొల్లప్రాయంపుఁ జిల్కలకొల్కి చనియె. 108

క. అది మొదలు జారశేఖరుఁ
డొదవిన యపుడెల్ల గొల్ల యుగ్మలి నెంతో
మదనాహవమునఁ దేల్చుచు
మదిమీఱఁగ మరుని లెంకమానిసిఁ జేసెన్. 109

క. చలివిడిచి జారశేఖరు
కలయిక చవిమరఁగి తెరువు కాఁపెట్టుక ని
చ్చలు లేనిపనుల నెన్నే
నలవఱచుకయుండు విరహ మగ్గలమైనన్. 110

ఉ. కమ్మనిజున్ను మంచినెయి గట్టిమీఁగడతోఁ బెరుంగు చొది
క్కమ్మగు జున్నుబాలు చిలుకమ్మిసిఁ దీసిన వెన్నముద్ద వె
చ్చమ్ముల కైదునాల్గుదివసాలకు మాడలముల్లె లిమ్మెయిం
గిమ్ములఁ దెచ్చియిచ్చు రతికిన్ బతిమాలుచుఁ బిల్చు నిచ్చలున్. 111

తే. ఇటుల నజ్జారశేఖరుఁ డేలఁబట్టి
యింటిలోనున్న వస్తువు లెదురువెట్టి
వలపులకుఁజిక్కి కేరడములకుఁ జొక్కి
సంగమసుఖంబు కొన్నాళ్లు జరిపె గన్నె. 112

ఉ. అంతటఁ బెండ్లిచేసెద మటంచును దత్సతి తల్లిదండ్రు ల
త్యంతమహోత్సవంబునఁ గులాదులతోఁ దగురూపరేఖలన్
గంతునిఁబోలునట్టి మృదుకాయము గల్గినవాని నొక్కశ్రీ
మంతునిఁజూచి తెచ్చిరి కొమార్తె వివాహముఁ జేసి రంతయున్. 113

తే. వేగఁ దలఁబ్రాలు గాఁజేసి నాగవల్లి
యైన పిమ్మట నత్తింటి కనుపఁ దలఁచి
పయన మొనరించి నెమ్మదిఁ బ్రమద మలర
ననుఁగుఁ గూఁతును నల్లుని ననిపి రపుడు.114

ఉ. దువ్వెన తీరుగాఁ బసపుతో నలరించిన బొట్టు నున్నఁగా
దువ్వినకొప్పు వన్నెగల దుప్పట మొప్పు విడెంబు పుక్కిటన్
మవ్వపుఁబోఁగునూల్ రవల మద్దెలు చేతులఁ బూలగాజులున్
నివ్వటిలంగ గోప హరిణీ తరళేక్షణ పోవ ముందటన్.115

సీ. సద్ద్విజరాజ సంశ్రయ మహాస్పదలీల
శాఖలు కకుబంత చయముఁ బ్రాఁక
సాంద్రవర్ణక్రమస్థాయిత్వమున మించు
జట లనంతావాప్తి పటిమ మెఱయ
విష్ణుపదార్పితవిహితవృత్తిఁ దనర్చు
నగ్రముల్ సప్తాశ్వు ననుకరింప
నహిలోకరాడ్భూషణాధారమై యొప్పు
మూలంబు కుండలిముఖ్యు జొరయఁ

తే. దన మహాగమవిఖ్యాతి ధరణిలోన
నఖిలజనులకు నద్భుతం బావహిల్ల
దేటపడఁగాను జూపెడు తెఱఁగు దోఁప
మలసి చూపట్టెఁ బథి నొక్క మఱ్ఱిచెట్టు. 116

క. ఆ వటభూజము చెంగటి
త్రోవను ముందట విభుండు తొయ్యలి వెనుకన్
బోవంగ జారశేఖరుఁ
డావెలఁదికి నెదురుపడియె నంతన్ వేడ్కన్. 117

చ. తమకముఁ బట్టఁజాలక పథంబున ముందరఁబోవు భర్తవి
క్రమముఁ దలంపఁబోక యధికంబగు మోహము నిల్పలేక వే
గమె యెదిరించి వచ్చు నుపకాంతుని వల్లవకాంత తెప్పునన్
గమకముఁజేసి గుబ్బకవ కౌగిఁటఁ దార్చి సుఖించె వేడుకన్. 118

తే. బ్రామికలు దీఱ నన్యోన్య భావమూరఁ
గలయికలు జేరఁ దాపాగ్నికణము లాఱ
సౌఖ్యములు మీఱఁ జేష్టలు సరణిఁ దేఱఁ
జెలఁగె నయ్యిద్దఱకు దృఢాశ్లేషణమ్ము. 119

క. ఆయెడ నిజపతి సతి రా
దాయెనని తలంచి మరి తనుఁ జూచినచో
నాయింతి పతికి హితముగ
నే యనువున బొంకవలయు నెఱుఁగింపఁగదే! 120

క. ఆమాడ్కి హంస మడిగిన
హేమాపతి యనియె నెవ్వరిడు నిక్షేపం
బేమఱక వారె కనవలె
నే మనుచున్ దప్పఁదాల్చె నెఱిఁగింపు మనన్. 121

ఉ. హంసహిమాంశుఁ డిట్లనియె, నయ్యాళివేణిని భర్తచూడ జా
రాంసమునందు వ్రేలు కులటాంగన దేహము కంపమొంద సా
యం సమయాదిఁ గేకివలె నారట మందుచు, “వీఁపుఁ దట్టుమో
పుంసవరా! ” యటంచు విటపుంగవు కర్ణము నాటఁ జెప్పినన్. 122

తే. జార శేఖరుఁ డాగొల్ల సకియనపుడు
వీఁపుఁ దట్టుచు “వెఱవకువే” యటంచుఁ
బలుకరించెడు నంతలోఁ బరువు వాఱి

దాని ప్రియనాయకుఁడు భీతి దాయవచ్చె. 123

క. వచ్చి "యిదియేమి చెలి?" యని
విచ్చలవిడి వీపుఁ జఱచి "వెఱవకు" మని లోఁ
జొచ్చిన భయమున నదరిన,
గచ్చుగ నిట్లనియె గోపకన్యక పతికిన్. 124

ఉ. ముందర నీవుపోవ భయమున్ వెదచల్లెడు నీ వటద్రు సం
క్రందనుఁజూచి గుండెలు వకావకలై వెతఁబొంది యీ దయా
తుందిలు పొందునన్ బ్రతుకు త్రోవకు వచ్చితి లేక యున్న నా
కుం దరి లేక యొంటినిటఁ గుందుదుఁగాదె యనుంగు వల్లభా! 125

క. అని చెప్పి నిజేశ్వరు చే
తను దన మోహంపు విటునిఁ దద్దయుఁ బొగడిం
చి, నళినలోచన వేడుక
దనరారఁగఁ జనియెఁ బతియుఁ దానును సరణిన్. 126

క. అట్టి యుపాయము నీకున్
దట్టిన నృపుపొందు మాటఁదలఁపుము లేదా
గట్టిగ నీమగఁ డెఱిఁగిన
యట్టయినను సిగ్గుచేటు లొఁగదె చెలియా! 127

ఉ. నావిని హంస పల్కు, వదనంబున హాసము దోపఁ బల్కె హే
మావతి "యద్దిరా! మగలమార్చు నెలంతదిగాక యింకఁ గ
దా? వివరించి చూడ వసుధాస్థలిలో" నను నంతలోపలన్
వేవినఁ గేళికాగృహము వేగ చనెన్ నృపమోహమగ్నమై. 128

వ. మఱియు నయ్యహర్ముఖం బప్రకాశమానకావ్యలక్షణంబయ్యును
బ్రకాశమానకావ్యలక్షణంబై యనిద్రాళువనాంతరాళపుండరీకసముదయంబయ్యును
నిద్రాళువనాంతరాళపుండరీకసముదయంబై యప్రస్ఫుటీకృతకువలయంబయ్యును
బ్రస్ఫుటీకృతకువలయంబై యవిభాసమానద్విజరాజంబయ్యును భాసమానద్విజరాజంబై
యవిభాసితతారాళిగణంబయ్యును విభాసితతారాళిగణంబై యొప్పె నప్పుడు. 129

క. ఒక నిముసం బొక మాసం
బొక ఘటికయ యొక్క యయన మొక జా మొక యేఁ
డొక దిన మొక కల్పముగా
సకి గడపెన్ బగలు విరహసంతాపమునన్. 130

క. రవియనెడు కాలచక్రము
దివసాంతప్రళయవేళ దీపాగ్నులచే
దివిఁ గాల్చి యడఁగ నమ్మషి
నివహంబన ఘోరతమము నిండెన్ బెలుచన్. 131

వ. అప్పుడు. 132

చ. చందురకావిపావడ పసల్ వెలిఁజిమ్మఁగఁ జల్వగట్టి, కా
లందెలు సందిదండలును హారములున్ మణికుండలమ్ములున్
బొందుగఁ దాల్చి వాసిలెడు పూలసరుల్ కచసీమఁ జుట్టి పొ

లొ్పొంద, గళాస గందవొడిఁ బూసి మృగేక్షణ వచ్చి నిల్చినన్. 133

క. చూచి కలహంస మిట్లను
వాచావైచిత్రి మెఱయ వనితా! చోద్యం
బై చెలువొందిన యొక కథ
యాచించి నృపాలుకేళి కరుగు మటన్నన్. 134

క. ఆ మధురతరసుధారస
సీమాసామోక్తిధార చెవులకు నెంతో
యామోదము చేసిన విని
హేమావతి యడుగ హంస మిట్లని పలికెన్. 135

## ఆఱవ రాత్రి కథ

### చలిపందిరి బ్రాహ్మణసుందరి తెరువరిఁ గూడుట.

శా. జంబూద్వీపధరారవిందముఖి కంచద్భూషణప్రాయమై
సాంబప్రస్థ మనంగ నొక్కటి మహాస్థానీయ మొప్పారు, ర
మ్యంబై యప్పురిలోన నుండు హరిశర్మాఖ్యుండు విప్రాన్వవా
యంబున్ శోభిలఁజేయు కర్మఠుఁడు కల్యాణాంగి! యాలింపుమా! 136

సీ. బలుకంచు గుబ్బబోర్తలుపులు తీనెల
వాకిలి నడవ చావడియు మగులు
నఖిలవస్తువుల ధాన్యముల కణంజలు
దేవతార్చనమిద్దె తావి పడుక
టిలు వంటకొట్టంబు పలుగాఁడి పసిదొడ్డి
పసపాకుపందిరి బావితోఁట
మడిసంచి దోవతి మడతవ్రేల్దండెంబు
ధమనికుండంబు బృందావనంబు

తే. నక్షతలచిప్ప సాన చిత్రాసనమును
గిండి చిటిచాప పళ్లెంబు గిన్నె పెట్టె
కుశసమిత్పత్రములు పెట్టు గొప్పయటుక
యమరఁ గాఁపురముండు నయ్యగ్రజుండు. 137

చ. అతనికి హేమచిత్ర యను నంగన ద్రుంగినవెన్కఁ జారుభా
స్వతియను ముద్దుగుమ్మను వివాహ మొనర్చిన నింతియొప్పె న
య్యతనుని చేతికత్తి చివుకంతయుఁ బోయినఁ జేవఁజిక్కు స
మ్మతి నెలజవ్వనంబు పొడమన్ జిగిదేఱెడు దేహసంపదన్. 138

క. ఆ పటుకుచముల చందం
బా పెద్ద పిఱుందుమంద మా మోమందం
బా పొంకం బా బింకం
బా పంకజముఖికె కాక యన్యకుఁ గలదే. 139

ఉ. ఆ మధురోష్ఠి గుబ్బకవ నబ్బిన సిబ్బెపుఁదళ్కు లందమా
యా మృదులోరు కన్నుఁగవ నన్నువ వెన్నెలలొల్కు చందమా

యా మితమధ్య సోముకళ లానినమోము మెఱుంగు లందమా
యేమని చెప్పవచ్చు నళినేక్షణ! యా చెలిరూపసంపదల్. 140

తే. వక్రయానంబుతో నాగ చక్రకుచలు
నిలువుఁగన్నులతో దేవ నీలకచలు
నాతి మృదుగతి చపలేక్షణముల కలికి
క్రిందుమీఁ దైరి కాదె పూర్ణేందువదన! 141

సీ. నెఱిగొప్పు మేఘసందేశంబు కనుదోయి
యందమౌ కువలయానంద మరయఁ
బొంకపుమోము ప్రబోధచంద్రోదయం
బధరంబు మణిసార మౌర! చూడఁ
జెలువంపుఁజిఱునవ్వు సిద్ధాంతకౌముది
స్తనయుగంబు రసమంజరి నుతింపఁ
గరరుహంబులకాంతి కావ్యప్రకాశిక
ఘననితంబము రసాయనము తలఁపఁ

తే. దనువలంకార మతనుశాస్త్రములు చూపు
లహహ! మధ్యంబు నాటకం బవనిలోన
విద్యలకునెల్ల మూల మీ వెలఁదిఁ గనిన
విద్యలు పఠింపఁగానేల వేఱె బుధులు. 142

వ. అది మఱియును. 143

చ. బుగడలు నానుతీఁగె మెఱుపుల్ కవకమ్మలు గుండ్లపేరు బ
ల్పగడపుఁజేకటుల్ రవల పల్లెరుపువ్వులు కుప్పెసౌరమున్
జిగికడియంబు లాణిమణి చెక్కిన ముక్కర గిల్కుమెట్టెలున్
సొగసుదలిర్ప నచ్చేలియ సొమ్ముల మెమ్మల నొప్పు నెంతయున్. 144

సీ. కప్పుఁగొప్పు బడావగలఁ జూడని ఘనుండు
వదనంబునకు వింతపడని జనుఁడుఁ
గన్నుల కాశ్చర్యగరిమఁ జెందని వాఁడు
సరసభాషలకు మెచ్చని నరుండు
గబ్బిగుబ్బల తీరుఁ గాంక్షింపని విటుండుఁ
గౌను నుతింపని కాముకుండుఁ
గటికి శిరఃకంప పటిమఁ జూనని మర్త్యుఁ
డంఘ్రులు బాపురే యనని విటుఁడు

తే. నాస్తి యనృతంబు దబ్బర నహి హుళిక్కి
కల్ల మఱియిల్ల లేఁడు భూగతులలోనఁ
గ్రమ్మి జిగిఁజిమ్ము నమ్ముద్దుగుమ్మ హొయలు
చెలువ మెటువంటిదోకాని చిగురుఁబోఁడి! 145

సీ. పాపట యిడి నూనె పంకెనతో నున్న
గా దువ్వి నెఱులు కీల్గంటు వైచు
నెఱ యొయారముతోడ నీటికాఁగుల నీడఁ
జూచి కుంకుమబొట్టు సొంపుఁదీర్చు

గందంబు పూసినగతి గబ్బి జిగిగుబ్బ
కవమీఁద గుంపు అవికఁ దొడుగు
నుమ్మెత్తపూ రీతిఁ గ్రమ్ము కుచ్చెల నేలఁ
జీరాడఁగాఁ జల్వచీరఁ గట్టు

తే. నీటు బెళుకువ దిగజాఱఁ బైఁట చెఱఁగు
జగ్గుతో దోపుఁ గాటుక నిగ్గు కనుల
మిక్కుటపుఁ జూపు మెఱుఁగు తళుక్కుమనఁగ
వెడలు నొకవేళ గృహము న వ్విప్రవనిత. 146

క. పతిరతిని దృప్తిఁబొందక
మతిఁ జపలత పుట్టి యన్యమానవు రతికిన్
హితముపడి మోహదశలన్
బతిమాలఁ గృశించుఁ జారుభాస్వతి యెపుడున్. 147

తే. పురములోఁ గల్గు మోహంపుఁబొగరుఁజిగురుఁ
గోడె నెఱజాణవిటులకుఁ గొంతకొంత
వింత రతితంత్రముల్ నేర్పి విడివడున్న
కంతు మదదంతి పంతంబు గదియఁ దిరుగు. 148

క. ఈలీలఁ గొంతకాలము
బాలామణి సంచరించు ప్రాయమునాఁడే .
కాల్గూఁదియున్న యిందిర
తాలిమిచెడి నిలువకచటు తలఁగిన యంతన్. 149

సీ. కులమహీరుహ మహాక్రూర కుఠారంబు
కోపాగ్ని వృద్ధి కృద్ఘోర నాడి
సంసార సుఖశైల శతకోటి పతనంబు
దేహవ్యథాలతా దోహదంబు
శశిముఖీ దృక్పాత సంరోధి జంబీర
ఫలరసం బతిధైర్యభర్మకషము
ప్రతిభాంబుహృద్గ్రీష్మపవనంబు నిజవధూ
రచిత నిందాసార నిచయ ఘనము

తే. సంతతాన్న సంపాదన సంభ్రమప్ర
యత్న విఘ్నద మతనుక్షుధార్తిదాయి
యమితలఘుతాశ్రయస్థానమై కడంగు
భూరిదారిద్ర్య దోషంబు పొదలె నపుడు. 150

క. అట్టి మహాదారిద్ర్యము
దొట్టిన హరిశర్మ ధృతియుఁ దూలక తృష్టం
గొట్టు పడకుండఁగాఁ దన
పట్టపు టిల్లాలిఁ గష్టపడి పోషించెన్. 151

సీ. పంచాంగములు సెప్పి బాజారులోపల
రంజిల్ల యాయవారంబు లెత్తి
తలమీఁద మంత్రాక్షతములుంచి కలకాపు

టిండ్ల నుపాదాన మెత్తి తెచ్చి
గ్రహణ సంక్రమణాది కాలంబులను రాచ
నగరాశ్రయించి దానములు పట్టి
లలు దర్భలుపూని తీర్థసన్నిధి మంత్ర
ములు సెప్పి నీరుకాసులు గడించి

తే. జన్నిదము లమ్మి గ్రహశాంతి జపముఁ జేసి
శవములను మోచి దుర్దానసమితికొగ్గి
వచ్చునాదాయములు గ్రాసవాసములకు
గాఁగ దినములు గడపె నక్కాలమునను. 152

శా. అంభోజప్రియ తిగ్మదీధితిచయ వ్యాఘాత నిర్భిన్న భూ
గంభీరోరు బిబోద్గతాధరజగ త్కద్రూజరాడ్భోగ భా
కుంభ ద్రత్నఘృణీభ్రమప్రదకనత్సూర్యోపలజ్వాలికా
జృంభ త్పావక మొక్క వేసవి జనించెం గాలకూటాభమై. 153

చ. శరచర సాధ్వసప్రదము సర్వబకౌఘ మదప్రదాయకం
బురుజల హైన్యకారము సముజ్జ్వలసాంద్రమరిచికా సము
త్కర వనరూపకారకము గాఢపయోధివియోగకార్శ్య
కర తటినీతనుప్రదము కాసరభీష్మము గ్రీష్మ మెచ్చినన్. 154

చ. పవలను వర్తకాగ్రణి నభశ్చలసాగరమధ్యమంబులో
రవియను నోడమీఁద నపరక్షితిధృత్పురిఁ జేరరా మరు
జ్జవగతి సుళ్ళఁబెట్టు నదిసాగక చిక్కినమాడ్కి సూర్యుఁ డ
య్యవసరమందు మందగతులానిన దీర్ఘములయ్యె ఘస్రముల్. 155

తే. మల్లికాకుంజ పుంజాబ్ధి మధ్యమున మ
రీచికాస్వాతివృష్టి గురియ జనించి
పత్రపుట శుక్తు లెండలఁబగుల బయలు
పడిన ముత్తెములన మొగ్గ లడరఁ దొడగె. 156

సీ. దేహంబు బలువెట్టదీఱి సిస్తుగనుండఁ
జలువగాఁ బన్నీట జలకమాడి
మనసారయుక్తమై తనరారు పాటీర
పంకంబు తనువున నింకఁ బూసి
విమల నాగరచూర్ణ విహితమౌ మాహిష
దధ్యోదనము ప్రొద్దుతఱి భుజించి
బహుళ లామజ్జక ప్రసవసౌరభ మిశ్ర
శీతల జలముల సేవ గలిగి

తే. కప్పురపుఁ దిన్నె లమరఁ బూఁ జప్పరములఁ
జిగురుఁ బాన్పున వసియించి శీతవాత
జాత కరతాళవృంతముల్ సతులు వీవఁ
బ్రొద్దువుచ్చిరి కొందఱు భోగులపుడు. 157

తే. అట్టి వేసవి వేళ ధనాఢ్యుఁడైన
యచ్చటి నియోగి చలివెంద్ర లాది యందుఁ

బెట్టఁ గట్టడిఁ జేసినఁ బేదలగుటఁ
జారు భాస్వతి హరిశర్మ చేరి రపుడు. 158

సీ. లవణ శుంఠీ జంభల రసానుయుక్తమౌ
నీరుమజ్జిగ కుండ బారు లలర
లఘులయైలానూన లలిత సౌరభమిశ్ర
శీతల జలకుంభ జాత మమర
తీరక కైడర్యచారుగంధము లొల్కు
పలుచని యంబళ్ళ పంట్లు దనర
రవయుప్పు నీరుల్లిరసము నించిన చోళ్ల
గంజికాఁగుల గుంపు కడు రహింప

తే. గంధ బర్హిష్ఠ లామజ్జక ప్రశస్త
కాయమాన ముహుర్ముహరాయమాన
మంద పవమాన ఘనసారబృంద వేది
కాలయ విశాల పానీయశాల యొప్పె. 159

వ. మఱియు నచ్చలిపందిరి గవాక్షాదిసమాకలితవాయుజాతసంచారంబు గావున
రఘురామమనోరంజకంబును, భాంథజనసంతాపహరణంబు గావున
సత్కృతసంగమంబును, గబంధప్రచురంబు గావున దండకావనంబును,
సితాభ్రసంచయకలితంబు గావున శరత్కాలంబును, నమృతసంపూర్ణకుంభంబు గావున
సురేంద్రనివాసంబును, ఛాయాసమేతంబు గావున దపననిలయంబును,
వివిధకుసుమసుగంధబంధురంబు గావున నారామంబును బురుడించు నప్పుడు. 160

క. అచ్చలిపందిరి లోపల
వచ్చుచుఁ బొయ్యేటి పరసవారికి జలమం
దిచ్చుచును జారుభాస్వతి
యచ్చట హరిశర్మ యుండు నా సమయమునన్. 161

చ. ఉపమరి బుద్ధిశాలి వినయోత్తముఁ డప్రతిమప్రభావళీ
తపనుఁ డవార్యధైర్యుఁడు నుదారచరిత్రుఁడు సర్వసత్కళా
నిపుణుఁడు రూపనిర్జితవనేరుహసాయకుఁ డొక్కవిప్రుఁ డా
తపపరితప్తుఁడై జలముఁ ద్రావఁ బ్రపాస్థలిఁ జేరి వేడినన్. 162

తే. చారుభాస్వతి శీతలజలము లపుడు
గిండితోఁ దెచ్చి యిచ్చి వీక్షించి, వాని
చక్కఁదనమున కలరారి సరసకేఁగి
యలఘుసాహసమునఁ దమి నిలుపలేక. 163

క. ప్రక్క లెగఁబొడువ మన్మథుఁ
డక్కోమలి పతికి వెఱవ కానందముతో
నక్కునఁ జేర్చుక పాంథునిఁ
జొక్కుచునుండంగ మగఁడు చూచె లతాంగీ! 164

తే. ఎట్లు బొంకంగవలె నిప్పు డిందువదన
నేర్పు గలిగినదానవు నృపతిమౌళి
కేళి కైతేను నీకిది కేవలంబు

దొడ్డగాదు విచారించి తోనే చెపుమ! 165

క. అనినఁ గలహంస పలుకులు
వినిహేమావతి విచార విపులాబ్ధి మునిం
గినమది నాకిది తెలియదు
వినిపింపుము నీవె యనిన విధహరి యనియెన్. 166

చ. అటువలెఁ జారుభాస్వతి ధరామరుఁ గౌఁగిటఁ జేర్పఁజూచి, తాఁ
జటులతరోగ్రభాష హరిశర్మ యదల్చినఁ దొట్రుపాటునం
బెట్టిలక "యీతనిన్ వినుము పిన్నతనంబున దేశచారియై
పటుగతిఁ బోయె మాతులునిపట్టి సుమీ" యని లేని దీనతన్. 167

తే. కాంతునకుఁదెల్పి మఱిమఱి కౌఁగిలించి
చెమటకణములు తనపైఁట చెఱఁగుచేతఁ
దుడిచి యాతని కేల్వట్టి తోడి తెచ్చి
మేలమాడుచుఁ బానీయశాల కపుడు. 168

సీ. "గొనబుతో నెన్నాళ్లకో సెల్వుగా నేటి
కైన నిన్నెనయ నాకబ్బె"ననుచు
"నీకు నామీదాన నిజముగాఁ జెప్పుమా
నాయందుఁ బ్రేమకద్దా?" యటంచుఁ
"బదిదినా లుండక, పాఱిపోయెదనన్నఁ
బోనిచ్చునా? వెఱ్ఱిదైన" ననుచు
"నీప్రొద్దు సుదివసం బే నోముఫలమొ! నా
మనసులో నెంజిలి మానె"ననుచుఁ

తే. జేరిక లొనర్చి తేనియల్ చిలుకఁబలికి
మోహమూరించి తరిదీపు మోపుకొల్పి
యతనిమీఁదను బతికి నింపితము వొడమ
మున్నె యొనరించి వానితో మురియఁదొడఁగె. 169

క. ఈకరణిఁ జారుభాస్వతి
యాకాంక్షలు దీఱ నాఁ డహర్నిశ మతనిన్
డీకొల్పి రతులఁ, జివురుం
జేకత్తి వజీరు సడ్డసేయక యుండెన్. 170

క. అటువలెఁ గాలోచితసం
ఘటితోక్తి స్ఫూర్తి నీకుఁ గల్గిన భూభృ
న్నిటలాక్షుఁ గదియఁ జిటిపొటి
నటనలఁ బోవమ్మ! కుందనపు జిగిబొమ్మా! 171

చ. అన విని మందహాసము ముఖాబ్దమునన్ జిగురొత్తఁ గర్ణవే
ష్టనమణికాంతి చెక్కుల హుటాహుటి నాట్యము సల్ప, "నౌర" యం
చును దలయూఁచి వేఁకువగుచోఁ, జెలి కేళిగృహాంతరంబునం
దెనసి నృపార్పితేచ్ఛఁ బవలెల్లను ద్రోయుచునుండె నంతటన్. 172

చ. సమయ మహేంద్రజాలకుఁడు సారసమిత్రుఁ డనేటి పద్మరా
గము వెస మాయఁజేసి కుతుకంబున "హా" యని నీలపంక్తులన్

భ్రమపడఁజూచి "ఝా" యనుచుఁ బల్కి సుపాణులఁ జేసి చూపెఁ జి
త్రమనఁగఁ బొద్దుగ్రుంకెఁ దిమిరం బెసఁగెన్ దివినొప్పెఁ దారకల్. 173

క. ఆవేళను గృహకృత్యము
తా వేగమే దీర్చి పేర్చు తమకంబున రా
డ్దేవేంద్రునిఁ జేరఁగ హే
మావతి నెమ్మదిఁ దలంచి మహితోత్సుకతన్. 174

ఉ. దిద్దిన నాభినామము కదించిన మేల్మడి చాఱచీర మై
నిద్దపుఁబూఁత పుష్పములు నించి ముడించిన కొప్పు రత్నముల్
తద్దయుఁగల్గు సొమ్ములు గళమ్మునఁ జొక్కపుఁజుక్క యొప్పఁగా
ముద్దియవచ్చి హంసమణి ముందర నిల్చె, నృపాభిలాషయై. 175

క. నిలిచిన యా హేమావతి
బొలిచిన కరుణామృతంపు భూవితరోక్తుల్
ఫొలయఁగ దృష్టిఁ గనుంగొని
తలచిన పని కపుడు హంసధరణిపుఁ డనియెన్. 176

## ఏడవరాత్రి కథ

### కంసాలి కోమలి ధూర్తుఁడను శిష్యునిఁ గూడుట.

క. "మున్నొక్క పట్టణమ్మున
సొన్నారి మిటారి నేర్పు శూరత్వముఁ గై
కొన్నదియై నడచిన కథ
చెన్నుగ విని పొమ్ము, కడు విచిత్రము కొమ్మా!" 177

తే. అనినఁ జిఱునవ్వు నవ్వి యయ్యంబుజాక్షి
"యేమి చిత్రంబుఁ గల్పించి తింతలోన
శీఘ్రముగఁజెప్పి దయచేసి సెల వొసంగు
మరిగెదను రాజుపొందున" కనిన నపుడు. 178

క. కాదంబవంశ వల్లభుఁ
"డాదృతిని బరాకులేక , యక్కరొ! వినవే!
మోదముతో "నని చెప్పెను
మేదుర మాధుర్యసాధు మేధాఫణితిన్. 179

క. విను మనఁగాననఁగా నిల
ఘనమణివర మనెడు పురము గలదొకటి వినూ
తనకేతన పట జాత ప
వనహత సురసురత ఘర్మవన వారంబై. 180

చ. కమటము కట్లసంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్
ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారు శా
ణము పటకారు మూస బలునాణె పరీక్షలమచ్చు లాదిగా
నమరఁగ భద్రకారక సమాహ్వయుఁ డొండొకఁ డుండు నప్పురిన్. 181

చ. కరఁగను బోతఁజోయఁగను గ్రాఁచి కదించను గమ్మిఁ దీయఁగా
నొరయఁగ వన్నియల్ మిగులనుండఁగఁ జూపఁగఁ బూదెగట్ట రే
కఱుఁగఁగఁ దీయఁ జెక్కఁగను నచ్చున వ్రేయఁగ సుద్దగించఁగా
సొరిది విచిత్ర చిత్రములు సొమ్ములు సేయ నతండు నేరిచెన్. 182

క. కంతు వసంత జయంతుల
సంతసమున గెలువఁజాలు సౌందర్యమునన్
సంతత సంపద్గరిమఁ గృ
తాంత జిదాప్తుని జయించు నతఁడు శుభాంగీ! 183

వ. మఱియు నా భద్రకారకు దుకాణంబు నాడీ ప్రచురంబు గావున శరీరంబును,
శుక్రాంగారప్రశస్తంబు గావున నక్షత్రమండలంబును, గుంభతులాదిసహితంబు గావున
రాశికూటంబును, గాంగేయశిక్ష గలిగినది గావున శిఖండిభండనంబును,
మధూచ్ఛిష్టసంయోగంబు గావున యవననివాసంబును, వప్రోన్నతంబు గావున
మహాపురంబును, మూషికావృతంబు గావున శూన్యాలయంబును, దీక్షసాధనయుక్తంబు
గావున యుద్ధరంగంబును, శ్రావణయోగంబు గావున వర్షాకాలంబు ననుకరించు. 184

తే. ఆతని వధూటి శుకఘోటి నలరుమేటి
యొడయఁ డేలేటి సీమాటి యొఱపు గోటి
కొన నెగయ మీటి యిదియేటి కులు కనేటి
పోటి కెదిరేటి శుభవాడి నీటు మెఱయు. 185

తే. దాని కచ కుచ గళ లక్ష్మిఁ బూనఁ దలఁచి
నీల శైలాబ్దములు మ్రోల నిలిచి నపుడె
కసవు కట్టెలు నీళ్లును గడఁగి మోయఁ
జేసె నేమనవచ్చు నచ్చలువ చెలువు. 186

క. కుందనపు రవలు గుప్పెడు
తుందిలపుం జన్నుఁ గవయుఁదొల (?) తేనెలకున్
విందు లొనరించు పలుకులు
జందురునిం బోలు మోము సకియకె యమరున్. 187

క. కువలయ మా కనుఁగవ జిగి
కువలయ మా వలుఁద పిఱుఁదు కుచకాఠిన్యం
బవలయ మా మోహన తా
ర వలయ మా నఖము లనఁగ రమణి రహించున్. 188

మ. కచశోభా గరిమంబు నెన్నడుము సైకంబున్ మధుప్రాయమౌ
వచన వ్యూహము లోచనాబ్జముల ధావళ్యంబు శృంగార వ
త్కుచకుంభమ్ముల పొంకమున్ ముఖకళాంకూర ప్రభావంబు న
య్యచలశ్రోణికిఁ గాక, యే సకియలం దైనం బ్రవరిల్లునే! 189

సీ. కుప్పె రాగిడిబిళ్ల కుంకుమరేఖ పా
పటబొట్టు కమ్మలు బావిలీలు
లలి సూర్య చంద్రవంకలు సూసకము కెంపు
రవల పల్లేరుఁబూవు రావిరేక
బుగడలు నానుఁగ్రోవులు దీఁగ మెడనూలు

కుతికంటు సరిపెణ గుండ్లపేరు
సరిగె ముక్కర బన్నసరము నుత్తండాలు
కంకణంబులు కట్లు కడియములును

తే. సందిదండలు నొడ్డాణ మందమైన
ముద్రికలు హంసకంబులు మ్రోయుగజ్జె
లలరు బొబ్బిలికాయలు గిలుకు మట్టె
లాది యగు సొమ్ముఁ దాల్చి య య్యబల మెఱయు. 190

క. దాని నెగాదిగఁ జూడని
మానవునిన్ దాని పొందు మదిలో నెపుడుం
బూని తలంపని పురుషునిఁ
గానము త్రిభువనములందుఁ గలవారలలోన్. 191

క. ఆ శుభవాటి మనోహర
పేశల తర మృదుల వాక్య పృథు మాధురికై
యాశపడి మార భూతా
వేశమునఁ జరించు వీటి విటయూథమ్ముల్. 192

శా. నీవీబంధముఁ జక్కదిద్దు? నెఱివేణిన్ లెస్సఁ గైసేయుఁ గె
మ్మోవిన్ జిల్కు దరస్మితంబు, జిగిచూపు ల్వాఱఁగాఁ జూచుచుం
గ్రేవల్ గన్పడఁ జేయు, నెచ్చెలియతోఁ గేల్కేల దట్టించి, వా
చావైచిత్రిని ముచ్చటాడు సకి, తన జారుల్ విలోకింపఁగన్. 193

తే. ఇటుల మదమెత్తి తమిచేత నేపురేఁగి
తిరుగు నవ్వీటఁ గల్గిన ధీర విటుల
పొందునకు నాసపడి పోవ సందులేక
కుందుచుండును విరహార్తిఁ జెంది యెపుడు. 194

వ. అంత. 195

మ. చిగురుంగత్తి వజీరు మాఱుపఱుపన్ జెన్నొందు నొయ్యారపున్
సొగసుంబ్రాయము గల్గువాఁ డొకఁడు మేల్సొన్నారి ధూర్తాఖ్యచేఁ
దగఁ బెంపొందినవాఁడు శిల్పఘనశాస్త్రప్రక్రియ న్నేర్వఁగాఁ
దెగువ న్నిల్చెను భద్రకారునకు నంతేవాసియై వేడుకన్. 196

క. వాని కుశలత్వ సంపద
వాని మనోహారి రూప వర వైభవమున్
వాని ఘన బుద్ధిఁ జూచి య
హీనకరుణ నింటనిల్పి హిత మలరారన్. 197

తే. కీర్తికై భద్రకారుఁ డా ధూర్తునకుఁ ద
నింటనే యన్నవస్త్రాదు లిడుచుఁ గల్గు
పనులు నేర్పుచు నుండంగ భక్తి మీఱ
నలఘుశుశ్రూష సేయుచు నాతఁ డుండె. 198

క. కందువ మాటల బెళుకుల
మందస్మిత రుచిర వచన మాధురి చేతన్

దుందుడుకుఁ జెంద ధూర్తుని
డెందముఁ గరఁగించి చెలి ఘటించెను రతికిన్. 199

తే. ఎడతెగని మోహ మూరించి యేపు రేఁపి,
వేశ్మమున నొంటిపాటైన వేళలందు
మదన కదనంబునకుఁ జాల మరులు కొనఁగఁ
జేసె శుభవాటి ధూర్తుని చిత్తమలర. 200

చ. అలయక భద్రకారుఁడు గృహంబున నుండిన యప్పుడెల్ల వే
డ్కలఁ బను లభ్యసించుచుఁ దడంబడ కాతఁడు లేనివేళలం
జెలఁగుచు వాని భార్యకడఁ జేరి మనోభవకేళికాక్రియల్
తొలఁగక యభ్యసించు శశితుల్యుఁడు ధూర్తసమాఖ్యుఁ డున్నతిన్. 201

తే. స్నానపానాన్నవస్త్రాదిసంగ్రహంబు
భద్రకారుఁడు సెలవిచ్చెఁ బనికి మెచ్చి
వాని చెలువంబునకు మెచ్చి వలచినపుడు
చాల శుభవాటి సెలవిచ్చె సంగమంబు. 202

క. ఈ తీరు సకలభోగము
లాతతగతి నడచుచుండ నా ధూరాఖ్యుం డా
తలిరుఁగత్తి గల దొర
చేతి కటారికిని సడ్డ సేయక యుండెన్. 203

వ. అయ్యవసరంబున. 204

ఉ. ఆదర మొప్ప నొక్క దివసాంతమునందు దుకాణమున్ బహి
ర్వేదిని భద్రకారుఁ డమరించుక ధూర్తునిఁ జూచి మిద్దెలో
బోదియమీఁద నున్న తుల పొందుగ వే కొని రమ్మటంచు స
మ్మోదముతోడ నంపఁగ సముద్రగభీరుఁడు పోయి చూడఁగన్. 205

తే. వాని యొయ్యార మొక వింత యైన నపుడు
చూచి వలరాజు రాజ్యంబు చూఱఁ గొనఁగఁ
దలచి శుభవాటి ధూర్తుతోఁ దారసిల్లి
తలుపు గదియించి రతికేళి సలుపుచుండె. 206

క. చెన్నారి చుంబనంబులఁ
జిన్నారివగల్ వినోదచేష్టలుఁ జిన్నెల్
గన్నారఁ జూపి యపుడా
సొన్నారి మిటారి ధూర్తు సురతులఁ గరఁచెన్. 207

క. ఈ లీల మదనకదనా
లోలత్వముఁ బూని యింటిలోపల ధూర్తుం
డాలస్యం బొనరించిన
దాలిమి చెడి భద్రకారధన్యుఁడు చింతన్. 208

చ. తడసె నదేమొ ధూర్తుఁ డల దర్పకుఁ బోలినవాఁడు భార్యయుం
గడు రతిఁబోలు రూపుసిరి గల్గిన జవ్వని యేమి ద్రోహమున్
గడిమి నొనర్చిరో యనుచుఁ గాలటు నిల్వక వచ్చి గట్టిగా

గడెనిడు తల్పుఁ జూచి ఘనగర్జితభాషలఁ బిల్చె శిష్యునిన్. 209

తే. అప్పు డాజాయ యేచాయ నధిపు మదికి
హితముగా బొంకవలయునో యెఱుఁగు మనుచు
హంస మడిగిన దరహాస మలర మోము
వంచి హేమవతీ సాధ్వి యంచ కనియె. 210

క. ఒకరొకరి బుద్ధి యెట్లో
యకటా! తెలియంగ బ్రహ్మకైనను వశమా?
కికురించక యిది నీవే
యకుటిలగతి నుడువు మనిన హంసం బనియెన్. 211

మ. విను హేమావతి! భద్రకారుఁ డటకున్ వేగంబుగా వచ్చి శి
ష్యునిఁ బిల్వన్ భయమంది వాఁడు జనితాస్తోకవ్యథన్ గుంద నా
తని భీతిల్లకు మంచుఁ జెప్పి తుల సూత్రంబుల్ వడిన్ ద్రెంచి వై
చి నిరాఘాటత నేఁగి వాకిలి సడల్చెన్ నాయకున్ దూఱుచున్. 212

వ. అట్లు వాకిలిఁ దీసి భర్తతో మఱియు నిట్లనియె. 213

చ. “తులఁ గొని తేను మంచి గుణధుర్యునిఁ బంపితి రౌను మీరలుం
బిలిచినఁ జూడవత్తుఁగద! భీతిని దారములన్ని త్రెంచి యీ
తలుపు గదించి సూత్రములు త్రాసునఁ గూర్చుచునున్న వాఁ డిసీ!
పలువ మఱెంత నేర్ప” రని భర్తకుఁ జూపి దురుక్తు లాడినన్. 214

తే. “ఎంత లే దింతె కద! దీని కిట్టు లనకు
తానె పోయెను గాక చేఁ దప్పి పోవ
నేమి సేయుదు?” మని ధూర్తు నితర మనక
డెందమున సందియ మొకింత చెంద కపుడు. 215

క. ఎప్పటివలె నుండి విభుం
డప్పగిదిన సూక్ష్మబుద్ధి నారయవలె నో
యొప్పులకుప్పా! నీ పని
చెప్పఁగ హాసంబు ముదముఁ జెలువము దోపన్. 216

క. ఆవేళ శిరఃకంపము
గావించి యయారె! యని చొకాటంబగు కే
ళీవాసముఁ జేరెను హే
మావతి, నపమోహమగ్నమానస యగుచున్. 217

మ. కనదృక్షాలయమౌ మహాబిలమునన్ గన్పట్టు భాస్వచ్ఛమం
త నవానర్ఘమణిం దటిన్యధిప సత్రాజిత్తునిం జేర్చెనో
మును దాఁ గైకొని కాల కృష్ణుఁడన నంభోజాప్తుఁ డప్పశ్చిమాం
బునిధిం జేరెఁ దదబ్జనాభరుచినాఁ బొల్పొందెఁ గ్రొంజీఁకటుల్. 218

వ. అయ్యవసరంబున. 219

సీ. విటమనోధృతి శిలావిచ్ఛేదతాటంక
తాటంకమణికాంతితతులు వెలుఁగఁ
బల్లవమానసపటుధైర్యహారక

హారకళాస్తోమ మౌఘళింపఁ
గమనహృద్దార్ఢ్యాబ్జగణశీతకంకణ
కంకణాంగదములు ఘల్లు రనఁగ
జారాత్మదృఢతాసమీరాహిసంతాన
సంతానకుసుమవాసనలు వొలయ

తే. యువజనస్వాంతకాఠిన్యదవసమీర
బంధుఘనసారఘనసారగంధసార
సౌరభోదారకుంకుమస్థాసకంబు
దనర రాయంచకడకు నత్తరుణి వచ్చె. 220

ఉ. వచ్చినఁ గాంచి హంసకులవల్లభుఁ డా తలిరాకుఁబోఁడి మై
లచ్చికి నిచ్చగించి యనులాపకలాపకళారసజ్ఞతన్
మెచ్చి, "నృపాలుపాలికిని మేకొని పోయెదవేమొ పొమ్ము! నా
ముచ్చట లాలకించి కడు ముద్దులు గుల్కెఁడు ముద్దియా!" యనన్. 221

క. అని పల్కు నంచ వాచాꣳ
తమమాధుర్యమునఁ జొక్కి తత్కథ యేమీ
వినియెద నన హేమావతి
కనురాగం బొప్ప రాజహంసం బనియెన్. 222

## ఎనిమిదవ రాత్రి కథ

### కోమటి దంపతులు సంకేతస్థలమునఁ బొరపాటునఁ గూడుట

మ. కల దుద్యర్ధ్వనజ శాటికా పటల జాగ్రద్వాత సంఘాత సం
చలనాభ్రస్థలి నిల్వ నల్కి తదవస్థం బాపఁ దద్భూమిరా
ట్కులమౌళిన్ శరణంబు వేఁడుటకుఁ దోడ్తో వచ్చెనో యంబుదం
బు లనన్ మత్తకరుల్ సెలంగ నొక ప్రోల్ పున్నాగపుంజంబనన్. 223

సీ. గోళ్లు రిక్కల జోళ్ల వేళ్లు మావి చిగుళ్లు
చెల్లు పొక్కి ళ్లుల్లసిల్లు సుళ్లు
తూండ్లు బాహులు గిండ్లు చెండ్లుబో! పాలిండ్లు
కండ్లు మీల్ సింగాణివిండ్లు బొమలు
చూపు మారునితూపుఁజోపు మోముల యేపు
బాపురే! శశిరూపు మాపనోపు
గప్పు పెన్నెఱికొప్పు లొప్పు చీఁకటి చొప్పు
గప్పు నవ్వులు విప్పు కప్పురములు

తే. పొంగు బంగారు రంగు లనం గడంగు
నంగలతల నెసంగు మెఱుంగు గుంపు
లనుచు నిజరూప వైభవం బఖిలజగము
లభినుతింపఁగ వెలయుదు రచటి సతులు. 224

వ. వెండియు నప్పురంబు సర్వమంగళాభ్యుదయనివాసంబై హిమమహీధరంబు పోలికిని
సుధర్మాస్పదరూపరమ్యంబై మేరుశిఖరిభాతిని బురుషోత్తమశోభితంబై శ్వేతద్వీపంబు

కరణిని బుణ్యజనానంద సమృద్ధిదంబై యలకాపురంబులీలను విబుధ మనోరంజకంబై
యమరావతీ పట్టణంబు చాడ్పునను రాజహంసాభిశోభితంబై పద్మాకరంబు వైఖరిని
జతురాస్యవాణీ ప్రచురంబై సత్యలోకంబు వీఁకను నొప్పు. 225

## కోమటిల్లు-అంగడి దినుసులు

సీ. గొడియబీగము లాపుగొలుసు లోపలియడ్డ
మ్రాను బోర్తలుపులు మగులుగోడ
కాయధాన్యంబుల కణఁజముల్ బియ్యంపు
గరిసెలు దినుసులు గల కొటార్లు
మిద్దె చిల్లరల నమ్మెడు దుకాణము బచ్చు
మళిగె బొక్కసపిల్లు మచ్చులుఁ దుల
కషణముల్ నాణెముల్గల కట్లసంచి గో
తము లెక్కకడితెంబు దడము భరణి

తే. తక్కటి సమస్త వస్తువుల్ దనరు నటుక
బావి నుగ్గుల కుచ్చెల పాడిపసుల
గాఁడి జాలాది దివెగూఁడు గాబుతొట్టి
యొప్పు ధనచిత్తుఁ డను బేరి యుండు నచట. 226

సీ. జాజికాయలు రాస్న జాపత్రియు హరిద్ర
నాగర గంధక నాభి రసము
లతిమధురంబు తుత్థాభ్రకైలా శిలా
జిత్తులు మురుదారుసింగు హింగు
వన్నభేదియు వస యక్కలకర పంచ
లవణ చవ్యములు బోళము మణిశిల
పిప్పళ్లు కోష్టువు పిప్పలీమూలముల్
హరిదళ నాగకేసరము లింగి

తే. లీకము సదాపవేళ్లు ధాన్యాకములును
గటుకరోహిణి పటిక జంగాలపచ్చ
కర్పురియుఁ గారవియు రేణుక మతివసయుఁ
దాళకము మాంసి నఖము నేపాళములును. 227

తే. కారపాషాణములు నభ్రకంబులైదు
గ్రంథి తగరంబును యవానికా ద్వయంబు
కచ్చురములు మరాటి మొగ్గలు కుళుత్థ
కుసుమములు కుందురుష్కము లెసఁగఁ గలవు. 228

సీ. గంటు బారంగియుఁ గంకుష్ఠమును మెంతి
మంజిష్ఠ జిలకట్టి మ్రానిపసపు
విషకంటకాలామ్లు వేతసంబును నీరు
చించలంబును బులిచించలంబు
జీరకంబును నల్లజిలకట్టి పుష్కర
మూలంబు కాంపిల్యమును సముద్ర
ఫేనంబు ధాతకీసూనంబు సాసువు

లుప్పళులును గజపిప్పలియును

తే. గాకమాచియు సౌజేయకంబు చిత్ర
మూల గోరోచనములుఁ గాపోతతార్క్ష్య
శైలసౌవీర రసముఖాంజనములు వెలి
గారమును గల్గియుండు నబ్బేరి యింట. 229

వ. మఱియును. 230

సీ. వింతగాఁ బుంజీభవించి నానాధాన్య
ముల రాసులుండెడి నిలయములును
సకల రత్నాకర స్థలములై యేకీభ
వించి విస్మయమిచ్చు వేశ్మతతులు
నఖిలదేశంబుల నమరు నాణెములఁ బుం
ఖీభవించిన చిత్ర గేహములును
జీని చీనాంబరానూన బృందంబుల
మందీభవించిన మందిరములు

తే. సర్వ రసవర్గములు టంకసాల వేయు
చావడి హమాదినుసు మేలు సరకుఁ గలిగి
నాల్గు దిక్కుల పేటల నగరజనుల
కలర నమ్ముచు ధనచిత్తుఁ డచట వెలయు. 231

క. వానికి వసుమతి యనఁగా
మానిని విలసిల్లు నొకతె మదనునిచే నా
నానవసుమపూజితమగు
చీనీజముదాళి యనఁగఁ జెలువు దలిర్పన్. 232

ఉ. ఆబిడ మోముగోముజిగి యాబిడ ముద్దుల కావిమోవిరం
గాబిడ కప్పుఁగొప్పుసొగ సాబిడ సూరెల కోపుచూపుజ
గ్గాబిడ గబ్బిగుబ్బసిరు లాబిడ లేదననైన కౌనుసొం
పాబిడ యారుతీరు చెలియా! వచియింపఁదరంబె యేరికిన్. 233

క. అలరుంబ్రాయపుఁజిన్నెల
కలిమిన్ రంజిల్లి, మెఱుఁగు కరుగునఁ బోయన్
విలసిల్లు నటన పుత్రిక
పొలుపున నవ్వీటిలోనఁ బొలఁతుక మెఱయున్. 234

చ. పొలతుకవేణి కృష్ణతను బూనినయంతనె మోము సూడుచేఁ
దలఁకి విధుస్థితిం దనరెఁ, దాళక చన్నులు నచ్యుతాకృతిం
బొలిచె, సహింపలేక నడుమున్ హరిరూపు వహించె, నిట్టి వా
ర్తలకు మధుద్విషత్త్వమును దాల్చెను జక్కెరలొల్కు మోవియున్. 235

సీ. కులగోత్రములవారి నిలిపి కట్టెలు నీళ్ళు
మోయించుచుండెడి ములుచఁదనము
తనుఁగన్నవారలఁ దన్ని తొక్కుకనిల్చి
చెలఁగి పంకావాప్తిచేర్చు సూడు
వినుతకళాఢ్యుఁడౌ ద్విజరాజు ననిశంబు

దోషాకరునిఁ జేయు దూషణంబు
ఘనరసస్థితిఁ జెంది తనరు మానససీమ
బహుభంగములఁ గూర్చి పడెడు నగడు

తే. బ్రహ్మ వారించి కొనియె నప్పద్మనేత్ర
కలరు కుచశైలములును హస్తాంబుజములు
నవ్యముఖ చంద్రబింబంబు నాభిసరసి
మెఱయఁ గౌశల్యశక్తి నిర్మించి మించి. 236

క. అంబుజముల బింకంబులఁ
గంబులను నయననయుగళము గళముఁ గుచంబుల్
చెంబులఁ గ్రొంబగడంబుల
డంబుల మోవి నగుననఁ బడంతి యెసంగున్. 237

క. డాలా మెఱుఁగులు గ్రొంబగ
డాలా నెత్తావిమోవిడంబులు కోదం
డాలా కనుబొమ లతనుని
డాలా వాల్చూపులన మిటారి రహించున్. 238

ఉ. గుబ్బలనీటు మోముపస కుంతలబృందమునిగ్గుఁ గౌనులో
జబ్బుఁదనంబు కన్నుఁగవచందము చెక్కులతేట మోవి నున్
గబ్బిచకచ్చకల్, రచనకాంతి కటిస్థలియుబ్బు కంధరం
బబ్బుర మారుతీరు దరహాసవిలాసము వింత చూడఁగన్. 239

తే. దాని సొగసాత్మలో మెచ్చి తలఁ గదల్చి
కేరి మీసంబుపై ముద్దుఁగేలు వైచి
యడరి నిట్టూర్పువుచ్చి, యయారె!
యనని మానవుఁడు లేడు ధారుణిలోనఁ జాన! 240

క. అటువంటి రూపరేఖా
పటిమన్ దనరారియుండు భామిని రతులన్
ఘటియింపక పరతరుణీ
విటుఁడై ధనచిత్తుఁ డెపుడు వెలయుం జెలియా! 241

తే. అటువలె నిజాధినాయకుఁ డన్యమృగదృ
గనుభవాసక్తచిత్తుఁడై యహరహంబుఁ
దిరుగఁ దనమీఁదఁ బసలేని తెఱఁగుఁ జూచి
వసుమతియుఁ గాంచె జారాంకవాహనంబు. 242

క. పతినడచునట్ల నడచెడు
సతియ పతివ్రతయటండ్రు సజ్జను లనుచున్
బతి పరదారలఁ గూడఁగ
సతి జారులఁ గూడఁదొడఁగె సతతము వేడ్కన్. 243

తే. ఇటుల నా వైశ్యదంపతు లేపురేఁగి
మనసు లెచ్చోటఁగల్గిన మరులుకొల్పి
నెఱి మరునితూపు తమచూపు నిర్గమంబు
వెట్టి మరుచివ్వ కేఁగుదు రెట్టులైన. 244

క. ఈతీరు కొంతకాలము
నాతియుఁ దానును బరేచ్ఛ నడచుచు నొకనాఁ
డాతతమదనశరాహత
చేతఃకంజాతుఁడై నిశీథిని వేడ్కన్. 245

క. అత్తింటి కోడలికిఁగా
హత్తుక నతఁడుండె, నొక యువాగ్రణికొఱకై
యత్తన్వి యటకె పోయినఁ
జిత్తజుఁ డెసకొల్పె వారి చిత్తము లలరన్. 246

తే. తాను గోరిన కన్య యీ తరుణి యనుచుఁ
జేరె నాసక్తిచే ధనచిత్తుఁ డపుడు!
ఆ యువాగ్రేసరుం డీతఁ డౌనటంచుఁ
గదిసె వసుమతి యత్యంతకాంక్షతోడ. 247

వ. అయ్యవసరంబున. 248

మ. సహసాసంఘటిత స్తనగ్రహణ సంజాతాంగ రోమోద్గమం
బు, హఠాచ్చుంబిత పాటలాధర ముఖాంభోజాక్షిగండంబు, దు
స్పృహ నీవీచ్యుతి కంచుకాహృతి నఖాంచద్దంతగాఢక్షతా
వహనం బిర్వుర కయ్యె సంగమము దిగ్వారార్చితేక్షాళియై. 249

మ. కలయికల యారజంబులఁ
గులసతిగా నతఁ డెఱింగె గోమలి మగఁ డీ
యలఘుఁడని తెలిసె నపుడెటు
వలె నచ్చెలి బొంకవలయు? వనితా! చెపుమా! 250

తే. అనిన హేమావతీభామ హంసదిక్కు
చూచి యది యెటు బొంకెనో చోద్య మహహా!
తెలియఁగాఁజాల నిది నీవె తేటపడఁగఁ
దెలుపుమని పల్క రాయంచ తెఱవ కనియె. 251

క. ఆవేళ నాయకుఁడు కో
పావేశహృదంబుజాతుఁడై, “యీ నిశితో
నీవిటకు నొంటి నేటికిఁ
గా వచ్చితి?” వనుచుఁ గినియఁ గామిని యనియెన్. 252

తే. మగఁడ! నామీఁద నీకింత మమత లేని
తెఱఁగుఁ గన్గొని కాళికాదేవి కేను
బడుగుఁదనమున మొక్కి, “నా పతిని రతికిఁ
గూర్పు నీ సేవ సేయింతుఁ గోర్కి మీఱ. 253

క. అని వేఁడుకొనిన యప్పుడె
ఘనకరుణామృతకటాక్షగరిమను గాళీ
జనని ననుఁజూచి, “పో!
పతి నెనసెద” వను నింతలోన నిట నెఱిఁగితి నిన్. 254

ఉ. వింతలు కాళికాజనని విశ్రుతసత్యము” లంచుఁ బల్కఁగా

నంతకుమున్నె యచ్చెలియకై చనుదెంచిన జారుఁ డొక్క కుం
జాంతర సీమనుండి, "యిది యౌనిజ" మంచు వచింప వర్తకుం
డెంతయు విస్మయాకులితహృత్పుటుఁడై నిజభార్య నున్నతిన్. 255

తే. స్తుతులఁ గరఁగించి సాష్టాంగనతు లొనర్చి
క్రుచ్చి కౌఁగిఁటఁ జేర్చి నీకోర్కు లలరఁ
జేసెద నటంచు బాసలు చేసి సతిని
దొడరి ధనచిత్తుఁ డింటికిఁ దోడి తెచ్చె. 256

క. అది మొదలుగఁ బరభామలఁ
గదియక ధనచిత్తుఁ డెపుడుఁ గాంతామణికిన్
ముదమలర వశ్యుఁడై తగఁ
బొదివెను, నీ కట్టినేర్పు పొసఁగినఁ బొమ్మా! 257

క. అన విని నాసికఁ దర్జని
యునిచి కడుశిరంబుఁ ద్రిప్పి "యోహో! చిత్రం"
బని తెల్లవాఱుచుండుటఁ
గని హేమావతి వియోగకలనన్ జనియెన్. 258

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పిన విని, సంతోషించి, నలుం డా తరువాతి వృత్తాంతంబుఁ
జెప్పుమని ప్రార్థించిన. 259

మ. స్మరవాత్సల్యవిశేషరక్షిత వనీమాతంగ! మాతంగసం
హర యోషిన్నుతపాదపంకరుహ శోభాభంగ! భాభంగభా
స్వర సర్వామర మౌని చిత్తజలరుట్సారంగ! సారంగరా
ణ్ణిరవద్య స్తుతిజాత ముత్పులకవన్నీలాంగ! నీలాంగదా! 260

క. సవనాసన జగదవనా!
దవనామ విషాగ్నిహరణ దారుణభువనా!
భువనాధిప నుతసవనా!
సవనాభ్ర ద్యుతిజితార్క జాసరసవనా! 261

పృథ్వీవృత్తము.
కులాచల కులాచలావలయ కూట ఘోణీట్ఫణీ
ట్తలాతల తలాతలాది జగదభ్రదిగ్గార్ఢ్య హృ
త్కళాధర కళాధర ప్రబలకార్ముకారోప కృ
త్కళాధర! యిలాధరప్రతిమ ధైర్యచర్యాకరా! 262

గద్యము.
ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధి
పూర్తిమాచంద్ర నిస్సహాయకవిత్వ నిర్మాణ చాతుర్యనిస్తంద్ర
శ్రీరామనామపారాచుణ నారాయణామాత్య
ప్రణీతంబైన హంసవింశతి యను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము

శ్రీజానకీక్షణోత్పల
రాజా! రాజాధిరాజ! రాజన్నిజసే
వాజాతహర్ష మునిజన
తాజలరుహచండధామ! దశరథరామా! 1

వ. అవధరింపుము. ప్రత్యుత్పన్నమతి నలరా జన్యున కిట్లనియె. అట్లు ప్రభాతసమయంబు
గావచ్చినం గనుంగొని. 2

మ. చని పూఁజప్పర మొప్పుచుండెడు మణిసౌధంబులోఁ గెంపుఁజా
మొనముక్కుల్ గల పచ్చఁజాచిలుకకోళ్లొప్పొందు బంగారపుం
బని రంగారెడు తూగుటుయ్యెలపయిన్ బాగొప్ప మేన్సేర్చి యా
వనజాతాక్షి దినాంతవేళ మనుజస్వామిస్పృహాధీనయై. 3

చ. మిడిగల వజ్రపున్ రవలమిన్కుల కమ్మలు జాతికెంపుఁజా
కడియములున్ సుపాణుల చౌకాటపుహారములున్ మృగీమదం
బడరెడు పట్టుచీర సొగసౌ నసఁదాల్చి నృపాలు కేళికిన్
నడిచె వధూలలామ తమినాటిన చిత్తము తత్తరింపగన్. 4

క. ఆయెడ హంసకులాగ్రణి
యా యోషామణినిఁ గాంచి యనుపమ వచన
శ్రీ యలరఁగ "నొక చిత్రో
పాయపుఁ గథ విను" మటంచుఁ బలికి వచించెన్. 5

## తొమ్మిదవరాత్రి కథ

### ముచ్చివాని భార్య తిరునాళ్ల గోవాళ్లఁ గూడుట

ఉ. సాలము మిన్నునంటి ఘనసంపదఁ గాంచ నగడ్త యూర్వ్యచేఁ
దాళ కనంతభోగములు తద్దయుఁ బద్దునఁ దాను జెంద నౌ
మేలనఁ గోట యున్నతియు మిక్కిలి ఖేయము లోఁతు గల్గి శో
భాలలితంబనంగ నొక పట్టణ మొప్పు నితంబినీమణీ! 6

క. ఆ వీటిలోన రంగా
జీవ కులాంభోధి పూర్ణ శీతమయూఖుం
డై వెలసి చిత్రఘనుఁ డనఁ
గా వార్తకు నెక్కి యొకఁడు కాపుర ముండున్. 7

తే. హరిత హారిద్ర కృష్ణ రక్తావదాత
శబల పాటల ధూమల శ్యామ కపిశ
వర్ణములఁ గూర్చి చిప్పల వాసె లునిచి
చిత్తరువు వ్రాయు గుళ్లలోఁ జిత్రఘనుఁడు. 8

క. సుర విద్యాధర కిన్నర

గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ హరి
ద్వర యక్షాసుర నలినజ
హరిహర మర్త్యర్షివరుల నతఁడు లిఖించున్. 9

## మృగ పక్షుల పట్టి

సీ. హరి కరి మృగ ఖడ్గ కిరి తరక్షు ద్వీపి
సైరిభ గోకర్ణ శరభ చమర
గంధర్వ రోహిష గవయ భల్లుక రామ
శశ జంబు కోష్ట్రాశ్వ కోక
వామీ ఖరోరణ శ్వా నౌతు కపి బభ్రు
సరటర్శ్య లూతాఖు సర్ప మకర
శతపదీ బస్త మత్స్య ఢులీ కుళీరాళి
గౌధేయ రక్తపా కమఠ నక్ర

తే. గో మహిష వృష భేక చిక్రోడములను
సింగిలీకము చిఱుపులి చెదలు పురువు
కొక్కు వెంట్రువు నలికిరి కొర్నలాది
గాఁ గలుగు జంతువులఁ జిత్రఘనుఁడు దీర్చు. 10

తే. గరిమి డిబ్బంది చొఱపందిగాఁడు మంద
గరడ బెగ్గోలు రేచు గర్గరము రాళ్ల
రాచి పెంకుల జెట్టి పున్నాచి పక్కి
పేచి చెక్కెల చేరను పేళ్లఁ గలుగు. 11

వ. పులుగులను, మఱియు (పూరణము) 12

సీసమాలిక. గరుఁడుండు సంపాతి గండభేరుండంబు
చీకురా యాడేలు జెముడుకాకి
వార్యము బైరి జావళము సాళ్వము డేగ
గూడబా తుల్లంగి కుంద టీల
పాల నారాయణపక్షి పాముల మ్రింగు
డంచ వేష్టము గ్రద్ద క్రౌంచ మాబ
లగు లోదె గొరకు తెల్లని పంత బలసట్టె
గూబ శంబర కాకి గుబిలిగాఁడు
నామాలకేతఁడు నల్లాస కప్పెరు
కాకి యంజిటిదారిగాఁడు మూఁగ
చిందర లకుముకి చిఱుత తీతువ కోడి
కారుకో డేకుల నారిగాఁడు
మునుఁగు కోడియు డాల ముట్టికోడియు బోద
పొన్నంగి కకళేటి బొల్లికోడి
గొంగడి కక్కెర గొక్కెర గొరవంక
పూరేలు కనుపెంటి నీరుకాకి
వెలిచె లావుకపిట్ట చిలుక జీనువకౌజు
పెడిస కేర్జము డబ్బు బెలవ నెమిలి
జిట్టువ మునుగపూజిట్టువ గిజిగాఁడు

వల్లడ పొడిపిట్ట వంగపండు
బరతము కోకిల పసిరికె తంగేడు
గొరవంక జక్కవ చెఱువుకోడి
పట్టుజీనువు కొంగ పాపేరు పిచ్చుక
పోలిక పిక్కిలి మీలమ్రుచ్చు
చిలుక చకోరంబు జిబ్బిటాయ జటాయు
కొండపిచ్చుక వానకోకిలయును
మ్రానుపొక్కటిగాఁడు మాలకాకి బెనాసి
పాపెర గొరవంక పందికైర
గబ్బిలంబును జాతకము కంకచిటి చెల్వ
పొనుపెంటి యేట్రింత భూతపోఁతు
గున్నంగి కనకాక్షి గుడిసె బయ్యకపుల్ల
సీతువు బెగ్గురు జిక్కు తురుక

ఆ. పికిలి నేలనెమిలి పెనుగువ్వ బకదారి
పావురాయి సివఁడు పలువరింత
చదులుకోడి గువ్వ వదరుతోఁకల వేడి
యాడియైన పక్షు లతఁడు దీర్చు. 13

వ. అదియునుం గాక. 14

ఉ. వాని మనోహరాంగవిభవంబును వాని ముఖేందుకాంతియున్
వాని పటూక్తివిస్ఫురణ వాని విలోచనదైర్ఘ్యసంపదల్
వాని యురస్స్థలోన్నతియు వాని భుజప్రతిభావిశేషముల్
మానిని! యేమి చెప్ప, నసమానము లౌను తదీయవైఖరుల్. 15

క. అతని గృహమున విద్యా
చాతురి కలరారి నృపులొసంగ రహించున్
జాతిహయవస్త్రభూషణ
మాతంగద్రవ్యమణిసమాజము లెపుడున్. 16

క. పౌరుషముఁ దారతమ్యము
కారుణ్యము దానధర్మగరిమయుఁ గల వి
ద్యారసికత్వము వినయము
గారవముం గలిగి చిత్రఘనుఁ డట్లలరున్. 17

క. ఆ చిత్రఘనున కల వల
రాచవజీరుని జిరాగుజానకు నెనయై
సూచింపఁ దగిన సొగసుది
వాచాలి యనంగ నొక్క వనిత చెలంగున్. 18

ఉ. ఆ కమలాక్షి చంచలదృగంచలసీమల తళ్కుబెళ్కులా!
యా కలకంఠకంఠి యలరారు సుధారస మొల్కు కుల్కులా?
యా కనకాంగి యంగరుచి హాటకకోటులఁ జిల్కుకళ్కులా?
హా! కుటిలాలకా! సరసిజాసనుఁ డైనను నేరఁడెంచఁగన్. 19

క. హరులా పల్కులు, తుమ్మెద

గఱులా కచరుచులు, నడలు కరులా కదళీ
తురులా తొడ లిందుని బి
త్తరులా గోల్లెంచఁ బ్రౌఢతరులా? సరసుల్. 20

సీ. మాటలా? యమృతంపుఁ దేటలా? కపురాల
మూటలా? యని జారకోటు లెన్నఁ
గన్నులా? తెలిదమ్మి చెన్నులా? మగతేటి
యన్నులా? యని పల్లవాళు లెన్నఁ
జేతులా? సుమలతా జాతులా? కిసలయ
ఖ్యాతులా? యని యుపకాంతు లెన్న
గుబ్బలా? యపరంజి లిబ్బులా? రుచిమించు
దిబ్బలా? యని పాంథధీరు లెన్న

తే. గోరులా? రిక్కసొరులా! కులుకుఁ దళుకు
నవ్వులా? జాజి పువ్వులా? నాటు నీటు
చూపులా? వాడి తూపులా? సొలపుఁ దెలుపు
ననుచు విటు లెన్నఁదగు నింతి, యతనుదంతి. 21

చ. వగ లిగురొత్త, జిత్తరువు వ్రాయుము సారెకు దీనిఁ జూచుచుం
దగ నవి పద్మసంభవుఁ డుదారదయామతి మీఱ మేలుబం
తిగ నొనరించి తత్పతికిఁ దేకువ నిచ్చిన మేటి జాళువా
జిగిబిగి గ్రమ్ము బొమ్మ యన సింధురగామిని యొప్పు నున్నతిన్. 22

తే. కురులు ఘనసంపదలఁ జెంది కొమరుమిగుల
ముఖము రాజవిభూతిచే మురియఁదొడఁగెఁ
గటి మహాచక్రవిభవముల్ గాంచె ననఁగ
నెలఁగు వాచాలి గమననిర్జితమరాళి. 23

ఉ. ముద్దులు గారు నెమ్మొగము మోహరసంబులు చిందు గుబ్బలున్
దిద్దినయట్టు లుండి జిగిఁ దేఱెడు చెక్కులు కావిమోవియున్
నిద్దపుజాళువా పసిఁడినిగ్గులు జిల్కు నయారె! దేహమున్
దద్దయు నెన్నఁగా వశమె? దాని నవీనవిలాససంపదల్. 24

తే. దాని వగలకు లోఁజిక్కి దర్ప ముడిగి
దర్పకాస్త్రాగ్నికీలదందహ్యమాన
మానసుడుఁగాని నరుఁడు భూమండలమున
వెదకినను లేఁడు సుమ్ము! సాధ్వీలలామ! 25

చ. అది తమయూరిదేవళమునందు దయ న్నెలకొన్న భక్తకా
మదుఁడగు రామచంద్రపెరుమా ళ్లలరం దిరునాళ్లలోన నిం
పొదవఁగఁ దార్క్ష్యవాహుడయి యున్నతితోఁ దిరువీథు లేఁగఁగా
ముదమున నమ్మహోత్సవపు ముచ్చటఁ జూడఁ దలంచి రా నటన్. 26

## తిరునాళ్ల వేడుకలు

తే. పరఁగఁ బదియాఱు గుజ్జుల ప్రభ యొనర్చి
గంట వేదియు బంగారుకలశ మెత్తి

కంచుగుబ్బల రావిరేకలును లోవ
పక్షములు దీర్చి గొప్ప చప్పరము గాఁగ. 27

మ. జగతీజ్యోతులు కాగడాలు బలు బంజాయీలు మోంబత్తులున్
బగలొత్తుల్ దివిటీలుఁ దిర్వళిఘలుం బంజుల్ మహాజ్యోతులున్
దగ సూర్యప్రభ లాయిలాయులును జంద్రజ్యోతులున్ మైనపున్
జిగటాల్ నిచ్చెనపంజు లారతులు నగ్నిజ్యోతులున్ వెల్గఁగన్. 28

వ. అప్పు డప్పద్మపత్త్రాయతాక్షుని తాదృశమహోత్సవం బేకశరీరంబున నిరీక్షించిన సంతుష్టి గాదని కాయవ్యూహయోగసామర్థ్యంబున ననేకదేహంబులు దాల్చి భక్తిసంయుక్తి నిరుచక్కిం జేరి వీక్షించు సూర్యచంద్రబింబంబుల డంబునం బోలుచు పట్టుగొడుగులు ధవళాతపత్త్రంబులు రాణింప, గరుడధ్వజాదివివిధకేతనజాతవాతాహతి నంతరిక్షంబున నుండ నలికిపడుచుండెడు నుడుగణంబుల వడువున నక్షత్రబాణపరంపరలు చెలువు మీఱ, బాతాళభూతలంబుల సంచరించుసంచున వియత్తలంబునం దారు విహరించం దలంచి విషవహ్నిజ్వాలికలు గురియుచు గగనంబున కెగయు కాకోదరానీకంబుల వేఁక రివ్వురివ్వున నెగిరిచను నాకసపుఁ జువ్వలు మింటనెరయ
ననంతకోటిబ్రహ్మాండనాయకుండైన పుండరీకనాభుం డేతేరం గనుంగొని ప్రమోదంబున మహావేదండయానలు సేసలుచల్లిన నుల్లసిల్లు వెండిపసిండిక్రొవ్విరితండంబుల పాండిత్యంబునఁ బలుతెఱంగుల బిరుసుల వింజామరల ఫెళఫెళారభటి నెఱయ రాలు సువర్ణవర్ణనీయంబులగు పూవుమొత్తంబులు భూనభోఽంతరాళంబులం గప్పి యొప్పుచుండఁ, దదుత్సవవీక్షణకుతూహలసమాగత శుక్రబృహస్పతిబుధాదుల పగిదిం బగులొత్తులు వెలుఁగ వెండియుఁ జక్రబాణంబులు నాకాశచక్రంబులుఁ బిట్టబాణంబులు శతముఖబాణంబులుఁ దాటబాణంబులు దేలుబాణంబులు గురుజులు కుండబిరుసులు సంపంగిపూలబిరుసులు జక్రబిరుసులుఁ బంచవన్నెబిరుసులు గజబిరుసులు మొదలైన బాణవిద్యలవైఖరులు చిత్రవిచిత్రంబుగాఁ జూపుచు బాణకారులు ముందర నడువ డమరుపుర భిడ్డమరు సహచరభయద ఢక్కా హుడుక్కా రవచాను కలహ పటహతమ్మటావజనిస్సాణ ఝల్లరీమర్దళ మురజషణాతుత్తుంభికజర్ఝరీ పాశకోశక్రోలు మోరీ భేరులును డోలు గౌరు గుమ్మె తమ్మెట వీరణ యురుమ యొంటికంటియురుమ పంబ జిమిడిక తప్పెట గిడిబిడి తుడుము చక్కి చుయ్యంకియును దాళ మహోత్తాళంబులును జేగంట చిటితాళంబులుఁ జిటికెలు ముఖవీణ శంఖ కాంస్యశృంగ కాహళంబులును సన్నెగాళెన ఫీరు కరకొమ్ము నాగస్వరమును సుతి చెంగు చేసన్నాయి సింగినాదము పిల్లఁగ్రోవి మ్రోలుఁబీకలును వీణె రుద్రవీణ స్వయంభువీణ మనోహరవీణ నారదవీణ బాణవీణ సరస్వతీవీణ స్వరమండలంబు, తంబుర రావణహస్తంబు రవాలుఁ గిన్నర తిపిరికిన్నర సిద్ధకిన్నర దండె మొదలయిన హృద్యానవద్యవాద్యవిశేషంబులు దిక్కులు పిక్కటిల్ల నిర్ఘోషంబులు బోరుకొల్ప నడుగడుగునకు నీరాజనంబులు నేకారతి పంచారతి యళఘారతి కుంభారతి శేషారతి గరుజారతి పురుషమృగారతి మంగళారతి యేకదళారతులు కూర్మస్వస్తిక నభోమంటప రంగవల్లిక లింగస్వస్తిక సర్వతోభద్ర గిరిబంధ మయూరనాట్య నాగబంధ వింజామర వ్యజనచ్ఛత్ర సింహతలాట బృందావన కల్పవృక్ష పాలసముద్ర గంగాతరంగ శంఖచక్ర పద్మంబులను పేరు గల్గిన మ్రుగ్గులు మాణిక్య మౌక్తిక ప్రవాళ మరకత పుష్యరాగ వజ్ర నీల గోమేధిక వైడూర్యంబులను నవరత్నంబులం దీర్చి పుణ్యభామినులెత్తుచుండ దశాంగ గుగ్గులు సామ్రాణి సజ్జరస శ్రీవాస సరళ యావన వృక్షధూపంబులు ఘుమ్మురను వాసనలుఁ గ్రమ్ముకొనఁ బశ్చిమభాగంబునఁ బరమభాగవతోత్తములు శ్రీవైష్ణవులుఁ గులశేఖరులుఁ ద్రైవర్ణికులు యతిరాజవింశతి పూర్వదినచర్య యుత్తరదినచర్య క్షమాషోడశము శఠగోపస్తవము శ్రీగుణరత్నకోశము ముకుందమాల యష్టశ్లోకి యాళవందారుస్తోత్రముఁ దిరువాయిమొడి

తిరుమంత్రద్వయచరమశ్లోకంబులు మొదలయిన ద్రావిళపాఠప్రబంధములు ప్రపత్తిపూర్వకంబుగాఁ బ్రసంగింప స్థలపరస్థలంబులనుండి చూడవచ్చిన బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులును, కోమటి కమ్మ వెలమ వేకరి పట్ర గొల్ల బలిజ కుమ్మర వలగండ బెస్త చిప్పె కమ్మరి వడ్రంగి కాళె కంచర యగసాల వడసాలె సాలె సాతాని కటిక భట్టు జెట్టి జాండ్ర తొగట గాండ్లవారును, జిత్రకార వందిమాగధ వైతాళిక జైన ఘూర్జర గౌడమిశ్రులును, భేరి భళియ ఛటికి సృగాలక చత్రజాతులును, బోయ యెఱుకు చెంచు యేనాది జలగరి వానివన్నె గట్టురంబళి యీడిగె మేదర వీరముష్టి మాష్టి యొడ్డె యుప్పరులును, నసిధావక మైలారి తురుక పింజారి విప్రవినోదులును, జాతికర్త దొమ్మరి డొమిణి బొమ్మలాటవారును, నింద్రజాలిక మహేంద్రజాలిక హస్తలాఘవ సూత్రనాటక క్షౌరక రజకులును, బోగమువారును, దెరనాటకపు జంగాలును, జంగాలు బిద్దెమువాండ్రు తెల్లకోకబత్తులు సివసత్తులు బత్తులు పలునాటివీరులు పరిహాసకులు సుద్దులకొమాళ్లు కొమ్మారి దానళ్లు తవిరుదాసళ్లు కోణాంగులు సేవపరులు పరసలు పడిగెవారు పరంగు లింగిలీసులు పరాసులు వళందులు సన్న్యాసు లేకదండత్రిదండు లేకాంగులు వానప్రస్థులు యోగు లవధూతలు పరమహంసిలు బైరాగులు జటాధారులు దిగంబరులు గోముఖులు నియమస్థు లూర్ధ్వబాహులును, గోరడజోగులు కాటిపాపలు మందపిచ్చులు పిచ్చుగుంట్లు చర్మకర్ములు చండాల మాతంగులు తలక్రిందుజోగులు రామగోవిందులు మొదలగువారును, బురోభాగంబున నేల యీనిన చందంబున, వెల్లివిరిసిన చాడ్పున, నుసుళ్ల విధంబున, మిడుత గమిలాగున, బేడిసెకదుపు భంగిని, నాకుఁ జిలుకల మొత్తంబు వంతున, బెరయీఁగల పగిదిని, స్వాతిబకంబుల వీఁకను, గంగాతరంగంబుల కైవడి, జలబుద్బుదంబుల వైఖరి, వర్షధారల పోల్కిని, రామరావణ బాణపరంపరల రీతినిఁ, బుంఖానుపుంఖంబులుఁ దండోపతండంబులు లక్షోపలక్షలు శాఖోపశాఖలుఁ గోటానుకోటులు సంఖ్యాతిసంఖ్యలుగా నడుచు సమయంబున. 29

క. నెఱిఁగంట మాళ్లిడుదు ని
ద్దఱు మంచి కొమాళ్లు గలుగ దయచేసిన నో
పెరుమాళ్ళని యా వాచా
లి రుమాళ్ల నొసంగి మ్రొక్కి యేఁగుచునుండన్. 30

క. ఆయెడ వరదత్తుండను
కాయజరేఖాసమానకలితాకారుం
డా యింతి యున్న చక్కటిఁ
బాయక నిలుచుండి దానిపై మోహమునన్. 31

ఉ. కందువమాటలాడి వగకారితనంబులు సూపి సన్న లిం
పొందఁగ సల్పి చేరికల నుల్లము రంజిలఁజేసి తమ్ములం
బందఁగనిచ్చి మెచ్చి భుజమందుఁ గరంబిడి నవ్వుచేష్టఁ గే
ళిం దమిరేఁచి గుబ్బలు ఛళీమని నల్చి రతైకచిత్తుఁడై. 32

క. ఆ వాచాలిని సంకే
తావాసమ్మునకు రమ్మటని ప్రార్థింపం
గా వలచి మనసు మెత్తని
దై వాని మనోఽభిలాష లమరన్ దీర్చెన్. 33

క. అదిమొదలు సుదతి మదమును
బొదలఁగఁ దుదిలేని మోహముల కాస్పదమౌ
మదిని ముదంబులు గుదిఁగొన

మదనప్రదరప్రభిన్నమర్మస్థలయై. 34

చ. చవిగొని జారవీరవరసంగమసంగ్రహణక్రియామహో
త్సవపరిణద్ధశుద్ధఘనతద్ధితబుద్ధిని సంచరింప న
య్యువిదకు నొక్క పుత్త్రుఁడు సముద్భవ మొందె మఱంతనైనఁ బ
ల్లవసురతం బసహ్యతఁ దలంపక యెప్పటియట్ల సల్పుఁగన్. 35

ఉ. "సొంపులునింపు చిత్తరువుఁ జూడఁగవచ్చితి" మంచు వేడ్క మో
హంపువయస్సు డిచ్చుటకునై పఱతేటె" నటంచు, "మీదె? యీ
సంపద లుల్లసిల్లు ఘనసద్మ" మటంచును దానికోసమై
గుంపులుగూడి వీటి విటకోటులు వత్తురు బోఁటియింటికిన్. 36

క. ఈలాగు జారకోటికి
మేలౌ నభిమతముఁ దీర్చి మెలఁగుచు నుండే
కాలమున నొక్క నాఁ డొక
జాలుండను విటునిఁ బిల్చి సంధ్యావేళన్. 37

తే. పురము వెల్వడి కాళికాపుణ్యభవన
సీమ సంకేత; మట కీవు చేరు మనుచుఁ
జెప్పి వాచాలి పతిలేని చొప్పుఁ జూచి
పుత్త్రు నిద్దురఁబుచ్చి తాఁ బోయె నటకు. 38

తే. పోయి యా కాళికోవెల పొంత నిలిచి
కటికి మబ్బున నలుదెస ల్గలయఁ జూచి
జాలుఁ డాచాయ లేకున్న సంశయించి
మనసుఁ దెలియఁగ డాఁగెనో యని తలంచి. 39

ఉ. చీమ చిటుక్కుమన్న వినుఁ జిమ్మట బుట్టిన నేఁగు నంతలో
నే ముదమంది చూచు సరణిన్ బశుపక్షిమృగాదిజంతువుల్
వేమఱుఁబోవు చప్పుడులు విస్మయ మందఁగ నాలకించు "నా
హా! మఱి రాక తక్కెనె" యటంచుఁ దలంచు వియోగవేదనన్. 40

క. "ఏరా తాళఁగ లేరా!
రారా! నన్నేచ నేల? రారా! రాపుల్
మేరా? మోహనరూపశ
రీరా! యటుడాఁగి పల్కరింప వదేరా?" 41

మ. అని వాచాలి ప్రియంపుఁ బల్లవుని డాయం బిల్వఁగా మ్రోయు వా
గ్ధ్వను లాలించి నిజాంగనాగళరవవ్రాతం బిదౌ నిశ్చయం
బనుచుం దద్విభుఁ డప్పుడొక్కపనికై యాదారిగాఁ బోవుచున్
గని "యిట్లేటికిఁ జీరెదీ" వనుచుఁ బల్కన్ గాంత తానంతటన్. 42

క. ఎటువలె బొంకఁగ వలెనో
కుటిలాలక! నీవు తెలిసికొమ్మని యనఁగా
నిటునటుఁ జూ చది తెలియదు
పటుసూక్తిని నీవె తెలుపు పత్రిప! యనినన్. 43

క. ఆ మానసౌక మప్పుడు

హేమావతి కనియెఁ దను నిజేశుం డడుగన్
భామిని ధైర్యము వదలక
తా మగనికి ననియె వేడ్క దళుకొత్తంగన్. 44

ఉ. "అయ్యలు సందెవేళఁ జని యాడఁగ, నింటికి రాక తక్కితే
నియ్యెడ నీదు వెంటఁ జరియించుచు వచ్చెనొ యంచు భీతిచే
నుయ్యెల లూఁగు ప్రాణముల నోర్వక చీరెద వీటఁ జూచితే
నెయ్యెడ లేఁడు చెల్లనిఁక నేమి యొనర్తు మనోహరాధిపా!" 45

క. అని వాపోవుచు సతి ప
ల్కిన విని యా చిత్రఘనుఁడు కినుకెడలి దిగుల్
గొని మనసు వకావకలై
చనఁ, "జెడితి నెటేఁగె?" నంచు సతితో ననుచున్. 46

తే. నగరమున కేఁగి యిద్దఱు నాల్గు వీథు
లరయుచుండంగ వాచాలి యంతలోన
భవనమున కేఁగి చనుదెంచి భర్తతోడ
వేడ్క లిగురొత్తఁ జెప్పెను వింతగాఁగ. 47

క. "నేనింటి కేఁగి చూడఁగఁ
దా నిద్రాసక్తిఁ బూని తనయుం డున్నా
డో నవమదనా! ర"మ్మని
మానిని తోడ్తెచ్చె మగని మందిరమునకున్. 48

తే. అట్లు తోడ్తెచ్చి నిద్రించు ననుఁగు సుతుని
లేపి ముద్దాడుకొనుచుఁ దొల్లింటి యట్ల
చిత్రఘనుఁడును వాచాలి చిత్త మలర
నిండుమోదంబున సుఖాన నుండి రపుడు. 49

క. ఆ రీతి నేర్పుగల్గిన
భూరమణునిఁ జేరు మనుచుఁ బులుగులదొర తన్
జీరఁగ హేమావతి విని
యౌరా! చెలియాగడం బటంచు గణించెన్. 50

క. ఈరీతిఁ గథకుఁ జొక్కి ప
యోరుహముఖి మెచ్చునప్పు డుత్ఫుల్ల త్వం
కేరుహ గంధానిల మరు
దేరఁగఁ దెలవాఱవచ్చె దృఢమని యంతన్. 51

సీ. పట్టెమంచము మెత్తపయిఁ దలగడ బిళ్ల
లగురుధూపము దివ్వె లడపము చిటి
చాప జాబిల్లికైసాన పువ్వుల చెండ్లు
తబుకు దంతపు గద్దె తావికుడుక
గొడుగు పావలు గందవాడి పెట్టె గందపు
గిన్నె సున్నపుఁగాయ గిండి సురటి
తంబుర నిల్వుటద్దము తమ్మిపడిగయు
వీణ కస్తురి రుద్రవీణ పునుఁగు

తే. కరవటం బాకు సంబెళ కప్పురంపుఁ
గ్రోవి బాగాలు బకదారి గూండ్లు దనరు
లోవ తీనెలు చిత్తర్వు తీవిఁ దనరు
కేళినిలయంబుఁ జేరె నక్కీరవాణి. 52

క. చేరి దినాంతంబైన వ
నేరుహశర కుసుమచాపనిర్ముక్తశరా
సార మొకయింత సైపక
భూరమణీరమణుఁ జేరఁబోయెడు బుద్ధిన్. 53

సీ. జలదావళి రహించు చంచలా లత లన
వేణిఁ గైతక దళ శ్రేణి మెఱయ
దిన విభాంకురము మైత్రినిఁ దమ్మిఁజేరె నాఁ
గాశ్మీర రేఖ వక్త్రమునఁ దనర
జయశంఖమునకు ముత్తియపు జల్లులు వేసె
మరుఁడు నా గళమున సరులు దూఁగఁ
బువ్వుగుత్తులఁ గప్పు పుప్పొడి యన గంద
వడి - పూఁత గుబ్బలఁ బరిమళింప

తే. రమ్య మేఖల ఘళఘళల్ రత్నహేమ
కలిత నూపుర ఝళఝళల్ చలువ వలువ
ఫెళఫెళల్ గిల్కు మట్టెల గిలగిలల్ ర
హించ రాయంచకడ నిల్చెఁ జంచలాక్షి. 54

తే. నిలిచి హేమావతీ నామ జలరుహాక్షి
హంసకుల పట్టభద్ర! నేడైన మాన
వేంద్రు కడకేఁగు మని సెల విమ్మటన్న
శిరముఁ గదలించి రాయంచ చెలియ కనియె. 55

శా. అక్కా! రత్నపుఁ బొళ్లసొమ్ము లివి లెస్సాయెన్ దుకూలం బహో!
చొక్కంబై తగె బుక్కపూఁత సుమముల్ సొంపారె, సేబాసు! నా
దిక్కుం జూడు, శిరోవిధూననము సంధిల్లన్ వచోమాధురిన్
జొక్కం జెప్పెద నొక్కగాథ విని నన్నున్ మెచ్చి పొమ్మంతటన్. 56

క. అనుచున్న హంస పలుకులు
వినుచున్ నళినాక్షి పలుకు వినియెద నని తన్
గనుచున్నఁ దేనెధారలు
పెనుచుచు నవభణితి నపుడు బిసభోక్త యనెన్. 57

## పదియవ రాత్రి కథ

### భూతవైద్యుని యిల్లా లొక రేయి నలుగురినిఁ గూడుట

క. వినుము సుధానిధి యనుపే
రున గృష్ణాతీరమందు రుచిరోన్నత కాం
చన గోపురాధరీకృత

ఘన గోపుర మైన పురము గలదొకటి సతీ! 58

సీ. సౌధఖేలద్వధూ జనదత్త ఖనదీ బి
సాహార తుందిల హంసచయము
హిత వయస్యా సమర్పిత కల్పతరుసుమ
స్రగ్వృత సౌధ యోషాకచంబు
సాల శృంగగ శారికాళీ పునః పునః
పఠిత నిర్జరసతీ భాషణంబు
జనకార్పితోగ్రాప్త వనభూజ ఫలవృద్ధ
భర్మ గోపుర శుకీ పైక గణము

తే. మందిర విటంక కలరవా మంద కలక
లారవ ప్రతిరావ కార్యమరనాథ
కేళికాగార మణికుడ్య వాళికంబు
తనరు వస్తు సమృద్ధంబు తత్పురంబు. 59

వ. వెండియు నప్పురంబు విబుధరాజమనోరంజకంబై సుధర్మాస్థాన వైఖరిని, బురుషోత్తమాధిష్ఠానంబై వైకుంఠంబు పోలికిని, రాజశేఖర కుమారాధీనంబై యమర సైన్యంబు రేవను, బుణ్యా జన సమృద్ధంబై యలకాపురంబు దాడ్పున నొప్పుచుండు. 60

క. కరి తురగ రథ భటోర్వీ
సుర భూవర వైశ్య శూద్ర శుభసౌధాళ్యా
వరణ జలఖేయ తరుణీ
పురుషోపవనాది గరిమఁ బురమది వెలయున్. 61

ఉ. భూతియుఁ గావిబొట్టు మెయిఁబూసిన మూల్కెలుఁ జొక్కు కల్కెముల్
చేతఁగడెంబుఁ దాయెతులఁ జేర్చిన మందులు మంత్ర తంత్ర కో
పేతపు నాగబెత్త మరఁబెట్టెలు నొప్పఁగ రౌద్రకర్ముఁడన్
భూతచికిత్సకుం డొకఁడు పొల్పుగ నచ్చటనుండు మానినీ. 62

సీ. పైగాలి సోకినఁ బాఱుఁ బిశాచక
తండంబు లెల్లను దల్లడిల్లి
పొలఁకువఁ గనుఁగొన్నఁ బోవు దయ్యంబుల
విసరముల్ భీతిచే విస్తరిల్లి
పేరు విన్నప్పుడే దూరమై చను భూత
చయములు దిగులున సరభసిల్లి
తొడరి నిల్చిన యంతఁ దొలఁగు దుష్టగ్రహ
ప్రచయముల్ భయమునఁ బరిఢవిల్లి

తే. యుఱుకు నా రౌద్రకర్ముని కరము సోఁకఁ
బ్రేత బేతాళ మోహినీ పిశిత భోక్తృ
కామినీ శాకినీ ఢాకినీ మదాంధ
భయకర బ్రహ్మారాక్షసుల్ పల్లటిల్లి. 63

క. క్రూరగ్రహ చోరగ్రహ
చారగ్రహ కూర్మశాక చండిగ్రహ కా
[1]టేరి గ్రహాంతర గ్రహ

వారి గ్రహములును బోవు వానిఁ దలంపన్. 64

క. వెలగల రావుల మఱ్ఱుల
వెలుగులఁ బాడిండ్ల శూన్య విపినస్థలులన్
గలుఁగుల నిలువక తొలఁగును
మలయక భూతములు వాని మంత్రోద్ధతికిన్. 65

క. ఈలాగు మంత్రమారుత
తూలతృణీకృతసమస్తదుష్టగ్రహుఁడై
యాలోకోలోకాంచిత
భూలోకఖ్యాతి నతఁడు పొలుపొందు సఖీ! 66

తే. వాని ప్రియురాలు విరివాలుఁ బూనఁజాలు
ఱేఁడు తమినేలు జవరాలు రేఖఁ బోలు
మేలు గల జాళువాడాలు గ్రాలు ముద్ద
రాలు ఘనురాలు పేర నవ్వాలుఁగంటి. 67

క. కుందనపు బొమ్మ తేనియ
చిందెడు క్రొవ్విరులకొమ్మ శృంగారము చె
ల్వందెడు గుమ్మ శుభాకృతిఁ
గందర్పునకమ్మ దానికథ విని పొమ్మా! 68

ఆ. వాలుమీలఁ బోలు వామాక్షి చూపులు
సోము సాము గోము భామ మోము
మించు మించు సంచు నెంచు మై దులకించు
మిన్ను చెన్ను దన్ను సన్ననడుము. 69

మ. బళిరా! ముద్దుమొగంబు తేటలవురా! పాలిండ్ల సొంపద్దిరా!
బెళుకుంగన్నుల సోయగంబు కటి బల్ బింకంబు సేబాసురా!
కులుకుంజెక్కుల నిక్కు మిక్కుటపుఁ డెక్కుల్ బల్ చొక్కాటంబురా!
తలరా! దీనికి సాటిలేదని విటుల్ తన్ మెచ్చ బోఁటొప్పగున్. 70

చ. ఘనకనకంపు సొంపుగల కాయము, కాయజుతూఁపు రూపులన్
జెనకిన చూపు కజ్జలవిశేషము, తోషముఁ గుల్కు పల్కులున్,
దనరు నవీన సూనముల నవ్వెడు నవ్వులు, తేనెసోన జా
ల్కొను పెనుతావి మోవి, యల కోమలి కే తగు, నొప్పుఁ జెప్పఁగన్. 71

క. నెలరా మొగమును నును వె
న్నెల రాజీవాక్షినవ్వు నీలపురా వ
న్నెలు రాజిలు బలుకీల్జడ
నెలరాల జయించు మిగుల నెలఁత నఖంబుల్. 72

క. నెఱికురులగుఁ గంధరములు
ధరముల కన్నన్ గుచములు తగ సుందరముల్
దరముల సిరి బిత్తరముల్
తరమె? లతాతన్విగళము ధర వర్ణింపన్. 73

క. ఇటులఁ దుల లేని రేఖా

పటిమయు జవ్వనముఁ దనరఁ బతిపైని రుచుల్
పొటమరిల కన్యపురుషుల
ఘటియింపం దొడఁగె రతికిఁ గామిని వేడ్కన్. 74

సీ. ఏనాఁటి కేపాప మెఱుఁగని కన్నుల
కిడియెఁ గాటుకరేక లేపు గులుకఁ
బుట్టి పుణ్యమెఱుంగనట్టి నెమ్మేనికి
బసపునల్గు ఘటించె మిసిమి బెళుకఁ
గలనైనఁ బంకించి కలయ దువ్వని వెండ్రు
కలు దువ్వి కొప్పిడెఁ జెలువ మొలుక
నెన్నఁడు సొగసేని యెఱుఁగని గుబ్బల
కలరించెఁ గంచుళి వలపు చిలుకఁ

తే. బూర్వ మెక్కాల మంధైన ముడువఁగనని
విరిసరులు జుట్టెఁ గ్రొమ్ముడి సిరులు దొలుక
నుదుటు విటకోటి నెన్నేటి మదమునాటి
యారజము మించి యా చంచలాక్షి యపుడు. 75

ఉ. పాటలు మోముఁ ద్రిప్పుటలుఁ బైఁ దిమిరించుట లోరచూపులున్
మాటలు ముద్దు జంకెనలు మవ్వపు నవ్వులు గోటి చిమ్ములున్
నీటు దొలంకు చిన్నెలును నెవ్వగ సన్నలు, లేని యూరుపుల్
మేటిగ సల్పు వింతవగ మిండలఁగాంచి వధూటి మాటికిన్. 76

సీ. పూటపూఁట మెఱుంగు నీటుగాఁ బెట్టును
గమ్మలు క్రొమ్మించు కాంతులీన
మాటి మాటికి నూనె పాటిగాఁ బదనిచ్చి
తలదువ్వి కొప్పిడు వలపు గులుక
గడెగడెకును బెట్టి నిడియున్న గడితంపుఁ
జలువలు గట్టును జెలువు దనర
దినదినంబును వింత దేఱఁ జొక్కటపు సొ
మ్ములు దాల్చు నెమ్మేనఁ దళుకు లొలుక

తే. గళముననుు బూయు గందంబు గందవడియుఁ
క్రొమ్ముడిని జెక్కు సవరంబుఁ గ్రొవ్విరులును
సొగసు దనరార విటకోటి సొక్కి తిరుగఁ
జిత్తజాయత్తచిత్త యై చిగురుఁబోఁడి. 77

తే. మదనపీడితయై యన్యమానవాభి
లాష మెదఁబూని యిటుల నలంకరించి
తిరుగుచుండెడు పిననాఁడె వెరవు పఱచు
కొనియెఁ దమిదీఱ నమ్ముద్దుగుమ్మ విటుల. 78

క. కరణమును నూరి రెడ్డి
గరిమందగు పారుపత్తెగానిఁ దలారిన్
దఱియైనవేళ నీ నలు
గురితోఁ బొలివోని రతులఁ గూడి సుఖించున్. 79

సీ. పురి బాహ్యసంకేతపరిసరంబున కేఁగి
యామికాభిప్రాయ మలరఁ దీర్చుఁ
దఱియైన యెడఁ జేని దగ్గరకే పోయి
ప్రియము గొల్పఁగ రెడ్డిప్రేమఁ దీర్చు
సంచారికాలయస్థలికిఁ బిల్పించుక
నధికారికోరిక లమరఁ దీర్చు
నెనయ వీలై యున్నఁ దన యింటికే పిల్చి
గరిమతోఁ గరణంబుకాంక్షఁ దీర్చుఁ

తే. బగలు రాతురులను నెడఁ బాయకుండు
మోహపరితాపవేదనల్ ముదిరి చెదరి
చెదరఁ జేయగ వేఱొక చింత లేక
చండమదమత్తభద్రవేదండగమన. 80

తే. సొగసి సొగయించు నెఱయోర చూపు చూచి
పలికి పలికించుఁ జిన్నెలు బయల నెఱపి
బ్రమసి బ్రమయించుఁ దనకు లోఁబడఁగఁ జేసి
వలచి వలపించు నది యెంతవాని నైన. 81

క. ఈ స్థితిని గొంతకాలం
బాస్థన్ విటకోటిఁ గూడి యలరుచు మోహా
వస్థల జరుపఁగఁ బతికొక
ప్రస్థానము సంభవించెఁ బ్రమదం బెసఁగన్. 82

చ. పరపుర భూమిభర్త కులభామిని కుగ్రములైన భూతముల్
తిరముగఁ బట్టి బాధలిడు తెంపున నుండఁగ నన్నిమిత్త మ
న్నరపతి పిల్వనంపఁగ ఘనంబగు వేడుక రౌద్రకర్ముఁ డా
తటి నెఱ మాంత్రికుండగుటఁ దత్క్షణ మేఁగెఁ జికిత్స సేయగన్. 83

తే. అటుల నిజనాయకుం డేఁగి యన్యరాజ
పురవరముఁ జేరె, నంతటఁ బొలఁతి యలరి
తొడుసు వాసెఁ గదా యంచు దుడుకు చేసి
విటుల నలరించె నిచ్ఛానువృత్తి మీఱ. 84

క. ఆజ్ఞ యొకింతయు లేమి మ
నోజ్ఞ వయోవిటపులకు మనోభవసమర
ప్రజ్ఞలఁ జూపుచు రతిపై
సుజ్ఞానము వొడమి పడఁతి సొంపున నుండెన్. 85

క. ఈ తీరు కొన్ని దినములు
చేతోజాతాహవములచేఁ దనివారన్
శీతాంశువదన మెలఁగఁగ
నా తలవరి యొక్కనాఁటి యామిని వేడ్కన్. 86

ఉ. పువ్వులతోడి కోరసిగ పొందగు చందురుకావి జాళువా
మవ్వపుటంచు పద్మపు రుమాలు సుగంధపుఁ బూత నేతచే
రవ్వగు చల్వ దుప్పటి కరంబున నాకులుఁ జంక వట్రమున్

నివ్వటిలంగ దానికడ నిద్దురఁ జెంద బిరాన వచ్చినన్. 87

క. చూచి ముదమంది దిగ్గున
లేచినదై యెదురుగా నిలిచి యాతని కే
లాఁచికొని పట్టి మెల్లనె
యా చెలి తన కేళిగృహము నతనిం జేర్చెన్. 88

ఉ. చేర్చి సూళముల్ గలుగు చిల్కల కోళ్లఁ దనర్చి పట్టెచేఁ
దీర్చిన తూఁగుపాన్పునఁ గదించిన కమ్మని పువ్వు సెజ్జకుం
దార్చి వినోదముల్ సలిపి దర్పకదర్పరణప్రవీణయై
పేర్చుచు నుండఁగా రతికిఁ బేర్కొని రెడ్డి ప్రియంబు సంధిలన్. 89

సీ. కమ్మి పచ్చడమును గంటీల పోఁగులు
మొలఁ జిట్టి కమ్ముల ముదుగు వల్లె
నిండు చల్వ రుమాలు రెండొంకుటుంగరం
బులుఁ జుక్కబొట్టు సొంపొలయ, మెడను
గందంపు నునుఁబూఁత కర్ణయుగంబున
నేర్పుగాఁ జెక్కు గన్నేరు పూలు
కత్తెర గండంబు గజ్జెలు నందెలు
నాదించు జిగి సకలాది తిత్తి

తే. పాదములఁ గిఱ్ఱు కిఱ్ఱని పలుకు మెట్లుఁ
గుచ్చు టద్దాలుఁ జేపట్టుకోల యమర
రెడ్డి ప్రియురాలి వాకిటఁ బ్రేమ నిలిచి
వాకిలి సడల్పు మనుచుఁ బిల్వంగ నపుడు. 90

క. తలవరి గడ గడ వడఁకిన్య
గలగకు మని వీఁపుఁ జఱచి ఘనురా లతనిన్
నిలిపె నొకమూల నటుకన్
నెలమిని వాకిలి సడల్చి హిత మలరారన్. 91

తే. రెడ్డి నింట్లోకిఁ బిలిచి నీరేరుహాక్షి
వాకిలి గదించి యపుడు దా వానికేలు
పట్టుకొని వచ్చి శయ్యపైఁ బవ్వళించి
ననవిలుతుకేళి నిద్దఱు పెనఁగుచుండ. 92

చ. తెలి తలపాగ చొక్క మొలతిత్తి బుజంబునఁ జల్వపచ్చడం
బరి చిటివ్రేల ముద్రిక యొయారము మీఱఁ బొగాకుచుట్ట సొం
పలరెడు కావిదోవతి పదాబ్జయుగంబున ముచ్చె లొప్పఁగా
సలనిభుఁ డంత గ్రామకరణంబటకై చనుదెంచి వేడుకన్. 93

క. “పెను తలుపు గడియఁ దీ” యని
మనురాలి నతండు పిలఁ గాఁపుకొడుకు తా
విని దిగులొందిన వెఱవకు
మని రెండవమూల నటుక నాతని నుంచెన్. 94

తే. ఉంచి కదలకు మిచ్చోట నురగ మొకటి
కల దటంచును జెప్పి యాకాంత వేగఁ

గరణమును డాయఁగాఁ బోయి గడియఁ దీసి
లోపలికిఁ బిల్చి మరలఁ దల్పును గదించి. 95

మ. దయకద్దా? యని పల్కరించి తమిఁ జెందం జేసి లేనవ్వులన్
బ్రియమొందించి కదించి ముద్దులిడుచుం బృథ్వీధరోరుస్తన
ద్వయి బల్ జొమ్మునఁ గ్రుమ్మి కుమ్మి యనుమోదంబొప్పఁ గావించి యా
వియదాకారసుమధ్య సంగమసుఖోద్వేలస్పృహాధీనయై. 96

క. తనివారక యరికట్టక
యనివారక మోహ దోహలామోదము హె
చ్చను వారట్లన్యోన్యము
చనువారఁ గళాదు లరసి సమరతిఁ బెనఁగన్. 97

వ. ఆ సమయంబున. 98

క. నిలువంగి యోర మెలికల
తలపాగ ఖలీతిశాలు తావి మెయిం బూఁ
తలు పోఁగు లంఘ్రిరక్షలు
వెలయఁగ వేపారి మీఁటి వెలఁదుక కడకున్. 99

మ. వగకాఁడై చనుదెంచి తీవిని బహిర్ద్వారంబునన్ నిల్చి త
ల్పు గడెం దీయు మటంచు నా ప్రవిమలాంభోజేక్షణన్ బిల్వఁగా
దిగులున్ బొంది నియోగి యెట్టు లనుచున్ దేహంబు కంపింప, నా
చిగురుంబోఁడి యమాత్యు వీఁపడఁచి తాఁ జెన్నొంద శీఘ్రంబునఁన్. 100

క. మూఁడవ మూలను నట్టుక
పై డించి నియోగి నయ్యబల యధికారిం
గూడఁ జని తలుపు సడలిచి
వేడుకఁ గ్రీడాలయంబు వేగమె చేర్చెన్. 101

తే. చేర్చి వాకిలిఁ గదియించి చెలిమి మించి
కాంక్ష లూరించి చిన్నెల కలిమిఁ గాంచి
మొలకనవ్వులఁ దేలించి మోహ ముంచి
కళలఁ గరఁగించి సంధించి కౌఁగిలించి. 102

చ. మునుకొని మూఁడు మూలలను ముప్వురు గ్రుక్కలు మ్రింగఁ జెంగలిం
చిన తమిచేత హెచ్చి మరుజెట్ల తెఱంగున డొంకి డొంకి పొ
ర్లిన గతిఁ బొర్లుకాడి చనులీలల నిద్దఱు నేకకాంక్షతో
ననవిలుకాని పోరునఁ బెనంగెడు వేళ నిజేశ్వరుం డొగిన్. 103

తే. పరధరాధిపు భార్యకుఁ బట్టినట్టి
భూతముల వెళ్ళఁగొట్ట భూభుజుఁడు మెచ్చి
ధనపరిష్కారవస్త్రముల్ తన కొసంగి
యంపకము సేయఁ దన యింటి కరుగుదెంచి. 104

క. తలుపు సడలింపు మనుచున్
గులభామను మాంత్రికుండు కూపెట్టినచోఁ
దలఁకెడి వ్యాపారి మన

శ్చలనము పో వీఁపుఁ జఱచి సంభ్రమ మొదవన్. 105

ఉ. నాలవ మూలయందు నుపనాథుని నుంచి కృశాంగవల్లియై
యాలువు భక్తి యుక్తిఁ దమి హెచ్చు భయంబునఁ దల్పుఁ దీసి యా
నీలశిరోజ నేత్రముల నీళ్ళనె కాళులు గడ్గి కౌఁగిఁటం
దేలిచి యింటిలోపలికిఁ దిన్నఁగఁ దోడ్కొని వచ్చె మెచ్చుగన్. 106

తే. పరధరాధిపు భార్యకుఁ బట్టినట్టి
భూతముల వెళ్ళఁగొట్టిన భూభుజుండు
దనియఁగా నీ కొసంగిన ద్రవ్య మేది?
కనుఁగొనఁగఁ జూపు మన రౌద్రకర్ముఁ డపుడు. 107

చ. "తెమలని చిమ్మచీఁకటిని దీపము లేనిది జూపు టెట్లు? దీ
పముఁ గొనితెమ్ము చూపెదను భద్రముగా నివి నీవె దాఁచి పె
ట్టుము మును దాఁచు మూలనె కఠోరకుచా!" యని పల్కరింపఁగా
నమితభయార్తచిత్తులయి యయ్యధికారిముఖుల్ చలింపుచున్. 108

క. మును దాఁచు మూల దాఁచు మ
టని భార్యను బొడిచియాడె, నది దీపము చూ
పినఁ జూచి వీఁడు మమ్మే
మనునో యను శంకచేత నలమట పడుచున్. 109

చ. నలువురు గుప్పుగుప్పునను నాలుగు మూలల నుండి దూకి వి
చ్చలవిడిఁ బాఱసాఁగినను సాహస మొప్పఁగఁ దద్విభుండు గొం
దలపడి చూచి, "వీ రెవరు దాఁపక చెప్పుము, చెప్పుకున్న న
గ్గలముగ నిన్ వధింతు" నని కత్తిని దా నొఱదూసి పల్కినన్. 110

క. ఆ వేళ నెట్లు బొంకం
గా వలయునొ కొమ్మ! తేటఁగాఁ జెప్పి ధరి
త్రీపభుని నెనయఁ జనుమనఁ
గా విని యోచించి, వనిత, కళవళపడుచున్. 111

ఉ. వింత కథారహస్యములు వీనుల విందుగ వింటిఁ బార్వతీ
కాంతునకైన శక్యమిది గాదు వచింపను, బ్రహ్మలోకప
ర్యంతముఁ జూడఁ దోప దిది, హంసవతంసమ! నీవె చెప్పి భూ
కాంతునిఁ జేర నన్ననుపు గాథలచేతనె ప్రొద్దుపుచ్చకన్. 112

క. అన విని మేల్ నెఱజాణవు
గనఁ జెప్పఁగరాదె? యెంత కథ యిది నే నీ
కును దెలియకున్నఁ జెప్పెద
వినవే; ఘనురాలి బొంకు విశదము గాఁగన్. 113

చ. వినుము నిజేశ! నీవు చని వేఱొక యూరికిఁ బోవ నాఁటి రా
త్రిని నొకతెం బరుండఁగను దృష్టికిఁ గన్పడెఁ గొన్ని భూతముల్
కనుపడి మమ్ము నీ మగఁడు కాలిడనీయఁడు మాస్థలంబులన్
దునియెద మేము ని న్ననుచుఁ దూటిన నందొక భూత మయ్యెడన్. 114

తే. నాతి! యీ వేళకును గాచినాము నిన్ను

నీదు మగఁ డింటి కరుదెంచి నిలిచినపుడు
మా తెరువు దాను రాకుండ మనవి చెప్పు
చెప్పకుండిన నీచావు సిద్ధ మనుచు. 115

క. బెదరించి నాఁటి రాత్రికిఁ
గడలెన్ భూతమ్ము లంతఁ గనుగూర్కెడు వే
ళ దినము దినమగపడి నా
యెదుటం బొడకట్టి నాపయింబడి త్రొక్కున్. 116

క. పది యైదు నాల్గు భూతము
లదయత ననుఁజూచి "నీ నిజాధిపుఁడు మమున్
మెదలంగ నీయఁ డియ్యెడ
విదళింతుము నిన్నుఁబట్టి వెలఁదీ!" యనుచున్. 117

క. ఇంతకు మును చనుకను న
న్నెంతయు బాధించె నింటి కీవిప్పుడు రాఁ
బంతము చెడి నీభయమునఁ
గాంతుఁడ! యవి పాఱిపోయెఁ గడువడిఁ గంటే! 118

త. ఈ రీతి నీ భయంబునఁ
బాఱెడి భూతములఁజూచి "భామా ! వారె
వ్వా" రని సంశయమున ననుఁ
గారింపఁ దలంచి తహహా! కరుణయు లేకన్ ! 119

క. నీవింట లేని తఱి భూ
తావళిచే నొచ్చుకంటె నదయుఁడ! నీచేఁ
జావగుట లెస్స తన కటు
గావున నిదె నఱుకు మనుచుఁ గంఠము వంచెన్! 120

ఉ. వంచిన భామినీమణి నవార్యకృపంగని తద్విభుండు హ
సంతాంచితమండలాగ్రము రయంబున నవ్వలఁ బాఱవైచి, రా
ణించిన వేడ్కఁ గౌఁగిటను నిల్పి నెఱుల్ కొనగోళ్ల దీటి లో
నుంచకు భీతి యంచు వినయోన్నతి నూఱటఁబుచ్చి యంతటన్. 121

తే. భూతరాపును జుట్టి విభూతిఁ బెట్టి
యంత్రములు గట్టి వెఱవకు మనుచుఁ దట్టి
పోయె లెమ్మన్న స్నానాన్నభుక్తిరతుల
మగనిఁ గరఁగించి ఘనురాలు మమతనుండె! 122

క. అని యంచ పలుకు నత్తఱి
నినుఁ డుదయాద్రిని పసింప నింటికిఁ జని యా
దినమెల్లఁ గడపి యామిని
చనుదెంచిన నృపతి నెనయు సంతోషమునన్! 123

ఉ. కొప్పున జాజిపూలు మణికుండలముల్ చెవులందుఁ గంధరన్
గొప్ప సుపాణిపేరుఁ జనుగుబ్బలఁ గుంకుమపూఁత పుక్కిటన్
గప్పురపున్ విడెంబుఁ గనకంపుఁ గడెంబులు చేతులన్ గటిన్
జొప్పడు చల్వదువ్వలువ సొంపు ఘటింప లతాంగి వచ్చినన్! 124

క. కనుఁగొని హంసము తరుణీ!
విను మొండొక పిన్నకథ వివేకముతో నే
వినియెద నని నీవడిగిన
వినిపించెద ననిన విరహ విహ్వలబుద్ధిన్. 125

క. దినములు నీ గాథలచేఁ
జనెఁగావి నృపాలుఁ జేర సాగకపోయెన్
జనియెద నేఁడై నను నా
మనవిని విని వేగఁ దెల్పుమా! పతగమణీ! 126

## పదునొకండవ రాత్రి కథ

### కడఁద్రోయఁబడిన బడబ తిరిపగానిఁ గూడుట

క. అని పలికిన హేమావతిఁ
గని పల్కెఁ బతంగవిభుఁడు కనకంబను పే
మనఁదగు పురి నొక విప్రుం
డనవద్యుఁడు చండరశ్మి యనఁ దనరారున్. 127

### పండిత పరిశ్రమ

వ. అతఁ డక్షర లక్షణ ఋగ్యజుస్సామాధర్వణంబులు వేదాంత వైశేషిక భాట్ట ప్రాభాకర పూర్వోత్తర మీమాంసా శాస్త్రంబులును, బ్రహ్మాండ విష్ణు నారద మార్కండేయ వామనాగ్నేయ గారుడ భవిష్య ద్భాగవత స్కాంద మాత్స్య లైంగ కూర్మ వాయు వరాహ పద్మ బ్రహ్మవైవర్త బ్రహ్మోత్తరఖండంబులను పదునెనిమిది పురాణంబులును, ఆదిసభారణ్యవిరాటోద్యోగ భీష్మద్రోణ కర్ణ శల్యసౌప్తిక స్త్రీ శాంత్యానుశాసనికాశ్వమేధ మౌసల మహాప్రస్థాన స్వర్గారోహణంబులను పదునెనిమిది భారతపర్వంబులును, శిక్షా కల్ప జ్యోతిర్వ్యాకరణ నిరుక్తములును, ఉక్తాత్యుక్త మధ్యా ప్రతిష్ణా సుప్రతిష్ణా గాయత్రీ ఉష్ణిక్ అనుష్టుప బృహతీ పంక్తి త్రిష్టుప్ జగతీ అతిజగతీ శక్వరి అతిశక్వరి అష్టి అత్యష్టి ధృతి అతిధృతి కృతి ప్రకృతి ఆకృతి వికృతి సంకృతి అభికృతి ఉత్కృతియను నిరువదాఱు ఛందస్సులును, బైలజ రోమజ వాసిష్ఠ సోమ సూర్యాది సిద్ధాంతంబులును, ఉపమా రూపక దీపావృత్తాక్షేపార్థాంతరన్యాస వ్యతిరేక సమాసోక్త్యతిశయోక్త్యుత్ప్రేక్షా హేతు సూక్ష్మ లేశ క్రమ సర్వ ప్రియోర్జస్వ పర్యాయోక్తి సమాహితోదాత్తాపహ్నవ శ్లేషోక్తి తుల్యయోగితాప్రస్తుతప్రశంసా వ్యాజస్తుతి నిదర్శనా సహోక్తి పరివృత్తి సంకీర్ణ విభావనాద్యలకారంబులును, అమరామరశేష విశ్వశాశ్వత శబ్దార్ణవ యాదవ వైజయంతీ నానార్థ రత్నమాలికా మేదినీ హలాయుధ వాగురి కేశవ తారపాల ధన్వంతరీ ధరణీ ధనంజయ రభస విశ్వప్రకాశ మాధవ చింతామణి జయ ప్రతాప శుభాంకాజయపాల క్షీరస్వామ్యేకాక్షరాది నిఘంటువులును, సంస్కృత పాకృత శౌరసేని మాగధి పైశాచి చూళికోక్త్యపభ్రంశాంధ్రము లనునష్టభాషలును, స్వర నిత్యసమాస ప్లుత కాక్వాదేశ ప్రాది ప్రాదియోగ వృద్ధ్యభేద దేశీయోభయ శకంధ్వ ఖండ విభాగ వికల్ప ప్రభునామ భిన్నవర్గ సంయుక్త వికల్ప సంయుక్తము లను చక్కటి యెక్కటి పోలికలును, సరసానుస్వార ఋజువు లనంబరగు యతుల విధంబులును, సమనామ సంయుక్త సంధిగతోభయ ప్రాది వికల్ప బింద్వర్ధబిందు ఋప్రాస త్రికార సమలఘుప్రాస మైత్ర్యంత్య దుష్కర ద్వంద్వ త్రిప్రాస చతుర్థప్రాసా ద్యష్టాదశ ప్రాసంబులును, మగణ యగణ రగణ సగణ తగణ

జగణ భగణ నగణంబులును, జంద్రేంద్ర సూర్యగణంబులును, నుపగణంబులును బ్రయోగించి, తత్తద్దేవతాలక్షణంబు లెఱింగి శయ్యాశైలీ భేదంబు లెఱింగి ద్రాక్షా కదళీ నారికేళ పాకంబుల కవిత్వ రచన లెఱింగి సకల విద్యా పారంగతుండై యుండె నప్పుడు. 128

తే. ఆతఁడు తన సతు లిద్దఱు నహరహంబు
వాదొనర్చుట సైఁపక వలపుఁ గులుకు
పిన్న పెండ్లాము పక్షమై పెద్దబార్య
భాషిణీనామఁ గడనుంచె దోషమనక. 129

సీ. నెఱిగొప్పు నెఱరంగు నీలంపు సద్రుచుల్
నారద భావంబుఁ జూఱఁ గొనఁగఁ
గలికి కాటుకకంటి చెలువు భారద్వాజ
గరిమంబు నైనఁ జీకాకు పఱుప
మించు సిబ్బెపు గుబ్బ మినుకులు కుంభజ
సద్వృత్త మంతయు జడియఁ జేయ
మందయానపుఁ బ్రౌఢిమము మతంగజధైర్య
పర్యాయ మెంతయుఁ బగులఁ జేయ

తే. నవసుధామయ మధురోక్తి నైపుణములు
శుక మనోవృత్తి నెంతయుఁ జులుకఁ జేయ
మెఱుఁగు జిగినిచ్చు వగజగ్గు నెఱతనంబు
వెలయఁ జరియించు నదియు న వ్వీటిలోన. 130

తే. మగఁడు పెఱవాడ వైచిన మట్టు మీఱి
బిడ్డ పాపలఁ గని యెత్తి పెంచు జోలి
లేదు గావునఁ దిండిచే నూఁది పోఁత
బొమ్మ గతి నుండు నక్కొమ్మ యెమ్మె చిమ్మ. 131

చ. కుడువ సమస్త భాగ్యములు కోరిక మీఱఁగఁ గట్ట వస్త్రముల్
తొడుగ విశేష భూషణములున్ దనరార నలంద గంధమున్
ముడువను మంచి పుష్పములు మొత్తము గల్గిన భోగహీనలై
పడఁతుక లుండ నేర్తు రటె? ప్రాయమునన్ బెఱత్రోవ డాయకన్. 132

తే. పిఱుఁదుఁ బిక్కలుఁ జెక్కులు బెడఁగుఁ దొడలు
వెడఁద యొడలును జన్నులు వెండ్రు కిడను
సందు లేకుండ బలియుట సకియ మనసు
జార సంభోగ కేళికిఁ స్వారి వెడలె. 133

వ. అది మఱియును, 134

క. జారుల మది జాఱఁగ నా
నారీమణి మోవి లేఁత నవ్వెసఁగించున్
హారంబుల వారంబుల
హేరంబులనన్ రదాళి యించుక మెఱయన్. 135

తే. మనసు నిలువక తమి హెచ్చు మాఱుమగల
వెదకుచుండంగ నప్పు డా వీథి వెంట

వింత పరదేశి చతురాఖ్య విప్రుఁ డొకఁడు
వచ్చె భాషిణి కనువిచ్చి మెచ్చి చూడ. 136

ఆ. విప్రుఁ డివ్విధమున వీథి నేతెంచుచు
సొలసి కెలఁకు లరసి చూచికొనుచుఁ
దన్నుఁ జూచుచున్న ధరణీసురాగ్రణి
తరుణిఁ గాంచి దాన్ని దఱియవచ్చె. 137

తే. వచ్చి ధర్మాభివృద్ధి గావలె నటంచుఁ
బరమ భాగీరథివి మహాభాగ్యశాలి
వనుచు దీవించి నాకింత యన్న మనుచు
వేఁడ భాషిణి యా విప్రవిభున కనియె. 139

క. పేరెయ్యది? యూరెయ్యది?
మీ రెయ్యెడ కేఁగఁదలఁచి మెట్టితి రిటకం
బారసి యడిగిన బాడబ
సారసలోచనకు వేడ్కఁ జతురుం డనియెన్. 139

చ. మునుపు ప్రసిద్ధి మీఱఁ దమ మూఁడవ తాత తరాన నుండి యుం
డిన యది కాణయాచి దగుఁ డెంకణ ధారుణియందుఁ దండ్రి నన్
గని చదివించు బుద్ధి నయగారికి నప్పనసేయ, నక్షరా
స్యునిఁగ నొనర్తు నంచు బడి కొయ్యనఁ దోడ్కొనిపోయి యచ్చటన్. 140

## ధూర్త విద్యార్థి చేష్టలు

సీ. నన్నయ్యవార లోనామాలు దిద్దుకో
మ్మనీనచోఁ గడుపు నొప్పనుచు నేడ్చి
దండమ్మునను గుణింతము పెట్ట రమ్మన్న
నంగుళి వ్రణమాయె ననుచు జుణిఁగి
శిష్యులచేఁ గాలుసేతులు గట్టించి -
తెచ్చి పద్యముఁ జెప్పఁ దెమలకుండి
పలకవ్రాయు మటంచు బడి కెత్తుకొని పోవ
బలపంబు లేదని పలుకకుండి

తే. యలుకచే నుండ బుగ్గలు నులిమి తిట్టి
తొడలు వడిపెట్టి కోదండ మడరఁ గట్టి
రెట్ట లెగఁబెట్టఁ బట్టించు ఱేపు మాపుఁ
గొట్టు బెట్టుగ సజ్జనకోల విఱుగ. 141

సీ. గద్దించి వడిఁ బెట్టి దిద్దుమంచును వేలు
వెట్టింప నచట నేఁ బెట్టకుందుఁ
పలుమాఱు "లో" యని పల్కుమంచును గొట్టి
చెప్పిన శిలవృత్తిఁ దప్పకుందు
నొకటికి సెలవియ్య నుఱికి చీఁకటి దాకఁ
బసుల కాఁపరుల వెంబడిన పోదు
జనని యడుగుకొని చదువుకోఁ బొమ్మన్న
వినక వేమఱు వెక్కివెక్కి యేడ్తు

తే. సారె పద్యపుఁ బలకపైఁ జమురు పూఁతు
నెప్పుడును బెద్ద పలక పొక్కెత్తఁ జేతు
బాలరామాయణము పుస్తకాలు దాతు
వేయు సజ్జనకోలలు విఱిచి వైతు. 142

క. చరికుండఁ బగులఁ గొట్టుదుఁ
బరువడి సూత్రంబుఁ ద్రెంచి పాఱఁగ వైతున్
మతిమతి బలపము లిచ్చినఁ
బొరి దినమును బగులఁగొట్టి పోయె నటందున్. 143

తే. నన్ను బింగీలు పెట్టించునాఁడె యయ్య
వారు నిద్రింపఁగాఁ జూచి చేరి యచటఁ
జింత వ్రేల్ కొమ్మ వంచుక సిగను గట్టి
విడిచి యుతికితి నయగారు మిడికి కూయ. 144

తే. అంతఁ దలిదండ్రు లయగార లది మొదలుగ
వేఁడి వెసలట్లు వేసరి విడువ నేను
గొంటె వగ నాకతాయులఁ గూడుక పలు
గాకి చేష్టల నాటలఁ గ్రందుకొంటి. 145

వ. అంత మఱియును. 146

## బాలక్రీడలు

సీసమాలిక. దూచియు జాబిల్లి బూచి కన్నుల కచ్చి
గుడిగుడి గుంజాలు కుందెనగిరి
చీఁకటి మొటికాయ చింతాకు చుఱుచులు
పులి యాటలను జిట్ల పొట్లకాయ
తూరన డుక్కాలు తూనిఁగ తానిగ
ఛిడుగుడు మొకమాట చిల్లకట్టె
దాఁగిలిమూఁతలు తనుబిల్ల యాలాకి
గుప్పిటి గురిగింజ కొండకోతి
చిక్కణ బిల్లయుఁ జెల్లెము గొడుగును
బిల్ల బిద్యము లక్కిబిక్కి దండ
గడ్డెనబోడి యొక్కసికొక్కు బరిగాయ
పోటు గీరనగింజ బొంగరములు
పెంచుల బేరి దోపిల్లు గాలిపటంబు
సరిబేసి పుటచెండ్లు చాఁకిమూట
గోట దొర్లుడుకాయ గొబ్బిళ్లు మోపిళ్లు
నీగ పోగిస బంతి దూగిలాట
వెన్నెల కుప్పలు వ్రేలు బొట్టగ సిరి
సింగన్న వత్తియుఁ జిందుపరువు
గచ్చకాయలు కిట్టుగానుగ త్రిప్పుళ్లు
గుట్టుపెక్కుడు మంటిగూళ్లు సూళ్లు
కాలికంచంబును గట్టె గుట్టము వినా
యకు తిరితూనె కొట్లాట చెమట

కాయత్తు గొడుగు బొంగరము రామన్నాట
పొడుగుల్ల నుయ్యాల బోర్ల పక్క
బండ్లికలును జొప్ప బెండ్ల మంచంబులు
గంగెద్దులాటలు గనికె కుండ
లీనె గాజులు పోఁతుటీనె గుఱ్ఱంబులు
నాల్గు కంబాలాట నట్టకోఁతి
దంటు కిన్నెర మంటిగంటి పోట్లాటలు
సింగన్న దాఁటులు జిరుకురాతి
దాబాటలును మంచి తాటాకు చక్ర చ
క్రాల త్రిప్పుడు తోఁచిగాయ పరుపు
పాడుపా తరమాళ్లు పాతరల్ బంతులు
చిమ్మన గ్రోవులు చిఱ్ఱు బుఱ్ఱు
లాకుపీఁకెలు జండ్రలాటలు చుండ్రాళ్లు
గిలకలు చిటికెలు కీచు బుఱలు
కోలాటములు పిల్లగ్రోవులు గుమ్మడి
క్రోవి కూఁతలు నూఁదుక్రోవు లొడ్డు
విడుపు నెట్టుడు గాయ విండ్లమ్ములాటలు
పులిజూదములు కట్టె పుట్టచెండ్లు
దాయాలు సొగటాలు దాట్రాయి చదరంగ
ముసు బోటురాళ్లును మూఁత పొడుపు
వామన గుంటలు వడి గుప్పి గంతులు
చెఱకుల పందెముల్ చిమ్ముఱాయి
తుమ్మెద రేఁపుళ్లు కుమ్మర సారెలు
బందారు బసవన్న పత్తికాయ
తిరుగుడు బిల్లల త్రిప్పుళ్లు జరుగుళ్లు
చిటి తాళ మీళలు నెటికె తట్లు

తే. తాటియాకుల చిలుకలు తాళ్లపాము
లకట! యగచాట్ల ప్రాఁతనై యాడుకొనుచుఁ
జదువుపై సంధ్యపై నాస్థ చాల లేక
పొలఁతి! యీరీతి నేఁ బ్రొద్దుపుచ్చుచుండ. 147

క. విను మాట్లాడఁగఁ బెద్దలు
ననుఁగని పనిసేయు మనుచు నాటిన కోపం
బున నేవలాడ వినలే
కను దేశభ్రమణవృత్తి గైకొని మఱియున్. 148

క. సత్త్రాశన పాత్రుఁడనై
విత్రాసము మాని వింత విషయముల బడిన్
యాత్రావస్థలఁ దిరిగితి
రాత్రి పవళ్ళనక వినుము రాకేందుముఖీ! 149

వ. ఇంత యేమిటి కంటేని. 150

సీ. తల్లికిఁ గలనైన దయలేదు నామీఁదఁ
దండ్రి యెప్పుడు చూచి వేండ్రపడును

బినతండ్రి బెదరించుఁ బెదతండ్రి కొరించుఁ
బెదతల్లి యూరక బెట్టుఁ దిట్టుఁ
చినతల్లి మెటికలు ఫెళ్లున విఱుచును
నన్నదమ్ములు చూడ రతులకరుణ
వదినెలు మఱఁదండ్రు వదరుచు శాపింతు
రక్కలుఁ జెల్లెండ్రు లెక్కఁ గొనరు
తే. మేనమామలు బావలు గానివానిఁ
గాఁగఁ జూతురు మా వాడకట్టువారు
కంటగింతురు నన్నంటె, కమలజాతు
వ్రాఁత ఫలమేమియో కాని, వనజగంధి! 151

తే. ఇంక నెన్నెన్నఁ గలవు నా హీనదశలు
నాపదలుఁ జెప్ప నేఁటిమీఁదాఱు నెలలు
పట్టు నది యేటి జోలి! నా పాపఫలము
నేఁటితోఁ దీఱె నోకొమ్మ! నిన్నుఁ జూడ. 152

క. అని చతురాస్యుఁడు వేగమె
తన వృత్తాంతంబుఁ జెప్పి తరలాక్షి! క్షుధా
ర్తిని డస్సితి భోజన మిడు
మని భాషిణి నడుగఁగానె యది యిట్లనియెన్. 153

క. ఈవేళ మాత్ర మన్నముఁ
గావించెదఁ గాని, మాపు కదలక దినమున్
నీవు పరుండెదవా? సుఖ
జీవితముగ నిచట నొకటి సెప్పెద నీకున్. 154

అనినఁ జతురాస్యుఁ డామాట కాశఁబొంది
"నీవు చెప్పిన మర్యాద నిజము నేను
జేయఁగల వాఁడ"నని బాసఁజేసి యపుడు
భోజన మొనర్చి వెలువడిపోయి యతఁడు. 155

సీ. అప్పుడె యేమని యడుగ నైతి నటంచుఁ
బలుమాఱుఁ దలఁచి యూర్పుల నిగుడ్చు
నీసారి చని వేఁడ నేమనునో యని
సంకోచమునఁ గొంకి చక్కఁబోవు
నస్తమానము గాదటంచుఁ బాదచ్ఛాయ
లొనరించు వ్రేళ్ళెంచికొనుచు నుండు
నీ యూర గడియార మేడ లేదాయని
వీథి వెంబడిఁ బోయి వెదకి చూచు

తే. లీలఁ బవళించు దిగ్గన లేచిపోవు
నిలుచుచోటను నిలువక నిప్పుద్రొక్కు
కోతి చందానఁ జతురాఖ్యకుండుఁ దిరుగు
వెలది పై మోహ మెదహత్తి వెఱ్ఱి యెత్తి. 156

క. ఇటులఁ దమి హెచ్చి మారుఁడు
సటలం బెట్టంగ నొచ్చి సడి నటు నిటుఁ జెం

దుటకు వెఱసొచ్చి రతిసం
ఘటనార్థము మిగుల వేఁగు కాలమునందున్. 157

ఉ. భానుఁడు క్రుంకఁగాఁ గని యపార ముదంబునఁ బొంగి, భాషిణీ
మానినియిల్లు చేరి వగమాటల తేటలఁ బొద్దువుచ్చి, యా
యా నిపుణోక్తులం జెనక నాబిడ "చూచిటు రమ్మటన్నచోఁ
బూనిక నిల్లు చేకొనెడు బుద్ధిటు వచ్చితి వేమి చెప్పరా! 158

తే. మంచి తగిన గృహస్థుఁడ వెంచఁ, బరక
కెత్తు కొమ్మనఁ బాతిక కెత్తుకొంటి"
వనినఁ జతురుఁడు వణఁకంగ నప్పళించి
"జడియకు" మటంచుఁ గౌఁగిఁటఁ జక్కఁ జేర్చి. 159

క. తరి తీపు వగలు చిన్నెలు
మురిపెములు వినోదకథలు మోహపు భాషల్
పరిపరి వింతల వలపులు
నెరయంగాఁ జూపి సురత నీరధి ముంచెన్. 160

వ. ఇట్లు చెలంగి. 161

చ. "కురు సురతక్రియాం, ప్రణయ కోపమతిం త్యజ, పూర్వ సంగమం
పరిచిను, దేహి గాఢ భుజ బంధన, మంగజ శాస్త్ర వాసనామ్
స్మర, రదఖండనం ఘటయ, మా మవ మారశరా న్నఖక్షతం
విరచయ" యంచుఁ బల్కుచును వేడ్క వచింతురు జారదంపతుల్ . 162

వ. ఇట్లన్యోన్య సరస సల్లాపంబుల నెడతెగని మోహాతిరేకంబున సంఫుల్ల హల్లకభల్ల
మల్లయుద్ధ మహోద్ధత సన్నద్ధ బుద్ధిని సరికట్లం బెనంగి పుల్లసిల్లి, కరంబులు కరంటుల,
నురంబు నురంబున, ముఖంబు ముఖంబున, నూరువు లూరువులం గీలుకొల్పుకొని
నిద్రించు సమయంబున. 163

చ. వనితయు నిద్రలేచి తెలవాఱెను లెమ్మని జారు లేపి, "నీ
వనుదిన మిట్లు రాత్రి సమయంబున వచ్చి, యనంగ సంగరం
బున నను డాయు" మంచు, నెఱ మోహముతో వినుతింప, మంచి దం
చును వచియించి వేడ్క పడుచున్ జతురాహ్వయుఁడేఁగె నెంతయున్. 164

తే. ఏఁగి సంధ్యాద్యనుష్ఠాన మెలమిఁ దీర్చి
పురములో రచ్చ తావులఁ బ్రొద్దు పుచ్చి
యస్తమయము సమీప మౌనంత, నేటి
కేఁగి మజ్జనమాడి యథేష్టముగను. 165

క. అక్షసరం బార్ద్రాంశుక
మక్షయ కరపాత్ర మమర నతఁడప్పురిలో
"భిక్షాం దేహి " యటంచు న
పేక్షం బ్రతి గృహముఁ దిరిగి భిక్షం బెత్తున్. 166

తే. ఎత్తి తెచ్చిన భిక్షాన్న మెల్లఁ జల్ల -
శాక మిడునింట భుజియించి సకల వైశ్య
జాల యాచిత లబ్ధి తాంబూల చర్వ

శోష శోణిమ మోమున నొఱపు నెఱప. 167

క. మనుజులు నిద్రాశయులై
యొనరిన తఱి నాల్గు దిక్కు లొగిఁ జూచుచు వే
చని భాషిణి యింటికి ముద
మునఁ జతురుఁడు నిచ్చ దాని ముచ్చటఁ దీర్చున్. 168

వ. ఇట్లు ప్రతిదినంబును నతండు భాషిణీ యోషాభిప్రాయంబుఁ దీర్చు; నంత. 169

మ. ఉహుహూకార తనూ విధూనన జనవ్యూహోపభూ జృంభమా
ణ హసంతీ జ్వలనంబు శీతపవమాన స్పర్శ రోమోద్గమో
ద్వహనాంగాఖిల జంతు సంఘము హిమ వ్యాప్తాంబుజాతాండ మి
మ్మహి మీఁదం బొడసూపె నెయ్యెడల హేమంతంబు దుర్దాంతమై. 170

సీ. సకల దిశా వ్యాప్త బక సితీకృతములు
బహుళ నిద్రాముద్ర పంకజములు
నిబిడ వర్షిత మహా నీహారకణములు
శీతలోత్తర జాత వాత తతులు
వర్ధిత నిర్ధూమ వహ్ని హసంతులు
కైరవ వికసన కారణములు
దాళవృంత విహార కేళివారణములు
యామినీ సముదయాయామదములు

తే. సరస మృగమద మేచకాగురు సుగంధ
బంధుక శ్రీ కుచ ద్వంద్వ బాధ యుక్తి
చకిత పురుషావళీ శీత సాధ్వసములు
భాసురములయ్యె హేమంత వాసరములు. 171

తే. శాంతములయ్యె నెండలు, నిశాంతములయ్యె వధూకుచంబు ల
త్యంతము వాడి వేడిమికిఁ దాంతము లయ్యెఁ బయోజముల్ ప్రణా
క్రాంతములయ్యె వాతెఱలు, కాంతము లయ్యె మహోష్ణ వస్తు, లా
శాంతములయ్యెఁ దావులు, నిశాంతములన్ హిమవారి బారికిన్. 172

తే. అట్టి హేమంతకాలంబునందు నొక్క
నాఁడు చతురుఁడు భాషిణితోడఁ గూడి
రాతిఁ బరిపరి రీతుల రసికవృత్తి
సురతకేళుల నైపుణిఁ జూపు నపుడు. 173

చ. నెలవునఁ జండరశ్మినిఁ గనిష్ఠకుటుంబిని లేనిపోని వా
దుల జగడించు చిల్వేడలఁదోలిన వ్రాలిన చింతనొంది యూ
ర్పు లెనయ “దైవమా” యనుచుఁ బొక్కుచు నెవ్వరుఁబల్కరంచుఁ బే
రెలుఁగున భాషిణీ యువతి యింటికి వచ్చె నతండు ఖిన్నుఁడై. 174

తే. వచ్చి యచ్చండరశ్మి తా వాకిటికడ
నిలిచి తన యగ్ర మహిషినిఁ బిలువఁ గానె
గుండె ఝల్లని చతురుండు కొంకుచుండ
నతని నెట్లింతి యిలువెళ్ల ననుపవలయు? 175

క. ఇది దెలిసిన నృపు నెనయన్
బదమని రాయంచ వలుక, భామామణి
నా కది తెలియ దెటుల నని పెను
విదితముగాఁ దెలుపు మనిన విహగం బనియెన్. 176

తే. అటుల నిజపతి తనుఁబిల్వ విటుని కేలు
పట్టి తోడ్తెచ్చి, భాషిణీ పద్మగంధి
తలుపుఁ దెఱచుచు నామూల నిలిపి వాని
నాత్మనాథుని కెదురుగా నరిగి యపుడు. 177

ఉ. నెయ్యము మీఱఁగాఁ జరణనీరజముల్ తలసోక మ్రొక్కి వే
డ్కయ్యెడఁ బల్లవింప హృదయంబున భాషిణి యాత్మనాయకున్
శయ్యకుఁ దార్చి దివ్వె లిరుచక్కి వెలుంగ ముసుంగు వెట్టి "నేఁ
డెయ్యెడకైన నేఁగవె చెలీ!" యని పల్కి పరుండెఁ దిన్నగన్. 178

చ. అనువచనంబు దన్ను నొక యన్యగృహంబున కేఁగుమంచుఁ బ
ల్కినదని యాత్మనెంచి వడి గేహము వెల్వడి యావిటుండు పో
యిన తరువాత భాషిణి నిజేశుని దగ్గరఁ బండసైపకన్
గొనకొని లేనివాదు లొనఁగూర్చి చరించెను వేఁగునంతకున్. 179

క. జారులపై నాసక్తులు
నారుల కున్నటుల నాత్మనాయకుల పయిన్
గోరిక లున్నవె? యని ఖగ
మారయ వచియించుతఱి నిశాంతంబైనన్! 180

మ. కని హేమావతి దాని మెచ్చుచు సమగ్ర స్వర్ణ సౌధాంతరం
బున నక్షీపని జాళువా గొళుసులన్ బొల్పొందు నుయ్యాలపై
ఘనతం జేరి వసుంధరాధిపతి యోగప్రాప్తి ఘస్రాంతమౌ
దనుకంగుంది తమిస్రమౌట కెద మోదంబంది యాపిమ్మటన్. 181

సీ. సకటాక్షదీప్తి కాంచన రత్న తాటంక
ధగధగల్ చీఁకట్లు తలఁగఁద్రోయ
సకపోల కాంతి మౌక్తిక హారవల్లికా
చకచకల్ సాంద్రచంద్రికలు గాయ
సవలయ ధ్వని హేమ స్వతకీ కింకిణీ
ఘణఘణల్ శ్రుతికౌతుకముగ మ్రోయ
సస్థాసక సుగంధ సారస దళ దామ
ఘుమఘుమల్ ఝుణోత్సవమును జేయఁ

తే. గళుకుపని చిల్క వగ లేఁత తళుకు లొలుకు
జాళువాకమ్మి సరిగంచు చలువ వలువ
ధగధగల్ జాజిపువ్వు మొత్తములు గురియ
నంచకడఁ జేరె సాతాని మించుఁబోడి! 182

క. చేరిన హేమావతి ముఖ
మారసి నెఱజాణ వౌదు వనుదినము మెయిన్
వేఱొక వగ గుల్కఁగ శృం

గారింపఁగ ననుచు ముదముఁ గల్పించి యనెన్. 183

## పండ్రెండవ రాత్రి కథ

### శివదత్తయోగిసతి కోడిపందెగానిఁ గూడుట

చ. మనవి పరాకుమాని విను మానిని! పూనికమైఁ గళింగభూ
మిని సిరికాస్పదంబు జనమేజయుఁడేలు సుగంధ బంధురం
బను పుర ముల్లసిల్లు మణిహర్మ్య వినూతన కేతనచ్ఛటా
జనిత సువాతధూత సురసాలపతత్సుమ ధౌత వీథియై. 184

శా. అందుండున్ భసిత త్రిపుండములు కామాక్షుల్ జడల్ కక్షపా
లందుం దండము కావి వస్త్రములు రుద్రాక్షల్ దువాళించు కా
లందెల్ పాదుకలున్ మృగాజినము నిత్యం బొప్ప సంసారి యో
గీంద్రుండొక్కఁడు శూద్రుఁ డీశపద భక్త్యైకాగ్ర చిత్తాబ్జుఁడై . 185

వ. అతండు పృథివ్యప్తేజో వాయ్వాకాశంబులను పంచభూతంబులును, ద్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియంబులును, వాక్పాణి పాద పాయూపస్థలను కర్మేంద్రియంబులును శబ్ద స్పర్శ రూప రస గంధంబులను విషయంబులును మనోబుద్ధి చిత్తాహంకారంబులను నంతఃకరణ చతుష్టయంబును జీవునితోఁగూడి పంచ వింశతి తత్త్వంబులగునని యెఱింగి యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులనం బరగు నష్టాంగ యోగంబులఁ జతురుండై కమల యోగ బ్రహ్మ గరుడ సుఖ వీర కూర్మ సిద్ధానంత కుక్కుటాసనంబుల నిశ్చలత నిలిచి రేచక పూరక కుంభంబులఁ, బ్రాణాపాన వ్యానోదాన సమానంబులను ప్రధాన వాయువులను నాగకూర్మ కృకర దేవదత్త ధనంజయంబులను నుపవాయువులను స్వాధీనత నొందించి, యిడా పింగళా సుషుమ్నా మార్గంబులను, నున్మనీ మనోన్మనులను నాద బిందు కళలను సాంఖ్య తారకామనస్కంబులను మంత్ర హఠ లయ రాజ యోగంబులను మూలాధార స్వాధిష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాజ్ఞా సహస్రారంబులను చక్రంబులను దెలియనేర్చి యాత్మాంతరాత్మ పరమాత్మజ్ఞానాత్మ స్వరూపంబు లెఱింగి సత్పురుషుల నాశ్రయించియుఁ దత్ఫలలబ్ధిఁ గానక కేవలంబు శైవమత ధురంధరుండై యుండె నంతట. 186

క. ఆరాధ్యుఁడు తమ వంశా
చారమునకు గురుమహత్త్వసత్తముఁడు ప్రియం
బారఁగ నతనికిఁ బెట్టిన
పేరును శివదత్తుఁడండ్రు బిసరుహగంధీ! 187

తే. సంతతంబును జంగమార్చనలు సల్పి
భౌమవారంబునను వీరభద్రు పళ్ళె
రంబునిడి వారి పాదతీర్థమున భుక్త
శేషమునఁ దృప్తిఁబొందుచుఁ జెలఁగు నతఁడు. 188

సీ. అయ్యావళీ ముఖ్యమై తనరారెడు
మిండ జంగంబులు మెఱసి నడువ
గౌరఘే మల్లప్ప గంగకుఁ జను కంచి
కావళ్లవారును గలిసి చనఁగ
గుమ్మెతల్ కిన్నెరల్ గూడి వాయించుచు

భైరవజోగి వెంబడినె కదల
బసవగంటలు బృహత్పుటశంఖములు మ్రోయ
శివరాత్రి జంగాలు చేరి కొలువ

తే. లశన తిలపిష్ట చూర్ణభాగశన మసిమి
యుల్లి పచ్చళ్లు పులిదోసె లూరుఁబిండ్లు
మూట జోలెలు చిటిగాళ్లు మోసితేఁగ
నాతఁ డేఁటేట శ్రీశైల మరిగివచ్చు. 189

తే. వీర శైవంబు ముదిరి యేవేళనైన
"హరహర శివా మహాదేవ" యనెడు పల్కు
పలుకునేకాని యితర సంభాషణంబు
లాడఁ జెన్నఁడుఁ బెండ్లాము తోడనైన. 190

క. అతనికి విశాల యనం
గాఁ దరుణియొ ర్తు తనరుఁ గమ్మవిరి లకో
రీ తురక రౌతు లాయము
లోఁ దేజీరతన మనుచు లోకులు పొగడన్. 191

క. దాని విలాసపు వదనము
దాని చొకాటంపు గబ్బి తళుకుల గుబ్బల్
దాని పసమించు దేహము
మానవతీ! పొగడ శక్యమా? విధికైనన్? 192

సీ. నీలాల రుచినవ్వు నెఱివేణి మొత్తమ్ము
తమ్ముల నిరసించు నెమ్మొగంబు
గంబురా బుగబుగల్ గలఁగించు నునుఁ బల్కు
పల్ కుదు రాణుల పసనుమించు
మించుల నిర్జించు మెయితీవ పొంకంబు
కంబుసోయగముల గళము మారు
మారు గుడారముల్ దోరుచు గుబ్బలు
బలుదీవినగు నితంబంబు మహిమ

తే. హిమమయూఖాస్య యూరుల యేపుఁ దెగడు
గడుసు రంభల సొగసు జంఘలు జయించు
నించువిలుకాని శరధుల నేణనయన
యనఘ పదములు కెంజివుల్లను హసించు. 193

క. చివురా? వాతెఱ నల్లని
కవురా? నునుసోగ వెండ్రుకలు పుత్తడిమేల్
సవురా? దేహము ముద్దుల
దవురా? యని జనులు పొగడ నాబిడ యలరున్. 194

తే. దాని నెమ్మేని మెఱుఁగుఁ దాఁబూనఁ గడఁగి
పుత్తడి వెలంది చిద్రుపలై ముద్రవడసి
యొఱసి యొట్టంబువడి కాఁగి నెఱయఁ జిమిడి
కరఁగి నీరయి పోవును గలువకంటి! 195

ఉ. సారసమా నవీనఘృణిసంపదఁ గాంచును నెమ్మొగంబు కా
సారసమాన విభ్రమము సారె జయించును నాభియున్ సుధా
సారసమాన మాధురిని జాల రహించును మోవి చంద్రికాఽ
సారసమాన హృద్యరుచి సంతతి మించును గాంతహాసముల్. 196

శా. పున్నాగంబును గెల్వఁజాలు రుచిరాంభోజాస్య వేణీరుచుల్
పున్నాగంబును నవ్వనోపి నెఱయున్ లోలాక్షియానంబులున్
బున్నాగంబును గేరి మీఱి మెఱయున్ బూఁబోఁడినూఁగారుడాల్
పున్నాగంబును మించు నాభిచెలువంబున్ సారె వర్ణింపఁగన్. 197

క. అతను జయధర్మ లీలా
హితవృత్తిన్ గన్బొమలు రహించె ననుచుఁ దా
మతను జయధర్మలీలా
హితవృత్తి రహించి మించు నింతికుచంబుల్. 198

చ. అది పతిభక్తి మీఱఁగ దినాంతముదాఁకను సేవఁజేసి యిం
పొదవఁగ నారగించి వసనోత్తమ భూషణ పుష్పగంధ సం
పదలనుదేలి రేలు ప్రియభర్తను సిబ్బెపుగబ్బిగుబ్బలన్
గదిసి కవుంగిలింపఁ జనఁగాఁ గని కోపవిఘూర్ణితాత్ముఁడై. 199

క. శివదత్తుఁడు “హరహర!!” యని
“యవలికిఁబో! అంకులాఁడి!” యని తను ద్రొబ్బం
గ వయసుది గనుక నాశలఁ
దివురుచు, ప్రతికతివ మోహదీక్ష చెలంగన్. 200

సీ. పదము లొత్తెదనంచుఁ బతిజంఘికలు తన
తొడలపై వేసికో మిడిసిపడును
నడుము పట్టెదనంచు నాథుని చిఱుఁదొడల్
పుడికినఁ జీయని పొరలు నవల
నుపబర్హ మెగఁద్రోయ నుంకించి మోముపై
మోముఁ జేర్చినఁ జూచి ముదుగులాడు
వ్రేల్మెటికలు దీయ వెసనెత్తి హస్తంబు
కుచములపై వేసికొనినఁ దిట్టుఁ

తే. బ్రక్కలోఁజేరి కౌఁగిఁటఁ జిక్కఁబట్టి
కులుకు గుబ్బల నెదఱొమ్ము గ్రుమ్మి క్రుమ్మి
రతి బలాత్కారమునఁ జేయ ధృతి వహించు
ప్రేయసిని జూచి రోయుచుఁ ద్రోయు నతఁడు. 201

క. ఈలాగు నిచ్చ నిచ్చలు
వాలుగు టెక్కెంబుఁ బూనువాని దురంబుల్
లీల నొనరింపఁ జూచు వి
శాలను “ఛీ! అంకులాడి! చను” మని తిట్టున్. 202

తే. అతఁడు పరసౌఖ్యమునె కోరి యానఁబొందఁ
డిహమునం దుచ్ఛ సౌఖ్యాప్తి కింతయైన
జాతికిడునట్టి గిలిగింతలై తనర్చుఁ

గాని ప్రియురాలి చేష్టలు గలఁప వతని. 203

వ. మఱియును. 204

సీ. ఎడలేక కవఁగూడి యేప్రొద్దు రతిసల్పు
వారి వైఖరుల కే(కారఁ దొడఁగు
సయ్యాటములు గల్గు జంపతిక్రీడకుఁ
గెరలి వేమాఱు గ్రుక్కిళ్లు మ్రింగుఁ
గందర్పు కేళులఁ బొందు సతీపతు
లాసక్తికిని భావమందుఁ గుందు
సురతఖేలన వధూవరుల మైత్రికి మాన
సమున నిట్టూర్పులు సల్పి పొక్కు

తే. విరి లకోరీ దునేదారి దురముఁ గోరి
మీటి పోరాడు సుకుమార మిథునతతుల
వైభవముఁ గాంచి హా! యంచుఁ బరితపించు
సంగమ విహీనయైన యా జలజనయన. 205

తే. కుడువఁ గట్టను దొడుగను ముడువఁ బుడమి
నెంత గలిగినఁ బ్రాయంపు టింతులకును
గ్రామ్య ధర్మంబు లేకున్నఁ గలుగు దుఃఖ
మెంతని వచింపవచ్చు నో దంతిగమన! 206

తే. వినుము నానావిధంబుల దినము దినము
రాత్రి రమణునిఁ గడియఁబో "అంకులాఁడి!
పోవే" యని త్రోయ, గుబ్బలఁ బొందు పైఁట
చెఱఁగుఁ బఱుచుకఁ బండు నుస్సురు మటంచు. 207

ఉ. మిన్నక యిట్లు భర్త తనమీద విరాళి వహింపకున్న నా
కన్నియ చూచి "యీ ముది బికారునితోఁ బనియేమి నా" కటం
చున్నిరసించుఁ "బంచశర సుందర రూపుల జార వీరులం
గ్రొన్ననవింటివానీ మొనకున్ గదియించెద" నంచు నెంచుచున్. 208

క. వేవిన శివదత్తునకును
సేవలు సేయుటలు మాని చిత్తం బలరన్
భావజనిభులగు జారుల
త్రోవలు గనుచుండె విరహ దోహల కాంక్షన్. 209

చ. చికిలి విభూతిరేక, జిగిఁ జిల్కెఁడు కమ్మల కాంతిజోక , హా
టక మణిభూషణంబుల మిటారపుఁ డెక్కులమూఁక వాసనా
ధిక సుమగంధ సంపదల తేటగు సిస్తుల వీఁక యొప్పఁగా
నకట! విశాల నామసఖి హర్షముతోఁ జరియింపుచుండఁగన్. 210

## కోడి పందెములు—కోళ్లు

క. ఆంతట నితాంత హర్ష
స్వాంత యుత ద్యూత జన రవక్షుభిత హరి

ద్దంతిశ్రుతియై నగర
ప్రాంతంబునఁ గోడిపదువు పందెము సాఁగెన్. 211

తే. కాలి ప్రాఁతలు దారాలు కట్టుముళ్లు
ముష్టులును నీళ్ల ముంతలు మూలికలును
గత్తుల పొదుళ్లు మంత్రముల్ కట్టు పసరు
లెనయ వచ్చిరి పందెగాండ్రేపు రేఁగి. 212

తే. డేగ నెమలి పింగళి కోడి డేగకాకి
వన్నె లైదింటి కిరవొందు వన్నెలందు
రాజ్య భోజన గమన నిద్రా మరణము
లను విచారించి యుపజాతులను వచించి. 213

సీ. పట్టెజుట్టుది మైల పుట్టజుట్టుది గూబ
చిలుకజుట్టుది మూఁగ చిల్లకోడి
పట్టుమార్పుది యరజుట్టుది బోరది
బూడిద వన్నెది పొడది చిల్ల
కాలుది గుజ్జుది గాజులకాలు దో
గలది పండెట్టిది గద్దకాలు
దెట్టని దురగది నీఁకెల కాలిది
నల్లది కొప్పుది తెల్ల యురగ

తే. పిల్ల వ్రేళ్లది మొద్దుది నల్ల యురగ .
లనఁగఁదగు కత్తి కాల్పుంజు లందులోనఁ
బసపు పావళ్లు కాలందె లెసలు కట్లు
రావి రేకలు బిరుదులు తీవి గలుగు. 214

సీ. గరుడండు శరభంబు కంచు డమారము
రణభేరి కార్చిచ్చు జాతిబొమ్మ
రాము బాణము మితి రాహుత్తి పిడుగు హం
వీరుండు పుంజుల వేరువిత్తు
గండకత్తెర గుండెగాలంబు మాష్టీఁడు
పట్టభద్రుఁడు జెట్టి భైరవుండు
కత్తులపొది సింహగాలి బేతాళుండు
పసులపాఁతర పాదరసము చిలుకు

తే. టమ్ము సుడిగాలి చక్రంబు నలజ డదరి
శూలము పిరంగి వెలినక్క సాలువంబు
కాళరాత్ర్యంతకుఁడు పందెగాండ్ర మెచ్చు
లనెడు పేరుల పుంజులఁ గొని మొగించి. 215

చ. చొరఁబడి కాలి ప్రాఁతలను జుట్టియుఁ గత్తులు వేసి సందిటం
బెరయఁగఁబట్టి చెక్కు గఱపించి, గిఱేర్పడగీచి నిల్పికొం
కురలఁగఁబూంచి పందియపు టుంకువ దిద్దుచుఁ జిట్కె వేసి స
ళ్ళిరి మఱి “భో” యటంచును ఖళీపెళి పుంజులు తన్నులాడఁగన్. 216

క. కృకవాకువులం బుట్టిన

కకపిక వాదడరుచుండఁ గాలజ్ఞ రణో
ర్వికడను నిలిచిన శకనా
మకు నొక నాయకునిఁ జూచి మానిని మెచ్చెన్. 217

ఉ. మెచ్చినయంతలోఁ జిగురుమేలడిదంబు బిరాన దూసి, బ
ల్పచ్చని వింటిబోయ చెలిపైఁబడి నిబ్బరపుబ్బు సిబ్బెపున్
మచ్చగలట్టి గుబ్బకవ నాట ఖచిక్కునఁ గ్రుమ్మి క్రుమ్మి తా
నచ్చుగఁ బేర్చియార్చె హరిణాక్షిమనంబు గలంగ నెంతయున్. 218

తే. అపుడు తనుఁదానె తెలుసుక యజ్జనయన
కులుకు గుబ్బలఁ జిన్నారి గోట్ల రవిక
పిగులఁ బోకముడూడిపోఁ బేర్మితోడ
శకునిఁ జూచుచుఁ దన యింటిచక్కి నిలిచి. 219

చ. అతఁడొక నీటికాల్వకడ కంతట వేచని తామ్రచూడ శో
ణితయుత హస్తముల్ కడుగు నేర్పున నుండఁగ వాని చెంతకున్
గుతుక మెలర్పఁగా జని శకుంగని కోమలి కొంకుపాటుతోఁ
గొతుకుచుఁ బల్కె నొంటి నిటు గూడునె రాఁదనవంటి దానికిన్. 220

క. అని నీళ్లఁ గాళ్లు గడుగుచుఁ
"జనఁ గావలె నమ్మ చెల్ల! సరె తడవాయెన్
గన నెవ్వారును లే" రని
ఘనకుంతల పల్కుచుండఁగా శకుఁడంతన్. 221

క. "ఇంతీ ! యెవ్వరు లేరని
గొంతేటికిఁ జేసె దెవరు గొనిపోయెదరే!
యెంతపని వచ్చినను నిదె
చెంతనె యున్నాఁడ, భీతిఁ జెందకు" మనినన్. 222

చ. విని చిఱునవ్వునవ్వి "భువి వింతలు పో! మగనాండ్ర నీగతిన్
బనివడి యొంటినుండఁగని పల్కుట న్యాయమే?" యంచుఁ బల్కి, "నీ
వనుదిన మెందునుందు వెవరైనను వచ్చెద, రేది? చెప్పుమా
ననవిలుకానివంటి నెఱనాయక!" యంచు విశాల వేడినన్. 223

క. "నేనుండు దెపుడు మాపురి
లోనన్ నా పేరు శకుఁడు, లోలాయతనే
త్రా! నారుల మానసములు
పూని కనుంగొనెడు బుద్ధి భూమిఁ జరింతున్." 224

వ. అని చెప్పి నవ్వుచు వెండియు నిట్లనియె. 225

క. "ఈ వీట నొండు చిత్రము
గావించెడి పాటిదానిఁ గనమీవఱకున్
నీవైతె జాణవౌదువు
గా వోలున్ మాట లటుకఁగా వినఁబడియెన్. 226

క. అదిగాక నిన్నుఁ జూచిన
మొదలున్ మదనాస్త్రతతుల మొనఁబడితి ననున్

గదియించి గబ్బిగుబ్బల
పొదుగున నీడేర్పు రతులఁ బొసఁగించి సఖీ! 227

తే. అనిన విని యా విశాల యౌరా! యటంచు
మెచ్చి నా మదిలోఁగల మేలిమెల్లఁ
దెలిసితివి జాణవౌదని పలికి, యతని
రమ్ము నాయింటి కిపుడని నెమ్మి మీఱ. 228

క. త్వరితగతిన్ దనయింటికి
దిరిగి తిరిగి చూచుకొనుచుఁ దెఱవయుఁజనె, నా
సరణిని బడి శకుఁడాబిడ
శరణమునకుఁ జనియె వేడ్క సఫలతఁ బొందన్. 229

తే. ఇద్ద ఱీరీతి నింటిలో కేఁగినప్పు
డొంటిపాటయ్యె శివదత్తుఁ డింటలేని
కతన ననిపొంగి యన్యోన్య కాంక్షలూర
సురత కేళికిఁ జెలరేఁగి చొచ్చి హెచ్చి. 230

చ. అలసటలే కసహ్యగుణ మందక తగ్గక తొట్రుపాటునం
గలఁగక ప్రాలుమాలక వికారముఁ బొందక యాలసించకం
దొలఁగక నిద్రమబ్బుగొని తూలక నిద్దఱు నేకకాంక్షతో
దలిరుకటారివాని బెడిదంపుదురం బొనరించి రెంతయున్. 231

చ. లకుముకులట్ల సర్పముల లాగునఁ గుక్కుటజాతి చాడ్పునన్
బికముల లీలఁ బావురపుఁ బిట్టల తీరునఁ జెట్లవీఁక ధే
నుకముల వైఖరిన్ గపుల నూఁకుడు భంగిని భైరవాశ్వయు
గ్మకములరీతి సింహముల కైవడిఁ బోరి రనూన చాతురిన్. 232

తే. అటులఁ దమి దీఱకుండెడి యాసతోడ
ముచ్చటలు దీఱ నిరువురు మొనసి పెనఁగు
వేళ శివదత్తుఁ డింటికి వేగవచ్చి
చూచె నాశ్చర్యకోప విస్ఫురితుఁడగుచు. 233

వ. ఇత్తెఱంగున. 234

క. ఘర్షించి కనుల నిప్పుల
వర్షంబులు గురియఁజూచు వల్లభునకు నా
ధర్షణి యపు డేవిధమున
హర్షముఁ గావింపవలయు నని యడుగుటయున్. 235

తే. హంసకుల సార్వభౌమ! నీ వనుదినంబు
కథకుఁ గథకిట్టు నన్నడుగంగ నేల?
చెప్పు మేలాగు హర్షింపఁజేసె మగని
ననిన హేమావతిని జూచి హంసయనియె. 236

క. విను మటుల మగఁడు కోపము
పెనఁగొని ఘర్షించి పలుక భీతిల్లక యా
వనజదళాకార విలో

చన ధైర్యము చెదరనీక చతురత ననియెన్. 237

క. మరుకేళిఁ గవయ 'కవ్వలి
కరుగవె చీ! అంకులాఁడి!' యని నను నిచ్చల్
నిరసింతువు, యోగివ కన
నరకా! నీ వాకె తాఁకె నాకుం జూడన్. 238

చ. పలుమఱు 'అంకులాఁడి' యనిపల్కెడు నీ వచనం బమోఘమై
నెలకొని తాఁకె, సిద్ధుఁడవు నీ మహిమంబది యేల వ్యర్థమై
తొలఁగు?" నటంచుఁబల్కి చెలి దూఱిన, నాత్మతపో విభూతిచేఁ
దలకొను వాక్యసిద్ధికి ముదంబు గొనెన్ శివదత్తుఁ డెంతయున్. 239

చ. అటుల నిజాధినాథుఁడపు డాత్మమహత్త్వ గుణోపలబ్ధి కు
త్కటమగు మోదమందఁగను గామిని చూచి, "ననుం బతివ్రతా
పటిమ వహించుమంచు బహు భాషలఁ బల్కుము, పల్కకున్న నీ
కిట ఘటియింతు హత్య, తను వేటికి నేఁటికి నింద వచ్చినన్" 240

తే. అనెడు సతివాక్యమునకు స్త్రీహత్య కులికి
తనదు వాక్సిద్ధికిని నద్భుతంబుఁ జెంది
"నీ విఁక మహా పతివ్రతా భావ మహిమ
వెలయవే!" యని యోగి దీవించెఁ బ్రీతి. 241

క. అటువలె దీవించుచు నె
ప్పటియట్లనె వేఱులేని పక్షంబున న
జ్జటిలుండుండెను జెలియును
బటు ముదమున మెలఁగుచుండెఁ బడఁతుక! వింటే? 242

క. ఆరీతి మహోపాయము
నేరిచినన్ జారుఁ గవయ నెలకొను మన, నౌ
రౌర! జగజంత యని తెల
వాఱుటఁ గని భామ కేళివసతికిఁ జనియెన్. 243

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పిన విని హర్షంబు నొంది నలుండు తరువాతి వృత్తాంతం బాన
తిమ్మని ప్రార్థించిన. 244

మ. నిరవద్య స్వయశో వినిర్జిత మహానీహార నీహార భూ
ధర పుత్రీశ్వర కావ్యగోత్ర విధికాంతా గౌరవా గౌరవా
కర మందార పటీర శంకరపతాకా తారకా తారరా
డరవిందోద్భవవాహ పథ్యతిథి పాకాహార కాహారపా! 245

అనులోమ విలోమ కందము.
రామా కుజరాజనుత ర
మామర సుమరాగకర సుమాకర సమరా
రామ సరకమాసుర కగ
రామ సురమమార తనుజ రాజకుమారా! 246

తోటక వృత్తము.
వారణ వారణ వారణ రక్షా!

సారస సారస సారస పక్షా!
శారద శారద శారద కీర్తీ!
హారిమ హారిమ హారిమ మూర్తీ! 247

గద్యము :
ఇది శ్రీమత్కౌండిన్యస గోత్ర పవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధి
పూర్ణిమా చంద్ర నిస్సహాయ కవిత్వ నిర్మాణ చాతుర్య నిస్తంద్ర
శ్రీ రామనామ పారాయణ నారాయణామాత్య
ప్రణీతంబైన హంసవింశతి యను
మహా ప్రబంధంబు నందు
దృతీయాశ్వాసము

—: o :—

[1] ఇచట గణభంగము కన్పట్టుచున్నది.

# చతుర్థాశ్వాసము

శ్రీరాజిత! జితవారిధి!
వారిధితనయాంకజాతవసుధాపుత్రీ
హారిస్తనకుంకుమఘన
సారమృగీమదసుగంధచర్చితవశా! 1

వ. అవధరింపుము. ప్రత్యుత్పన్నమతి నలున కిట్లనియె. అట్లు ప్రభాతకాలంబు కావచ్చినఁ
గనుంగొని. 2

క. చిగురాకుఁబోఁడి చొచ్చెను
మగరా జిగి రాయిడించు మందిర భూమిన్
జగరాజిల్లెడు తొగరా
జగరాశికి నది రసించు సాయంబైనన్. 3

క. కని జలకమాడి సొమ్ములు
దనరంగ నలంకరించి తరళేక్షణ రా
ట్తనయునిపై మోహంబునఁ
జనగా రాయంచ చూచి సఖితో ననియెన్. 4

## పదమూడవ రాత్రి కథ

## నియోగిభార్య జోస్యునిఁ గూడుట

తే. "అక్క! రుచిగల్గు చక్కెర లానవాలు
పెట్టెదవె, యొక్కగాథఁ జెప్పెదను వేడ్క
నది నవీన ప్రవాళ రాగాధరోష్ఠి!
వినిన నొక్కింతనేర్పు నీ కెనయుఁజుమ్మి." 5

క. అనవిని చిఱునవ్వొలయం
"బనిచెఱుపుల కథలు చెప్పి పార్థివుఁ జేరం
జననీయ వైనఁజెప్పుము
వినియెద"నన సతికి హంసవిభుఁ డిట్లనియెన్. 6

తే. పూర్వమున బ్రహ్మసభకు నేఁబోయి కొంత
కాలమందుండి యజుఁడంపకంబు సేయ
మానస సరంబునకు వచ్చి మామకీన
కులజులను గాంచి భువిఁజూచు కోర్కి పొడమి.

## పర్వతములు.

సీ. హిమవ న్నిషధ మేరు హేమకూ టాస్తోద
య ద్రోణ మలయ వింధ్య త్రికూట
మాల్యవ న్మందర మైనాక గంధమా

దన సహ్యా పారియాత్రక సువేల
ఋక్షవ చ్ఛతశృంగ ఋష్యమూ కాంజన
చంద్ర గోశృంగ మహేంద్ర వృషభ
శాలేయ ధూమ్రవజ్ర మతంగ కైలాస
శతకేతు భృగు నీల చక్రవాళ

తే. కనక మేఘాంశుమ త్పుష్ప గరుడ భద్ర
చిత్రకూట సుదర్శన శేష సింహ
రోహణ శ్రీగిరి క్రౌంచ రుద్ర మత్స్య
సూర్య వైద్యుతముఖగిరుల్ చూచియంత. 8

## కంప చెట్లు.

సీ. కోరింద నలతుమ్మ గొటికె కోడారెయు
వెఱుతు రూడుగు దంతె వెట్టితుమ్మ
చిటిగార సుందరి చీ కెట్టితుమ్మయుఁ
దెల్లతు మ్మిలింద కళ్ళి తొట్టి
జమ్మి బలుసు గార చంద్ర పఱికి తెల్ల
పూలి లొద్దుగ జిడ్డు బుడ్డతుమ్మ
కలివే రేఁగుండ్రయు గచ్చ పెన్నంగయు
దుడ్డుమంగయు భూతతొట్రు కోవె

తే. మంగ చిటికొక్కి సీకాయ మండ్రకుక్క
వెలఁగ వాకుడు పల్లేరు ములక జీల్గ
నగిరి నీర్గొబ్బి మొదలుగా జగతిఁ గల్గు
కంపలన్నియు వేవేగఁ గడచి కడచి. 9

## చిఱు చెట్లు.

సీసమాలిక. జిల్లేడు వెంపలి జిడ్డువెంపలి పైఁడి
తంగేడు తంగేడు తగిడి యుస్తె
ములువెంపలి ములుస్తె గలిజేరు గుంటగ
ల్జేరును దంతి బందారి నేల
తంగేడు మెట్టబందారి దుండుగ బ్రహ్మ
దండి భూతుల సెట్టిదొండి చల్ల
పిల్లిమాడుపు చార పిల్లడ్గు చిత్రమూ
లము నల్లతీఁగె కోలాకు పొన్న
ముయ్యాకుపొన్నయు మొగచీర తుత్తెర
బంకదుత్తెర హంసపాది గంటె
కామజిలుగు మెట్టదామర వెట్టి సె
నగ జంబిరము కాచి నల్లకాచి
శ్రీతులసియు సంబరేణు నేలుసిరి కీ
శ్వరి నేలవే మూటి చల్లగడ్డ
సహదేవి దుష్టుపు చలిపిండి చిటిముటి
పెన్నేరు విషబొద్ది పిండిదొండ

నెమటాయి గొలిమిడి నీరుబచ్చలి ప్రబ్బ
వీర గన్నే రాఁడుబీర నేతి
బీర పేరాముష్టి పీచరములు గొలి
మిడి చేఁదుపొట్ల యుమ్మెత్త తిప్ప
తీఁగె విష్ణుక్రాంత తీండ్రెల్ల చిత్రమూ
లము దొండతీఁగె ముల్లంగి నల్ల
జీ డెద్దుమట్టాకు చేగొల్ల చంద్రకాం
తెల్లని యచ్చంద యెల్లతుమికి
కుప్పి సూర్యక్రాంత ముప్పుడు నరవండు
గాడిదగడపర కన్నెకొమర
నల్లగెంటెన పూలి తెల్లగెంటెన యుత్త
రేణి గుబ్బిరి సంబరేణు బండి
గురిగింజ గురివింద తురకపత్తియుఁ బత్తి
తలపిడు చబ్బెంద సులియ చిట్టి
వెలఁగ విషమదారి వెట్టికుందెన మంచి
కుందెన కలబంద గువ్వగుత్తి
మామెనయును నేలమామేన యటికమా
మిడి దూల గోవెల మేఁకమేయ

తే. నాకు నల్లేరు నులిజెముడాకు జెముడు
నేలజమ్మి కసిందయుఁ గోలజెముడు
బొంతజెము డుల్లియును సదాముష్టి మొదలు
గాఁ గలుగునట్టి చిఱుచెట్లఁ గాంచి యంత. 10

## మహా వృక్షములు

సీస మాలిక. రావి మామిడి కొండరావి మేడియు బ్రహ్మ
మేడియు జీడిమామిడియుఁ జింత
పులిచింత మోదుగు ములుమోదుగును వెల్ల
పుల్లవెలఁగ వెట్టిచిల్ల చిల్ల
బూరుగు కలిగొట్టు భూతపాదిరి కొండ
బూరుగు చిటిగొట్టి భూతనెరిద
నేరేడు మఱి యల్లనేరేడు పాదిరి
తడగూబ తడ టేఁకు కడప బట్ట
కడప కొడిసె పాలకొడి సెజ్జలొద్దుగు
చిరిటేఁకు లొద్దుగు జీడిపాల
కలుజువ్వి వావిలి గండువావిలి యేరు
మద్ది ముద్దియును నేలొద్ది యొద్ది
తెల్లకాంచనము తుందిల మెఱ్ఱకాంచన
ముప్పి తెల్లుప్పి నీరుప్పి యిప్ప
తాండ్ర చందన మేపె దాసాన మెఱ్ఱదా
సానము చిందుగ చారజేన
మఱ్ఱి విరిగి తూకి కఱ్ఱితూ కిబ్బెడ
నక్క విరిగి చండ్ర ప్రక్కె దంతె
కాకితూ కందుగు కానుగు వరగోఁగు

గొలుగు బొట్టుగు బిక్కి కొండగోఁగు
గోఁగు పొగడ ములుగోరంట గోరంట
వెలమ సుంకేసరి వెట్టి బిక్కి
నారువ సురపొన్న వారిజమును బొన్న
నెల్లి మూలుగ బిల్లు నెమిలి యడుగు
కొండగుమ్ముడు రేఁగు కొరవి సంపఁగి కొండ
సంపంగి మారేడు సరళ తగిస
గుమ్ముడు క్రోవియుఁ గమ్మరేఁ గూడుగు
పొల్కి గుగ్గిల మెట్టపొల్కి జమ్మి
దేవదా రుసిరిక తిలకము తెల్లన
గిరి వేఁప కరివేఁప తురకవేఁప
వేరుపనస గుత్తి వెట్టినారువ రేల
పనస కరక కొమ్మి పలుకరేణి
బండచింతయు నల్లబలుసు సురభిచీకి
రేని కుంకుడు నెమ్మి ప్రేంకణమ్ము
భూతాంకుశ మశోక భూర్జపత్రమ్ము లం
బాళము మంకెన బలుసు గంగ
రేఁగు తక్కిలి ములువేగి భూచక్రము
మొక్కస కొక్కస మొల్లమ్రాను
హనుమంతబీర మంకెన గిరికర్ణిక
పెడమల్లె కొండముక్కిడియుఁ గోల
ముక్కు దాడిమ బీర మొగలింగ గోదాడు
నేదాడు ఖర్జూర మీఁత నేల
తాడి బగిస పోఁక తాడు కొబ్బెర చెట్టు
పెద్దమాను పతంగి బెండ గలుగు

తే. కణుదు రిరుకుడు కాలుగ కాన సన్న
విరిగి సోమింద గున్నంగి దిరిసెనంబు
మొదలుగాఁగల్గు బహువిధ భూరుహములు
నిండియుండెడు కానల పిండు లరసి. 11

క. వెస జంబూ ప్లక్ష క్రౌం
చ సుపుష్కర శాల్మలి కుశ శాక ద్వీపా
లెసఁగఁ గనుఁగొంటి లవణే
క్షు సురా ఘృత దధి పయో విశుద్ధజల్బుధుల్. 12

సీ. స్వాయంభువోత్తమ స్వారోచిష బ్రహ్మ
దక్ష వైవస్వత తామసేంద్ర
రౌచ్య రైవత రుద్ర భౌచ్య చాక్షుష సూర్యు
లనెడు చతుర్దశ మనువు లమరి
బ్రాహ్మార్ష దివ్య బార్హస్పత్య సౌర చాం
ద్రగురు పావన పిత్రు నామక నవ
మానమ్ములును గేతుమాల కింపురుష హి
రణ్మయేలావృత రమ్యక కురు

తే. భరత భద్రాశ్వ హరిసంజ్ఞ వర్షములును

భారతేంద్ర కశేరు గభస్తి నాగ
తామ్ర రౌహిణ సౌమ్య గాంధర్వకాఖ్య
లమరు నవఖండముల నొప్పు నవనియందు. 13

సీ. ద్రవిడ విదేహ మాళవ మత్స్య మళయాళ
కొంకణాంగ విదర్భ కురు పుళింద
చేది టంకణ వత్స సింహళ కర్ణాట
మగధ ఘోట కళింగ మద్ర యవన
కుకురు బాహ్లిక పౌండ్ర ఘూర్జర నేపాళ
శక వంగ కాంభోజ సాల్వ లాట
సౌరాష్ట్ర చోళాంధ్ర శబర పాండ్య వరాట
కుంతల కేకయావంతి కాశ

తే. నాట కరహాట సింధు గాంధార నిషధ
కేరళ తురుష్క పాంచాల శూరసేన
కోసలోత్కల కాశ్మీర కుత్స బర్బ
ర మరు హూణాఖ్య సర్వ దేశములు చూచి.

క. యమునా తమసా మధ్య
క్షమఁ గమలోత్పల మరంద సంగ్రహణాద
భ్ర మతిభ్రమ ద్భ్రమర వి
భ్రమ గీత తతాభ్ర సురతరంగిణిచెంతన్. 15

సీ. పొడయెండ గాయని పొన్నగున్నల నీడఁ
గ్రొమ్ముత్తియపుటరంగులు చెలంగ
గొజ్జంగి పొదరిండ్ల పజ్జలఁ బచ్చక
ప్రములు, నిండిన ద్రాక్ష పందిలి తగ
శశికాంత కుట్టిమ స్థలులఁ బన్నీటి తుం
పర జల్లు జలయంత్రపాళి దనరఁ
గేళి కేళాకూళి క్రేవఁ జక్ర చకోర
హంస భ్రమత్సారసాదికలిత
తే. కలకలారావ విస్తార కమల కుముద
సార భాగార నీహార నీరపూర
వీచికానార దుర్వార విహృతి ధీర
శీతల సమీర కాసార సీమఁ గంటి. 16

వ. మఱియుఁ దత్కాసారం బనిమిషసంచారయోగ్యంబై యమరావతిపురంబును, శంఖమకరకచ్ఛపాధిష్ఠానంబై యలకాపట్టణంబును, ధార్తరాష్ట్రవిహారస్థలంబై హస్తినగరంబును, బకనివాసంబై యేకచక్రపురంబును, శంబరాధారంపై కాంతారంబును, శింశుమారచక్రవికాసితంబై మేరువునుం బురుడించుఁ దత్తీరంబున. 17

క. పల్లవితకలితపుష్పిత
సల్లలితమరందవళితసత్ఫలితమహీ
జోల్లసితాభ్రంకషమై
యుల్లము రంజిల్లఁజేయు నొక వన మొప్పున్. 18

ఉ.ఆ వనసీమ నొక్క తరు వంబరచుంబిత శాఖమై ముదం

బావహిలంగఁ జేయఁ గని యాగమనశ్రమమున్ క్షుధా ర్తియున్
బోవ నొకింతకాల మల భూజముపై వసియించి నాకగం
గా వనజాత జాత బిసఖండము లానుచు నుంటి నయ్యెడన్. 19

ఉ. కొండలు క్రిందుమీదుగను గూల దిశావళి వ్రీల సుష్ఠ్వివే
దండము లుర్వివ్రాలఁ ద్వరితంబుగ వారధు లింకిక్రాల బ్ర
హ్మాండము తూల నాది మహాహిప సూకర కూర్మమూరు లొం
దొండఁ గలంగి సోలఁ జటులోద్ధతి నుర్లెను నేల యమ్మొగిన్. 20

వ. అప్పుడు. 21

## గణిత శాస్త్రము

చ. హరి శిఖి దండి దైత్య వరుణానిల యక్షప భర్గులెక్కి యా
మరకరి మేష వాహరిపు మానవ నక్ర మృగాశ్వ నందులన్
గురుపవి శక్తి దండ వర కుంత గుణధ్వజ ఖడ్గశూల భృ
త్కరులయి కుంభయంత్ర గతిఁ దాల్చిరి దిక్పుర సైన్య సంగతిన్. 22

క. ఆ తటి నే నాకసమున
కాతత సంరంభగతుల నతిజవ మొప్పం
గాఁ దెలివి నెగసి చూడఁగ
భూతల చలనం బడంగి పోయిన పిదపన్. 23

క. ధరణీసుర భూభృద్వి
ట్చరణజ భట రథ గజాశ్వ సద్వస్తులచే
నిరవొందు పాండ్య భూమిని
బరిపూర్ణం బనఁగ నొక్క పట్టణ మున్నన్. 24

తే. కని మహామోద మొనరింపఁగాఁ బురంబు
కాఁపురంబుగ నుండెడు ఘనజనముల
కలిమి బలిమియు వీక్షించు కాంక్ష వొడమి
యొక్క సౌధంబుపై డిగ్గి యుంటి నందు. 25

తే. పరక తలగుడ్డ యొకపాటి పచ్చడంబు
ముదుక నీర్కావి దోవతి మొలను సంచి
తిత్తి వెండుంగరము వ్రేల హత్తి యొప్ప
నుండు శరుఁడను పేద నియోగి యొకడు. 26

సీ. క్షేత్రఘాతంబుల స్థితులు వక్కాణించి
సౌవర్ణ గణితోక్త సంఖ్యఁ దెలిసి
మిశ్రిత గణితార్థ మిళిత మనస్కుడై
గాఢ ప్రకీర్ణక గణిత మెఱిఁగి
త్రైరాశికాద్యంత సారాంశము గ్రహించి
సూత్రగణితంబుఁ జొచ్చి కలఁచి
మఱి భిన్న గణితంబు మార్గమెల్లను గాంచి
పర గణితంబులఁ బాఱఁజూచి

తే. నిఖిల సిద్ధాంతసూత్రముల్ నేర్చి జగతి
గణక కుల సారభౌమత్వ గణనకుఁ దగి
గణిత మర్మజ్ఞుఁ డితఁడని ఘనులు మెచ్చఁ
దెలిసి యత(డెంత లెక్కైనఁ దేటపటచు. 27

సీ. త్రైరాశికప్రకీర్ణ సువర్ణ పంచరా
శిక మేరు పొర్ణరాశిక సమాధి
కార వీరాచార ఘాట కుంటాహ్వయ
చ్ఛాయార్యభట బృహజ్జాతకోక్త
లిత సప్తరాశిక లీలావతీ వర్గ
వర్గమూల క్షేత్ర వాస్తు భాగ
గణితసార చతురంగ ప్రశంసాబల
నాధీయ బీజ భిన్న నవరాశి

తే. క ఘన ఘనమూల శిల్పసంకలిత సూర్య
సోమ సిద్ధాంతయుగ లబ్ధ శోధ రత్న
ఘట్టిత్రైకోనరాశ్యాది గణిత తతులు
దెలిసి యతఁడెట్టి లెక్కైనఁ దేటపఱచు. 28

తే. సరవి గుడిగట్టు గాచెంగ సరసివ్రాసి
యంతకము సేసి కులవర్గు లాయకట్లు
దీర్చి దినవహి నపరగతి ప్రతీర
నౌరవణి నిర్ణయింప శేషాహి యతఁడు. 29

చ. చదువులు చెప్పిచూచె మఱి సారెకుఁ గూలికి లెక్క వ్రాసి చూ
చదవదఁ గోలుకాఁడగుచు నన్నిఁట మండువలన్ నటించి చూ
చదియునుగాక రాయసపు టార్యుల ఘంటము లాకు దుద్దులన్
వదలక మోసి చూచె నొకపట్టునఁ బొట్టకులేక తక్కినన్. 30

క. పొరుగిరుగువారి కలిమికి
గుటిగాఁ దానింత కూడు గుడుచుచు, వీటం
దిరుగాడి ప్రొద్దు గ్రుంకెడు
వఱ కొక పాతికకుఁ గొలుచు వడిఁగొని తెచ్చున్. 31

తే. తెచ్చి సుఖమతి యను నామధేయమునను
బరఁగు ప్రియురాలిచేతి కేర్పడఁగ నీయ
నాబి డన్నంబు సంకటి యంబలియును
జేయ సమరేయి వేళ బోసేసి పోవు. 32

క. అతఁ డీలాగున గ్రాస
స్థితికై యూరెల్లఁ గలయఁ దిరుగాడంగా
నతనాలు మరునికేళికి
వెతఁగొని తిరుగు భుజంగవీరులఁ గలియన్. 33

క. ఒసపరి వగలది ముద్దుల
నసియాడెడు గౌనుగలది యందముగల పైఁ
డి సరైన మేని చాయల

పస గలదని విటులు దాని పని కలవడుచున్. 34

తే. ఎనయ నేవేళ నెందైన నేపురేఁగి
పురిని గల జారు లత్యంతమోహు లగుచుఁ
గ్రుక్కిళులు మ్రింగికొనుచు నొక్కొక్క రొకరె
తిరుగుచుందురు దానింటి తెరువుఁ బట్టి. 35

ఉ. ఇందుఁడు కందు, నిద్దపు రహిందగు సుందరి మోముగోము తా
నందమి, నిందిరేందుముఖినందనుఁడుం దన డెందమందు నిం
దిందిర కంద బృంద కచ దృక్తతి చందముఁ జెందఁజాలు వా
లొందమిఁ గుందు, జారులిఁక నుగ్మలిఁ బొందమిఁ గంది కుందరే! 36

శా. నెత్తావుల్ వెదచల్లు పుష్పలతలన్ నెమ్మేను, సింగంపు రా
మొత్తంబున్ నునుఁగౌను, శ్రీల గరిమంబున్ వీను, లందమ్ము ద
ళ్కొత్తుం గ్రొవ్విరి గుత్తులన్ మినుకులొల్కుం గబ్బి చన్గుబ్బలున్
నెత్తమ్మిన్ గళదేరు మోము చెగడున్, సీమాటి రంభన్, నగున్. 37

క. ఆ సుఖమతి తరుణవయ
శ్శ్రీ సంగతి నలరు విటులఁ జేరి రతులకున్
వేసారక యుసికొల్పఁగఁ
దా సుఖపడి వచ్చు నట్టి ధన్యులలోనన్. 38

చ. ఒకనికి మోముచుంబనము లొక్కనికిన్ మొనగుబ్బపోటు వే
ఱొకనికిఁ జెంపపెట్టు మఱియొక్కనికిన్ బిగికౌఁగిలింత లొం
డొకనికి గాఢసంగమము లొక్కనికిన్ రతిబంధనైపుణుల్
కకవికఁ జూపు మన్మథుఁడు గట్టినదట్టి సడల్ప నియ్యకన్. 39

చ. దుసికిలఁబాఱు చీఁకటులు దూఁకొనుచుండెడు గీలుగంటుపైఁ
బసగల పూలు నిగ్గుగల ఫాలతలంబునఁ జాదుబొట్టు దృ
గ్వసతికి గజ్జలంబు నరకాలున నంచులు జీఱు చీర, తా
రసమగు పుష్కకంచుకము రంజిలఁగాఁ జరియించు వీథులన్. 40

తే. ఇటుల జరియింపఁగా దాని యెమ్మె లెఱిఁగి
వట్టి యనుమానమలచేత బెట్టు గుంది
కని విరూపిణిగాఁ జేసి కాంత వీడి
చనియెద నటంచు నెమ్మది శరుఁడు దలఁచి. 41

క. ఒకనాఁటి రాత్రి యింటను
సకియ కడన్ బవ్వళించి సంభ్రమమునఁ బొం
ద్రక దేశమునకుఁ జనియెద
నొక పనికని వేగ యామముండెడు వేళన్. 42

తే. పయనమై లేచిపోవుచో భార్యతోడఁ
జెప్ప నొక్కింతదూర మచ్చిగురుఁబోఁడి
సాఁగ నంపి బహిశ్శంక కేఁగ, నతఁడు
దిరిగి కికురించి వేగ మందిరము చొచ్చి. 43

ఉ. దూలముమీఁది యట్టుకను దొంగవిధంబున నిశ్చలాంగుఁడై

తాలిమిఁ జిక్కఁబట్టి కులతామరసేక్షణ చర్యలెల్ల నా
మూలముగాఁ గనుంగొనెడు బుద్ధిని నాశరుడుండు నంతఁ బ్రా
క్శైలశిఖాగ్రభాగమున సారసమిత్త్రుఁడు తోఁచె నంతటన్. 44

క. పనిపాటుఁ దీర్చి సుఖమతి
పనివడ నేఁడింటితొడుసు బాసెగదా యం
చును వెల్వడిచని వీథిని
మనసిజ వేదనల జాలిమాలి తిరుగఁగాన్. 45

సీ. గౌరి పంచాంగంబు గౌళిపల్కుల పంతు
పక్షుల శకునముల్ పైఁడికంటి
పలుకుల రీతులు ప్రశ్న భాగంబులు
గబ్బిల్లు కూఁతలఁ గలుగు మేలు
కీడును, బోచిల్ల జాడెఱింగెడు నేర్పు
దిగ్విదిక్కులఁ జూచి తెలుపు నుడువుఁ
దుమ్ము లక్షణములు తొడరు కాకరవంబు
సాముద్రికస్థితిఁ జతురమహిమఁ

తే. తెలియనేర్చిన యొక మహాధీరవరుఁడు
శకునవిద్యావిచక్షణాధికుఁడు సొకు
మార్యరేఖల మాఱట మారుఁడైన
యవనిదివిజుండు మతిమంతుఁ డనెడువాఁడు. 46

క. ఎదురైనఁ జూచి సుఖమతి
కదియంజని వాని సొబగు కలిమికి మోదం
బెదనొంది యతని "నో నవ
మదనా!" యని పిలుచునంతమాత్రనె యతఁడున్. 47

తే. దీనిఁ దగిలించుకొనవలెఁ దియ్యవిలుతు
దురము పనిలోకి నేఁడు ముద్దుగ నటంచుఁ
దలఁచు నంతటిలో జాణతనము లాడి
లో బఱచి వానిఁ దోడ్తెచ్చె లోలనయన. 48

మ. అటులం దోడ్కొని వచ్చుచోఁ గులుకు టొయ్యారంబుగాఁ జూచుఁ, జొ
క్కటపున్ సిబ్బెపు గబ్బిగుబ్బ నెలవంకల్ సాముగాన్పింపఁ బై
పట మొక్కింత సడల్చుఁ, బచ్చి దొరలన్ భాషించు, లేనవ్వుతో
సటలుం జేష్టలొనర్చుఁ బై పయిఁబడున్ జారుఁడు హర్షింపగన్. 49

చ. నిలయములోని కిట్లు విటునిన్ వెసఁ దోడ్కొనివచ్చి హెచ్చి కం
బళము ముదంబునం బఱచి పల్లవుఁడందు వసించినంత న
య్యళికచ యేక్రియం గనెనొ యట్టుకపై నిజభర్త యుండుటల్
తెలిసిన భీతిలేక సుదతీ! యపుడేమని బొంకెఁ జెప్పుమా! 50

చ. అని యల వానజాలిపులుఁగా వనజాక్షినిఁ జీరి వేఁడినన్
విని తలపోసి చూచి యిది వింతసుమీ! తెలియంగ లేను నే
ర్పున నది భర్త కింపు మదిఁబుట్టఁగ నెట్టుల బొంకెఁ జెప్పవే
యనఁ గలహంస వంశ కలశాంబుధిచంద్రుఁడు కాంత కిట్లనున్. 51

క. విను హేమావతి! సుఖమతి
తన వల్లభుఁ డటుకమీఁద దాఁకొని యున్నాఁ
డని తెలిసి ధృతి చలింపక
యనుపమచాతుర్యధుర్యయై విటు మ్రొలన్. 52

క. వక్కాకిడి సద్భక్తిని
మ్రొక్కి కనుం గీఁటి, “శకునములు చూడు వరుం
డె క్కార్యంబున కేగెనో
యక్కార్యము లెసఁగ సఫల మౌనో? కావో! 53

తే. లెస్సగాఁ జూచి చెప్పుము లేమిచేతఁ
జనిన నాపతి శీఘ్రంబె సఫలుఁడై సు
రక్షితంబుగ వచ్చునో రాఁడొ” యనుచుఁ
దెలుప యడిగిన నా సైఁగఁ దెలిసి యతఁడు. 54

## జోస్యుని సరకులు

సీ. అంగుళి క్రమమున నశ్విని భరణియుఁ
గృత్తిక రోహిణి మృగశిరార్ద్ర
పొసఁగఁ బునర్వసు పుష్య మాశ్లేషయు
మఖ పుబ్బ యుత్తర మఱియు హస్త
సరవిఁ జిత్రయు స్వాతి పరఁగ విశాఖాను
రాధలు జ్యేష్ఠయు రమణ మూల
పూర్వోత్తరాషాఢ లుర్విని శ్రవణ ధ
నిష్ఠలు శతభిష క్రోష్ఠపదలు

తే. నుత్తరాభాద్ర రేవతు లొనర నెంచి
మేష వృషభ మిథున కర్కి మృగప కన్య
కా తులాళి ధనుర్నక్ర కలశ మీన
రాశి సంఖ్యలు వరుస నేర్పడ గణించి. 55

తే. సూర్య శశి భౌమ బుధ జీవ శుక్ర మంద
రాహు కేతు గ్రహస్థాన రాశి కూట
చార కోణోపచయ కేంద్ర సార నీచ
పరమ స్వోచ్చాంశ లగ్నముల్ పదిల పఱచి. 56

తే. జన్మ కర్మ సాంఖ్యాతిక సాముదాయి
కాంగ జామిత్ర వైనాసికారి వామ
పార్శ్వవేధలు లత్తలు భావ దుస్స్వ
భావ నీచాస్తమయములఁ బరిహరించి. 57

సీ. ద్వాదశాబ్దాబమాత్ర గ్రహ మాతృ న
క్షత్రాంశ రాశి మాస దిన మరసి
పద్మ సింహాసన పణకూర్మ నర చాప
కుంతల ఖలజీవ కుంభవర్గు
శని ఖడ్గ రథ గణాశ్వవ్యూహ నాడికా
దిగ్వేధ ఛత్త్ర ద్వితీయ పంచ

విధ దశవిధ రాహు వృశ్చిక లాంగూల
పంచ సప్తశలాక పక్షిడింభ
కౌమాఖ్య తోర్మణ గౌళిక్షుత శ్యేన
యాత్రా త్రికాల సూర్యఫణి జయక
ఘోర కాలానల గూఢకాలానల
భూచర ఖేచర పుణ్యభూమి
చంద్రకాలానల సంకట సూర్యకా
లానల రాహు కాలానల కలి
వర్తుల భాస్వర వామ గౌడ ద్వితీ
య తృతీయ మాతృకా చతుర దీర్ఘ
వర్ణేశ్వరాహ్వ దైవతయోగ తుంబురు
ప్రస్తార సర్వతోభద్ర కులకు
లాల కోటా మహాలక్ష్మినఖక్షితి
వలయ లక్ష క్షేత్ర వాల భూమి

తే. ఘన పుళింద కొల్లాపురి వెనక పటక
కాలరేఖ మహామాలికా నిరామ
యాఖ్య లలరారు చక్రము లందు బీజ
పంక్తి లిఖియించి తత్ఫలాఫలము లరసి. 58

క. ఈలాగు చక్రముల గ్రహ
జాలము లిఖియించి చూచి చంద్రాస్య వరుం
డాలయమున దాఁగుండుట
కాలజ్ఞుఁడు తెలిసి పలికెఁ గౌతుక మెసఁగన్. 59

తే. "కడుపులోఁ జల్ల గదలక కలికి! వినుము
నేడు రేపటఁ దలపువ్వు వాడ కతఁడు
రాఁ గలఁ" డటంచు శపథ మేర్పడఁగఁ జెప్పి
యతఁడు తా నిల్లు వెలువడి యపుడ చనియె. 60

ఉ. ఆ సమయంబునందు శరుఁ డట్టుకపై వసియించి యుండి యెం
తో సుముఖత్వ మొప్పఁ గని తొయ్యలిభక్తికి సచ్చరిత్రలీ
లా సుగుణ ప్రసిద్ధికి భళా! యని మెచ్చుచు డిగ్గివచ్చి "రా
వే! సరసీరుహాక్షి!" యని వేగమె కౌగిఁటఁ జేర్చి వేడుకన్. 61

క. "ప్రమదా: నీ పాతివ్ర
త్యము భక్తియుఁ గంటి సందియము లేదిఁక" నం
చు మనోరాగంబున శరుఁ
డమిత స్తుతు లొనరఁ జేయ, నది యిట్లనియెన్. 62

తే. "కాంత! నే నెన్నుకోరాదు గాని నన్నుఁ
బోలఁగల సాధ్వు లున్నారె? పుడమిలోన"
ననుచుఁ బతితోడఁ జెలరేఁగి యాడుకొనఁగ
నిండుమోదంబున సుఖాన నుండె నతఁడు. 63

చ. అని కలహంస చెప్పిన నయారె! కథాస్థితి యంచు మెచ్చుకొం
చును దపనోదయ ప్రభలు సుందరి కన్గొని యింటిలోనికిం

జని పవ లెల్లఁ బోఁగడపి సారసమిత్త్రుఁడు పశ్చిమాద్రికిం
జనిన యనంతరంబ మనుజప్రభుపై విరహంబు మీఱినన్. 64

సీ. కళదేరు కస్తూరి తిలకంబు వాసనల్
లపన గంధములకు లంచ మొసఁగ
నవరత్న తాటంక వివిధ కాంతిచ్ఛటల్
నును౦ జెక్కు జిగికిఁ గానుక నొసంగ
నలరు మానికపు సోయగపు దండల టెక్కు
కనకాంగ దీప్తికిఁ గట్న మిడఁగఁ
జెంగావి వలిపంపుఁ జీరంచు సరిగడాల్
పదశోణ ఘృణులకుఁ బగిడిఁ బెట్ట

తే. మదన మదహస్తి విడిపడ్డ మాడ్కిఁ బడఁతి
పుడమియొడయని కడ కేఁగ బెడఁగు నడల
నడచు వడిఁ గడుఁ గ్రొమ్ముడి సడలి విరుల
జడి పొడమ నిల్లు వెలువడి చనఁగ నపుడు. 65

క. కని రాజహంసవరుఁ డి
ట్లను "భళి! మేల్జాణ వౌదువౌ సొగ సమరెన్
జననాథు నెనయఁ బోయేదొ
విని పొ మ్మొక కథ" యటన్న వెలఁ దిట్లనియెన్. 68

మ. "కలహంసాధిప! నీ స్వబుద్ధి నిటులన్ గల్పించెదో! కాక పె
ద్దలచేఁ బూర్వము విన్నవాఁడవొ! మహాదైవ ప్రసాదంబొ! విం
తలు సుమ్మట్లు వచింప నన్యులకు, మేధాశక్తి నిన్ బోలు వా
రలు లేరింక, బలారె; చెప్పు" మనుచున్ రాజాస్య ప్రార్థించినన్. 67

## పదునాల్గవ రాత్రి కథ

### కోమటిబోటి సుంకరి కొల్వుకానిఁ గూడుట

క. ఆ మానసౌక మభినవ
తామరస మరంద బిందు తత బృందంబుల్
నేమించి కురియు వాక్కుల
హేమావతి కనియె మోద మిగురొత్తంగన్. 68

చ. వినుము విదర్భ దేశమున విశ్రుతమై సిరులందు విహ్వాలం
బన నొక పట్టణం బమరు, నచ్చట నొండొక వైశ్యుఁ డెంతయున్
దనరు హిరణ్యగుప్తుఁ డను నామముతోడఁ దదీయ భార్య హ
స్తిని యను పేరునన్ బరఁగుఁ జెప్ప నశక్యము దాని వైఖరుల్. 69

క. మిల మిల మను మెయి తళుకులు
పొల యలరుల వలపు గులుకు పొలుపగు నగవుల్
చిలుకల కదుపుల నదలుచు
చెలి సొలపుల పలుకు లలరుఁ జిలుకలకొలికీ! 70

క. విరులా! నగవులు, నీలపు

సరులా! కురు, లుబ్బు గబ్బిచన్నులు జాళ్వా
గిరులా! యూరు లనంటుల
సిరులా! యని జనులు మెచ్చఁ జెలువ చెలంగున్. 71

క. చిందం బనఁదగు గళమును
గుందమ్ముల తీరు రదన కోరక పంక్తుల్
మందమ్ములు గమనమ్ములు
చెందమ్ములు పొగడఁ దరమె? చెలువపదమ్ముల్. 72

ఆ. కలువ చెలువ చెలువుఁ గైకొను కన్నులు
జగ మెఱుంగు రంగు జగమెఱుంగుఁ
గులుకుఁ దొలుకు మొలక గుబ్బల పసగల
వనిత మేలు కొక్క వనిత మేలు. 73

సీ. బలితంపుఁ బులినంపు వెలఁ బెంపు జఘనంపు
బోఁడిమెన్నఁగ నొక్కనాడు పట్టు
విరితమ్ములను గ్రమ్ము సిరిఁజిమ్ము వదనమ్ము
చెలువమెంచుట కొక్క నెలయుఁ బట్టు
నిరు లెప్పుడును గుప్పు నెఱకప్పుగల కొప్పు
ప్రణుతింప నొక్క యబ్దంబు పట్టు
జిత జంభకరికుంభ తతడింభ కుచకుంభ
యుగమెన్నుటకు నొక్కయుగము పట్టు

తే. చొక్కటపు రిక్కగమి నిక్కు టెక్కు జక్కు
నఖముల నుతింపఁ గల్పకాంతంబు పట్టుఁ
గెంజిగురు సంజ కెంజాయ పుంజిఁ దెగడు
పదము లెన్నంగ బ్రహ్మకల్పంబు పట్టు. 74

క. ఘన జఘన స్తన యుగములు
వెనుకను దలమ్రోల నుద్దవిడి నొత్తంగా
మన లేక యారు మఱుఁగునఁ
బనుపడ దాఁగెననఁ గౌను భామకుఁ దనరున్. 75

సీ. విష్ణుపదం బంటె వేమఱు మేఘంబు
చంద్రుండు ముట్టె నీశ్వరు శిరంబు
తీర్థంబులోఁగొని ధృతినిల్చె శంఖంబు
కోరి ప్రసాదంబుఁ గొనె ఘటములు
దండనుండిన సాధుతరులఁ దాఁకెను లత
లతనుధర్మముల తోడనియె విరులు
పుణ్యానదీనదంబుల నిల్చెఁ బులినమ్ము
లల పితామహునాజ్ఞ నలరె నంచ

తే. కుంతలానన కంధర కుచ సుబాహు
నఖ కటి యాన పటు శోభనత వహించి
దీటు రాలేమటంచును దృఢ మనీషఁ
జెలియ యంగమ్ములకు బాస చేసినటుల. 76

ఆ. మొగము నిండియుండు మోహంపుఁ గస్గవ
యురము నిండియుండు నుబ్బుచనులు
వీపు నిండియుండు వేనలి జొంపంబు
దానిఁ బొగడఁదరమె! మానవులకు. 77

క. ఆ హస్తిని యౌవన ము
త్సాహమునన్ బిడ్డ పాప సందడి లేమిన్
మోహన తర విట వృషభ
వ్యూహములకు వల్లెత్రాటి యొఱపున మెఱయున్. 78

చ. మిడి మిడి గాని చేకటులు, మేలిమి సూలల దండ జోడుకా
ల్కడెములు సండిబొందె విడికమ్మల మించుల మించు మించులన్
నిడి బుగడల్ జరాసరి హొణీలఁ దనర్చిన కట్లదండ బే
గడ కుతికంట్లు సూసకము మల్లను మెట్టెలు పూని వీఁగుచున్. 79

క. అది గర గరనగు పురుషుం
డెదుటఁబడ వీఁడు జీవితేశ్వరుఁ డయినన్
మదిఁ గల దుఃఖం బెల్లను
దుదముట్టు నటంచు మోహ దుర్దశ నొందున్. 80

వ. అది మఱియును. 81

చ. ముదమునఁ బల్లెపట్రలకు మూఁటకు ముల్లెకటంచు నాథుఁ డిం
పొదవఁగ నేఁగ జారజనయూథహితప్రదభాగధేయమై
కదిసి చరించుఁ జిన్నెలను గాసిలఁ జేయుచు మోహకాంక్షతో
మదనుఁడు సొనచిమ్ములు సుమాళము తోడుతఁ జిమ్ముచుండఁగన్. 82

వ. ఇట్లు సంచరించు నయ్యవసరంబున. 83

సీ. హేరాది యొడ్డాది భారాదులను వచ్చు
గోనెలు తణగాలు గోతములును
నూలాసు నగలు కంట్లాలు కంబడికట్లు
మూఁటలు చిక్కాలు బాట నుండు
వల లావణము పట్టి వార తుక్కోలును
సుంకము బీటికాసులును మగలు
కావలి దేవళ్లకాసులు కుప్ప బ
త్తెము విశేషము దోవ తీర్వ యర్థ

తే. మాన్యముల తఱుగు విడుపు మడుపు మణియ
కాఁడు కోల్కాఁడు బంట్రౌతు కరణములును
నారి వెట్టి బసివి గణాచారు లచటి
వారి లెక్కలు రాఁబట్టువాఁ డొకండు. 84

ఉ. సుంకరి కొల్వుకాఁడు సరసుండను పేరిఁటి వాఁడు చూడ నే
ణాంక వసంత కంతుల జయంతుని నెంతయుఁ బోలువాఁడు ని
శ్శంక నలంకరించుక హుశారున వీథికి వచ్చి యప్పుడా
పంకజలోచనం గని సెబాసని మెచ్చిన యంతలోపలన్. 85

చ. పొగడ హిజారు, చెంగలువబొందళ , మేలకిపువ్వుధట్టి, సం
పఁగి విరితేఁటి మెల్లనినపాగ, శిరీషపు గోషుపేషు, మేల్
జిగితొగడాలు, జాజిబరీచిం గొని చిల్కలవాజినెక్కి పెం
దెగువను గంతుపాదుష హదే! యని యార్చెద ఔమ్ముఁ గ్రుమ్మినన్. 86

సీ. వ్రీడావహిత్థప్రవేనోన్మదోగ్రరో
ష ప్రదోష వితర్క చపల దైన్య
పరుష సత్రాసక చరమ లీలాప ని
ర్వేదనాసూయ విషాదగర్వ
మోహాంచితాస్మృతి మోహనమాధుర్య
జడ గుప్తి ధృత్యపస్మార హైన్య
హర్ష విజ్ఞాన శంకాలస్య సుఖ నామ
ధేయముల్ గల్గి వర్తిల్లునట్టి

తే. ముప్పదియు మూఁడు సంచారములను మ్రగ్గి
స్వేద వైవర్ణ్య రోమాంచ విస్వరాశ్రు
కంపముల్ ప్రళయస్తంభకములనఁ జను
సాత్త్వికపు భావములచేత జడిసి తెలిసి. 87

సీ. సాక్షాత్కరించిన చంచలాలతికయో!
మాటాడ నేర్చిన మణిశలాకొ!
జీవంబు వచ్చిన చిత్తరు బొమ్మయో!
కడు రూపుఁదాల్చు శృంగారరసమొ!
చేష్టలు వెలయించు చివురుఁబూరెమ్మయో!
చెఱలాడు జాబిల్లి చిన్నికళయొ!
కలితరేఖ నటించు కమ్మనెత్తావియో!
మోహింపఁజేయు సమ్మోహనంబొ!

తే. కాకయుండిన నీతళ్కు, కాంతి, మురువు,
సొగ, సలంకృతి, కళయును, సురభిశుభద
విభ్రమంబులు గలవె? త్రివిష్టపముల
నిండి యున్నట్టి చక్కని నెలఁతలందు. 88

క. కరములు సుమలతికా శ్రీ
కరములు, చిఱునవ్వు లబ్జకరములు, పద్మా
కరములు నాభీరుచు, లా
కరములు సొగసులకుఁ జెలికిఁ గల యవయవముల్. 89

క. నారి కెన సఖులు లేరే!
లే రేదొరఁ దెగడు నిటలలీల లయారే!
యా రేపు మరు నారే
నా రేఖకుఁ దగు ఘనాళి నాఁగను మెఱయున్. 90

క. బాలా దృక్తతి వాలా?
వాలారుంగన్ను లతుల వనజశ్రీలా?
శ్రీలా? చెవుల సులీ, లా
[1]లీలావతి కంఠరవము లెరబాబాలా? 91

సీ. శశిరేఖ శశిరేఖ సత్కళా సౌందర్య
ములు మాయఁ జేయు నిచ్చెలువ తీరు
పద్మినీ పద్మినీ పరిమళ జాతుల
నలరింపుచుండు నిక్కలికి సౌరు
రేవతీ రేవతీ రేఖా విలాసముల్
తలకింపఁ జేయు ని త్తరుణి మురువు
వరహేమ వరహేమ సురుచిర లీలలు
గరఁగంగఁ జేయు నీకాంత హరువు

తే. తార తార నుదారను దారసించు
భద్ర భద్ర సుభద్రను బరిహసించు
నౌర! యిట్లుండవలదె? శృంగార మనుచు
మెచ్చి పల్మాఱు బలుమోహ మెచ్చి కెరలి. 92

క. మిణుకైన యీ కృశాంగీ
మణి నిప్పుడు మోహినీ సుమంత్ర జపాక
ర్షణకళ నాకర్షించుక
కణఁకం బలుగతుల రతులఁ గవిసెద ననుచున్. 93

క. మది నూహ చేసికొని తన
సదనంబున కపుడె వచ్చి చలమునఁ దన్నున్
మదనుం డేచఁగఁ దమిచే
నొదవిన యొక యమృతసిద్ధియోగము నందున్. 94

## వశీకరణ మంత్ర ప్రయోగము

సీ. వైష్ణవి కౌమారి వారాహి చాముండ
బ్రాహ్మి మహేశ్వరి బగళ లలిత
కాత్యాయ నీంద్రాణి కాళరాత్రి భువనే
శ్వరి మహామాయి పంచదశి దుర్గి
భగవతి మాతంగి బాల మహాకాళి
కామేశ్వరియు భద్రకాళి శక్తి
మలహరి కృష్ణాక్షి మాధవి శాంభవి
శాకంభరియు లఘు శ్యామలాంబ

తే. మోహినీ కామరాజాఖ్యా ముఖ్య దేవి
రాజరాజేశ్వరియు మంత్రరాజ రాజ
ముఖి విరూపిణి భైరవి ముఖ్య మూల
మంత్రములలోన మోహినీమంత్ర మరసి. 95

సీ. కడుభక్తి శుక్లపక్షమునఁ బుష్యార్కము
నాడు హస్తిని వీధి నడచు వేళఁ
గుడియడుగిడు మన్నుఁ గొనితెచ్చి శయనమం
దిరము గోమయమున నెఱయ నలికి
మధ్యమంబున నెట్టమంటి పట్టిడి పస
పున మ్రుగ్గొసఁగి మధ్యమునను మన్ను

నెఱపి యాపైని నన్నెలఁత రూపము వ్రాసి
చుట్టు యంత్రము గురుస్తుతి యొనర్చి

తే. మొదల నోం శ్రీం వినిర్మించి "మోహ మోహి
నీ ఘటు స్వాహ" యని మంత్రనియతిఁ దీర్చి
యందు దిగ్బంధన మొనర్చి యరుణగంధ
పుష్పదీపాదులను లెస్స పూజఁ జేసి. 96

ఆ. లక్షజపము చేసి లక్షణయుతముగఁ
దద్దళాంగము మధుతర్పణంబు
తద్దశాంశ మగుచుఁ దగు పలాశలతాంత
హోమవిధియుఁ దీర్చుచున్న యపుడు. 97

సీ. మినుకొప్పు నునుగొప్పు మినమినల్ దూలాడఁ
గన్నుల దళధళల్ మిన్నులాడ
బునుఁగిడ్డ నెఱపూత భుగభుగల్ చెఱలాడ
గుబ్బల చకచకల్ దొబ్బులాడ
జిగిపూని తగుమేని ధగధగల్ దిరుగాడ
నగుమోము నిగనిగల్ నాట్యమాడ
గుమిగూడు విరిదండ ఘుమఘుమల్ పొరలాడ
నందెల ఝుళఝుళల్ చిందులాడ

తే. నెదుట సాక్షాత్కరించు మోహినికి నతఁడు
గరిమతో లేచి మొక్కినఁ గరుణఁ జూచి
తనకుఁ బూర్ణాహుతి యొనర్చి తప్పకుండఁ
దంత్రము ముగింపుమా! నీవు తలఁచి నట్టు. 98

క. వరమొసఁగెద నన, నటువలె
జరిపి 'మనోజాత పంచశక' యని యంత్రా
శరణముఁ దుడిచి మదీప్సిత
ము రయంబునఁ దీర్పు మనిన మోహిని యంతన్. 99

తే. మంచిదని యచ్చెలిని నావహించి శక్తి
తెచ్చి ముందట నిల్పి యదృశ్యయైన
సంభ్రమంబున సరసుండు సరసరతులఁ
బరవశత్వంబు నొందించి భ్రమముఁ గొల్ప. 100

చ. కనుఁగవ విప్పిచూచి యల కామిని, 'యెక్కడి దీ నిశాంత మీ
ఘనుఁ డితఁ డెవ్వఁ డిట్టి రతి గల్గుట యే' మని విస్మయంబుచే
మనమున నెన్ని 'యేమయిన మంచిదే! నామదిఁ గోర్కెఁ దీర్చెఁ బ్ర
బ్బిన మకరాంకు నింక ఘనభృత్యునిఁగాఁ బనిఁబూని యేలెదన్. 101

వ. అదియునుంగాక. 102

తే. భద్రుఁడన దత్తుఁ డనఁగను బరఁగు కూచి
మార పాంచాల విట పీఠమర్ద నాగ
రిక విదూషక లనఁ బ్రౌఢరీతి మెలఁగు
నాయకులవంటి రసికుఁడీ నాయకుఁ' డని. 103

చ. మనమున మెచ్చి, "నాయకుఁడ! మా నెఱజాణవు ప్రోఢ వేక్రియన్
గొని రతినేలినాడ వనుకూలము నాకిది నిచ్చనిచ్చలున్
ననవిలుకాని కేళిక లనన్ వెలయించు" మటంచుఁ బల్కినన్
విని సరసుండు మంచిదని వేడుక నాతినిఁ బంపె నింటికిన్. 104

క. అది మొదలు చేసి హస్తిని
మది రంజిల సరసుమీఁది మమతను నిచ్చల్
మదనుని కేళికిఁ బిల్చును
దుదఁ దన గృహమునకు సందు దొరకిన యెడలన్. 105

వ. ఇట్లు విహరింపుచుండి యొక్కనాఁడు. 106

క. మధ్యాహ్నవేళ జనతా
రాధ్యుండగు సరసుఁడలరి రతిపతికేళీ
సాధ్యత "బుద్ధిమతాం కిమ
సాధ్య"మ్మని యావధూటి సదనమె చేరెన్. 107

తే. చేరినప్పటి సరసుని తీరుఁజూచి
భుజము లొప్పొంగి హస్తినీ పుష్పగంధి
కలయఁబడి మతి పన్నీటఁ గాళ్లు గడిగి
మేలమాడుచుఁ దోడ్తెచ్చె మెచ్చు హెచ్చి. 108

సీ. జీవదంతపు జగాజీని నఖాసు మే
ల్తళుకుటద్దపుబిళ్ల బెళుకు రవలు
వింత సంతనఁజేసి విప్పుగాఁ దాపిన
హురుమంజి పూసల మెఱుఁగు కుచ్చు
లునిచి తీర్చిన సొంపు మినుకైన కెంపురా
మొనముక్కులుండెడు ముద్దు గులుకు
కళుకుఁ గ్రొంబని పచ్చచిలుకలు రహిమించు
తొగ రా చలువరాల నెగడులోవ

తే. గల వగలనిండు పచ్చని జిలుఁగు ప్రతిమ
కళల నిరవొందు చిత్తర్వు కప్పురంపు
మెప్పు మేల్కట్ల చవికెలో మెఱయు హంస
తూలికాతల్పమునఁ జేర్చి తోయజాక్షి. 109

క. తొడరి నునుగబ్బిగుబ్బల
పొడవడఁగఁగఁ గౌగిలించి పొడమిన దార్ఢ్యం
బెడలంగ నీక మన్మథు
బెడిదపుదురమం దతనికిఁ బ్రియమొందించెన్. 110

తే. ఇత్తెఱంగున వారిద్ద ఱేపు రేఁగి
మిథునకార్యప్రవిష్టులై మెలఁగుచుండ
దాని పతి యింటి కరుదెంచి తలుపుఁ దెఱువు
మనిన నది యెట్లు బొంకంగఁ జనునొ చెపుమ? 111

తే. తెలిసెనా నీకు? హేమావతీ లతాంగి!
తెలియకుండినఁ జెప్పెదఁ దెలిసికొనుము.

విభుఁడటులఁ బిలిచిన విని విటుఁడు పడఁక
వెఱవకు మటంచు ధైర్యంబుఁ గఱపి యపుడు. 112

చ. ముసుఁగిడి పండుకొమ్మనుచు మోహముతోడ వితర్థిఁ జూపి తా
నుసురసురంచు ఖిన్నయయి యొయ్యన నేఁగి కవాట మవ్వలన్
బెసబెసఁద్రోచి మూటఁదల బెట్టుక వచ్చిన భర్త కింత సా
ధ్వస మొదవంగఁజెప్ప విని వాఁడు విభావిత "యేమి" యంచనెన్. 113

వ. అని హీనస్వరంబున, 114

క. అడిగిన పతితో నిట్లను
"దడవాయెను సుంకరీఁడు తమ లెక్కలకై
పడియున్నాఁ డిదె కను"మని
పడఁతి యతనిఁ జూచి భయ ముప్పొంగన్. 115

క. వెనుకడుగు లిడుచు నవ్వలఁ
దన పొరుగింటను విభుండు దాఁగినచో జా
రుని రతి తృపాస్థన్ వే
తనిపి వెడల ననిపి తరుణి ధవునిం బిల్చెన్.116

తే. పిలువ నతఁ డెప్పటట్లన ఖేదపడక
కూర్మితో నుండెఁ బతిదాను కుందరదన!
వింటివా? యిట్టి చాతుర్య విశదశక్తి
నీకుఁ గలిగినఁ బోవమ్మ! నృపతి నెనయ. 117

చ. అని కలహంస చెప్పఁగ మహాదరణంబుల నాలకించు నం
తనె తపనోదయ ప్రభలు తద్దయుఁ గన్పడ గేళికానికే
తనమున కేఁగి యచ్చట సుధాకరబింబనిభాస్య ప్రొద్దు గ్రుం
కిన దనుకా వియోగమునఁ గేవలమున్ వెతఁజెంది యుండుచున్. 118

క. కుముదమ్ములు కుముదమ్ములు
సముదమ్ములు గాఁగ మెఱయు సాయంబైనన్
రమణీమణి ఘనకచభా
రమణీమణి సిరులు నిరులు రంజిలువేళన్. 119

సీ. తారకావృత పయోదముమాడ్కి సుమదామ
పరివృతంబగు కొప్పు పరిఢవిల్లఁ
దీఁగను ననలు హత్తిన చందమున మేన
సొగసుగా రతనంపు సొమ్ము లలర
వదనచంద్రునిఁ గూడ వచ్చిన రోహిణి
మురువున ముత్తెంపు ముక్కరమర
మంచు గప్పిన గట్లసంచున వలిపెంపుఁ
బైఁటలో గబ్బిగుబ్బలు చెలంగఁ
తే. బరఁగు జగడాల పగడాల బరిణిలోనఁ
గ్రాలు మగరాల నిగరాల లీల వీడెపు
టరుణ రుచిఁ జిల్కు నోరఁ బల్వరుస మెఱయ
వచ్చి నిల్చిన యాహేమవతిని గాంచి. 120

క. జలజభవాశ్వం బిట్లనుఁ
జెలియా! యింకొక్క గాథ చిత్రతరంబై
చెలువొందెడిఁ జెప్పెద వినఁ
గలవే? యని యడుగ, వినెదఁ గాకని నిల్చెన్. 121

వ. హంసం బిట్లనియె. 122

## పదునేనవరాత్రి కథ

### రెడ్డిసాని యొక పగ లిద్దఱినిఁ గూడుట

మ. ఇతర ధ్యానముమాని నీవు వినుమీ హేమావతీ! ద్రావిడ
క్షితిలోఁ జిత్ర విచిత్ర వస్తువితతిన్ జెన్నారు కాంచీపురిన్
స్థితుఁడై కాపురముండు శూద్రుఁడొకఁడా శ్రీదృష్టికిం బాత్రమై
శ్రిత నానాజన భాగధేయమగుచున్ సీరాంక నామంబునన్. 128

### కృషీవలునిల్లు, ధాన్యములు, కాయలు

సీ. ముంగిటఁ బులిజూదములు గీచియుండిన
రచ్చబండలు గొప్ప ప్రహరిగోడ
పంచతిన్నెలు చాలుపట్టెలు ముమ్మూల
గూండ్లు దీర్చిన యట్టి గోడ లలరు
దేవర చవికె, పందిరి కోళ్లగూఁడులు
గొట్టు గుంటక కాఁడి గొడ్డపల్పు
రిట్టువ గల కాఁడి కొట్టంబు పలుగాఁడి
కంపపాతిన లేఁగకదుపు దొడ్డి

తే. ప్రత్తి గూటంబు తొట్టియుఁ బలక పీఁట
బావి పిడుకల కుచ్చెల పసుల మేఁపు
మంగలము దాలి ఱో లిర్కు మ్రాని సందు
గలిగి విలసిల్లు నాతని నిలయ మెపుడు. 124

వ. అవియునుంగాక మఱియును. 125

తే. ముద్ద గిడ్డ జమిలిమార్పు ముసుగు పచ్చ
మార్పు జింకపురి పరంగి మల్లెమార్పు
పాల్పసర కొమ్ముసూఁగూరి పైరజల్లి
మసర తెల్లెల్లి జొన్న రమ్మంగఁ గలపు. 126

సి. జడకొట్టి కొఱ్ఱలు చామలు వెలిచామ
కుట్టారి కారిక కొండబరిగె
బరిగె సజ్జయు గిడ్డ గిరసజ్జ మజ్జపా
ల్గిడ్డచే న్నెద్ద రాగెయును యవయు
గోదుమ పెదనువ్వు కుఱునువ్వు తెలినువ్వు
కుసుమ తెల్లగిసెయు గోగు జనుము
చిటితోఁట వెలి పొద్ద చేపరంగి పేరాము

దము చక్కెర చిటాముదమును మఱియు

తే. మినుము నెఱ తెల్లకంది చిర్సెనగ సెనగ
పిచ్చ నలపిచ్చ కుఱుపిల్ల పెసరకాయ
మళ్లు నలసంద లుబ్బడాల్ నల్ల తెల్ల
యులవలు పటాణములు పుట్ల కొలఁది గలవు. 127

సీనమాలిక. బంగారులుతీగల గంగాజలమ్ములు
కసూరినిగరాలు కటకసరులు
నిప్ప పూరాజనా లేనుంగు కొమ్ములు
మల్లె శ్రీ గంధులు మదనగంధు
లేలిక రాజనా లీశ్వరప్రియములు
రావిపూ రాజనాల్ రత్నసరులు
కుసుమపు రాజనాల్ గుత్తి బల్గుత్తులు
కస్తూరిపట్టెలు గంధసరులు
మందిగండ్రలు నాగమల్లెలు తీఁగమ
ల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు
మన్మథబాణాలు మరువంపు మొలకలు
సన్న మఱింగెలు జున్నుబ్రాలు
పొన్ను శ్రీ రాజనాల్ పునుఁగు రాజనములు
ముద్దుఁ బ్రాలారళ్లు ముత్తుసరులు
సన్న సూదులు పచ్చగన్నేర్లు కోదండ
రామముల్ కేసర్లు రాయసర్లు
చంద్రవంకలు జీనిసరులు కాంభోజులు
వంగాకు బుడమలు పొంగుబ్రాలు
జిలకర రాజనాల్ చింతపువ్వులు గోరు
రాజనాల్ బూదప్రోల్ రాజనాలు
రామబాణాలు రెక్కాములు వెన్నము
ద్దలు జిల్మ బుడమెలు దాళువాలు
గొప్పకాయలు బలుగుత్తులు పాలమీఁ
గడలు శ్రీరంగాలు కామదార్లు
తెక్కపాలలు కాకితెక్కలు పుష్ప మం
జరులు సీతాభోగసరులు గౌరి
కుంకుమల్ రణబెండ్లికొడుకులు పిచ్చుక
గోళ్లు ప్రయాగలు గొజ్జఁబ్రాలు.
గరుడసరుల్ పోతుగంట రాజనములు
మోదుగ తొడిమలు ముదుకసరులు
పచ్చసరుల్ రెడ్డిపాలవంకెలు సుఖ
భోగులు పచ్చకర్పూరసరులు
నివ్వరుల్ దెబ్బసల్ నీరుకావులు గాజు
కప్పెరల్ కురువడాల్ కంఠసరులు
సాలంక లలుగు రాజనములు సంభావు
లవసరదార్లు మోహనపు సరులు
మణిసరుల్ మసరులు మంకెనల్ పగడంపుఁ
దీఁగెలు మదిప్రాలు దేవసురులు

లత్తుకబొత్తులు లక్ష్మీ మనోహరాల్
భారతీసేసలు భాహుపురులు
వజ్రపుఁ దళుకులు వాసన రాజనాల్
జవ్వాదివంకెలు గవ్వసరులు
సంపంగి పూవడ్లు జాజి రాజనములు
గంబూర రాజనాల్ కన్నెసరులు
తమ్మిపూ రాజనా లమ్ముడు కొణిగెలు
జీనువ ముక్కులు చిలుకముక్కు
లేదుకజ్జులు వంకె లిసుక రాజనములు
పులిగోళ్ల వంకెలు, బొగవసరులు

తే. జిలి తొగల రాజనములు నలవరులును
దెల్ల నల్ల చెన్నంగులు దీవసరులు
నాది యగు పేర్లు గలుగు వడ్లతని యింట
నుండు శతకోటి పుట్టు లొక్కొక్కదినును. 128

తే. దొండకాయ ములకకాయ తొట్లకాయ
జంబికాయయు నెజ్జిల సందకాయ
వెలయు నుస్తెకాయయు రామములుకకాయ
మేడికాయ కాకరకాయ గూడ నింక. 129

సీ. రామగుమ్మడి యోబరాజుగుమ్మడి చార
గుమ్మడి బూడిదగుమ్మడులును
గిండిసొఱయుఁ దీఁగెకిన్నెర సొఱయును
బీఱ సముద్రపు బీఱ నేతి
బీఱ పిచ్చుకపొట్ల పెద్దపొళ్ళేనుఁగు
దంతపుఁ బొళ్ళలు తంబలు వెలి
కాకర పొట్టికాకరలు మేఁకచెవి చి
క్కుడు పాలగణుపులు గోరుచిక్కు

తే. డులు సుగంధాలు బొంతనంటులు సురళులు
గంజి పందిటి కపురపొంకాయ తరులు
బూజుపచ్చ కురాసాని పుచ్చ పెద్ద
దోస నక్కదోసలు వాని తోటఁ గలవు. 130

ఆ. చేమ కంద గెనుసు చిఱిగోరు పెండ్లము
పొసఁగు తెల్లగెనుసు భూతగెనుసు
లల్ల ముల్లి పసుపు ముల్లంగి వెల్లుల్లి
గాజరయును మొదలుగాఁగఁ గలవు. 131

చ. గురుగెఱ బొద్ది చెంచలియుఁ గుచ్చలి చిజ్జి తగిర్సి తుమ్మి దు
స్సరి బలుగూటి బొద్దినెలి చల్మిలి పల్లెరు రూక పాత్కె వె
ల్వరిగిసె ముస్గ యెల్కచెవి పావిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి నరవంజి చేతర సదాపయు గొండలి కొండపిండియున్. 132

తే. పాల వాయింట తక్కలి బచ్చలి కొయు
గూర చక్రవర్తము చిల్క కూర గోళి

కూర దుంపబచ్చలి తోటకూర కొతిమ
రాకు సోపు మెంతాకు చుక్కాకు గలదు. 133

సీ. పనస సీతాఫలాల్ చిననిమ్మ గజనిమ్మ
దూదినిమ్మయు నార మాది ఫలము
నారదఖర్జూర నారికేళాదులు
రామ ఫలంబులు జామ ఫలము
లలరారు బొంత కిత్తళియుఁ బోకయుఁ బోక
పిప్పలి నేరేడు పెద్దవెలఁగ
రామావళియు గమరక జీడిమామిడి
బారంగి పెనురేఁగు పాలఫలము
తే. చెట్లు పండెడి తోటలు చిట్టిగొట్టు
చెఱకు రసదాళి చెఱ కెఱ్ఱచెఱకు నల్ల
చెఱకు తోటలు కలుజోడ్లు సీర్పిదినుసు
కారపాకాకు దోటలు గల వతనికి. 134

సీ. మామిడికాయయు మారేడుకాయయుఁ
గొండ ముక్కిడికాయ కొమ్మకొయ
గరగుకాయయు మొల్లకాయ యందుగుకాయ
యుసిరికకాయయు నుస్తెకాయ
యేకరక్కాయయు వాకల్మికాయయుఁ
జిణినెల్లికాయయుఁ జిల్లకాయ
కలబంద గజనిమ్మకాయ నార్దపుఁగాయ
చిన నిమ్మకాయయు జీడికాయ

తే. కొందెనపుకొమ్ము మామెనకొమ్ము బుడమ
కాయు యల్లము మిరియంపుఁగాయ బీఱ
కాయ కంబాలు కరివేఁపకాయ యాది
యైన యూరుఁగాయలు గల వతని యింట. 135

తే. పంట మోటాటి పెడకంటి పాకనాటి
యరవెలమ లాది కొండారె మొఱుసు గోన
కొణిదెకాఁపులు మొదలైన క్షోణి దనరు
కాఁపులకు నెల్ల మిన్న యక్కాఁపుకొడుకు. 136

తే. అతని కొక్క కులాంగన యగ్రమహిషి
చనిన పిమ్మట సత్యకేశిని యనేటి
పేరు గల్గిన చిన్నాలు బిసరుహాస్త్రుఁ
డేలు ప్రియురాలు నాఁగ సొంపెక్కి క్రాలు. 137

సీ. మెఱుఁగంచు కమ్మలు మెడనూలు గెఱల ము
క్కర యుడ్డబుగడలు కట్లసరులు
దండి తీర్రైన చింతాకు తీఁగెయు నాను
పల్లెరుపూవులు బన్నసరము
కుప్పెసొరము మెచ్చికొన్న సూలలదండ
యందగించిన జోడు సందిబొందె
నిగరమైన సిరాజి పగడాల చేకట్లు

కాలికడెంబు లుంగరపుజోళ్లు

తే. గిలుకు మట్టెలు జంటీల జిలుఁగు అవిక
సన్నమౌ వేయుఁగన్నుల చలువచీర
పసిమిఁ జిల్కెడు ముంజేతి పచ్చలమర
దుడ్డెతనమునఁ దిరుగు నా రెడ్డిసాని. 138

క. ఆ చొక్కపు జిగి చర్గవ
నా చిక్కని మెఱుఁగుటారు నా మోమందం
బా చక్కని రూపము పస
చూచిన మరుఁడైన భ్రాంతి సొలయక యున్నే! 139

సీ. మేఘేందు కార్ముక మీన దర్పణ వజ్ర
కచ ముఖ భ్రూ నేత్ర గండ నాస
దరసుధా బింబకుంద శ్రీమణీ కర
గళ వాగధర దంతకర్ణ జిహ్వా
పద్మలతాధర భంగ భోగ మృగేంద్ర
కర భుజా కుచ వళి కక్ష మధ్య
బిల తుండ చక్ర కాహళ తార పల్లవ
నా భ్యూరు తటి జంఘ నఖర పాద

తే. ప్రసవ విద్రుమ చలదళ పత్ర కనక
కదళికాపర్ణ కౌముదీ గంధసార
మార్గ వాంగుళ్యనంగ సద్మరుచి చరమ
హాసివాసన యగుచు నయ్యబల మెఱయు. 140

క. మినమిన లీనెడు నునుమే
నున నొనరిన వనజనయన నూతన నలినా
ననమున ననువుగఁ గనుఁగొనఁ
దనరుఁ గనత్కనక వననిదాన స్ఫూర్తుల్. 141

సీ. పలుకులు కప్రంపుఁ బలుకుల వర్జించుఁ
జూపు మారుని తూపు రూపుమాపుఁ
గరములు బిసభీతికరములై సిరులొందు
జడజగ్గు లిరులను జడియఁజేయు
మందయానము హంస చందము నిరసించు
మించు మైనిగ్గు క్రొమ్మించు నొంచుఁ
గుచముల పసలు లికుచముల నిర్జించుఁ
జెక్కిళ్లు ముకురాలఁ జెక్కివైచుఁ

తే. దావి కెమ్మోవి యమృతంబు బావి తీవి
యారు చెన్నారు చీమలబారు దూఱు
నూరు లలరారు ననఁటులసొరుఁ గేరుఁ
గాంత నగుఁ గాంత లతికాంతకుంతకాంత. 142

క. కమలంబులఁ గమలంబులఁ
గమలానన లోచనముల కాంతి జయించున్

బ్రమదాళులఁ బ్రమదాళుల
రమణీమణి వాలుఁజూపు రహి నిరసించున్. 143

తే. దాని బిగిగబ్బి సిబ్బెంపుఁ దళుకు టుబ్బు
గుబ్బ చన్నుల కౌఁగిలి కోరనట్టి
మానవాగ్రణి వసుమతీ స్థానమునను
వెదకి చూచిన లేఁడుపో! విద్రుమోష్ఠి! 144

తే. అది మనోజ్ఞములైన యాహారములను
గండ మెండైన మదముచేఁ గన్నుఁ గాన
కమిత పల్లవ రతికేళి కాస వొడమి
మీఱు చిత్తముతోడ నేఁకారఁ దొడఁగె. 145

సీ. పని వంటవార్పుల బాధలించుక లేక
తీరిన మంచి సంసార మొదవె
నత్తమామల పోరు నారు దూఱెఱుఁగక
పొందొంద నిచ్చఁ గాపురము దనరెఁ
గుడువఁగట్టను బూయఁ దొడుగ వస్తువులు య
థేచ్ఛముగా నుండు నిల్లు దొరకెఁ
బట్టి పల్లార్చ కేపట్టున దయఁ జిల్కు
మనసు గల్గిన యట్టి మగఁడు గలిగె

తే. నింత గల్గిననేమి నా హృదయ మెఱిఁగి
మనసు దీఱను బదివేలమంది మగలఁ
గలుగఁ జేయక చెడు దోసకారి బ్రహ్మ
యొకనిఁగాఁజేసె ననుచు నూరక తపించు. 146

క. ఆ పాపమేమి చెప్పుదుఁ
గాఁపుది మదమెత్తి కన్ను గానక పురిలోఁ
జూపరుల నెవరి నైనను
నేపున సంభోగకేళి నెనయం జూచున్. 147

చ. అటువలెఁ జూచువేళ నొకఁ డంగద నామకు దాయుధోప జీ
వటకుఁ బ్రయోజనార్థము రయంబున వచ్చిన వానిటెక్కు చొ
క్కటపు టొయారమారఁగని కాపుది మోహము నిల్పలేక మి
క్కుటపు రతిప్రయత్నమునకున్ గరఁగించెద నంచు నిట్లనున్. 148

తే. "ఎన్నఁడును రానివాఁడ వీవేమిపనికి
వచ్చినాఁడపు కూర్చుండు వన్నెకాఁడ!
మంచమదె తెచ్చి యింటిలో నుంచినా" న
టన్న విని వాఁడు "పోవలె" ననుచుఁ బలుక. 149

ఉ. "పోవలెనంటివా? రమణి మోమటు చూడక యీడనుండలే
వో? విడిపించు బిడ్డలకు నొయ్యనఁ జన్నిడి నిద్రఁబుచ్చఁ బోఁ
గావలెనో? భ్రమించు విటకత్తెల యల్కలు దీర్చబోయెదో?
శ్రీ విభవోత్తమా! యెఱుఁగఁజెప్పు?" మటంచును రెట్టఁబట్టుకన్. 150

తే. కోళ్లు నిండారఁగా దొడ్డగొంగడపుడు

పఱచి యాతని మంచంబుపైకిఁ జేర్చి
వలచి వలపించి చిన్నెల వగలు చూపి
యెనసి రతికేళి నేలె నయ్యిగురుఁబోఁడి. 151

వ. ఇత్తెఱంగున. 152

క. అనిరుద్ధ చేష్ట ఖేలన
మనివారిత దంతఘాత మతిచిత్రతరం
బనిదంపూర్వానందం
బనుపమ గురుసురతసౌఖ్య మబ్బినయంతన్. 153

క. ఈలాగు నిచ్చనిచ్చలు
మేలుగఁ గోరికలు దీఱ మిథునత నన్నున్
దేలింపు మనుచు ననిపినఁ
జాలన్ బాగుగ నతఁడటు సలుపుచునుండెన్. 154

క. అల కాఁపు వగల చిలుకల
కొలికికిఁ దమి యింతయైనఁ గోల్పడక మదం
బరిధారి యుండ నొకనాఁ
డెలమిని నయ్యూరి బేరి హితమలరారన్. 155

క. ముదుక రుమాలు గుడ్డ భుజమూలమునన్ గడితంబు మీఁదఁ బ్రాఁ
తదియగు దుప్పటంబు మొలఁద్రాసును గీసరలుండు తిత్తి స
న్నది నెలవంక నామము వినాయకు నుంగర మంగుళంబునం
బొదలఁగ రత్నగుప్తుఁడు సమున్నతి నింటికి రాఁ బ్రియంబునన్. 156

క. ఆ సత్యకేశినీసతి
నాసత్యసమాను వైశ్యనాయకు రూపం
బాసఁగొని చూచి మోహము
తో సరసము లాడుకొనుచుఁ దోషణ మొదవన్. 157

క. వక్కాకుఁ బొగాకిడుమని
చక్కటికిని బోయి పైఁట జాఱఁగ నెదుటన్
మొక్కనగ వొప్ప నిలఁబడి
"దక్కితి విఁక నెందుఁ బోయెదవురా! బావా!" 158

తే. అనుచుఁ దమినిల్పలేక[2] నయ్యంబుజాక్షి
వలుఁద గుబ్బలఁ గౌగిఁట బలియఁబట్టి
సురతకేళినిఁ దేలించి చొక్కుచుండ
నపు డటకువచ్చి యయ్యంగ దాహ్వాయుండు. 159

ఉ. "వచ్చితి రెడ్డిసాని! తరివాకిలిఁదీయు" మటంచుఁ బిల్వ లో
హెచ్చిన సాధ్వసాప్తి నపుడెంతయు వైశ్యుఁడు సంచలింపఁగా
నచ్చపలాక్షి వాని "భయమందకు" మంచొక గాదె లోపలం
జెచ్చెర నుంచి నాయకుని చెంతకుఁజేరి మహానురాగయై. 160

ఉ. వాకిలిఁ దీసి చొక్కటపు వాలుగ కన్నులఁ దేలఁజూచి నా
ళీకదళాక్షి కుందనపు లిబ్బులనేలెడు గుబ్బచన్మొనల్

సోఁకఁగఁ గౌఁగిలించి నెఱసొంపునఁ గేళిగృహంబు లోనికిం
దోకొనిపోయి వాని రతినూతన సంభవ పారవశ్యయై. 161

క. అలకాపుర సంపద లల
రల కాఁపువధూటి యానానాలంకృతి కా
ర్యలకా పుంజితయై వే
డ్కలఁ గాఁపుర మొప్పఁజేయు కాలము నందున్. 162

ఉ. నల్లనికమ్మి పచ్చడము నామముబొట్టును గుచ్చుటద్దముల్
తెల్లరుమాలువల్లె మొలఁదిత్తి కరంబునఁగోల వ్రేళ్ళ సం
ధిల్లిన వంకుటుంగరము తీరగుపూజల జంటగుండ్లు రం
జిల్లఁగవచ్చి రెడ్డి, తన చెల్వను వాకిలిఁ దీయఁ బిల్చినన్. 163

క. ఆయెడ నిద్దఱు మిండలఁ
బాయక రతిసల్పు కాఁపుపడఁతుక యెటులన్
మేయించి బొంక వలెఁ జెపు
మా! యని చక్రాంగ వంశమండన మనినన్. 164

చ. ఆ వచనంబు వేడ్క విని యౌదల యూఁచి నిడూర్పు పుచ్చి హే
మావతి పల్కె, "హంసవర ! మాటికి మాటికిఁ బృచ్ఛ యేల? నీ
వే వినిపింపుమా! వినెద! వింతసుమీ! తెలియంగరా డదె
ట్లో విశదంబుగా" ననిన నుత్పలగంధికి హంస యిట్లనున్. 165

చ. తన నిజనాయకుం డిటులఁ దల్పు సడల్పు మటంచుఁ బిల్చినన్
విని యల వన్నెకాఁడు భయవిహ్వలుఁ డైన 'వడంక వద్దురా'
యని నగి వీపుఁ దట్టి, "చనుమా! పగఁ జాటుచు, మళ్ళీ చూడ కే
మనకను రెడ్డి తోడ" నని యా సఖి పంచిన నాతఁ డంతటన్. 166

వ. "మంచి" దని యప్పుడు. 167

క. త్వరితమ్ముగఁ దల వాకిలిఁ
దెఱచుక బంట్రవుతు నోటి తీఁటయుఁ దీఱన్
బొరి పొరి వదరుచుఁ జనియెడి
తెఱఁగు నిరీక్షించి రెడ్డి తెగువన్ మగువన్. 168

తే. పిలిచి కోపారుణాక్షుఁడై పేర్చి పలికె
"నేమి బంట్రోతుగాఁ డిటు లెమ్మె మెఱసి
వచ్చినాఁ డదిగాక తా వదరుకొనుచుఁ
బోవుచున్నాఁడు సెప్పుమా! పువ్వుబోఁడి". 169

క. అని పతి యడిగిన జడియక
"వినుమా!" యని రెడ్డిసాని వింతలు గులుకన్
నునునగ వొప్పఁగఁ జెప్పెను
"గనుమా! యీ సెట్టిగాని, ఘర్షణ మొదవన్. 170

తే. నగరివారలు పిల్చుచున్నా రటంచుఁ
దఱుముకొని రాగ నిలుఁజొరఁ దలుపువేయ
గోడతఁడు దూకి వచ్చి తోడ్కొనుచుఁ బోవ

‘రెడ్డి లేఁడు గదా’ యని యడ్డ పడితి. 171

ఉ. అంతట నీవు వచ్చితివ యాతఁడు నాగ్రహవృత్తిచేత న
న్నెంతయు దూఱుకొంచుఁ జనియెన్ మగఁడా !” యని చెప్పి వైశ్యునిన్
జెంతకుఁ జేరఁ బిల్చిన వసించు కుసూలము వెళ్ళి సాధ్వసా
క్రాంతశరీరుఁడై యెదురుకట్లకు వచ్చిన రెడ్డి యంతటన్. 172

తే. వాని దయఁ జూచి “నేనున్న వాఁడ నీవు
భయపడకు సెట్టిగా!” యని పల్కరించి
పొమ్మనిన మస్తకవిధూననమ్ము చేసి
యేఁగె నాతఁడు తనయింటి కేమి యనక. 173

ఉ. ఆవిధి బొంకనేర్చిన నృపాగ్రణి దగ్గర కేఁగుమన్న హే
మావతి నాసికాగ్రమున మాటికి వ్రేలిడి కర్ణపత్ర శో
భావళి చెక్కులన్ నటనమాడ శిరంబటులూఁచి మెచ్చుచున్
వేవినఁ జూచి యంత నిజవేశ్మముఁ జేరఁగ నేగె గొబ్బునన్. 174

క. ఈ గరిమను నిజగృహమున
కేగి ధరాధీశమోహ హృదయాంబుజయై
యా గజగామిని యొండొక
లాగున దినమెల్లఁ గడిపి లలి నిశియైనన్. 175

చ. ఘనశితికంఠకంఠ కలకంఠ ఘనాఘన నీలకంఠ కం
జనయన ఖంజరీట బలశాసన నీల తమాలమాలికా
ప్రణుత మృగేక్షణా చికురభార మృగీమద చంచరీక కా
ననకిట కోక కజ్జల వనద్విప సన్నిభమైన చీఁకటిన్. 176

ఉ. కొప్పున జాజిక్రొవ్విరులు కుంకుమగందపుఁబూత గుబ్బలన్
గొప్ప సుపాణి రాసరులు గోమలదేహ లతాంతవల్లికన్
గప్పెడు సొమ్ము పెన్సిరులు గన్నుల పండువు లాచరింపఁగా
నెప్పటియట్ల వచ్చి హరిణేక్షణ నిల్చెను హంస సన్నిధిన్. 177

ఆ. నిలువఁ గలువకంటి చెలువంబు వీక్షించి
దినము దినము నొక్క తెఱఁగు దోప
సొగసుఁ బూన నేర్చు సుందరాంగివి నీవె
యనుచు మెచ్చి హంస మనియె సతికి. 178

## పదునాఱవ రాత్రి కథ

### జాలరిబిత్తరి తైర్థికునిఁ గూడుట

మ. పొగడం జొప్పడు సౌరసేనజగతిన్ బుణ్యోపలబ్ధం బనే
నగరం బొక్కటి యందుఁగాఁపుర ముదీర్ఘప్రౌఢితోనుండు భ
ద్రగుణాపేతుఁడు సూతవంశజుఁడు కుద్దాలాభిధానంబునన్
దగఁ బెంపొందినవాఁడు రూపజితకందర్పుండు భామామణీ! 179

తే. రాజ నలరాజ రతిరాజ రామరాజ

రాజ రాజాత్మ జామర్త్యరాజజ వన
రాజ రాజిత రేఖా విరాజమాన
సౌష్టవాకార సంపత్తి జరగు నతఁడు. 180

క. తరణి జని తరణి ధరణీ
తరుణీ రమణీయ వేణిఁ దత నిర్ఝరిణీ
వర రమణీమణి శ్రిత జన
దురితాటవ్యరణి సుగుణ ధోరణి యమునన్. 181

## పడవలు, వలలు, జలచరములు

తే. ఈదుకొయ్యలు తెప్పలు నీఁదుకాయ
లరడ లరికోళ్లు పడవలు తరులు పుట్లు
చేపడవ లోడ లాదిగాఁ జెలఁగునట్టి
యంబుతరణంబులకు నెల్ల నధిపుఁడతఁడు. 182

క. ఆకర్ణదఘ్న పుణ్యక
థాకథన లలిత హృదయుఁ డసమాన యశుం
డా కర్ణధారుఁ డంహతి
ధీకర్ణుఁడు ధీవరకుల దేవుం డరయన్. 183

తే. కొడమ తిట్టిడ్డకొడమ ద్రొబ్బుడు పటంబు
చాప యెత్తెల గూడయు జల్లిగూడ
లుంట గాలంబు తెరదీము లుసురుగాల
మొసుకు గొరకు పుణుకు సొక్కు లెసఁగుచుండు. 184

క. మెడవల సన్నపువల త్రో
పుడువల డొంకవల మింట ముక్కిడివల దాఁ
టుడువల సింగిత మనుకువ
లెడవల కుండెవల లాదు లెసఁగెడి వలలున్. 185

సీ. నీరు కుమ్మరపుర్వు నీరీఁగె తలకప్ప
తెలిదమ్మ కరివేల పొలికె నత్త
గుల్ల చుట్టుడుగుల్ల కురిమింద నాచుడు
గవ్వ మురుండము కాకిచిప్ప
యెఱగుల్ల నులిగుల్ల పురుగు గోచురుగప్ప
కప్ప కత్తరి యెండ్రకాయ జెలగ
గులకరింతయు నీరుగట్టు శంఖనఖంబు
పలుకాసి నసిమిరి బంగపురువు

తే. పెలుక నిర్ఘాత కోచు తాబేలు పిడక
మొసలి శింశుమారము పెద్దమొసలి నీరు
పాప నీరేన్గు నీర్బలి ప్రాచి పురువు
లాడి కొఱగాని జంతువు లన్ని విడిచి. 186

సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱమీ నులస ము
చ్చంగి బేడిస జెల్ల చాఱమీను

వాలుగ ముకుదొమ్మ వల్లికతట్ట పు
త్తడికాసు పూమీను కడిసెలంబు
పక్కె చిత్తర నీరుపాపెర మలుగు మీ
నరుజు నిల్లెపుఁజేప యాకుజెల్ల
మిసి కల్లురుజు నడమీను తొల్లిక జాతి
గొరక మాపురమును గుంటముక్కు

తే. మొరపక్కెర దొందును గూరముక్కు
పుల్లురుజు గెజ్జె గెండయు బొమ్మిడాయ
యల్లె దమ్ముప్పుచేఁపయు గొల్లదొందు
పరిగె రొయ్యాదియగు మీలఁ బట్టునతఁడు. 187

క. కులనాయకపుం జాలరి
కులనాయక తాంబుతరణ కోటీశత్వం
బులు జారి క్రియాశాసన
మలవడఁ గుద్దాలుఁ డందజౌనన మెలఁగున్. 188

తే. మేలు బలువాలుగలనేలు మిసిమి గ్రాలు
కన్నుగవడాలు మరునాలుకరణిఁ బోలు
మురిపెముల పోలు కలదొక్క ముద్దరాలు
వాని యిల్లాలు దొమ్మరవాని డోలు. 189

తే. దాని నామంబు తగు భద్రసేన యనఁగ
రూపయౌవన గరిమ నారూఢికెక్కి
యీడు జోడును సరిసాటి యెందులేక
విఱ్ఱవీఁగుచు నుండు నా విద్రుమోష్ఠి. 190

సీ. జడ చిల్వ యాస్యంబు శశి నొసల్ నెల బొమల్
ధనువు లక్షులు తొవల్ నాస గంధ
ఫలి చెవుల్ శ్రీల్ దంతములు మొల్ల లధరంబు
తలిరు చెక్కిళ్ళద్దములు గళంబు
జిగిశంఖ మంగుళుల్ పగడాలు కరము ల
బ్జములు కక్షములు భోగములు భుజము
లు లతలు గుబ్బలద్రులు వళులూర్ములా
వాల్నాభి గుహ కౌను బయలు కటిల

తే. తొడ లనంట్లు మోఁకాళ్లు బిరడలు పిక్క
లు శరథులు గుల్భము లరడలు ప్రపదములు
కూర్మములు గోఱ లుడు లడుగులు మహోత్ప
లములు వెన్ పల్కయై యొప్పు లలన కెపుడు. 191

క. కెంపా? వాతెర జిగిబిగి
శంపా? నునుమేను, మోముసొ రిందుని మేల్
సొంపా? బలభిన్మణి ఘృణి
గుంపా? కుంతలవిభూతి కోమలి కెన్నన్. 192

సీ. సారంగ సారంగ సారంగములఁ గేరు

గమనంబు కనుదోయి కచభరంబు
సారాజ్ఞ సారాబ్జ సారాబ్జముల నేలు
వదనంబు కంఠంబు పదయుగంబు
పున్నాగ పున్నాగ పున్నాగములఁ బోలుఁ
దీరైన నాభి నూఁగారు నడుము
తారక తారక తారకమ్ముల మీఱు
దంతముల్ నఖములు దరహసములు

తే. వడిఁ బ్రవాళ ప్రవాళ ప్రవాళగతి న
దల్చు భుజములు వేళ్లు నెత్తావి మోవి
రమ్యతర చక్ర చక్ర చక్రములఁ దెగడు
ముదిత జఘనంబు చనుగవ మురుఁగు లరయ. 193

క. మబ్బులు గ్రమ్మెడి క్రొమ్ముడి
జొబ్బిల్లెడి తేనెమోవి సొబగౌ మొగమున్
సిబ్బెంపు గబ్బి గుబ్బలు
నిబ్బరమౌ పిఱుఁదు తొడలనిగ్గు చెలంగున్. 194

సీ. మృగధర బింబంబు మెలఁత నెమ్మోము మృ
గంబు కన్దోయి ధరంబు లుదుటు
గబ్బిసిబ్బెపుఁ జనుగుబ్బలు బింబంబు
తావి చక్కెరలొల్కు మోవి ఠీవి
సుమచాపబాణంబు లమరు పాదమ్ములు
సుమములు నవ్వు చాపములు బొమలు
బాణముల్ క్రొవ్వాఁడి రాణించు వాల్చూపు
లళులు నిద్దపుఁ గుటిలాలకమ్ము

తే. లమృతద రమావిహారమ్ము లలరుకురులు
నమృతములు పల్కులు దరమ్ము రమణిగళము
మావికెంపు చివుళ్లు సమ్యక్కరములు
హారములు దంతపంక్తి సోయగము లరయ. 195

ఆ. భ్రమరకములఁ బోలు భ్రమరకముల డాలు
పృథు లకుచము లొఱయుఁ బృథుల కుచము
లతనుభామఁ గేరు నతను భామాకృతి
యలరుఁ గొమ్మఁ దెగడు నలరుఁగొమ్మ. 196

శా. ఆ రాజన్ముఖ మా వినీలచికురం బా చెక్కుటద్దంబు లా
శ్రీరమ్యాధర మా భుజాలతిక లా సిబ్బెంపుఁ జన్గుబ్బజో
డా రోమావళి పొంక మా నడల యొయ్యారంబు వీక్షింప న
మ్మారుండైనను దాని సంగతికిఁ బ్రేమన్ బంటు గాకుండునే! 197

తే. అదియు జవ్వన ముదయించినది మొదలుగ
సంగమాపేక్ష తల కెక్కి చారిఁ దివురు
నంత నుపకాంత సంగతి యబ్బేనేని
యాకసము తూఁటు వొడుచుకయైనఁ జనును. 198

సీ. కలికి చొకాటంపు బెళుకుచూపుల ముద్దు
కనుబొమల్ జంకించుకొనెడు హొయలు
కలయిక మాటలఁ గరఁగించు చెలువంబు
లాస పుట్టఁగ నవ్వునట్టి నేర్పు
తేలించి చేతులు ద్రిప్పెడు పొంకంబు
హర్షించి తాను చుక్కనెడు సొబగు
చిన్నెల పసఁజూపి సన్నఁ జేసెడి తీరు
ముక్కుపై వ్రేలిడి చొక్కు వగలు

తే. వలుఁద గుబ్బలఁ బయ్యెద వైచు తీవి
నఱకు మెట్టెలు రొదలిన నడుచు సొగసు
విను త్రిలోకము లందుండు వెలఁదు లందుఁ
గానఁబడ దెన్నటికి నైనఁ గమలగంధి! 199

తే. అదియుఁ గ్రొవ్వున వీఁడువాఁడనక చొచ్చి
టెక్కు గలవాని చూపు సొంపెక్కువాని
బలము గలవాని రతులఁ బేర్వడిన వానిఁ
గనిన విడువదు వానితోఁ గలిసి కాని. 200

వ. ఇట్లు ప్రతిదినప్రవర్ధమానానూనమోహాతిరేకంబున
నన్యమానవవితానమీనకేతనాయోధనాధీనమానసాంభోజయై యయ్యంభోజనయన
విజృంభించి మెలంగుచున్న యవసరంబున. 201

చ. ఒకఁడు కిరాతదేశమున నుండెడు కోమటి పోలిసెట్టి పు
త్రకుఁడు హిరణ్యనామకుఁడు తండ్రి యదల్చిన నల్కతో సఖి
ప్రకరము గొల్వఁగా సుకృతపాటవ మొప్ప మహానదుల్ నిధుల్
సకలముఁ జూడఁగోరి చనె సత్వరయానమునన్ ముదంబునన్. 202

వ. ఇట్లు చని చని. 203

## పుణ్యక్షేత్ర తీర్థ విశేషములు

ఆ. బదరికా గుహేక్షు కదళికా చంపక
నహుష దేవదారు నైమిశములు
దండకావనంబుఁ దనరు వింధ్యాటవి
యాది యగు మహావనాళు లరసి. 204

సీసమాలిక. గంగ సరస్వతి కాళింది గౌతమి
చిత్రోత్పల విశాల శీత చంద్ర
భాగ కావేరి విపాశ సితాలక
శీతలవాహినీ సింధు సరయు
గిరి యిరావతి గండకి దశార్ణ కృష్ణవే
ణిక శంబమాల దేవిక తృణఘ్ని
బహుళ విశాఖిని బ్రహ్మభాగ సురాప
వాలుకా వాహిని వర్ధమాన
శోకావధూత పినాకినీ ఋభు తామ్ర
పర్ణి పలని తామ్రవతి వితద్రు

నర్మద బాహుద నంద చిత్రిత యుత్స
లావతి కపిల మాల్యవతి త్రిదివ
లక్షణ హరిణిక లాంగలిని త్రిసామ
ద్యుమతి కుముద్వతి తుంగభద్ర
ఋషిత జితావగ ఋజ్వభద్ర సునంది
భృగువర గండకి భీమరథి మ
హాజల గోమతి హంసావళీశ్వర
గండక హరిగండక శతభద్ర
బ్రహ్మగండిక నీల పద్మావ తీశావ
తి హిరణ్యా శాఖావతి హిమ క్రౌంచ
హరితల మానస హంసకంబు సుమేఘ
సౌభద్ర కౌశిక చక్రధార
శ్యామ మహోత్కట సోమ మహా వక్ర
శౌక్లి పాశావతి చంద్రమత్త
పంచగం ధ్యరుణ ప్రభాంజని వల్లవ
వజ్రవాలుక శూక వరుణ వక్ర
పంచ మహామాయి ఫల్గుణి సురకర్తృ
ష ధనుష్మతి వితస్త చంద్రవక్ర
స్కందావతి సమూల చక్షు కదంబక
పుండరీక పయోష్ణి భూత పాద
కూట వైఘయుఁ జిత్రకూట వేదవతి న
క్రవతి వేగవతి వేత్రవతి గర్భ
వతి యింద్రనందియుఁ గృతమాల కృష్ణ పా
ద జయంత వంద శ్యాత్రాఖ్య శుక్తి
మతి హరిధృతి సువర్ణతటి మణిప్రభ
ప్లక్ష కుజల పిప్పల శుచి సింధు
వర్ణ కాశ్యపి మణికర్ణిక మందాకి
ని మలప్రహారి సానుమతి క్షీర
కౌమోదకీ సఖీస్వామిక కరతాల
వేదత్రయి మయూఖ విలయ విదిత
భవనాశనియు సర్వ పాపహ కిటికక్ష
ప్రోద వేదస్వ జంబూక కుంభ
కరణి త్రిసంధ్యయు గాయత్రి ఋషికుల్వా
ప్రభ విష్ణువు వికూట రత్న కృష్ణ
తోయ పాపఘ్ని విద్యుత దౌర్గ్య సర్వద
వైర్ణ దృష్టి ద్యుతి వందవార
శీఘ్రోదయుఁ బ్రణీత చెయ్యేఱు గుండ్లక
మ్మయుఁ గుందు మొదలుగా మహిఁ దనర్చు

తే. పుణ్యకూలంకషాబృందముల నమంద
వికస దరవింద గంధిల విమల కమల
ఝుర వరంబుల నురుభక్తి జలక మాడి
సకల దానాది సత్క్రియల్ సలిపెనంత. 205

తే. శార్ఙ్గకోటి గదాకోటి శంఖకోటి

చక్రకోటి సరఃకోటి చంద్రకోటి
సిద్ధకోటి మహాకోటి చిత్రకోటి
పుణ్యకోటి ధనుష్కోటి ముక్తి కోటి. 206

తే. పద్మసరసి మంద్రసరసి బ్రహ్మసరసి
శుభ్రసరసి మహాసర సభ్రసరసి
గృధ్రసర సిందుసరసిని క్షీరసరసి
మానససరసి నన్నిఁట స్నానమాడె. 207

సీ. స్వామి పుష్కరిణిలో స్నానంబు గావించి
శశి పుష్కరిణి నీళ్లు చల్లు లాడి
చంద్ర పుష్కరిణిలో జలకంబు ఘటియించి
సోమ పుష్కరిణిలోఁ జొచ్చి పొరలి
గుహ పుష్కరిణి నీఁత కొమరొప్ప నొనరించి
యమృత పుష్కరిణి నాడి వెడలి
నిత్య పుష్కరిణిలో నీళ్లాడి చిత్రపు
ష్కరిణిలొ స్నాతకక్రమముఁ జూపి
తే. శంఖ పుష్కరిణిని గ్రుంకి చక్ర పుష్క
రిణి మునిఁగి దేవతా పుష్కరిణిఁ దొలంచి
క్షీర పుష్కరిణిని దూకి సేతు పుష్క
[3]రణిని మజ్జన మాడి సరాళముగను. 208

సీసమాలిక. మత్స్య కూర్మ వరాహ మాండవ్య నరసింహ
రామ పరశురామ రామ వామ
న మహేంద్ర చక్ర గో నారద శంఖ పాం
డవ శార్ఙ్గి పక్ష్యగస్త్య విజయ జయ
కపిల వసిష్ఠ మార్కండేయ భృగు జహ్ను
వాయు మునిబ్రహ్మ వరుణ విష్ణు
ధర్మ పరాశర దామోదర కపింజ
ల శుక కౌండిన్య గాలవ హిరణ్యా
వసు కృష్ణ శాండిల్యా వజ్ర కౌశిక ధనం
జయ ముక్తి దేవర్షి శర్వ పిప్ప
ల సరస్వతీ ముద్గల భరత పర్వత
పరమ కాశ్యప శేష పంచగోప
రైధ్య భరద్వాజ శైభ్య తుంబురు గౌత
మ జటిల భార్గవ మాధవ గురు
బాభ్రవ్య పుణ్య గోపాల ముకుంద త్రి
విక్రమ సౌర గోవింద మోక్ష
కుల్యాచ్యుతామృత గోమద సుర కృప
నారాయణ మను జనార్ధన హరి
వైకుంఠ కేశవ వాసుదేవ పతంజ
లి విరజ ధన్వంతరి కురు భోగ
సావన శ్రీధర పావన ప్రద్యుమ్న
పురుషో త్తమ పరమ పురుష సిద్ధ
పాతకనాశన పాపహారి ఋ్యరు

విమల భాస్కర మధు కమల సోమ

ఆ. నామధేయములను భూమిలో సార్ధత్రి
కోటి తీర్థములను మేటి వనఁగఁ
దనరు నట్టి నూట యెనిమిది తీర్థాల
స్నానదాన విధులు సలిపె నంత. 209

క. తిరుకొళము నూయి కోడును
జెఱువు మడువు లొండు కుంట చెలమ పడియ కో
నెఱు బుగ్గ వాఁగు దొనతల
పరి గుండము కాల్వ డిగ్గి బావి దొరువులన్. 210

సీ. సంకల్పములు సెప్ప సాగు బ్రాహ్మణు లుండ
భైరవార్ఘ్యం బిచ్చి భక్తితోడ
స్నానంబు గావించి సంచి మాత్రము దక్కఁ
గల ధనమెల్ల బాపల కొసంగి
కపిలగోఘృతములు క్రముకపర్ణంబులు
గుడుములు ఫలములు గుగ్గిళులును
గానుకల్ వత్తుల కట్టలు పూలస
రాలు గైకొని మోదరసము చిల్క

తే. నార్ద్రవస్త్రంబు లంగంబు లంట వడఁకి
కొనుచు నమ్రత నడుగడుగునకుఁ బెద్ద
మాట "గోవింద" యనుచును నూట యెనిమి
ది తిరుపతులలో స్వాములఁ దెలియఁజూడ. 211

వ. తరించి మఱియుఁ జని చని. 212

మంజులగతి రగడ. శ్రీవైకుంఠ క్షేత్రంబునఁ దగు
వాసుదేవునకు వందన మొనరిచి
యామోదస్థలి యందలి సంక
ర్షణునకుఁ గర్ణాచ్ఛాదనముల నిడి
సరవిఁ బ్రమోదస్థలమునఁ జెలఁగిన
ప్రద్యుమ్నునకును బ్రణతి యొనర్చుచు
సమ్మోదాఖ్యస్థలమున నుండెడు
ననిరుద్ధునకు సమారాధన మని
సత్యలోకమున సతత మ్మెనసిన
విష్ణువునకు గోవిందలు సల్పుచు
సూర్యమండలిని సొంపుగఁ బ్రబలిన
పద్మాక్షునకుఁ బ్రపత్తి వహింపుచు
క్షీరాబ్ధిస్థలి శేషశయనునకు
హస్త స్వస్తిక మనుబంధింపుచు
శ్వేతద్వీప క్షితిఁ బ్రభవించిన
తారక హరికిని దండము లొసఁగుచు
రమణ బదరికారణ్యం బందలి
నారాయణునకు నమ్రత లొసఁగుచు
నైమిశ పుణ్యవనంబును బొందిన

హరికిని మంగళహారతు లెత్తుచుఁ
దనరు హరిక్షేత్రంబున నెలకొను .
సాలగ్రామస్వామి గణింపుచుఁ
బొసఁగ నయోధ్యాపురిలోఁ జెలఁగెడు
రఘునాయకునకుఁ బ్రణిపాతము లని
మధురాపురిలో మహిమలఁ జెందిన
బాలకృష్ణునకుఁ బ్రాణాచారము
మాయాస్థలిలో మధుసూదనునకు
నిరతం బల్లో నేరే ళ్లనుకొని
కాశీస్థలి భోగశయానునకును
నమరఁగ నూర్ధ్వశయంబుఁ జొనుపుచును
దలఁప నవంతీస్థలిలో నవనీ
పతిదేవునకును బ్రాంజలు లిడుచును
ద్వారవతిన్ యాదవకుల భర్తకు
దాళహస్తములు దప్పక కొట్టుచు
వజ్రపురిని దావలమై చిక్కిన
గోపప్రియునకు గొబ్బిళ్లనుచును
వసతిగ బృందావనమున నిలిచిన
నందాత్మజునకు నతులొప్పించుచు
నలరఁ గాళియ హ్రదతలమునఁ గల
గోవిందునకును గొండీ లెన్నుచు
గోవర్ధనమునఁ గొలువై కన్పడు
గోపవేషునకుఁ గొణిగె లొనర్చుచుఁ
దనరు భక్తమోచనము భవఘ్న
స్వామికి హస్తస్తంభనఁ బట్టుచు
మహిమ వెలయ గోమతపర్వతమునఁ
జేరిన శౌరికి సేవలటంచును
రమ్యహరిద్వారమునఁ బ్రసన్నుం
డైన జగత్పతి కభివాదనమని
చాలఁ బ్రయాగ స్థానమ్మునఁ గల
మాధవునకు సన్మానకరంబులు
గయలో సాక్షాత్కారమునొందు గ
దాధరునకు జోతలు చెల్లింపుచు
గంగోదధి సంగస్థలిఁ జెలఁగిన
శ్రీవిష్ణువునకు జేజేలనుచును
జిత్రకూటమున సేమంబందిన
రాఘవునకు నేత్రనిమీలన మని
నందిగ్రామమునను జెలువొందిన
రాక్షసఘ్నుఁడగు రామున కెఱఁగుచు
సరవిఁ బ్రభాస్థలసంచారుండగు
విశ్వరూపునకు వినతులు సేయుచు
శ్రీకూర్మస్థలిఁ జేకొను కూర్మ
స్వామికిఁ బుష్పాంజలు లర్పించుచు
నీలాచలమున నెలకొను పురుషో

త్తమునకు హాణిగెలు దండిగఁ జేర్చుచు
సింహాచలమునఁ జెందిన నరసిం
హాకారునకు జొహారులు నెఱపుచుఁ
దులసీవనమునఁ దులకించు గదా
ధరునకు నర్చలు తఱచుగఁ గఱపుచుఁ
గృత శౌచస్థలిఁ గేళిక లొందెడి
పాపఘ్నునకు సపర్యలు సలుపుచు
శ్వేతాద్రిస్థల సింహాలోచనున
కెలమిని గేకిస లిచ్చుచు భక్తిని
ధర్మపుర క్షేత్రము యోగానం
దస్వరూపునకు దాస్యము సలుపుచు
శ్రీకాకుళమున సిస్తుగఁ దోచిన
యాంధ్రనాయకున కర్చన మనుచును
ఘనత నహోబల గరుడాద్రి వీర
ణ్యాసుర వధునకు నలిజోబిళ్లని
పాండురంగమునఁ బాటిలు విఠ్ఠల
దేవునకు సదా దిగ్విజయములని
వేంకటగిరిపై వెలసిన తిరువేం
గడ ముడయానులఁగని కానుక లిడి
యాదవ పర్వత మందలి నారా
యణునకు జయజయ లావర్తింపుచు
ఘటికాచలమునఁ గల్గు నృసింహునిఁ
గృపణత్వంబునఁ గీర్తన నడుపుచు
వారణగిరిపై వరదస్వామికి
బిడికిలింతలని పెంపుగ నుడువుచుఁ
గాంచీపురిలోఁ గమలాక్షునకును
మోదము తోడుత ముకుళితకరమని
యొప్పుననుండు యథోక్తస్థలము య
థోక్తకారునకు దోయిలిఁ దీర్పుచుఁ
బరమస్థలిలోఁ బరమేశ్వరునకుఁ
గర మర్థింపుచుఁ గన్నుల మ్రొక్కుచుఁ
బాండవ భూస్థలిఁ బాండవదూతకు
వలగొను బాహులు వైపుగఁ దీర్చుచు
విక్రమస్థలిఁ ద్రివిక్రమ హరికిని
సారెకు సారెకు సాగుబళా యని
కామాళికిలో గణుతికి నెక్కిన
శ్రీనృసింహునకుఁ జేతుల మొగుపని
యష్టభుజస్థలి నష్టభుజునకును
జిత్తము రంజిలఁ జిన్ని పువ్వులని
ప్రవాళస్థలినిఁ బ్రవాళవర్ణునకు
నమర నమోనమ యని వర్ణింపుచు
దీపాళస్థలి దీపాభునకును
మోహముతోడ నమోవాకంబని
రాజిలు గృధ్రసరస్తీరస్థలి

గలుగు విజయరాఘవునకు శరణని
రసికత వీక్షారణ్యశయానుని
వీరరాఘవుని వేఁడుకొందునని
తోతాద్రిస్థలిఁ దుంగళయాన
స్వామికి నిత్యోత్సవములఁ బనిగొని
యలరు గజస్థలమందు గజార్తి
ఘ్నునకు శయద్వయిఁ గోలాటంబని
బలిపురమందున బలియు మహాబల
దేవున కిదిగో తిరువారాధన
భక్తసారమునఁ బ్రబలు జగత్పతి
కిని సంధించిన గిడిగిళ్ళో యని
యైంద్రస్థలమున నవతారముఁ గొను
దేవదేవునకు ధృతహృత్పుటములు
గోప పురస్థలి గోపదేవునకు
నెలమిఁ బ్రదక్షిణ మేఁగెద గొబ్బున
శ్రీ ముష్టి స్థలిఁ జెలఁగు వరాహ
స్వామికిఁ జేర్చెదఁ జంకలఁ జేతులు
మహితస్థలమున మసలక పొదలెడు
పద్మాక్షునకును బడువాటులు వడి
శ్రీరంగస్థలి శేషశయనుఁ డగు
రంగస్వామికి రహి మ్రొక్కెదనని
శ్రీరామస్థలి సీతాప్రియునకు
మానక యెపుడు నమస్కారము లని
శ్రీనివాసమను క్షేత్రంబునఁ గల
పూర్ణమూర్తి కిదె పొరిఁ బూజింపని
స్వర్ణమందిర సువర్ణస్వామికి
గేరుచు జరిపెద గిడిగిళ్లనుచును
వ్యాఘ్రపురస్థలి యందు మహాబా
హుస్వామికిఁ గేలొసఁగెద హితముగ
నాకాశనగరమం దనువొందెడు
హరిమూర్తికి నిదె యప్పాల్ దిరిగెదఁ
బరఁగ నుత్పలావతగ స్థానం
బందలి శౌరికి నారాధన మని
మణికూటస్థలి మలయు మణి ప్రభు
పెరుమాళ్లకుఁ గడుఁ బింపిళ్లాడుచు
విష్ణుపురంబున విలసిల్లు మహా
విష్ణుస్వామికి వెన్నెల కోళ్ళని
భక్తస్థానము భక్తిప్రదునకుఁ
బొసఁగఁగఁ జేసెదఁ బొర్లు దండములు
శ్వేతవరాహ క్షేత్రంబందలి
శాంతమూర్తికిని సంసర్గంబులు
నగ్నిపురస్థలి యందు మురద్విష
నకు నొనరింతుఁ బ్రణామము లూకొని
భార్గవతలమున భరతస్వామికిఁ

గీలించెద లంకెగఁ గేల్మొడతలు
వైకుంఠపురీవాసుండై తగు
మాధవునకును నమస్కృతిఁ బేర్కొని
పురుషోత్తమమునఁ బొల్పగు భక్తస
ఖస్వామికి నిజకైంకర్యం బని
చక్రతీర్థసంచారి సుదర్శన
దేవున్ మదిఁ బ్రార్థించెద ననుచును
గుంభకోణమున గొనకొని కదలని
శార్ఙ్గ ధరు నుపాసనఁ జేసెద నని
భూతస్థానము పురంబు నెలవగు
శార్ఙ్గస్వామికిఁ జాఁగు బడికెలని
యరయఁ గపిస్థలమందలి దంతా
వళవరదునకు నివాళికరము లని
చైత్రకూటమున సరసతఁ గొల్వగు
గోవిందునకును గొల్పుడు చేతులు
నుత్తమతలమున నుత్తమహరికిని
ఘనతరభక్తిని గైలాటము లని
శ్వేతగ్రావక్షేత్రంబునఁ గల
పద్మలోచనునిఁ బ్రస్తుతి సేయుచుఁ
బార్థస్థలమున బాగుగ నుండు ప
రబ్రహ్మమునకు రాముదాము లని
కృష్ణకోటి యను క్షేత్రములోని మ
ధుద్విషునకున్ను నిదె తొంగలిపాట్లని
నందపురీభవనం బందు మహా
నందునకును శరణార్జి ఘటింపుచు
వృషపురస్థలిని విడియు విపాశ్రయ
దేవుని కిదిగో దీవెన కోళ్లని
కడఁక సంగమ గ్రామంబందలి
సంగమమూ ర్తికి సాఁగిలింత లని
తనరు శరణ్యస్థలము శరణ్యా
స్వామికి నిదె కై రపుఁ జెయ్యని
చెన్నగు సింహక్షేత్ర మహాసం
హస్వరూపునకు హస్తార్పణ మని
మణిమంటపమున మల్లరి సామికి
పొందించెద గోవింద లటంచును
నిబిడస్థలిలో నిబిడాకార
స్వామికి మతిఁ గైచాపు లొసంగుచు
ధానుష్కస్థలిఁ దలకొను జగతీ
శ్వరునకుఁ బెట్టెద సరిటెంకణ మని
మాహురమందసమానత విడిసిన
కాలమేఘునకుఁ గైమోడుపు లని
చక్కని మధురాస్థానంబునఁ గల
సౌందరరాజస్వామికి మేలని
యనిశంబును వృషభాద్రిని యళఘరి

పేరిటి హరికిని బేడిస లెన్నుచు
వరగుణస్థలవ్యాపకుఁ డగు నా
థస్వామిని మది ధ్యాన మొనర్చుచుఁ
గుళికస్థలమునఁ గూర్చున్న రమా
సఖుని మంత్రపుష్పము లిడి వేఁడుచు
గోష్ఠిపురస్థలి గోష్ఠిపురస్వా
మికి నర్పించెద మేలుకొల్పు లని
దర్భసంస్తరస్థలి శయనించిన
దాశరథికి నతితతు లొనరించుచు
ధన్వి మంగళక తలమున నెలకొను
శౌరికిఁ దగు పరిచర్య లొనర్చుచు
భ్రమరస్థలమునఁ బరఁగు బలాఢ్య
స్వామి సలామని సత్కర మెత్తుచు
ధరణిఁ గురంగస్థల మందలి పూ
స్వామి నవారణమునఁ గొల్చుచు
నవని పటస్థల మందలి విష్ణు
శ్రీమూర్తికి నిదె చెంగనలో యని
ముద్రనదీస్థలి శోభిలుచుండెడు
నచ్యుతునకును శిరోఽవనతుల నిడి
యంత ననంతశయన మందుండెడు
పద్మనాభునకుఁ బాణిమోడ్పు లని
ధృతి నూటెనిమిది తిరుపతులందుల
నవతారంబుల నలరఁగ వెలయుచుఁ
గృపతో మము రక్షించెడు స్వామికి
సలుపుదుఁ బదివేల్ సాష్టాంగంబులు. 213

వ. అని ప్రపత్తిపూర్వకంబుగా నష్టోత్తరశతతిరుపతులు సేవించి, యంత. 214

సీసమాలిక. అభిషేకవల్లి మోహనవల్లి విద్రుమ
వల్లి చంపకవల్లి వజ్రవల్లి
మకరందవల్లి కోమలవల్లి మాణిక్య
వల్లి చందనవల్లి వచనవల్లి
జంబూరవల్లి కాసారవల్లి వసంత
వల్లి శోభనవల్లి వసుధవల్లి
మరకతవల్లి నిర్మలవల్లి మౌక్తిక
వల్లి కస్తూరివల్లి గంధ
వల్లి విభ్రమవల్లి వర్తులవల్లి వ
రహవల్లి నిక్షేపరాజవల్లి
యంబుజవల్లి విహారవల్లి వినోద
వల్లి నిత్యోత్సవవల్లి చిత్ర
వల్లి మనోహరవల్లి కేతకివల్లి
సారంగవల్లి కర్పూరవల్లి
కల్యాణవల్లి శృంగారవల్లి మనోజ్ఞ
వల్లి మాయకవల్లి స్వచ్ఛవల్లి
సౌభాగ్యపల్లి కేసరవల్లి మాధుర్య

మాలతీవల్లి సామ్రాజ్యవల్లి
మంజులవల్లి సంభ్రమవల్లి శుకపల్లి
నర్తితవల్లి యానందవల్లి
కేయూరవల్లి కోకిలవల్లి సుందర
వల్లి సుమంగళవల్లి మదన
వల్లి సరసవల్లి వైభవవల్లి కి
సలవల్లి రుచివల్లి చారువల్లి
కౌతుకవల్లి శర్కరవల్లి వికసిత
వల్లి మండనవల్లి పరమవల్లి
హసనవ ల్ల్యమృతవల్లి యనురాగవల్లి కు
సుమవల్లి సుఖవల్లి శుభ్రవల్లి
చంచలవల్లి భూషణవల్లి సుకుమార
వల్లి వనజవల్లి వామవల్లి
రంగవ ల్ల్యకలంకరత్నవల్లియు శ్యామ
వల్లి కుండలవల్లి వకుళవల్లి
విచికిలవల్లియు వేదవల్లియుఁ బెరుం
దేవివల్లియు భూమిదేవివల్లి
యలమేలుమంగ తాయారును బీబి నాం
చారు శ్రీరంగ నాంచారు తాయి
కొమరొందు శ్రీచూడికుడుత నాంచారమ్మ
చెలువొందుచుండెడు శ్రీపిరాట్ట
నందగు పేళ్ళఁ జెన్నొందు దయాన్విత
సీతాభిధానలక్ష్మీస్వరూప

తే. ములను నూటెన్మిది తిరుపతుల వసించు
విష్ణుమూర్తులతోఁ గూడి వివిధగతుల
ననుపమవిహారముల మించు
నమ్మవార్ల పాదపంకజముల కతిభక్తి మ్రొక్కి. 215

సీ. వారక పొయిఘాళువారులఁ గొనియాడి
వఱలు పూదత్తాళువార్లఁ గొలిచి
ధీరత బేయాళువారల దర్శించి
పెరియాళువారల పేరుఁ దలఁచి
నమ్మాళువారల నెమ్మదిలో నిల్పి
తిరుమంగయాళ్వార్లఁ దెలియఁ జూచి
తిరుముషి యాళ్వార్లఁ బరికించి మఱి తొండ
రడిపొడి యాళ్వార్ల కడిమిఁ బొగడి

తే. వేడ్కఁ గులశేఖరాళ్వార్ల వినుతిఁ జేసి
మఱి తిరుప్పాణియాళ్వార్ల మఱుఁగుఁ జెంది
మధురకవి యాళువారుల మాట లెన్ని
నాథముని యాళువార్లకు నతులొనర్చి. 216

క. సాక్షా ద్వైకుంఠం బిదె
వీక్షింపుం డనుచుఁ జూపు విధిని బ్రపతిన్
నిక్షేపించి సుమేరుస

దృక్షంబుగ నున్న వైనతేయునిఁ గొలిచెన్. 217

సీ. మత్స్యావతార! నమస్తే మహాకూర్మ
దేహ! నమస్తే వరాహవర! న
మస్తే నృసింహ! నమస్తే వటో! నమ
స్తే భృగుకుల నమస్తే దశరథ
తనయ! నమస్తేఽర్కతనయా విభేదనో
ద్దండ దోర్దండ ప్రచండ విక్ర
మక్రమోదగ్ర! నమస్తే బలానుసం
భవ! నమస్తే బుద్ధ భవ్య రూప

తే. ధర! నమః కల్కి వేష సుందర! నమోఽస్తు
శక్రముఖ దిక్పతి పయోజజాత రుద్ర
సిద్ధ సాధ్యాది నుత! నమస్తే యటంచు
వివిధ విష్ణుస్థలములు సేవించి వేడ్క. 218

వ. తదనంతరంబ శ్రీశైల ఝిల్లి చక్రేశ్వర మూకాంబికా కోటీశ్వర గోకర్ణ కేదార హాటకేశ్వర జంబుకేశ్వర బ్రహ్మేశ్వర పుండరీక పంచనదీశ్వ రారుణ గిరీశ్వర జటానాథ వైద్యనాథ గౌరీనాథ రామేశ్వర శంకరనారాయణ సుబ్రహ్మణ్య స్థలాద్యధీశ్వరులగు నీశ్వరులను సేవించి వెండియు మహీమండలిం గల పుణ్యస్థలవిశేషంబులం జూచుచు సంచలించు నయ్యవసరంబున. 219

శా. సర్వ ద్వీపవతీ ప్రపూరిత పయస్సంబంధ ధారాధరా
ఖర్వధ్వాన భయోత్పతిష్ణు బిసభుగ్రాజీవ కూర్మదికం
బుర్వీంద్రాయుధ పాత భగ్నకుబిలవ్యూహక్షరద్వాః పత
త్తర్వశ్మ క్షుభితాహిలోక మగుచున్ దర్పించె వర్షంబిలన్. 220

సీ. నేళనెళ ధ్వనులతో ఫెళఫెళ మను గర్జి
తములు కర్ణక్షోభదములు గాఁగ
ధళధళ ద్యుతులతో మిలమిల ల్గల మించు
లక్ష బలౌద్ధత్య మడఁచుచుండ
ఘుళఘుళార్భటులతో ఫళఫళారను వాన
ధార్తరాష్ట్రాది మహార్తి నింపఁ
జిటచిటారవముతోఁ దటతట వడగండ్లు
యువరాజ ముఖులను నొదుగఁజేయ
తే. విజయ విఖ్యాతి నమ్మహావృష్టి సమర
మమర వరధర్మవిలసనం బనిలజాత
ఖేలనము కృష్ణ ఘనయుక్తి చాలఁ గలిగి
యవని జనములు వినుతింప నతిశయించె. 221

క. ఆయెడ సఖు లొకఁ డొక్కఁడు
కూయిడి జతఁగూడ కెడసి కునుకుపరువులం
బోయిరి చెంగటి యూరుల
కా యూరవ్యుఁడు హిరణ్యుఁ డట్లతిగతితోన్. 222

తే. వడఁకు చట భద్రసేన యావాసమునకుఁ
బోయి “నేను ప్రవాసి నో పుణ్యురాల!

తడిసితిని వర్షధారలఁ దాళఁజాల
నేర్పెఱఁగ నిందు రానిమ్ము! నిద్రఁ జెంద." 223

క. అని వేఁడిన వైదేశికు
ఘనకరుణాదృష్టిఁ జూచి కామిని, "పడుకొ"
మ్మని ముంగలి చావిడిఁ జూ
పిన హా లక్ష్మి యటంచుఁ బేర్కొని యచటన్. 224

చ. తడిసిన వస్త్రముల్ విడిచి తాళ్లపయిన్ వెస నాఱవేసి, "యో
పడఁతుక ! నీదు పెద్దలకుఁ బల్కఁగ శక్యముగాని పుణ్య మ
య్యెడు నిట కగ్నిఁ దెచ్చి సెగ యించుక చూపు" మటంచు వేఁడఁగాఁ
దొడివడి యట్లొనర్చి యల తొయ్యలి యాతని రూపసంపదల్. 225

తే. మంట వెలుఁగున వేమాఱు మనసు దూలఁ
దళుకు దెలివాలుగన్నుల బెళుకుఁ జూచి
"యెప్పు డే గ్రామ మందుండు దేమి పనికి
నెచటి కేఁగెదు నీదు పేరేమి? చెపుమ! 226

క. అనిన సఖి కనియె "నుండుదు
ననిశంబు కిరాతదేశమందు, హిరణ్యుం
డనఁదగుఁ దన పేరిలఁ బు
ణ్యనదీనిధులెల్లఁ జూచి యరిగెదఁ బురికిన్. 227

చ. అని వచియించు తైర్థికున కా వనజాయతపత్రనేత్ర యి
ట్లను "నవయౌవనంబున రతాస్థఁ దొలంగి కులాబ్జగంధిపైఁ
గనికర మింతలేక తిరుగన్ మనసొగెనటోయి! నీకు?" నా
విని "నిజమౌను నీ పలుకు వేయననేల? వివాహహీనుఁడన్. 228

తే. ఆలి కే నంగలార్చుచు నన్యసతులఁ
జూచి గ్రుక్కిళ్లు మ్రింగుచు సుఖములేని
కతన యాత్రం జరెంచెడి కతయె కాని
మనసు సంభోగవాంఛల మరగి తిరుగు." 229

చ. అను పరదేశికుం గని మహాదరణంబున లేచి కౌఁగిఁటన్
నునుజిగి గబ్బిసిబ్బెపుఁ జనుంగవ నాటఁగఁ జేర్చి మోహముం
జినుకఁగ మోవినొక్కి మరుచివ్వకుఁ దార్చిన వాఁడు పేర్చుచుం
డిన తమిచేతఁ దద్రతికి దీవి సమున్ముఖుఁడై ముదంబునన్. 230

తే. గుబ్బలను నట్టు లూఁతఁగాఁ గొని మనోజ
కేళికావార్ధి లోపల నోలలాడు
చుండె నవ్వేళ దాని నాథుండు వచ్చి
"యెవరువా?" రని ఘర్షించి హెచ్చరింప. 231

క. ఆ సమయంబున నెటువలె
భాసురమతి బొంకవలయుఁ బలుకంగఁగదే!
యో సుదతీ! యని యడిగిన
నాసఖి యిది తెలియదనుచు నటుమొగ మయినన్. 232

తే. హంస హేమావతికి నిట్టులనియె వేడ్కఁ
దెలియకుండిన నేమాయెఁ దెలిసికొనుము
వింటివా? పతి ఘర్షింప విటుఁడు వడఁక
వెఱవకు మటంచుఁ జెలి వాని వెన్నుఁజఱచి. 233

ఉ. కీలెలుఁగున్ ఘటించి పరికింపక పండుక యుండి పల్కె “యా
త్రాలసదుర్విచారులము రాత్రి జనించిన నేఁడు తావకీ
నాలయమందు మేమిదె సుఖాప్తిని సుప్తియొనర్చి రేపుషః
కాలమునందుఁ బోయెదము కారుణికోత్తమ! పండనీయవే!” 234

తే. అనిన “మంచిది” యని లోని కరిగె నాథుఁ
డరిగినది చూచి సఖి లేచి యంతలోనఁ
బంటితో నీళ్లు పట్టుక యింటిలోకిఁ
బోయి “యేడుంటి వీసరి ప్రొద్దు దనుక? 235

క. ఒక్కతెనె గ్రుక్కు మిక్కని
దిక్కెడసిన రీతినుండి తెరువరు లేవరో
యిక్కడకుఁ బండ వచ్చిన
నక్కట! ప్రాణమ్ములుండె నధిపా!” యనినన్. 236

ఆ. నిండినింటిలోన నీకేల భీతిల్ల
గోల! యూరఁ బొద్దు గ్రుంకలే ద
టంచుఁ గౌఁగిలించి యనుమాన మొందక
యోర్పుతో సుఖాప్తి నుండెఁ జెలియ! 237

శా. ఈ లీలన్ వెస బొంక నేర్చిన నృపత్యేకాగ్రచూడామణీ
కేళీసంభ్రమచిత్తవృత్తి సురతక్రీడాచమత్కారచ
ర్యాలాలిత్యకథాప్రయత్నమున కత్యాసక్తి తోఁ బొమ్ము లే
దా, లోలాంబక! యూరకుండు మని కాదంబేంద్రుఁ డిట్లాడఁగన్. 238

చ. తెలతెలవాఱ వచ్చుట సతీమణి యప్పుడు చూచి కేళికా
నిలయముఁ జేరనేగి ధరణీధవుపైఁ దమి మీఱ నుండె నా
చెలి యనుచుం బురోహితుఁడు సెప్పిన నాత్మ జనించు వేడ్క
నా నల నరపాలమౌళి తదనంతరగాథ వచింపుమా! యనన్. 239

శా. [4]రక్ష శ్శిక్షక రక్ష యక్షయ నృపాధ్యక్షా సదాక్షేమ కృ
ద్వక్షా రక్షిత శుభ్రపక్ష హయదార్ఢ్యక్ష్మాఖ్య మద్రారి స
రక్షా యన్యనిలాక్షరాక్షస జలాధ్యక్షాగ్ని వాయుః క్షపా
తృక్షేక్షార్భక పద్మరక్షక రమాధ్యక్షారవిందేక్షణా. 240

పాదభ్రమకకందము. రామానుత తను మారా
ధీ మదవనధీ వర రవ ధీ నను దమ ధీ
తామస జయ యజ సమతా
నామగతాఘ నయతతత యనఘతా గమనా. 241

[5]మణిగణనికరవృత్తము.
హరిహయ పరిణాభ్యదయవ భరణా
హరిహయ హరిణాభ్యదమ విభరణా

నరవర విగమన నవినుత చరణా
నరవర విగమన నవిమల కిరణా. 248

గద్యము.

ఇది శ్రీ మత్కౌండిన్యస గోత్ర పవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధి
పూర్ణిమా చంద్ర నిస్సహాయ కవిత్వ నిర్మాణ చాతుర్య నిస్తంద్ర
శ్రీరామనామ పారాయణ నారాయణామాత్య ప్రణీతంబైన
హంసవింశతి యను మహా ప్రబంధమునందుఁ
జతుర్థాశ్వాసము.

—: o :—

[1] ఈ చరణము చెడినది.
[2] ఈ కవి ద్రుతాంతముగనే వాడును
[3] పుష్కరణి తప్పు : పుష్కరిణి ఒప్పు
[4] ఈ పద్యము వ్రాయసగాండ్ర చేతులలోఁ బడి చెడి యిట్లున్నది.
[5] ఈ పద్యపు పూర్వార్ధమున ఛందోభంగము

# పంచమాశ్వాసము

శ్రీధర! ధరధర! వరధా
రాధర నిభవర్ణ! సమదరావణ మకుట
క్ష్మాధర చరశర! విబుధా
బాధిత! కరుణాభిరామ! రఘుకులసోమా! 1

వ. అవధరింపుము. నలరాజన్యునకుఁ బ్రత్యుత్పన్నమతి యిట్లనియె, అట్లు ప్రభాతంబుగా
వచ్చిన నిజమందిరంబు చేరి మఱునాఁడు దినాంతంబయిన యనంతరంబ
హేమవతికాంత యత్యంత సంతోషంబున. 2

సీ. నిటలాధరీకృత స్ఫుట చంద్రకళ లీల
నెలవంక నామంబు నీటుగులుక
మరుదాప్తి రేఖగా నెరయు పద్మరజంబు
వలె వక్త్రఘనసార తిలక మమర
నంతస్స్థ నృపవిరహాగ్ని పైఁబర్వివ
గతి గుబ్బఁ గుంకుమ కలప మలరఁ
జిగిరించి పూచిన చిన్నారి లతరీతిఁ
జిత్రపట్టాంబర గాత్ర మమరఁ

తే. గనక సుమదామ ఘుమఘుమల్ కచములందుఁ
గంబురాపూత భుగభుగల్ గళమునందు
నంద మొందంగ వాసింప హంసమున్న
నెలవునకుఁజేరె సాతాని యలరుఁబోఁడి. 3

తే. చేరినప్పుడె కలహంస శేఖరుండు
తివిరి హేమవతీకాంత దిక్కు జూచి
వేడుకలరంగ నొకగాథ వింటివేని
చెప్పెద నటన్న మంచిది చెప్పుమనిన. 4

వ. హేమావతికి హంసం బిట్లనియె. 5

## పదునేడవ రాత్రి కథ

### కుమ్మరిగుమ్మ సాలెవానిఁ గూడుట

క. పరఁగు నొక పురము రత్నా
భరణంబనఁ దరణకిరణ పటలీ సంరో
ధ్యురు సౌధస్థిర కేతూ
త్కర చిత్రపటాంశు చిత్రిత ద్యుతలంబై. 6

తే. తనయుఁడగు రాజు ఘనమార్గమునను రాఁగఁ
గోట యాత్రోవ నరికట్టుకొన్న సుద్ది
విని జలధి దానిచుట్టును విడిసె ననఁగ

నారసాతల నిమ్న ఖేయంబు దనరు. 7

ఉ. అందొక కుంభకారక మహాన్వయమండల దుగ్ధవార్ధి పూ
ర్ణేందుఁడు చక్రదాసుఁడన నెన్నిక కెక్కిన పేరుగల్గి చె
న్నందు మనోహరాంగ రుచిరాకృతి సంపదచేత నిందిరా
నందనుఁడే యితండగు ననందగి కాపురముండు నెప్పుడున్. 8

ఆ. సలుప కడవ రాయి సారె కలాసంబు
కట్టె యిసుము జల్లి కడవ ముల్లు
మంటిముంత గుబ్బమ్రాను నావంబును
మన్ను మోయఁ బోతు మలయుచుండు. 9

## కుమ్మరి - పరిశ్రమ

సీ. ఆదివరాహంబు మేదిని నెత్తిన
మాడ్కి చొప్పడఁగఁ దా మన్ను మోయుఁ
బ్రథమవేళల సృష్టి బ్రహ్మ చేసిన యట్లు
ఘటకోటు లుత్సాహగరిమఁ జేయు
విష్ణువు చక్రంబు వేడుకఁ ద్రిప్పెడు
చాడ్పునఁ బలుమాఱు సారెఁద్రిప్పు
బయలి పురంబులు భర్గుండు గాల్చిన
డంబు సూపట్ట నావంబుఁ గాల్చుఁ

తే. గపివరుఁడు పర్వతంబులు గమిచితెచ్చి
కుప్పలిడురీతిఁ గుండలు కుప్పవెట్టు
నవి దివియు ధాతకాండంబు లడఁచు సరణి
సాధుపథవర్తి ఘటకార చక్రవర్తి. 10

తే. కాఁగు మజ్జిగ ముంతయుఁ గడవ గూన
బాన వెసలయు బుడిగెలు పరపు చట్టి
కడవ ముంత కరిగె దుత్త పిడత గురిగి
కుందె లటికయు మూఁకుడు బిందె ప్రమిద. 11

చ. చెవులపెనంబు గోలమును జిల్లుల సిబ్బియు దోని తొట్టియున్
గువిచిలుమూఁత మాలయును గుమ్మెత యందపు ధూమపాత్రయున్
సవరని బూద పెందొనయు సానికె యొప్పు కమండలంబు వే
డొవతెవ కంబి దుత్త నెరడుల్చియుఁ గప్పెరపంటు లాదిగన్. 12

తే. తీనెపూజలు కులుకులు త్రేటగట్లు
గరల మురువులు పడికట్లు కిరుదుకట్లు
బొద్దుటీనెలు నునుపులు మొదలు గాఁగఁ
బనులు నిర్మించుఁ గుండలపై నతండు. 13

సి. దేవకార్యములకుఁ దిరునాళ్లకును మహో
త్సవములకును గంగజాతరలకు
సంప్రోక్షణములకు జన్నములకుఁ బెండ్లి
వడుగు నోములకును వ్రతములకును

సత్త్రంబులకు సహస్రంబులకును సమా
రాధన పితృకార్యయూథములకుఁ
బండుగులకు నాలపంబులకును బొంగ
లికిని దేవరకు గొబ్బికిని నడరు

తే. జంగమార్చనలకు బాల[1]దాస భోజ
నములకును దండువెట్టికి నగరివారి
కొండ బక్కలకును భిక్షుకులకు నైనఁ
గొఱఁత వడకుండఁ గుండ లాకుమ్మరిచ్చు. 14

క. ఒకపాటి కలిమిచేతను
గకపిక పడ కప్పులేక కనకాభరణాం
శుకముల గరగరికల నిం
చుక తక్కువగాక యతఁడు సుఖమున నుండున్. 15

క. ఆతని కొక్క కులాంగన
శీతాంశునిభాస్య రూపసేనాఖ్యను వి
ఖ్యాతిని వెలయును గంతుని
చేతి జగా బాఁకనంగ జిగిబిగి వగతోన్. 16

ఆ. ఘనము ఘనము కన్నఁ గచనైల్యవిస్ఫూర్తి
మెఱుఁగు మెఱుఁగుకన్న మేనిచాయ
విపుల విపులకన్న నుపమింపఁ గటితటి
దాని కెనయె భూమిలోని సఖులు? 17

ఉ. పోకల రీతినొంది మెఱుపుల్ గొని మిట్టలు గట్టి పై మొనల్
జోకగఁదీసి తాళముల చొప్పునఁ గన్పడి చెండ్లవైఖరిన్
దీకొని యొప్పి గిండ్లపగిదిన్ గొమరొప్పఁ బసిండికుండలై
వీకను దండనుండి యళివేణికుచంబులు పొల్చు నెంతయున్. 18

ఉ. పంచశరాహితుండికుఁడు భామిని పొక్కిలిపెట్టెలోనఁ దా
నుంచిన కాలసర్పము సమున్నతి నాడఁగ లేవమీఱ బు
స్సంచు ఫణాగ్ర మెత్తి యలరారెడు చాడ్పున రోమరాజి య
భ్యంచితలీల మించి మది హర్షముఁ జేయు జనాళి కెప్పుడున్. 19

సీ. చంద్రభాగ నిరూఢి సతిమోము రాణించు
నెఱికొప్పు కృష్ణవేణి గతిఁ గాంచు
నువిద వాల్గనుదోయి యుత్పలావళి నొంచు
సకియపల్కులు సరస్వతిని మించు
శంఖవర్ణారూఢి సఖిగళంబు జయించు
నవ్వులు క్షీరసుందరత మించు
స్తనము లుత్తుంగభద్రసులీల దర్పించు
నారు నీలాకృతి నందగించు

తే. జఘనము విశాలహేలల సంభ్రమించుఁ
బదయుగము పల్లవాకార మద మడంచు
నడలు హంసావళీఖ్యాతిఁ గడు వహించు

నంగము హిరణ్యాకళలతో నతిశయించు. 20

క. తమ్ములు చెలికరములు కుం
దమ్ములు పలువరుస పర్వతమ్ములు బలుచం
దమ్ములు చన్నులు తొవలం
దమ్ములు కను లలక లంబుదమ్ములు పొగడన్. 21

చ. హరివరకాంచనాబ్జకమలాళిఘనాకృతులందు టెంత య
బ్బురము పటూక్తి నాస గళముం గరముల్ కుచయుగ్మ మంచు న
త్తెఱవ సుమధ్య దేహ ముఖ దృక్తతి కుంతల కేశపాశముల్
హరివర కాంచనాబ్జ కమలాళి ఘనాకృతులందు నిచ్చలున్. 22

ఉ. దాని మిటారి సోయగపు దట్టపుమోహము లూరు చూపులున్
దాని కచంపు సొంపు వగఁదాల్చిన చాయల రాయడించుకన్
దాని రసోక్తు లాకుల మనంబుఁ గనుంగొని లోనుగాని య
మ్మానవుఁ డెందులేఁడు వినుమా! యనుమానము మాని మానినీ! 23

చ. అది నెఱప్రాయపున్ సొగసుదొట నొకానొకటైన గర్భముం
బొదలని దొట నింటి యెనుబోఁతునకంటె మదంబు హెచ్చి నె
మ్మది పరసంగమంబునకు మార్కొని సొక్కఁగ జార వీరులన్
వదలక చూచుచుండఁ దలవాకిలి కాఁపురమయ్యె దానికిన్. 24

క. చిటిపొటి సొమ్ములు వెట్టుక
పుటపుటగా వీధివెంటఁ బొరుగిండ్ల బడిన్
విటుల నిమిత్తము మట్టెలు
చిటుకు చిటుక్కనఁగఁ దిరుగు సిస్తగు వగతోన్. 25

సీ. జేజేల రారాల జిగిఁగ్రాలు నిడువాలు
కురులు వేమఱు దువ్వి కొప్పువెట్టు
బలువాలుగల నేలు తెలిడాలు గల మేలు
కనుల రేఖలఁ దీర్చుఁ గజ్జలంబు
కపురంపు రుచిఁ బెంపు కడునింపుఁ దులకింపు ‘
పెదవిపైఁ గెంపెక్క విడెము సేయు
వలసిబ్బెముల గుబ్బలుల నిబ్బరపు గుబ్బ
చనులఁ బూయును మంచి చందనమ్ము

తే. మంగళాభంగ రంగద్రథాంగ వృత్త
ఘన జమనసీమ సవరించుఁ గలువచెలువు
నలవరుచు నల్లనైన దువ్వలువ మెఱయఁ
జిత్తజుని దాడి కుమ్మర చిగురుఁబోఁడి. 26

సీ. తరితీపువగలు బిత్తరపుఁజూపులు మోవి
విఱుపులు సొలపులు వింతమాట
లుదుటు చొకాటంపుటొయ్యారిచేష్టలు
సోబాన పాటలు సొగసు గుల్కు
పొగరు వికావిక నగవులు బెళకించు
కనుసన్న నేర్పులు కలికి కతలు

సామెతల్ చిన్నెలు జానతనంబులు
తెచ్చికో ల్మురువులు తేటపడని

తే. జంకెనలు ఱొమ్ముతాటింపు సాహసములు
పచ్చి తేరఁగఁ బల్కెడు ముచ్చటలును
విటులఁ గనుఁగొన్న వేళల విస్తరించు
రూఢిమించిన తమితోన రూపసేన. 27

క. ఈ లాగునఁ జెలి పల్లవ
జాలచకోరముల కెల్లఁ జంద్రోదయమై
చాల విహరించుచుండెడు
కాలమ్మున నొక్కనాటి కడయామమునన్. 28

మ. పరఁగం గూలిన యిండ్లు వెళ్లు గరిసెల్ పల్లేరు లుమ్మెత్తలున్
జిఱిపెంకుల్ చిగిరింతలున్ గునుకలున్ జిల్లేడులున్ మూషికో
త్కరముల్ దున్నిన పెంటదిబ్బలును నక్కల్ పందికొక్కుల్ దరుల్
దొరుఁగన్ బూడిన పాఁతఱల్ పడిన గుళ్ళున్ గల్గు పాడూరిలోన్. 29

ఉ. లాడికి మూఁగు కాకులఁ బలాయన మొందఁగఁ జేయ వీఁపుపైఁ
ద్రాడున వ్రేలు నీఁ కెగుది తాపిన దేహము పేఁడి కాళ్ళకున్
రోడి నశించు తోఁక బలు రోమము లంటిన జోరుటీఁగలున్
గూడిన బంధముం గలిగి కూర్కుచు నుండొక బక్క గుజ్జమున్. 30

తే. మందగుది రిప్ప గొరి సేలు మక్కి రొళ్ళు
బరతుమురు కొమ్ములును దోటు బర్ల తడక
వాటు తెఱడొక్క మిడితోఁక వేటుగాళ్లు
నేరు ద్రోసిన యొక బీద యెద్దుఁ జేరి. 31

వ. అందు పసించియున్న సమయంబున. 32

చ. నలువగు తుంకి చేవనఁ గనంబడు కొమ్ములు వింత చింత ని
ప్పుల సరివచ్చు కన్నుఁగవ పోసరమున్ మెడ ముద్ద ప్రక్కలున్
దెలుపులరాలు లావు పొలతిందగు (?) పాదము లుక్కుపోఁత సం
ధిలిన విధాన నుండు బలు దేహము గల్గిన పోతు వచ్చినన్. 33

ఉ. చేరి, “శుభంబె? ఘోటకమ! శ్రీకరమే! వృషభంబ! మీర లీ
తీరున డస్సియుండు కథఁ దెల్పుఁ” డటంచును బోతు వేఁడ, “వే
సారక విన్ము చెప్పెదను సైరిభవర్య! మదీయ గాథ” యం
చారసి యార్తిఁ గ్రుంకుచు వృషాగ్రణి పోతును జూచి యిట్లనున్. 34

సీ. తలయేరుఁ బెట్టి బీడులు దున్ని పడఁగొట్టి
గాలు చిక్కిన బండ్లఁ గట్టి మొత్తి
పొలముకాండ్లకుఁ ఱంచి తలదిమ్ము పట్టించి “
పట్టుడు కవిలెలఁ బదనుఁ జెఱచి
పాపనమ్ములఁ జిక్కుపఱచియు రెండేసి
గొర్లకాఁడి నమర్చి గొట్టు చేసి
బలు గుంటకల చేను పాయుచో, సాగని
తావుల సెలకోల దాఁక మొత్తి

తే. గానుగలఁ ద్రిప్పి సరువళఁ గలఁచి బంతి
దుడ్డు బరువెత్తి యెకిరింత దోలి యొడలు
గళ్ళుపడి రెండు దుక్కులు వెళ్ళ దున్ని
యట్టు గడిగి పోఁ దోల నిట్లైతిఁ జుమ్మి! 35

క. అన విని తలఁ దిప్పెను బో
తనియె "మహోక్షంబ! కష్ట మనుభవమయ్యెన్
వనజభవు వ్రాఁతఁ గడవఁగ
మన తరమా?" యనుచు వగచి మహిషము హరితోన్. 36

తే. నీవు హరిరీతి గంధర్వ నిచయమెల్లఁ
గొలువ దేవమణీ చక్రములు వహించి
విబుధుల భరింపుచుండెడు విధము లెల్లఁ
దొలఁగి చిక్కితి విటులేల తెలుపు మనిన. 37

వ. తురంగంబు మహిషంబున కిట్లనియె. 38

క. ఆనాఁటి కటుల నుండితి
నీనాఁటికి నిటుల నయితి నేమందు నయో!
లేనాఁటి మేని సత్తువ
లేనాటికిఁ గలవె? విను చరించిన విధమున్. 39

సీ. ప్రేమ నెదుర్కోలు పెండ్లివారల కిచ్చి
తెవులైన వారి కద్దెలకు నొసంగి
మేయఁబోయిన చోట మెడవెండ్రుకలు వట్టి
యాకతాయలును వాహ్యాళిఁ దోలి
సారె గృహప్రవేశమువారి నెక్కించి
సంత సారెకులందు స్వారి వెడలి
పల్లె పట్రలనుంచి బర్వు వేసుక వచ్చి
వలసల చేకంట్లముల ఘటించి

తే. తీఱకున్నట్టి కష్టసంసారమునకుఁ
గసవుకట్టెల లద్దుల గాసి పఱచి
లావు సత్తువ చెడఁగొట్టి లాఁడె పోవఁ
జేసి తోలిన నిటకు విచ్చేసినాఁడ. 40

చ. గొఱపము చెడ్డయొట్టు చలి గొట్టినచోఁ గవణంబు కల్ల మే
నఱసిన మాదమాఱ జలమార్చుట యెన్నడు కాని వావి యే
తఱిఁ గలలోననున్ బడెఁడుదాణ యెఱుంగను బేదదంటు ముం
దరఁ బడవేసి యెడ్లకడ దామెనత్రాడునఁ గాలు గట్టినన్. 41

తే. ఎడ్లు పోట్లాడి కొమ్ముల నెత్తివేయ
గేదె లొక దిక్కు సెలఁగఁగఁ గ్రేపుఁదల్లు
లాస్థఁ దన్నంగ నమ్మహావస్థచేత
గోడిగై పుట్టియును గోడు గుడువవలసె. 42

## గడ్డి రకములు

సీ. పిల్లపీఁచర నక్కపీఁ చెల్కచెవి గొఱ్ఱె
పాలలంబును మేక పాలలంబు
బుడ్డకాసర యుట్లబొద్ది దొంతరలంబు
మాడుపు గురుగును మదనకట్టె
నూనెముంతలమును నానఁబ్రాలలమును
గొండగురుగు పాలపెండలంబు
పొర్లుగాడియు నల్లపూలల మిసుక చెం
చలి కందికారము గిలకలంబు

తే. కన్నెకొమ రెద్దుమట్టాకు వెన్న వెదురు
లంజెసవరము వెఱ్ఱి పూ[2]లలము చిట్టి
బొట్టలము గొల్లగొండియుఁ గట్టలంబు
నల్లతీఁగాది యలములు సళ్ల విడిచి. 43

తే. కనుము లీడని కోరికె కాకివెదురు
దర్భ చిగిరింత గోరిగె దాడయంబు
జంబు నూదర తుంగ పెన్ జంబు పెద్ద
తుంగ భోజవతియు నక్కతోక విడిచి. 44

సీ. కాచిగోగడ నెల్లికాచి బూడెడ తోల
కాచి పండెడ గొల్లగడ్డి యూల
ముల్లూపు చెంగాయ మల్లయ కరివెల
యెఱగొయ్యి వెఱుతురు మెఱుఁగుగడ్డి
గంప దొల్లొకకొమ్ము కారెపోతర ముల్లు
వట్రింత కదురు కార్వాకు చిత్ర
కదురు బూతరాకాసి పిచ్చుక మియ్యు
మశ్మరి వెర్లి చేమర్లు గునుక

తే. చీమచిప్పర చిప్పర చేతిబోద
పుట్టగడ్డుట్ల చిప్పర పూడు కసవు
పొలికె పెనుకెడ కుందేటి పొరుజు గఱిక
పరికి సాళువ సొంబెకుందురు గొలిమిడి. 45

వ. మఱియును. 46

తే. వేరు తొణ్ణంగి తొండును వెల్లి మూరు
తోప రిట్రింత యెద్దుకొమ్ముప్పి గడ్డి
పుల్ల పూరూచయును బూద పూలగడ్డి
కచురు తుంగాకు తుంగలుఁ గలయ విడిచి. 47

ఉ. చిక్కులమారి యా బలిజసెట్టి వయాళులఁ గట్టె బర్వులన్
సుక్కెడలంగఁ గొట్టి తన సుందరిచేతికి గడ్డికోసమై
చెక్కుడుపాఱ యీయఁ బడిసేటది చక్కని కోడెకాండ్రపైఁ
బ్రక్కల వ్రాలి సోలి నగుబాటునకళ్కక సంజె చీఁకటిన్. 48

తే. దాసకపువాండ్రు లద్దిలోఁ దలఁగఁ దీసి
దిబ్బలను వ్రేయఁ జెడుగత్తు గబ్బుగడ్డి

గంపలో వేసికొని వచ్చి చంపఁజాలు
పూనికను గ్రమ్ముకొని నామొగాన వైచు. 49

క. విను సూపెచర్య కినుమడి
గొనకొని కావించు దానికోడలి నడతల్
కనికని వేసారితి హె
చ్చెను బాపఁపుఁగాల మనుచుఁ జెప్పెడు వేళన్. 50

## గాలి - వాన

సీ. చండవేగోత్థ భూమండల ధూళ్యాప్తి
పంకీకృతాభ్ర కూలంకషాంభ
మభ్రోత్పతద్వృష ద్వ్యాఘాత భగ్నధా
త్రండక్షర ద్బాహ్యకాండకాండ
ముద్రిభిత్కేల్యట వ్యగ్ర భాగద్రాక్కృ
త ప్రోద్ధుతక్షమాస్థ క్షమాజ
ముగ్రత్రిపుర ధీకృదుగ్ర త్వరోద్ధుత
ద్యోవీర్యటద్ధరిత్ర్యున్నత పుర

తే. ముద్ధుతాబ్ధి ప్రద ప్రోదినీద్ధ వార్మి
హుర్ముహుర్హతి నిపతద్భుహూరుచక్ర
వాళమద్ర్యశ్మపూరితవార్ధి వీచె
భయదగతి నొక్క ఝంఝాప్రభంజనంబు. 51

మ. వరుణాశాగతమారుతోద్ధతశిలావ్రాతాహతిద్రాగ్గళ
త్తరళద్యోపతనాతిభీతిభరితాంతబ్రహ్మదత్తార్జునో
త్కరముత్స్రస్తరముఖ్యవస్తుఘటితస్తంభభ్రమాపాదిభీ
కరవాతోత్థధరాపరాగవలయౌఘమ్ముల్ దనర్చె న్మహిన్. 52

వ. మఱియు నవ్వాయువు శోషితసింధురాజంబును గర్జవిస్ఫాటనంబును గావున ధనంజయపరాక్రమంబును నష్టకబంధనంబును బలాశివిజయంబును గావున దాశరథిప్రతాపంబును ఖగరాజమానభంగంబును శైలబలఘాతియుఁ గావున మహేంద్రవిక్రమంబు ననుకరించె నంత. 53

ఉ. భేక శుభప్రదం బనలభీమ మనేకప ఘోణికాసరా
నీక శరీరతాపహ మనీర తటాక నదీనదాది నీ
రాకర హర్షకారణ మహఃపతి దీప్తి నిరోధికంధరా
లోకన హృష్ట భీత శిఖిలోక మరాళము సోన దోచినన్. 54

చ. జలదము నీలిచల్లడము శక్ర శరాసనమొప్పుకాసె ధా
రలు తెలిజిల్లుపేరు బకరాజి వహించిన బూదిపూఁత ల
గ్గలపు మెఱుంగు లాయుధపుఁ గాంతులు గర్జిత గర్జలొప్పఁగాఁ
దొలకరి వీరముష్టి కడుఁద్రొక్కె నభస్స్థల పణ్య వీథికన్. 55

సీ. ఆకాశ కరికుథంబై యొప్పు మొకమాలు
కాల కువిందోత్థ నీల పటము
మిహిరాంగనాభంగ మేచకోల్లాభంబు

కకుబంగనా నీల కంబళంబు
కమలజాండ భ్రాష్ట్రగత మషీవ్రాతంబు
ద్యుమణి దీపోత్థిత ధూమచయము
నడిమిలోకము ఁజేని నల్లపట్టు గుడారు
ప్రకృతి కస్తూరికాపంకచర్చ

తే. యనుచు జగముల జనములు వినుతి సేయ
నీల కాకోల కలకంఠ నీలకంఠ
కజ్జల ప్రజ్వల న్నీలకంఠకంఠ
ఖంజరీటాభ ఘనమనాఘనము నెరసె. 56

మ. తగఁ దేజంబను బల్పిరంగి జలధృత్సంఘంబు మందుంచి పొం
దుగ శంబంబను గుండువేసి పటువిద్యుద్వహ్నిచే భ్రాష్ట్రి మం
టఁగఁ గాలంబను యంత్రకారకుఁడు చూడన్ మ్రోయు నామ్రోఁతలై
జగముల్ కంపమునొంద మ్రొసె ఘనముల్ సంభీషణాహంకృతిన్. 57

సీ. వనదాంజనగ్రావమునఁ గనచ్ఛోణాంశు
వితతిగళత్సుధాప్రతతు లనఁగ
జలదపూర్ణాజాండ జలరాశితట మరు
చ్చలితవిద్రుమలతాచయ మనంగ
నమరులకడ వినోదము చూపు సమయమాం
త్రికు నేర వెడ లగ్నిదీప్తు లనఁగ
ధారాధరాహ్వాయవారణేంద్రమదారు
ణేక్షణాంచలకాంతు లెసఁగె ననఁగ

తే. ఘనఘనాఘనగహనసంఘాతములను
గర్జితధ్వానములు మ్రోయఁగా రహించు
దావపావళకీల లందంద పర్వె
ననఁగ దళుకొత్తెఁ జంచల లభ్రసరణి 58

సీ. బిబిబిబి ద్దరగర ద్భేకభీమధ్వని
వివిధజంతుశ్రేణిఁ జెవుడుపఱుప
ధిగధిగ ద్ఘృణిగణదేదీప్యవిద్యుచ్ఛ
టల నిశల్ పవలట్ల వెలుఁగుచుండఁ
బెటపెటార్భటి రటచ్చటులాభ్రనిర్ఘోష
ముల ముజ్జగమువార లులికిపడఁగ
ఘుమఘుమారావ సంకులకులాచలకుభృ
త్కుహరానిలముల దిక్కోటు లురుల

తే. ఖిటఖిట యటంచుఁ గరక లుత్కటలురాల
నిగనిగద్యుతి మేఘముల్ నింగి నెరయ
ఫళఫళ పయఃపృషత్పరంపరలు గవియ
ఝోరు ఝోరున దారుణాసార మడరె. 59

క. పటుధాటీరటదుత్కట
పటహాలటహ కోటరములు పాటిలినటులన్
నెటనెట పటపట వెటవెట

పిటపిట చటులార్భటులను బిడుగులు పడియెన్. 60

వ. అప్పుడు. 61

సీ. గగనమండల భద్ర కాయమానంబున
ఘనపంక్తులను మేలుకట్లు కట్టి
ధరణి వేదిక మీఁదఁ గరళానికాయ మౌ
క్తికముల రంగవల్లికలు దీర్చి
ఘనఘోష భేరికాధ్వనులు బర్హిణగళ
ధ్వానకాహళ నినాదములు మ్రోయఁ
దెగని మెఱుంగుల దివ్వటీలు చెలంగ
ద్విజరాజమంత్రముల్ విస్తరిల్ల

తే. వృష్టి గజరాజగామినీవిభుఁడు సమయ
పురుషుఁ డయ్యెడ నిమ్నగాపుత్రికలను
గాంచి పెంచి ప్రమోదంబు గడలుకొనఁగఁ
బరిణయమొనర్చె శరధికి భవశరధికి. 62

తే. అప్పు డవ్వానకొట్టున నళికి యులికి
పడిన గోడలు నొరుగు కంబముల పట్లు
వదలి కూలిన గోపురావళులు గల్గు
పాడుగుడిలోని కెనుబోతు పఱచి నిలిచె. 63

క. అంతట వర్షము నిలిచె ది
నాంతము జనియించెఁ గజ్జలాభ్థర తమాలా
శ్రాంతరుచి పర్వె నెల్లెడ
సంతమసము చుక్కలమరె సత్పథవీథిన్. 64

క. ఎనుబోతు నపుడు కుమ్మరి
తన యింటికి రాకయున్నఁ దత్పుర మందున్
వనముల వంకల డొంకలఁ
గనుగొనుచున్ వచ్చివచ్చి కని యచ్చోటన్. 65

ఉ. లంపులమారిదాన! నిను లాచుక మాదిగవాఁడు గోయ, వే
కొంపకుఁ బొమ్మటంచు మిణుగుర్లు జనింపఁగఁ బండ్లుదీటి మై
కంపముపుట్టఁ జేగుదియకట్టెను దిట్టుచుఁ గొట్టఁ బోతు బల్
గుంపెన నింటికై చనినఁ గుమ్మరి గాఁడినిగట్టెఁ గట్టినన్. 66

తే. కట్టు విడువకుమని చెప్పి కాంతతోడ
రేయి యొకరీతిఁ గడపి యా రేపకడను
గుమ్మ రయ్యూరిపల్లెలఁ గుండలమ్మ
వెడలఁ దద్భార్య జాతుల వెదకుచుండె. 67

ఉ. సారణ నామధేయుఁ డొక సాలియవాఁడు మనోజ్ఞమూర్తి కా
శ్మీర ధరిత్రినుండి యల సింధువసుంధరఁ జేరఁ బోవఁగా
దారిని రాఁగ రాగమునఁ దప్పక యాతని దిక్కు చూచి, “యే
యూ? రెటకేఁగె? దేమి పని? యున్న తెఱంగెఱిఁగింపుమా!” యనన్. 68

తే. అతడు దాని నెగాదిగ నరసి చూచి
దుడ్డె గట్టిది పనిలేక తొల్త దాని
పిలిచె నిది పాట్లమారి గావలె నటంచుఁ
జేరి తన పేరు పురి పేరు చెప్పి నిలిచి. 69

సీ. దప్పి కిమ్మన మతి దప్పినదా? యనుఁ
జెంబు దెమ్మనిన్న గుచంబె? యనును
గూరఁ బెట్టుమనఁ జేకూఱెనా? హిత మను
నన్న మడిగిన నధ్వాన్న మనును
సున్న మిమ్మన్నఁ గూసున్న మేలనుఁ బోక
వక్కలేవన్న గుర్వక్కె యనును
నిప్పని పలుకఁగా నిప్పనికని యను
నాకిమ్మనిన మసియాకె యనును

తే. దేహ మలసె నటన్న సందేహమా? య
టంచు నిల్లేపురేఁగి యమ్మించుఁబోడి
యతని మాటల కరమాట లాడుకొనుచుఁ
గేరి నవ్వినఁ జూచి యా సారణుండు. 70

క. నెఱమాటలఁ గోడిగముల
నరమాటల జాణతనము లతిచతురతలన్
బరిహాసంబుల నీసరి
పెఱకాయపు సతులు లేరు బిసరుహగంధీ! 71

వ. అని పలికి యత. 72

ఉ. కొమ్మరొ! ప్రొద్దుగుంకె నెటకుం జనలేను బరుండ నింత చో
టిమ్మని పల్కరింపఁ దరళేక్షణ మంచి దటంచు నవ్వుచున్
రమ్మని చేరఁబిల్చి యరరమ్మొగి మూసి గడెన్ గదించి మో
దమ్మున రెట్టఁబట్టికొని దర్పకు కేళికి సంభ్రమించినన్. 73

తే. అతఁడు సురతాభిలాష సంగతుఁడుగాన
మంచిదని సమ్మతించిన మమత తోడఁ
గ్రుచ్చి కౌగిఁటఁ జేర్చుక కుచములొత్తి
యెనసి మదనరణక్రీడఁ బెనఁగులాడ. 74

ఉ. అంతట దానిభర్త నిలయాంగణసీమకు వచ్చి నిల్చి య
య్యింతిని దల్పుదీయుమని యెంతయు ఘర్షణతోడఁ బిల్చినం
జింత యొకింతలేక యల చేడియ యేగతి బొంకుఁ? జెప్పు మో
కాంత! యటంచు నంచ యడుగన్ విని యాబిడ యూర్పు సంధిలన్. 75

తే. తెలియ దెటువలె బొంకునో జలజగర్భ
వీతిరత్నమ! చిక్కులు పెట్టనేల?
చెప్పినను జెప్పు మిక్కథఁ జిత్త మలర
వినియెద నటన్న రాయంచవిభుఁడు పలికె. 76

చ. అటువలె భర్త పిల్చిన భయంబున జారుఁడు కంప మొంద నా
కుటిల సుకుంత లయ్యెడను గొబ్బున వాని భయంబు వాపి యు

త్కటధృతి సైరిభంబు మెడఁ గట్టిన త్రాడు వదల్చి దైవమా!
కటకట! యెట్లు సంగతముగా నెనుఁబోతును గల్గఁ జేసితే! 77

తే. గాఁడిపట్టున నిల్వదు కట్టివేయఁ
దరము గాదంచు వాకిలిఁ దెఱచి "పోతు
వెడలి పొయ్యాని వాకిలి వేయు" మంచు
మగనితోఁ జెప్పి యా దిట్ట మమత పుట్ట. 78

తే. ఈ దయానిధి వీథిలో నేఁగుచుండఁ
బిలిచి తోడ్తెచ్చితిని మెడఁదలుగుఁ బెట్టి
వింత మానిసిఁ గని కట్టివేయ నీక
యురుకఁగాఁ దల్పు వేసితి నోయి రమణ! 79

క. అని చెప్పి మగనిచే జా
రుని నుతి సేయించి వారిరుహముఖియు విభుం
డును దొంటి రీతి నుండిరి
యని యంచ వచించునెడ నిశాంతంబయ్యెన్. 80

చ. పొనపొన నిద్రమబ్బునఁ బ్రఫుల్లసరోజదళాయతాక్షి మె
ల్లన నృపమోహతాపమునఁ లంపటతోఁ జనె నంచ దెల్పఁ దా
వినిన కథాచమత్కృతికి వేమఱు నౌదల యూఁచికొంచు హా
యనుచు నిడూర్పు పుచ్చుచు నయారె యటంచును బోయె నింటికిన్. 81

తే. పోయి యభ్రంకషంబైన చాయ లొలుకు
కలువరాఱాల కళుకు లోపల రహించు
తళుకు మగరాల గోడలుగల సుపాణి
మేటి క్రొమ్ముత్తియపు ఱాతిమేడలోన. 82

చ. పఱుపు పరంగి పోషుగల బంగరుమంచముపై వసించి భా
స్కరుఁ డుదయింప నూడిగపుఁ గామిని లేపఁగ నిద్ర లేచి త
త్తరకరుఁ డస్తమించు దనుకా నొకరీతి మెలంగి చీఁకటుల్
నెరసిన పిమ్మటన్ నలిననేత్ర మహిపతిమీఁది కోరికన్. 83

ఉ. రాలు మెరాలు వాలు సవరాలు మెఱుంగుల నూపురాలు వ
జ్రాలసరాలు మేలు బవరాలు వరాల జిరాలు తూలు హా
రాలు తురాలు ముంగయి మురాలు తతాల సిరాలు సందితో
రా లుదుటుంగరాలు జిగిరాలఁగ నా జవరాలు దా ల్చొగిన్. 84

సీ. చీర కుచ్చులు నేల జీరకుండఁగఁ బట్టు
కాని పార్శ్వముల సఖీజనము నడువఁ
బాదుకల్ మెట్టిరాఁ బదిల మం చుడిగంపు
టింతులు కైదండ లిచ్చి కొలువ
మనవుల కని చెలుల్ గునుకు పర్వున వచ్చి
మొగ తెఱకట్టుతో ముచ్చటాడఁ
బ్రొద్దుననే పనుల్ పూని చేయుద మంచు
బోనకత్తెలు వేగిరాన రాఁగఁ

తే. ద్వరితగతి నిండ్లకుఁ జనంగఁ దమకుఁ దమకు

సెల నొసఁగు మంచుఁ బాటలు సెప్పు విప్ర
యోష లేతేర నొయ్యార ముట్టిపడఁగ
వచ్చి నిల్చిన రాయంచ మెచ్చి యపుడు. 85

సీ. సొగసు మిటారంబు సొంపు నొయ్యారంబు
నీటు జగ్గుఁదనంబు నెఱతనంబు
సొబగు నాగరికంబు చొక్కాటమును డెక్కు
గరగరికతనంబు ఘనత నడత
హొయలు చక్కఁదనంబు నొసపరి నెఱిఠీవి
సవరణ చెలువంబు సరసరీతి
హౌసు చమత్కార మారజంబును నేర్పు
గహ్వారంబును (?) నాయకంబు వన్నె

తే. సిస్తు జిగిబిగి వగబాగు చిన్న యొప్పు
పేరు నాణెంబు మురిపెంబు పెద్దతనము
కులుకు ప్రౌఢత్వ మభినుతి గొనబు నెలవు
నడత యిట్లుండ వలదె? హా! యనుచుఁ బలికె. 86

వ. ఇవ్విధంబునఁ దనుమెచ్చి పలికిన రాయంచం జూచి హేమావతి యిట్లనియె. 87

క. తురగము వృషభముతోఁ దన
తెఱఁగెన్నుచుఁ దనకుఁ గసవు దేని చెలిని ద
ద్వర సుతు సతి నెంచెఁ గదా!
యెఱిఁగింపుము దాని చర్య లెట్టివొ యనినన్. 88

ఆ. అంచ మించుఁబోఁడి యాననం బీక్షించి
యడుగవలయు నిట్టు లడిగినపుడు
చెప్పకున్నఁ దనదు శేముషి యది యేల
యనుచు నిట్టు లనియె నాదరమున. 89

## పదునెనిమిదవ రాత్రి కథ

### అత్త కోడండ్రు ఉపపతులఁ గూడుట

శా. శ్రీరామంబను నొక్క పట్టణము ధాత్రిన్ మించుఁ జంచన్మణీ
సౌధస్తోమ వధూముఖేందు మృణి సంస్పర్శస్రవ త్స్వచ్ఛ తా
రాధీశాశ్మ పయఃపృషచ్చయ విధూతాకాశ కూలంకషా
సాధూత్తుంగ తటీ మునీశ్వర తపస్సంజాత సంతాపమై. 90

తే. సాల మున్నతి భూర్భువస్స్వర్మహర్జ
న సుతపస్సత్యములు ఖేయ నైమ్న్య మతల
వితల సుతల తలాతల తం రసాత
లము మహాతల బలిసదనము లెఱుంగు. 91

చ. కనఁ బురిచుట్టు తోఁటల సుగంధఫలంబులు రాల వానిపైఁ
బనసలు పండి త్రెళ్లిపడుపాటున రొంపులు గట్ట వాని మీఁ
దనె రసదాళి ప్రీలి రసధారలు నించఁగనైన యుబ్బలిన్

జనువడిఁ భాంథు లందుఁ బడ సారె హసింతురు శాలిపాలికల్. 92

క. ఆపురమున నొకఁడుండును
గాఁపురముగ బలిజెసెట్టి గణదాసుఁ డనన్
దీపురము గాఁగ నయ్యల
కాపురమున ధనదుఁ డుండుగతిఁ గడు వేడ్కన్ . 93

వ. వెండియు నతండు. 94

చ. సరిపెణతోడిసజ్జ బలు సందిటి తాయెతు లంగవస్త్రముల్
సరిగె చెఱంగుపాగ విలసన్మణి ముద్రిక లంచుకమ్మలున్
మెఱుఁగులు గుల్కు దోవతియు మిన్నగు నీలపుఁ బోఁగుజోడు బి
త్తరపు విభూతిరేఖ లఱుతన్ రుదురక్కలు గల్గి భాసిలున్. 95

ఉ. మోర కసీదుపట్టె మొగముట్ల తలాటము జల్లుపేరు చిం
బోరయుఁ గంచుకుప్పెలును బూచెల గొల్సును బెద్దగంట సిం
గారపు దృష్టిదండ మెడ గజ్జెలపేరులు నందెలొప్పలా
వేరిన దొక్కపస్సె యెకిలింత మహోక్షము పొల్చువానికిన్. 96

చ. తగణము లానుకంట్లములు తండిగముల్ సలకల్ దడెల్ కుతూ
గణములు చెక్కుగుంపు లడిగంబులు పంబులు త్రాడుగట్లు మం
కెణములు గోతముల్ నగలు గెంటెపు బోరెము లాతనింటిలో
గణన కశక్యమై వెలయుఁ గంజసమాన విశాలలోచనా! 97

సీ. గూటపుఁ దిరుగుళ్లు కొలికి దామెన త్రాళ్లు
కందళి కెముకలి కదురుకోల
మఱగజుమును మోడి మెఱుఁగుగాఁ దీసిన
పిల్ల చుట్టులు నల్లుబిళ్ల లొల్లె
త్రాళ్ళును బురికొసల్ దబ్బనములు నుసి
గంతలు నట్టెన కట్టె లసిమి
బలుపొన్ను లలరారు బగిస గూటంబులు
పెలుజోగి పట్టెళ్ళు పిల్లపట్టె

తే. డలును బూవుల కోరగిన్నెలు విభూతి
పండ్లు గంగాళమును గుసిగెండ్లి పాల
మడ్డి బరణియు రుద్రాక్షమాలికా స
మూహములు గల్గియుండుఁ దద్గేహమునను. 98

ఉ. కాముని మేనుగాలెఁ బలుగాకి జయంతుని రూపుగూలె నా
సోముని సత్కళాగరిమ చూడఁగఁ జూడఁ గృశింపఁజాలె నా
భూమి జనించి యాక్షణమె పొల్చువసంతుని యాకురాలె నో
హో! మఱి వీనిరీతిఁ జెలువొందిరె వా? రని యెంతు రంగనల్. 99

చ. అతనికి నొక్కయాలు గల దన్నిట మేటి మిటారి రూపునన్
రతి నిరసించు మీఱి మరురాయని దిగ్జయభేరి వింతలౌ
చతురతలందుఁ గేరి ఘనసాహసచర్యల బల్తుటారి వా
క్తతిఁ జెలువంపుఁగీరి యభిధానము చేత విహారి యారయన్. 100

చ. కమలభవాలయారి గజగర్వమడంచు ముఖంబు యానముల్
కమల భవాలయారి కళలన్ నగుఁ గంఠము శ్రోణిబింబమున్
గమల భవాలయారి గతిఁగైకొనుఁ గన్నులు గబ్బిగుబ్బలున్
గమల భవాలయారి ఘృణిఁగొంచుఁ గరంబులు వేణి యింతికిన్. 101

చ. ఘనము కచంబు చెంబులన గబ్బిచనుంగవ మించు మించులన్
దనురుచి రూపుమాపు నెలతళ్కుల గెల్చు మొగంబు గంబురా
లనఁదగుఁ బల్కుఁ బల్కుదు రయారె! సుపాణులు పాణు లబ్జముల్
మనసిజునారి నారి యసమానపు టారలరారుఁ దీరుగన్. 102

క. ఆ లపమున శశిబింబం
బాలపనము తేనెధార లంబుదవర్ణ
శ్రీ లపనయించుఁ గబరీ
శ్రీల పనలు బొగడఁ దరమె? శేషునకైనన్. 103

ఆ. కాంత కరము గళము కల ముద్దురూపంబు
దరము దరము దరము తరము వరము
వాలు మీలఁ బోలు వనజాక్షి కన్నులు
సారె సారె సారె సారసములు. 104

సీ. మొనయైన నఖరాన మినుకీను నిటలాన
జోక గుల్కు విభూతిరే కమర్చి
యయ్యోర జిగిదేఱ నొయ్యార మలరారఁ
బసపుతో సన్నంపుఁ బట్టె దీర్చి
యలదండ కల తండముల నిండుతనముండ
సరస కుంకుమరేఖ సంఘటించి
యా చెంత కాసంత యాసంత జగజంత
సొగసుగా నిడు చాదుచుక్కఁ బెట్టె

తే. మెడను జందనచర్చ ధమ్మిల్లసీమ
విచికిలంబులు గంబూర కుచములందుఁ
గప్రపు విడెంబు పుక్కిట ఘుమ్ము మనఁగ
విటుల వలపించు మరునైన వెస భ్రమించు. 105

తే. మీఱి గడిడేఱి భోగము కేరి చేరఁ
జీరి చిన్నారి వగఁగేరి వారి దారి
కోరి విటుఁజీరి రానిచో మారుబారి
సారె వేసారి పొరలు విహారి నారి. 106

వ. ఇత్తెఱంగున. 107

క. పరపురుష చింత నచ్చెలి
నిరతము చరియింపఁ జూలు నిలిచెను వృద్ధిం
బరఁగుచు నవమాసంబులు
జరగిన తదనంతరమునఁ జంద్రవదనకున్. 108

కొఱగాని కొడుకు

సీ. గుడిమీఁదఁ బడు రావి కడిలోని చెడుగీఁగ
పుణ్యనదీతీర్థమునను మొసలి
కంటిలోఁ గొర వెండ్రుకయు రచ్చమట్టిని
బ్రహ్మరాక్షసి కాపురమ్ము సేయు
భవనసీమను ద్రాఁచుపాము కల్పకుజంబు
కడ గచ్చపొద పాలకడలి విషము
వనమునఁ జిచ్చు దివ్యౌషధికినిఁ బుప్పి
బ్రతుకు బాలెడు నింటఁ బరశురాము

తే. హస్త ముదకాన గ్రుడ్డు సస్యమున మల్లె
జీవవితతికి రోగంబు చెఱకు వెన్ను
మణికి బోషంబు నృపునందు మార్దవంబు
పుట్టు చందానఁ బుట్టెను బుత్రుఁ డొకఁడు. 109

తే. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిగి
కాళికలను దేవ గడిమీఱీ గట్టిపాటి
రాలుఁగాయతనాన బేరజపు దారి
నాఱితేఱియుఁ బలు గుంటమారి యయ్యె. 110

మ. గుణమా? సెబ్రి, వివేకమా? నహి, మనోగూఢత్వమా? లేదు, భా
షణమా? కల్ల, విచారమా? రవళి, వంశాచారమా? నాస్తి, మా
ర్గణ ముఖ్యావన శీలమా? శశక శృంగప్రాయ, మాప్తాది తో
షణమా? దబ్బర, సత్యమా? హుళి, గణించన్ వాని కద్రిస్తనీ! 111

వ. వెండియు నతండు. 112

సీసమాలిక. ఆకతాయ బికారి యడిబండ గుండఁడు
మొండికట్టె గులాము మొప్పె గోపు
పోలెవాఁ డగచాట్లపోఁతు దుర్మార్గుండు
పడిసేటును గరాసు పంద లండి
కొయ్యద్రిప్పు ఖరాబు కూళ బందెలమారి
ముండరి పాపాలముద్ద ధగిడి
యోగు దూబరదిండి యోచవాఁ డవలక్ష
ణమువాఁడు గోల వ్రాత్యుడు బజారి
పలువిత్తు పలుగాకి ప్రాడ్వాకుఁ డుచ్ఛిష్ట
మొందు సుద్దులమారి యులిపికట్టె
పాపిష్ఠి బజిగేడి పంచమహాపాత
కియు వ్యతీపాత పోకిళ్లమారి
దరిబేసి చెడుగొట్టు జెరికి దగాకోరు
విషపాలవిత్తు చిల్విషము దగులు
బాజి హరాంకోరు వాజ ప్రక్కల ము్రుచ్చు
చీవాట్లమారి ప్రాచీనవిత్తు
మూసిన ముటికి నిర్మోహి స్వామిద్రోహి
దుష్టు రోతలమారి దోసకారి
బడిమి కూళ్ళకు మిత్తి పడిసె యెంగిలికాయ
పడుపుగూ డెసగొట్టు పాడెగట్టు

గండకుల్లెడము తాకట్లమారి యభాసి
కడుప్రేత నడపీస్ను గలపడింపు
దూర దర్శన మూడు తోేకచు క్కన గుల్ల
గుజ్జాల గో వోదెకొరుకు బల్లి
తే. కొంటె కసుమాళమును దూబ కొంపచెఱుపు
చేడి గేరి చెరపనచేట రోసు
బడియ దుర్బీజమును భ్రష్టు మడియచేట
పెయ్య కల్మెచ్చు చెడుగు సాపెనల మారి. 113

క. అనుచుం బొరుగిరువారుం
దనవారుం గానివారు తక్కిన వారున్
దనుఁ దిట్టఁజేయు దుడుకులు
మనమున లజ్జింప కతఁడు మఱియు న్మఱియున్. 114

తే. వాని కెనిమిది యేండ్లది మేనమామ
కూతుఁ బెండిలి చేసినఁ గోడె వయసు
పాక ముజ్జూత లూఁగెడు భార్యమీద
మనసు చాలించి దుర్మార్గమతి వహించి. 115

క. బోగాలవారి యిండ్లకు
బోగాలకు మించి యరుచిబోఁ గామించున్
బోగాల వలపు విడియపు
బాగా లిడఁ గుసుమదీప్తివలె మూఁపెనయన్. 116

వ. ఇట్లు నిజవధూవైముఖ్యంబును వారవనితాభిముఖ్యంబును వహియించి వల్లవుం
డనువాఁడు వర్తింపుచుండ నొక్కనాఁడు. 117

సీ. రంభ ఘృతాచి యూర్వశి మణిప్రభ చిత్ర
రేఖ మేనక శశిరేఖ హరిణి
హేమ స్వయంప్రభ హితమోహ మోహిని
పుంజికస్థల రత్నపుంజ సరస
ధాన్యమాలిని తిలోత్తమ వరూథిని మంజు
ఘోష సౌగంధిని కుంద తార
మణిమాలిక సుమంజు మంజరి మణిభద్ర
మణిక విద్యున్మాల మదమయూర

తే. దివ్యమూర్తి సువర్ణ దేదీప్యమాన
రుచిర మకరంద సుమదామ విచికిలాంగి
యనఁ దనరు నప్సరస్స్త్రీల కన్న మిన్న
చెన్నలరు వారసఖుల హెచ్చెన్నఁ గలఁడు. 118

క. ఆ వారసతులలో సౌగ
సై వారణలేని కలిమి నందలరు సుశో
భావార మరుని పసిఁడి జి
రావారణ మన నొకర్తు రతిసేనాఖ్యన్. 119

సీ.కల ధనమెల్లఁ బోకడఁ బెట్టి సన్న్యాసి

యై బిచ్చమెత్తని యగ్రజుండు
చేతికైదువును నాశింపక తెగఁగట్టి
కులశేఖరులఁ గూడుకొనని రాజు
సంచి మూల్యము నిచ్చి సడికోర్చి త్రైవర్ణి
కులజంటఁ దిరుగని కోమటీఁడు
కారు కలప మొదల్ గా నమ్మి సీమపై
జోగులఁ గలియని శూద్రబిడ్డ
తే. లేడు ధరలోన రతిసేనఁ గూడి మాడి
యున్న విటులందు రతియందుచున్న వేళ
సందుగని పెట్టుకొని పెట్టు మందుగుళిగె
మహిమ యెటువంటిదో కాని, మధురవాణి! 120

వ. అది మఱియును.121

## నృత్య గాన విశేషములు

సీ. భారుడంబును శుద్ధపద్ధతి బహురూప
లక్షణంబులు దండ లాస్యములును
బెక్కణ పద్ధతి పేరణా పద్ధతి
కుండలీ నృత్తంబు భాండికంబు
రాసకాఖ్యము నాటరాసకంబును జిత్ర
పద్ధతియును దేశ్యపద్ధతియును
జర్చరీకందుక చానరి కోలాట
ములు నాఁగఁ దగుపేళ్లఁ గలుగునట్టి

తే. షోడశం బగు నృత్తంబు చౌరవ లెఱిఁగి
సరవిఁ జంచుపుటంబును జాంపుటమును
ధ్రువము మధ్యము రూపక త్రిపుట జంపె
యేక తాళాట తాళాదు లెల్ల నెఱిఁగి. 122

సీ. భైరవి మాళవి బంగాళ హిందోళ
రాజమంజరియు శ్రీరాగ గౌళ
భూపాల లెన్మిది పురుష రాగంబులు
దేశాక్షి ఘూర్జరి దేశీ తోడి
దేవక్రియాందోళి దేవగాంధారియు
గౌళ గుండక్రియాహాళి సలలి
త బిలహరి కురంజి ధన్యాసి పూర్వగౌ
ళ వరాళి నాట భల్లాతకి మల

తే. హరులు సారంగ రామక్రియలు ననంగఁ
గన్నడ యనంగ మంగళకౌశికి యన
వెలయు నారాయణియుఁ జతుర్వింశతి విధ
ములను దనరారు స్త్రీరాగములను మరియు. 123

సీ. కాంభోజ కేదార గౌళ శోకవరాళి
పున్నాగ గుమ్మకాంభోజి శంక

రాభరణము మేఘగంజి తోడి వరాళి
నాదనామక్రియా నాట రీతి
గౌళ రామక్రియ మేళ రామక్రియ
గౌళ నారాయణగౌళ మధ్య
మావతియు ముఖారి మలహరి సామంత
పంతువరాళియు బౌళి రాగ

తే. చెంచు మలహరి దేవాక్షి శ్రీవరాళి
మాళవియుఁ బాండి సింధు రామక్రియయు వ
సంత సామంత శుద్ధ వసంత గుజ్జ
రియును హెజ్జిజి నీలాంబరియు ననంగ. 124

తే. పొసఁగు ముప్పది రెండు నపుంసకములు
మాళవశ్రీ యనంగను మలహరి యన
దేవ మలహరి రేగుప్తి దిర ముకుంద
మలహరన నైదు మిత్ర లీ మర్మ మరసి. 125

తే. షడ్జ గాంధార మధ్యమర్షభ నిషాద
పంచమ సుధైవతాఖ్య సప్తస్వరములు
మంద్ర మధ్యమ తారక మహిమలెఱిఁగి
యాడఁ బాడఁగ నేర్చు నయ్యబలఁజూచి. 126

క. వలచి యతఁడు కడుమోహము
తలమునుకలు గాఁగ మరుని తామరవీరి తూ
పుల కకబికలకు లోఁబడి
మలయుచుఁ దా వెంట జాలిమాలం దిరుగున్. 127

వ. ఇట్లు దిరుగుచుఁ దాఁజేయు యత్నంబులఁ దన కభిమతంబు ఘటింపం దలంపని యా రతిసేనను మరులుకొల్ప నూహించి యా వల్లవుండు వైద్యసహవాసం బొనర్చి యంత. 128

## స్త్రీ వశీకరణౌషధములు

తే. ఇంద్రగోపంబు రోచన మెట్టిలు వెలి
గారము జలభ్రమణములు నీరుగొబ్బి
వితనాల్ పుట్టపండు రసోత్తరముగ
నూరి మడుపునఁ బెట్టిన నారి వలచు. 129

సీ. నల్లేరు కణికగందము తేనె వగనూరి
లేపించి కూడిన లేమ వలచుఁ
గరక తాండ్ర యుసిరికలు కోష్టు పాలచే
నూరి పట్టించిన వారి చేరు
వెలిగారమును నెట్టివిసెపూలు నిజతనూ
జలముల నూరిడ్డఁ జెలియ కలియుఁ
గలుగొట్టు నీరావు కాల్మడిచే నూరి
విడెములోఁ దగిలింప వెలఁది చిక్కు

తే. గూర్మి జిల్లేడు దూదిని గోశఫల ర
సమున మేదించి వర్తిగాఁ జక్కఁ జేసి
కుసుమ నూనెను దీపంబు పొసఁగఁ బెట్టి
చూప లోనౌదు రెటువంటి సుదతులైన. 130

తే. జాజికాయలు జాపత్రి చారపప్పు
సెనగ లసుములు గసగసల్ మునుగపువ్వు
మదన విత్తులు కొబ్బెర మందపాల
నూరి త్రాగిన మదమబ్బుఁ జేరు వేళ. 131

క. అనుచు నిజరచిత వితరణ
జనితామోదమున వైద్యజనములు దెలుపన్
వనితావశ్యౌషధములు
విని యట్లొనరించి యింతి వెస వలపింతున్. 132

క. అని నిశ్చయించి యా బొజుఁ
గనుపమ మణిహేమఘటితమై సిరులొలయన్
దనరు రతిసేన మందిర
మును గాపెట్టుకొని యుండు మోహము కల్మిన్. 133

సీ. పంచాంగమయ్యకు బాగ సమర్పించు
నట్టువకానికిఁ బెట్టు మురువు
భరతంపు టొజ్జకుఁ బచ్చడం బొగిఁ గప్పుఁ
బొగడు బట్టుకుఁ జేర్చుఁ బోఁగుజోడు
కథఁ జెప్పు భూసురాగ్రణికి దోవ తొసంగు
ననువుకానికి బత్తె మెనయ నడుపుఁ
బూల్గట్టు సాతానిబోటి కుంగర మిచ్చు
గందొడివానికి విందు సేయు

తే. చతురికకుఁ జీర దూతికి సందిబొందె
కడెము పరిచారికకు సారికకును అవిక
తాపికకు సొమ్ము వేశ్యమాతకును గాన్క
లిచ్చిచెప్పించు రతిసేన కెచ్చు తమిని. 134

వ. మఱియును. 135

ఉ. గుండనికిం బసిండి పనికో, రడిబండకు వెండి తాయెతుల్
లండికిఁ జేకడెంబు పదిలంబుగ గుమ్మెతకాని కందెలున్
బెండెము బాడుగోలునకు భృత్యునకున్ మెడనూలు చాటుకృ
త్యండున కుంగరాలు మొలత్రాడులు కుంటెనకాని కియ్యఁగన్. 136

క. వారందఱుఁ దమ చాతురి
మీఱి మహాసంపదాప్తి మించినవాఁడీ
జారాగ్రణి యని చెప్పిన
నా రతిసే నపుడు మంచిదని యియ్యకొనెన్. 137

క. పడతుక నతఁ డీగతి లోఁ
బడఁజేసుక మురిపె ముట్టిపడఁ గడుఁదమి తుం

దుడు కొనరింపఁగఁ గోరిక
లడరఁగ రతిసేన రతుల కాయత్తంబై. 138

క. పన్నీట జలక మొనరిచి
కన్నర రానున్న మిన్ను గిన్నన్నకు మున్
మున్నొనఁగి సన్నబియ్యపు
టన్నము మితభుక్తి చేసి యమితోత్సుకుఁడై. 139

తే. చాఁదు శ్రీగంధ మగరు కేసరి కదంబ
మంబరు పునుంగు జవ్వాది హరిణమదము
బుక్క యత్తరు గోవ గంబూర బోలు
చట్ట కలపంబు పన్నీటఁ జాఁది పూసి. 140

క. సిగ సరవిరి సరములు పొం
దుగవేసి రుమాలు గట్టి దుప్పటి వలెవా
టుగ వైచి విడెము సేయుచు
సొగ సుట్టిపడంగ నతఁడు సొంపు జనింపన్. 141

సీ. సకినెల పట్టెమంచము పాన్పు తలగడ
బిళ్ళలు చందువ మల్లెవిరులు
కరడె సురటి గిండి గద్దె సున్నపుఁగాయ
గాజద్ద మడపము కలపము చిటి
చాఁప తబుకుసాన జాలవల్లిక దీప
ములు గందవడిదట్ట పునుఁగుబరణి
యాకుసంబెళ తంబు రగురుధూపము పాదు
కలు తమ్మపడిగము కప్పురంబు

తే. క్రోవి కస్తూరి వీణె కుంకుమ సుమంబు
పొట్లములు రుద్రవీణ మేల్కట్లు బాగ
ముల కరండంబు రతిబంధ కలిత చిత్ర
ములు గలుగు కేళినిలయ మింపలరఁ జేరి. 142

తే. బలసి కూకీలు నొడ్డీలు పల్లటీలు
పావురాయులు బకదార్లు బట్టిగాండ్రు
రంచలు నెమళ్లు కేర్జముల్ పంచవన్నె
చిలుకలు పికాది శకునముల్ గలసి పలుక. 143

తే. చంద్రకావి ఖురాళంబు సరిగెచెఱఁగు
జిలుఁగు కెందమ్మి దోదుమ్మి చీని కమ్మి
పైకిణికమ్మి తెఱచాటు పాన్పుమీఁదఁ
బదటు తమినుండునంత నప్పణ్యకాంత. 144

వ. మజ్జన భోజనాదివిధుల సంతుష్టహృదయయై భావసూచక బిబ్బోక హావభావ లలిత కుతూహల కిలికించిత విహృత విచ్ఛిత్తి విభ్రమ ధైర్య లీలాహాస మాధుర్యహేలా విలాస చకితాది శృంగారచేష్టల కనువైన యాలింగనంబులలో సరసాలింగనంబు దృఢాలింగనంబు సర్వాలింగనంబు స్పృష్టక చిద్దక ఉద్ఘృష్ట స్ఫుటక పీడితక ఊరూపగూహన జఘనోపగూహన కుచాలింగన లాలాటిక నిరూపణ లతావేష్టిత

వృక్షాధిరూఢ తిలతండులక క్షీరనీరకంబులను చతుర్దశాలింగనంబులు గావించి
యుప్పొంగు తమకంబున నతఁడు. 145

తే. చుంబితంబును బరిమృష్టకంబు కబళి
తంబు చూషిత మనుపేళ్ళఁ దనరు నాల్గు
గతుల ముఖరతి భేదముల్ గలయఁ జేసి
ద్రవముఁ బుట్టించు తానకాల్ తడవి చూచి. 146

తే. సకియ యంగుష్ఠ పదగుల్ఫ జాను జఘన
నాభ్యుర స్స్న న కక్ష కంఠ సుకపోల
దంత గల్లాక్ష ఫాల మస్తక శిరోజ
ములు ప్రతిపదాదిగాఁ గళాస్థలములంటి. 147

సీ. చెవుల నిమిత్తంబు చెక్కుల స్ఫుటితంబు
నధరోష్ఠమున భ్రాంత మడరఁ గన్ను
గవఁ దిర్యగంబును గక్షదేశంబులం
బ్రథితంబు చనుదోయి నధరకంబు
చిత్తము గృహమున నుత్తరస్ఫుటితంబు
పొక్కిట సంపుటంబును శిరోధి
ననుపదం బూరుల నన్వితం బన నొప్పు
దళచుంబనములుఁ దత్తత్స్థలములఁ

తే. బొదలు ముదమునఁ బర్యాయమున ఘటించి
కలయ శశకవ్రత మయూర ఫలక రంజి
సుచ్ఛురిక మండలిక గండ సుత్రిభాగ
ముఖ ముఖ నఖక్షతంబులు మొనయఁజేసి. 148

తే. క్షతరదోచ్ఛూన ఖండాభ్రక ప్రవాళ
మణిక గూఢక రుచిబిందు మణికబిందు
మాలికా కోల చర్వితాఖ్యాళి వెలయు
పదిరదక్షతముల వేడ్కఁ గదియ నొక్కి. 149

క. స్థితమును దిర్యగ ముత్తా
నితమును నాభిస్థితమన నిపుణజనులు ప్ర
స్తుతిగొనఁ దనరు చతుర్విధ
రతుల గతుల నతుల మబ్బురము గావించెన్. 150

వ. వెండియు నఖండసురతపాండిత్యంబున విటుండును నయ్యండజయానయు,
మదవేదండంబులరీతి జృంభక కూర్మక రణస్కంధయుగ గర్భపీడిత సాధుక దృఢలావుక
కర్కట సముద్గక వేణుదారిత సంయమ కృత కోపరతి ధృతోరుక నాగరక ప్రేమాభిరామ
చక్రభ్రమణ ప్రసాదిత శూలాంచిత పాదవేష్టిత బాణరంజన మదనరంజన పార్శ్వఘట్టన
భావికోల్బణ మండూకకరణ గ్రామ్యకరణ సర్వతోభద్ర మండలప్రభ
మధురకంపితాంగసంపుటార్ధసంపుట పద్మక అర్ధపద్మక అంబురుహ భారచరణ
పాదపదక పాదబంధపాదాశ్లేషణమదనడోలన చంద్రార్ధ మండలార్ధ ఊరు చరణ కక్షపాద
వేష్టితక హళికకరణ నాగపాశాంగ చక్ర గుహ్యక ద్విరదావలంబన చిత్రలాఘవ
మదనకుంచిత గగనకరణోర్ధ్వ బాహూత్ఫుల్లక మర్కట విమర్దన వేణుకోద్వేగ పరావృత్త
గణాంగ దృఢాంగ సింహావలోకన పాదారోహణ ప్రియాంగ బాడబబాణ కృత్తమదన

రాజహస్త లాఘవ బాహుచరణ చక్రపాద మదన సంఘట్టన పాదమేళన గోముఖాంగ
సంవేద్యకరణ సమితాంగ కరణంబులను చౌశీతిబంధంబులను జమత్కారంబులఁ
బెనంగుచుండి రయ్యవసరంబున. 151

## మర్లు మందు

సీ. గంబూరమును జాజికాయ లుమ్మెత్త వి
త్తులు మర్లు మాతంగి కలువగడ్డ
పచ్చయెన్నులు కోష్టు పచ్చిక మంచేసుఁ
గుమదము గుళ్ళసున్నమును రుద్ర
జడవేరు వస ఖురాసాని వామము పుడు
కల పోలుగాఁడు మైఁగారు చెమట
నీరావు గజ్జల చేరిన మష్టును
గాల్మడి జాతంటుగాను నూరి

తే. కలయ గురిగింజలంతేసి గుళిక లమరఁ
జేసి నీడనె యాఱించి తీసి దాచి
యున్న మంచింత మడుపుతో నొసఁగె నతని
కధికతరమోహ మూన నా హంసయాన. 152

క. ఈ బాళిమందు మసగొని
యాబిడ తనకండ్లు గట్టినట్లుండ నతం
డేబుద్ధి లేక యచ్చెలి
సోబెల కెదఁ జిక్కిచిక్కి చొక్కుచుఁ దిరుగున్. 153

తే. వాఁడటుల మీఱి బోగమువారి గేరి
చేరి రతిసేన రతితాణఁ జెలఁగు మదిని
దాని సొమ్మైన, నమ్మైన దట్టమైన
వయసు మరుబారిఁబడఁజేయ వానిజాయ. 154

సీ. బొమ్మలపెండ్లిండ్లు బువ్వఁపుబంతులు
పుణికిళ్లు నిట్టుక్కి బొమ్మరిండ్లు
గుజగుజరేకులు గొబ్బిళ్లు నీఁగలు
బుడిగించు జాబిల్లి పుక్కటిల్లు
గుజ్జనగూడులు కోటకోలన్నలు
గీరనగింజలు పారుపట్లు
పిప్పిళ్లు త్రొక్కిళ్లు బేడిసె తిరుగుళ్లు
నచ్చనగండ్లు దాయాలు పొళ్లు

తే. లడరు వామనగుంట లాడైన దట్టి
యాటపాటలఁ బ్రొద్దువో ననుఁగుఁజెలులఁ
బాయక చరించు బాల కీప్రాయమేల
వచ్చె విరహాగ్ని యిటులేల హెచ్చెననుచు. 155

క. నెఱవయసు పిక్కటిల్లఁగ
సురతం బొకవేళనైనఁ జొప్పడని మదిన్
బరపురుషవాంఛ వొడమిన

విరహంబున రేయిపవలు వేఁగుచునుండున్. 156

చ. ఉదుటగువానిఁ బ్రాయమున నుండెడువాని మనోజ్ఞలీల సం
పద గడిదేఱువాని గుణపాటవమొందెడువాని నేపుచేఁ
బొదలెడువాని గీతములపొల్పు లెఱింగినవాని సంగమో
న్మదమున మించువానిఁ గనినన్ మరుబారికి నగ్గమై పడున్. 157

తే. ఇరుగు పొరుగుల దంపతు లేపురేఁగి
సంగమక్రీడ నోలాడి సరసమాడు
సొవసొవలు విన్నమాత్ర నుస్సురుమటంచు
మన్మథునిబాడి గొట్టైయి మగువ దలఁకు. 158

వ. అంత నక్కాంత వేఱొక్క వాసరంబున. 159

చ. అటువలె వేఁగుచుండి మగఁడత్తయు మామయు నింటలేమి వె
ల్పటికి హుషారునం జని గుబాదెబ వీథులవెంట జంటలై
చిటిలిన పూఁతగందముల సిస్తగు పాగల నిండుచల్వ దు
ప్పటుల విభూషణావళుల బాగుగనేఁగెడు దుండెకాండ్రలోన్. 160

సీ. పసిఁడికుప్పెలతీవి బారుకుచ్చులు నింద్ర
గోపంపు జగజంపు గుంపు వారి
కుచ్చుక్కు సిగ్గెముల్ గొల్పెల్లు ముసనాబు
చెక్కడపుల బచ్చ చిలుకచెండ్లు
పట్టుపట్టంచు తాప్తాలేపు జీవదం
తపు గోడియలు పట్టుత్రాళ్లు దిండ్లు
నేనుంగు కొమ్ము కాటేరికిఁ బేటాకు
విలకెలమ్ములు సెల్లు వెండవీటి

తే. కేను లీవంగి సోఁక పొక్కిలులల పోలు
పుష్పి చినుతిండియును లేఁతముదురు నిడుద
గణపు సదులావు నీల రక్తముల పన్ని
కొమ్ము పున్నాగమమ రందలమ్ములందు. 161

క. వగ లుట్టిపడఁగఁ దమతమ
సొగసులతో విఱ్ఱవీఁగు సొంపుల మీసాల్
వగలున వడివేయుచుఁ జిఱు
నగవులఁ బధమనుచు జారనాయకు లలరన్. 162

సీ. పైచర మోరడి బలిమికం బొద్దిక
ముల్లడితాఁకుడు జల్లికట్టు
మైసల్లు మెడగుడు మారువెంబడి బిట్టు
జతుకు సమాధాన జతన మడుగు
లోదాటు నడ్డకాలువ పాదబెళకు ని
బ్బరము నీరడికందు బలిమిదిరుగు
నుమ్మలిసెలవు పాదొత్తుకలు ధుతాళి
తొడిగట్టయును గాల జడుపులావు

తే. హొయలు బూరుగ వన్నాగహొయలు బిగువు

బొట్టు డేగురు రేకప్పు బెట్ట డిసుము
పటమ తాకుడు మొగవొయల్ పదిల మదిగొ!
హెచ్చరికటంచు వడిబోయ లేఁగుచుండ. 163

ఉ. సంచపురేకుదుప్పటులు జారుసిగల్ బిగిచల్లడాలు వా
సించెడి గందపట్టియలు జిల్గురుమాలలు సందితాయెతుల్
మించఁగ సాన చిమ్ము నునుమీసలు దీటుచు మీఱి కేరి ధి
క్కించు వటంచు గుంపుగొని కేకలువేయుచు వచ్చువారిలోన్. 164

తే. మంతుఁడన నొప్పు నెఱవింత హొంతకారి
సొగసు బయకారిఁ జానయుఁ జూచి దగ్గి
కేకరించిన నాతఁడు కెరలి కాంచి
యిదియు వగలాఁడిరా యని కదియఁజనఁగ. 165

ఉ. గేదకి రేకుటత్తమునఁ గీల్కొను చూతధళంబు నాళ మిం
పూఁదిన జాజిమొగ్గ గజముత్పలపున్ జలికట్టు సంపఁగిన్
బాదురుగా నొనర్చిన తుపాకిని బుప్పొడిమందు కప్రపుం
బూడిగుండునుంచి మరుబోయఁ డమీయన నేసె నిర్వురన్. 166

వ. అప్పు డామంతుఁ డాయింతిచెంతకు సంతసంబున వచ్చుచు నిజాంతర్గతంబున. 167

ఉ. ఆరయ నేరెడేటి యనలందుల వెన్నెలతేట నించి తొ
ల్కారు మెఱుంగురంగు లిడి కమ్మసుధన్ బదనిచ్చి మేటి శృం
గారరసంబుతోడఁ బొసఁగంగ ననంగవిధాత చేసెఁ గా
కీ రమణిన్ విధాత సృజియించుచు నంటినఁ గందకుండునే? 168

సీ. దీర్ఘమై విలసిల్లుఁ దేటవాల్గనుదోయి
గుడుసొచు నాభియుఁ గుల్కుచుండుఁ
గొమ్ములగతి హెచ్చుఁ గొమిరెచేతుల రీతు
లుత్వంబు చందాననొప్పు జఘన
మౌత్వంబుభాతిని నమరుఁ గర్ణద్వయం
బేత్వమై జడపొంక మెసఁగుచుండు
నైత్వంటు విధమున నల యూరు లలరారుఁ
దలకట్టువలె మించుఁ దళుకునొసలు

తే. సున్న నడుము విసర్గలు చన్ను లారు
పొసఁగు వలపలి గిలక యద్భుతములనఁగ
నలరు గుణితంబు వైఖరిఁ జెలఁగు నంగ
సౌష్ఠవముతోడ నున్నది సకియ యనుచు. 169

వ. కదియంజేరి యప్పుడు. 170

చ. "చెలియరొ! యేపురం? బెటకుఁ జేరఁగవ చ్చిట నిల్చినావు? వీ
ణెలరవమొప్పు దగ్గితివి నెమ్మదిలోఁగలపూన్కిఁ దెల్పు మా
యలు పచరింపఁబో"కనిన, నమ్మకచెల్లరొ! యీతఁడెందు కెం
దుల కురులొగ్గె నేచి కడుదొమ్మికి రాఁదలఁచెన్ సెబాసుపో! 171

తే. అనుచుఁ జిఱునవ్వు మోవిపై నంకురింప

భయము సిగ్గును దనుముంపఁ బలుకునెడల
గద్గదరవంబు జనియింపఁ “గన్నెదాన
మేలు పడినాను జాణ! న న్నేలుకొనర!” 172

క. అనిన విని మంచిరని యొ
క్కనివాసస్థలముఁ జేరఁగా రమ్మని వ
చ్చినఁ జేరి ముద్దులిడి మె
ల్లనఁ జేష్టల నుబుసుపుచ్చి లాలిత్యమునన్. 173

క. కళలంటి ముద్దువెట్టుక
వెలసినతమి మోవినొక్కి వీఁపునఁ జనుము
క్కులు వెళ్లఁ గౌఁగిలింపుచుఁ
బలురీతుల రతురిఁ గలసి భ్రమనొందించెన్. 174

క. ఈచక్కి నీవు నిచ్చలు
రాచిలుకసిపాయిరౌతురణమున పలపుల్
పీ చణఁచు మనిన హాయని
యా చిగురుంబోఁడి కాతఁ డభయం బిచ్చెన్. 175

తే. ఇచ్చి సందైన యపుడెల్ల వచ్చి సైగ
చేసి విటుఁడేఁగఁ దానేఁగి చెలియ యింట
సురతకేళుల నలరింప సుఖము మరగి
తిరిగెఁ దన యత్తకన్నఁ గావరము పట్టి. 176

ఆ. అత్తకన్న కోడ లయ్యత్త కోడలి
కన్న నేపు రేఁగి యాప్తజార
జనులఁ గూడి మాడి చరియింప సాఁగిరి
యొంటిపాటు దొరకియున్న యెడల. 177

తే. అత్త యేమఱి యుండెడు నంతలోనఁ
గోడలు చరించి వచ్చును గొంత తడవు
కలయఁగ గుణాలు వచ్చు నాక్షణమె బుద్ధి
కోడలికిఁ జెప్పి యత్త అంకాడఁ బోవు. 178

క. ఈ మాడ్కిని నన్యోన్యం
బేమాత్రము తెలియకుండ నిచ్ఛావృత్తిన్
గామించుచు నొక దినమున
లే మాపునఁ గోడలింట లేకుండు నెడన్. 179

క. వలవని సతిపురుషులకును
వలపులు పుట్టించు మందు వగనెఱిఁగి రతిన్
వలపులు మరుపంజాలిన
బలియుండగు హొంతకారి పథమున రాఁగన్. 180

ఉ. అత్తయు హొంతకారిని రయంబునఁ దోడ్కొని మూల యింటిలో
హత్తుక కేళి సల్పునెడ నంతటఁ గోడలు వచ్చి యింట మా
మత్త విభుండు లేరనుచు మంతునిఁ దోడ్కొని యిల్లు సేరినన్
దత్తరమారఁ గోడలిని దద్విటునిం గని యత్త కిన్కతోన్. 181

తే. అపుడు గృహమధ్యమున నుండు నత్త, నత్త
విటునిఁ గోడలు గాంచె నవ్వేళ యందు
నేర మొక్కింత రాకుండ నేర్పు మెఱసి
వార లిరువురు బొంకఁగా వలయుఁ జెపుమ! 182

క. అన విని హేమావతి యే
యనువమరఁగ నితరశంక లంటక యుండన్
ఘనకచలు బొంకి తమ విట
జనముల నిల్వెడల నంపఁజాలిరొ యెఱుఁగన్. 183

క. నీ వెఱఁగించిన వినియెద
నా విని, హేమావతీ! వినన్ గడు వేడ్కల్
భావమున నున్న వినుమని
ధీవిభవము హంసవంశతిలకం బనియెన్. 184

తే. అటుల విటయుక్తయె యింటి కరుగుదెంచు
కోడలిని జూచి యత్త సక్రోధ యగుచు
"వీఁ డెవఁడు? వీనిఁ దోడ్కొని వేశ్మమునకు
సంజకడ రాఁ బనే ? " మని జడియ నడుగ. 185

క. దిట చెడక దిగులుగొని సొట
సొటపోవక వెనుకముందుఁ జూడక బొంకే
దెటు లని చింతింపక యా
ఘటకుచ తడఁబడక యత్తఁ గల్గొని పలికెన్. 186

తే. "తల్లిదండ్రులు మీరు బాంధవులు మఱియుఁ
జిక్కి తక్కినవారలు చెప్పినపుడు
వినక నా పతి నన్నిట్లు విడిచి పెట్టి
తిరుగుచున్నది మీ కెల్లఁ దేట గాదె? 187

క. వనితాపురుషుల కీయన
యనువున నన్యోన్యమోహ మందఁగ జేయున్
ఘనుఁడని కొందఱు చెప్పఁగ
విని తోడ్కొని తెచ్చినాను విభు ననుఁ గూర్పన్. 188

క. ఇది యేక్రియ నీయనచే
ముదమునఁ జేయింపవలెనొ ముగ్ధను బ్రాయం
బొదవిన దానను మోహము
మది సైపఁగజాల" ననుచు మమత ఘటిల్లన్. 189

ఉ. కోడలు పల్కు పల్కు విని కొంకక నిక్కముగాఁ దలంచి యీ
చేడియ నాదు జారుఁ గని చిత్తములో నెటులం దలంచునో
దూడెల నమ్మరాదని విధుంతుదవేణి తనందు సత్యపుం
జాడ గనంబడన్ స్వతనుజాతలతాంగిని జూచి యిట్లనున్. 190

క. నీ వింత యడుగ నేటికి
నీ విభుఁడు పరేచ్ఛంబూని నిను విడిచి చరిం
చే విధము తెలిసి కాదే

యీ వైద్యుని౯ దోడి తెచ్చి తింటికిఁ దరుణీ! 191

వ. అని యజ్ఞగజంత నిశాంతంబున నున్న తన యుపకాంతుని౯ జూపి వెండియుఁ గోడలి కిట్లనియె. 192

క. నీపతి నిన్ను వరింపన్
బ్రాపగు యత్నంబు నితఁడు భవ్యస్థలిలో
నేపున నొనర్చినాఁ డిఁక
రేపట మర్నాటి నీదు ప్రేమ ఘటిల్లున్. 193

తే. అనుచుఁ దనయందుఁ జెలి సందియమ్ముఁ జెంద
కుండ నెఱిఁగించి యత్త “యో యుత్పలాక్షి
యతని నంపించు మిప్పటి కితనిచేతఁ
గాక యుండినఁ జూతముగాక” యనిన. 194

క. విని కోడలు నాయందలి
నెనరున నీయత్త యతని నిక్కమ తోడ్తె
చ్చినయది పతి ననుఁ గూర్చుట
కని తలఁ చటు సందుగామి ననిచెన్ విటునిన్.195

ఆ. అంత దానియత్త యాత్మోపపరిఁ జూచి
సైగ సేయఁ దెలిసి జారుఁ డపుడు
తత్ప్రయత్న మపుడె తగఁ జేసితని వార
లిరువు లెఱుఁగఁ బలికి యింటి కరిగె. 196

చ. అని కలహంసవంశమణి సాంగముగా వినిపించె వీనుదో
యిని౯ గడు సమ్మదమ్ము జనియింపఁగఁ దత్కథ యాలకించి కాం
చనసుమగంధి యా సతుల చాతురికాత్మ సెబాసటంచు మే
లనుచు గణించుకొంచు నిలయంబున కేగె నినుండు దోఁచినన్. 197

క. ఈరీతిఁ బడకటింటికి
జేరంజని మఱుసనాఁడు చీఁకటి జేజే
రారా కళ రా రాఁగల
యా రజనీవేళ విరహ మగ్గల మైనన్. 198

సీ. విరిదండ నెత్తావి నెఱి గుంపు గండుతు
మ్మెద పిండునకు మోద మొదవఁజేయఁ
గాశ్మీర తిలకంబు కాంతులు వదనేందు
బింబంబునకు సంజ డంబు గూర్పఁ
గస్తూరి పత్ర భంగముల నిగ్గు కపోల
శశి ఖండములకు లాంఛనము లీన
వాసించు నెఱ గందవడి పూఁత చనుగుబ్బ
పువ్వుగుత్తులకుఁ బుప్పొడులఁ గురియ

తే. నీలమణి కాంచి ఘృణులు విశాల జఘన
ధరణి కంబుధి మేఖలాత్వము ఘటింప
నృపతిమణిఁ జేరు కోర్కె నన్నీరజాక్షి
వచ్చి రాయంచకడ నిల్చె మెచ్చు లొల్కు. 199

వ. అప్పుడు హేమావతికి హంసం బిట్లనియె. 200

## పందొమ్మిదవ రాత్రి కథ

### గాండ్లచేడె ద్విజవటువును గూడుట

క. శ్రీకర మను నొక పురము సు
ధాకర బింబ భ్రమప్రద స్వర్ణమణి
ప్రాకార గోపుర వర
ప్రాకార సువజ్ర కలశమై సిరులొందున్. 201

శా. సాలాగ్రస్థల కేళి తత్పుర మహీస్వామ్యర్భక వ్యూహ దోః
పాళీ క్రీడిత రత్నకందుక మహా బాధ వ్రణావ్యాప్తిచే
నాళీకప్రియ ధీరసారథికి మున్ పాటిల్లి యీనాఁటికిన్
బోలేదయ్యె ననూరునామ మదివో మూలంబు తత్సంజ్ఞకున్. 202

మ. పరిఘాంభః పరిదృశ్యమాన విలస త్పాతాళ సంచార బం
ధుర దర్పోత్కర భోగ రత్న ఘృణి సందోహంబు కెందమ్మి మొ
గ్గ రహిన్ గుల్క హరింపఁ బూని యది రాకన్ దక్కినన్ బల్మఱున్
గరముల్ సాఁచఁగ బోంట్లు, నవ్వుదురు వీఁకన్ వారికేళిన్ సతుల్. 203

తే. ఆ పురంబున ఫణిహారుఁ డనెడు పేరఁ
గాపురము సేయు నొక తిలఘాతకుండు
సంభ్రమంబున నాకార సౌష్ఠవమున
వాఁడు కందర్పునకుఁ జీటి వ్రాయఁగలఁడు. 204

తే. గానుగ కడెంబు మోకులు గడ్డపాఱ
కాఁడి సిద్దెలు గూటంబు కడవ జల్లి
గంప కనుగంత తక్కెడ గట్టి యెద్దు
చుట్టు చవికెయు సర్వ వస్తువులు దనరు. 205

తే. వెల్లగిసెనూనె కుఱునూనె వెట్టినూనె
నల్లనూ నిప్పనూనెయుఁ దెల్లనూనె
కుసుమ గానుగ దుండుగ కొబ్బరయును
నూనె పొగనూనె తగిరెసనూనె దీయు. 206

క. పరిపాటి కల్మి చేతను
గరగరిక వహించి మించి కడు నాగరిక
స్ఫురణన్ దమ వంశంబున
కరయంగాఁ బిన్న పెద్దయై యతఁ డుండున్. 207

చ. అతనికి నొక్క యింతిగల దంగజు పట్టపుదంతి జారిణీ
సతులకు మేలుబంతి విటజాలము లాడెడు పూలబంతి యా
యతమతి జార చిత్తజ మహా విరహాగ్నికి శాంతి దేహ ని
ర్జిత చపలా సుకాంతి మణిచిత్రిణి నాఁ దనరారు పేరునన్. 208

నిరోష్ఠ్య కందము. దర గళ ఘన రసధర కచ

ధర సదృఢ స్తన సురదన తరళ నయన సుం
దర కంఠ కక్ష కరయుగ
సరస చరణ యనఁగఁ దరుణి సరసతఁ దనరున్. 209

సీ. నీల ధారాధర నిర్మల కాంతుల
గడియలో మాయించుఁ గలికి వేణి
సంపూర్ణ పూర్ణిమా చంద్రబింబ స్ఫూర్తి
దినము కుందఁగఁ జేయుఁ దెఱవ ముఖము
నిద్దంపు రుచు లొల్కు నద్దమ్ము వీక్షించి
గవిసెనల్ పెట్టించుఁ గాంత చెక్కు
లలరారు జిగిదేఱు నల చకోరంబులఁ
బుట్టు గ్రుడ్లని పల్కుఁ బొలఁతి కనులు

తే. నెట్టుకొని గట్టువగ పట్టు పుట్టచెండ్ల
బట్టి కొట్టించు వీఁపునఁ గొట్టుఁ బాఱఁ
గొమిరె సిబ్బెంపు గబ్బి చన్గుబ్బబోయి
విను మదారంభ గంభీర వేది గమన! 210

క. తనుకాంతి మెఱుఁగు మినుకా
మినకావర మఱఁచుగౌను మేలిమి గనకా
కనకాద్రి తోడ సరిచనుఁ
జను కాఠిన్యమ్ము పొగడ సన్మణి తునుకా! 211

తే. నీరజేక్షణ సిబ్బెంపు నిబ్బరంపు
గబ్బి గుబ్బల నెఱ రూపు గాంచి తొడరు
కాంతిఁ బొంగారు బంగారు కలశములకుఁ
గసలు బిబ్బోక నిరాకఁ గలుగఁ జేసి. 212

మ. వనజాతాక్షి పయోధరంబు లలకవ్రాతంబు కంఠంబు మో
హనలీలం దగు ఫాలభాగమును నూగారున్ గనల్లీలచే
ఘన నీలాబ్జ కళాకలాప జయకాంక్షన్ మించుటే మబ్రమౌ
ఘన నీలాబ్జ కళాకలాప జయ కాంక్షన్ వేణి రాణించఁగన్. 213

ఆ. దాని జవ్వనంబు దనువు నిరీక్షింప
మౌని కైన నెనయ మనసుపుట్టు
నితర జనులు చూచి యేణాక్షి రతిఁ జెంద
నిచ్చయింతు రనుట కేమి యరుదు? 214

తే. త్రుప్పు తుల్లిన నొప్పారు తోయజాస్తు
చికిలి నిద్దంపుఁ గైదువు చెలువు తోప
నూనె మెఱుఁగున నునుచాయ మేను దనర
నది విటాళుల కన్నాసయై మెలంగు. 215

చ. నడవడి గల్గువాఁడు కడు నాణెము చేఁ గలవాఁడు రూపునన్
బెడగగువాఁడు బల్ రతుల బేరజమై తగువాఁడు నిద్ధరన్
జెడుఁగడు బ్రహ్మ దీనిని నిసీ! మగనాలుగఁ జేసెనంచు లో
మిడుకుచు దాని యింటికడ మీసలు దీటుచు నుందు రెప్పుడున్. 216

సీ. పనిలేని పని పూనుకొని వచ్చి ముంగిలి
నెలవుగఁ దిరుగని నీటుకాఁడు
వేఱొక్కకడ కేఁగు వేళల నటు తొంగి
చూచిపోఁ దలఁపని సొగసుకాఁడు
సంగడికాఁ డిందుఁ జనుదెంచెనా? యని
వాకిలిఁ ద్రొక్కని వన్నెకాఁడు
గానుగ యీ ప్రొద్దు కట్టలేదా? యంచుఁ
గూర్చి యింటికిరాని కోడెకాఁడు

తే. మందునకు నైనఁ బ్రాయంపు మనుజులందు
వెదకి చూచిన నొకఁడైన వీటిలోనఁ
గలుగఁ డటువంటి మహిమ గల్గంగ దాని
కేమి జనవశ్య మున్నదో యెఱుఁగ రాదు. 217

ఉ. ఆ మణిచిత్రిణీ సుదతి యన్యజనోత్కరసంగమంబుపైఁ
బ్రేమ జనింప నాత్మ పిరువీకులు పెట్టఁగ వీటిలో విట
స్వాముల గారవించుఁ గృకవాకు భుజంగమ ధేనుకేభ ము
ఖ్యామిత బంధకేళులఁ గళాదు లెఱింగి కరంగఁ జేయుచున్. 218

తే. ప్రేమఁ గన్పట్టి వేఁథిలో బెళుకు మగల
సరసి కనుసైగ చేసేడి యంద, మంత
లోనె లోఁబడఁ జేయంగనైన నేర్పు
దానికే కాక కలుగ దేచాన కైన. 219

తే. ఇరుగుపొరుగింత వినకుండ నింటిమగఁడు
తెలియకుండఁగఁ బరరతిఁ దేలి నంగ
నాచివలె నుండుఁ గాని యా నాతిగుట్టు
బ్రహ్మదేవునకైనను బయలుపడదు. 220

వ. వెండియు నయ్యండజయాన విటకాండంబులఁ గూడి యఖండమోహంబునఁ
బలుదెఱంగులఁ జరించుచుండె నివ్విధంబున. 221

## వసంతము

ఉ. అంత వసంతవేళఁ జెలువంతతట నెంతయు సంతసిల్లె న
త్యంతలతాంతకుంతసమరాంతదురంతనితాంతతాంతతా
శాంతికరంబు కంతుశరసంతతి సంతత కాంతతాసమా
క్రాంతవనాంతరంబు కలికాతతి దంతురిత ద్రుమాంతమై. 222

తే. కలయఁ గొమ్మలతోఁగూడి కాననమున
నుండువిటపుల ననిలచోరుండు పట్టు
కొని దళాంబరముల దోఁచుకొనియె ననఁగఁ
బండుటాకులు గాడ్పులుపర్వ రాలె. 223

క. వనలక్ష్మి మాధవ శో
భనమగు నత్తఱిని బాదపలతా పురుషాం
గన లన్యోన్యము క్రీడిం

చిన నెరయు వసంతమనఁగఁ జివురులు మొలిచెన్. 224

చ. వనకమలారుణాంబర షువారితకుంజ పికౌఘశోణిలో
చన ఘృణిమండలంబు తరుసంఘ దిగంబరపంక్తి మస్తకో
కనదభ సజ్జటావృతము కాననమేఘు తటిల్లతోత్కరం
బనఁగ నవీన పల్లవచయంబు రహించె నరణ్యభూములన్. 225

చ. ఆళితతి డక్కి డొల్ల కుసుమావళి చుక్కలనామ ముల్లస
త్కళికలు పూసపేర్లు నన దట్టపు బట్టగఁబూని మావిజా
జులకు శుభాశుభాలు పికసూక్తులు దెల్పుచుఁ జైత్రకుం డనే
యల బుడబుక్కివాడు కలయన్ జరియించె వనాలయంబునన్. 226

చ. అళికుల గానవైభవము హర్ష మొనర్పఁ బరాగపూగ మన్
చలువపుఁదావి గందవడి సమ్మదమీయఁగఁ గల్కిచిల్క ప
ల్కులు నలరింపఁ గ్రొత్త విరిగుత్తి చనుంగవ లింపునింపఁ బొ
ల్పలరు లతాలతాంగులను జాయుట లెట్లగుఁ బల్లవాళికిన్. 227

ఉ. చారుతరాతపత్రములు చామరముల్ సురటీలు పావడల్
సారతరోత్తరీయములు చల్వపు వల్పెపు దుప్పటంబు లిం
పారు సుగంధలేపనము లందముఁజిందు వితానపంక్తులై
మీఱె వనీరమాసతికి మెల్లనిగాడ్పుల రేఁగు పుప్పొడుల్. 228

వ. ఇత్తెఱంగున జగన్మోహనంబైన వసంతసమయంబున నవనీసురాదు లగ్నిష్టోమంబును
షోడశ్యాప్తోర్యామంబు ద్వాదశాహస్సు వీజపేయంబు పౌండరీకం బతిరాత్రంబు
చయనంబు గరుడచయనం బశ్వమేధంబు గవాలంభనంబు ప్రతిపత్స్తోమంబు
మహావ్రతంబు విశ్వజిత్తు రాజసూయంబు సర్వతోముఖంబు విశ్వతోముఖంబు
సత్త్రయాగంబు బృహస్పతిసవనంబు ప్రాతస్సవనంబు మాధ్యందినంబు సౌత్రామణియు
నాగ్నేయం బుషస్యం బాశ్వినంబు హేమంత ప్రచ్యవరోహణంబు వృషభయజ్ఞంబును
మొదలగు సకలక్రతువు లొనరింపం దొడంగి రట్టిసమయంబున. 229

క. హరిశర్మ యనెడు పేరునఁ
బరఁగిన యొకసోమయాజి పనిచిన నొకభూ
సురసుతుఁ డొకదిక్కున న
ధ్వరపశువును బట్టుకొని ముదంబున రాఁగన్. 230

క. కంతు వసంత జయంతులఁ
బంతంబున గెల్చు నతని భవ్యాకృతి న
త్యంతముదంబునఁ గన్గొని
కంతు శరాహతుల కళికి క్రాఁగుచు నాత్మన్. 231

చ. కలికి చౌకాటపున్ సొగసుకాయము కాయజుఁ గేరిమీఱు నీ
కలికి వయోవిలాసు బిగికౌఁగిఁట సొక్కుచునుండలేని యా
కులుకు టొయారిగబ్బి నసగూఁటి మిటారుల యందమేల? యె
మ్మెలపస యేల? యం చతనిమీఁదను గొంత దృఢానురాగయై. 232

ఉ. చెంతకుఁ జేరనేఁగి ముఖసీమ దరస్మితమొప్ప వారసీ
మంతిని కీయనో! వెలకు మార్చనో! యేటికిఁ గొంచుఁబోయె ద
త్యంతరయానభాగము నటంచును మాటలు దీసిపల్క న

శ్రాంతముదంబుఁ గైకొని ధరామరసూనుఁడు విచ్చుఁగన్నులన్. 233

మ. ఆనవద్యాకృతి యౌవనంబుదగు నయ్యబ్జాక్షి నీక్షించి హా!
వనజాతాసనసృష్టికౌశలము తేవన్ దీని నిర్మించినం
తనె కానంబడె నేర్పరౌననుచుఁ దద్వాణీశుఁ గీర్తించి మె
ల్లనె చేరంజని దానిచెంగటను మేలంబాడుచున్ నిల్చినన్. 234

తే. అలరుకన్నులఁ దేలించి హర్ష మొదవ
సరసమాడుచుఁ గనుసైగ నెఱపి వేగ
నింటికేఁగిన నచ్చెలి వెంటనేఁగి
క్రతుపశువు నాతఁ డొకచోటఁ గట్టివైచి. 235

వ. అప్పుడు. 236

క. మోహంబుమీఱఁ గంద
ర్పాహవమున వారలిరువు రతుల ప్రౌఢిన్
బాహాబాహి కచాకచి
దేహాదేహిని బెనఁగి ధృతినున్నంతన్. 237

ఆ. దానివిభుఁడు వచ్చి తలుపుదీయు మటంచుఁ
దనదు సతిని బిల్వ విని విటుండు
కడుభయంబు వొడమఁ గంపితదేహుఁడై
యింక నెట్టులనుచు నింతి కనియె. 238

ఉ. అత్తఱి నెట్లు బొంకి వసుధామరశేఖరుఁడైన యా జం
గోత్తము వెళ్లనంపవలె నుత్పలగంధసుగంధి! లెస్సగాఁ
జిత్తములోన యోజనలు చేసుక తెల్పుమటన్న హంసతో
బిత్తరి నేనెఱుంగ నిది పెంపుగ నీవు వచింపు నావుడున్. 239

క. మంచి దిది విను మటంచున్
గాంచనగర్భాశ్వ మబలఁ గన్గొని పలికెన్
బ్రాంచ న్మధుర సుధారస
చంచ న్మకరంద బృంద సదృశ మృదూక్తిన్. 240

ఆ. లలన నటుల భర్త పిలిచినఁ దా విని
వసుమతీసురుండు వడఁకుచుండ
వెఱవ వలదటంచు వీపు దట్టి లతాంగి
వేగ మేకపోఁతు విడిచి పెట్టి. 241

తే. "పొదువు పోనీక పట్టుము భూమిదేవ
వర్య!" యనుకొంచు వచ్చి కవాటము గడె
యెడపినంతనె తద్భర్త యింతి తోడ
"నెవ్వఁ డీతండు? గజిబిజి యేమి?" యనుచు. 242

చ. గదిమిన నా వధూటి కలఁగంబడ కాత్మ భయంబు లేక "భూ
మిదివిజుఁ డితఁ డీ సవనమేషముఁ బట్టుక పోవఁ ద్రాడు చే
వదలిన వేగవచ్చి మన వాసముఁ జొచ్చుక చిక్కకుండినన్
బదపడి తల్పు మూసికొనఁ బల్మఱు మేషము ద్రిప్పు లాడెడిన్. 243

క. చూడు" మని చూపి, "బాపన
బోడిక ముగ్ధుండు మేకపోఁతును బట్టి
మ్మేడకుఁ బోవలెనో" యని
చేడియ చెప్పిన నతండు చిఱునవ్వొలయన్. 244

తే. తఱిమి మేషంబు పట్టిచ్చి తఱలు మయ్య
బ్రాహ్మణోత్తమ! యని పంపి భార్యమీఁద
సందియము లేక యెప్పటి చందమునను
వేడ్క లిగురొత్తగా నుండె వెలఁది మగఁడు. 245

క. ఈ మర్యాదఁ జరింపం
గా మహిమ యొకింత నీకుఁ గలిగిన భూమి
స్వామినిఁ జేరఁగఁ బొమ్మని
హేమావతితో మరాళ మిట్లను వేళన్. 246

సీ. కృకవాకు కంఠకీచక నివృత్తి కదంబ
కములకుఁ బడమటికడ మరుత్తు
బహుళ నిద్రాముద్ర పద్మకానన పద్మ
భవనను మేల్కొల్పు పాఠకుండు
చక్రవాక ద్వంద్వ సంబంధ సంధాన
శేముషీ భూషణ చేటకుండు
సురమార్గ దీర్ఘికాంతర తీర బిసఖండ
భక్షణాయాత వలక్ష పక్షి

తే. భూరి కైరవ వనరమా ముఖ వివర్ణ
భాగ సంపత్కరంబైన పగలువత్తి
కులట లెదస్రుక్కుఁ జోరులు గుట్టలెక్క
వేగ జనియించె జిగినిక్క వేగుఁజుక్క. 247

చ. అపుడు కథాచమత్కృతికి నద్భుతమై తలఁదిప్పి యద్దిరా!
నిపుణత! తద్ద మెచ్చఁగల నేర్పరి వౌదని పల్కి యంత న
చ్చపలమృగాక్షి దివ్యమణిసౌధములో విరిదమ్మిపాన్పుపై
విపులనృపాలమోహపరివేదనచే శయనించెఁ బొక్కుచున్. 248

వ. ఇట్లు శయనించి కొంతతడవు నిద్రించి హేమావతి రాజదూతి యగు హేలతో ముదంబున
నిట్లనియె. 249

చ. కల యొకటేను గంటిఁ గలకంఠ సుకంఠి! శుకాశ్వకేళికా
కలితకళాకలాపపతిగాఢభుజాపరిరంభణక్రియా
సలలితపారవశ్యసుఖసంభ్రమగుంభనజృంభమానపుం
గలనల మేలుకొంటి రవిఁ గంటి నకుంఠతరోదయోపరిన్. 250

వ. అనిన హేమావతింగాంచి నీ యిష్టంబు శీఘ్రంబునన యీడేరు నని దూతి చెప్పిన విని
సంతోషించి యమ్మగువ క్రమ్మర దినాంతంబున. 251

తే. నీలకాకోల కాకోల నీల నీల
కంఠ శ్రీకంఠ శ్రీకంఠ మనఘనాఘ
మనఘనాఘ ఘటాఘట ఘటన రుచుల

పెంపు గనిపించు చీఁకటి పేర్చువేళ. 252

క. నలుగిడి కుంకుమ పిండిని
దల సంపెఁగనూనె నంటి తావుల గంధా
మలక మొసఁగి పన్నీటన్
జలకం బొనరించి చల్వఁ దడియొత్తి వెసన్. 253

సీ. చీని కలంకారి చీటి కుచ్చుల మీద
సిరిమించు సరిగంచు చీరఁగట్టి
కొదమ రాచిల్కలఁ గూర్చి తీర్చు కసీదు
సవురు మేల్పని చల్వ అవికఁ దొడిగి
తళుకు మానికపు నిద్దా చెక్కడపుఁ బైడి
సొమ్ములు నెమ్మేన నెమ్మిఁ దాల్చి
కమ్మ నెత్తావి చొకాటంపుఁ గలపంబు
నెఱనీటుగా మెడనిండఁ బూసి

తే. తుఱుము లోపల నరవిరి సరులు దుఱిమి
వేడ్కఁ గపురపు బాగాలు వేసికొనుచుఁ
గులుకు జిగిబిగి వగ వింత గొలుప వచ్చె
బోటి లావణ్య మదన వధూటిఁ బోలి. 254

క. వచ్చి తన మ్రోల నిలిచిన
యచ్చపలమృగాక్షిఁ జూచి హంసము భళి! నిన్
మెచ్చితి నీ సొగసునకున్
మెచ్చుము కథవిని యటంచు మెలతకు ననియెన్. 255

## ఇరువదవ రాత్రి కథ

### మంత్రికుమారుని భార్యలిద్దరు నిద్దరినిఁ గూడుట

క. ఉజ్జయిని యనఁగ నొకపుర
మిజ్జగతిఁ బ్రసిద్ధికెక్కు నిద్ధ విభా సం
పజ్జలజరాగహర్మ్యచ
రజ్జారాలింగితాప్సరస్స్త్రీగణమై. 256

మ. నెలఱాలోవలు చిల్కు తళ్కు పని వన్నెల్ వన్ను ముత్తెంపుఁ దా
పల కప్రంపు టనంటిమొగ్గ మగఱా బల్బోదె దంతంపు సి
స్తులు గుల్కుం బవడంపుఁ జాపులు రహించున్ గెంపుఱా యోడుబి
ళ్ళుల నిద్ధంబగు నిల్వుటద్దముల మేడల్ వేసవే లప్పురిన్. 257

చ. పురవన భూజ పుష్పఫలముల్ గొను వేడుకఁ బూని తద్ద్రుమో
త్కరములమీఁది కెక్కి సతతంబును దండల నుండు నందన
స్ఫురదురువృక్షపంక్తి సుమముల్ వెసఁగైకొని కొప్పులం దలం
కరణ మొనర్తు రాపురిని గల్గిన భిల్ల సుపల్లవాధరల్. 258

వ. ఇట్టి పురంబున. 259

మ. చతురోపాయసమర్థుఁ డప్రతికళాచాతుర్యధుర్యుండు వి
శ్రుతకార్యజ్ఞుఁడు రాజనీతిపథదక్షుం డింగితజ్ఞాని య
ద్భుతశక్తిత్రయపారగుండు గుణసంపూర్ణప్రభావుండు సం
తతభూపాదరణీయుఁ డొక్కరుఁ డమాత్యశ్రేష్ఠుఁ డుండుం బురిన్. 260

తే. అతని నామంబు బహుమానుఁ దండ్రు జనులు
మానినీరత్నమ! పరాకు మాని వినుము
భర్తృహరి చెంగటను గీర్తిఁ బరఁగునట్టి
మంత్రిజనులందు మేటి యా మంత్రిజూటి. 261

సీ. నిర్ణయంబా బ్రహ్మనిర్ణయంబు స్వమాయ
విష్ణుమాయయుఁ జర్య కృష్ణచర్య
వాక్యంబు శ్రీరామవాక్యంబు దృష్టి యీ
శ్వరదృష్టి దీప్తి భాస్వంతుదీప్తి
బల్మి భీముని బల్మి పద వింద్రపదవి స
త్యము హరిశ్చంద్రు సత్యము ప్రతిజ్ఞ
రాము ప్రతిజ్ఞ ధైర్యము మేరునగ ధైర్య
మాజ్ఞ సుగ్రీవాజ్ఞ ప్రజ్ఞ గురుని

తే. ప్రజ్ఞ బలము సుయోధను బలము కట్ట
డన భరతు కట్టడి కలిమి ధనదుకలిమి
గాఁగఁ బతి మెచ్చ నఘటన ఘటన పటిమ
నమ్మహామంత్రి రాజ్యభారమ్ముఁ దీర్చు. 262

వ. మఱియు గురు మహాప్రధాన సామంత సేనాపతి ద్వారపాలకావసరిక ఘటికా నిర్ధారక గణక లేఖక పౌరాణిక పురోహిత జ్యోతిషిక నైయాయిక వైయాకరణ మీమాంసక కావ్యకారక దేవతార్చక మాలాకారక పరిమళకారక గోష్ఠాధికార గణాధికారాశ్వాధికార భాండాగారాధికార ధాన్యాధికారాంగరక్షక సూత సూద భేతాళ మత తాంబూలిక తాళవృంతిక నరవాహక చ్ఛాత్రిక చామరిక కళాంచిక శరశారిక కీరమాలిక పాదుకాధారక నర్తక గాయక వైణిక శాకునిక మాగధ వైతాళిక స్తుతిపాఠక పరిహాసక క్షౌరక రజక సౌచిక చర్మకారక ముద్రాధికార పురపాలక వనపాలక నరవైద్య గజవైద్యాశ్వవైద్య పశువైద్య భేరీవాదక మురజవాదక రౌమక శిలాచ్ఛేదక స్వర్ణకారక కాంస్యకారక కుంభకారక చిత్రకారక వ్యావహారిక మృగయాకారక పక్షివాహిక వణహారికోగ్రాణాధికార వైశ్యజనంబు లాదియైన డెబ్బదిరెండు వినియోగంబులవారు సేవింప నతండు వెలయుచుండు. 263

ఉ. వానికిఁ గొన్నినాళ్ల కిల వార్తకు నెక్కినవాఁడు రూపరే
ఖానవపంచబాణుఁ డనఁగాఁ దగు చక్కనివాఁ డొకండు స
న్మానవిభూషణుండు సుకుమారుఁడు దైవకటాక్షవీక్షణా
నూనకృపాప్తిచేఁ గలుగ నుత్సవ మొప్పఁగఁ బెంచి రెంతయున్. 264

తే. పెంచి యెలప్రాయ మొదవఁగాఁ గాంచి యతని
పెండ్లి సేయుద మనుచు సంప్రీతి నొందు
తల్లిదండ్రులతో బంధుతతులతోడఁ
బరిణయము నొల్ల నేనని పలుకుచుండు. 265

కామినీ గర్హణము

ఉ. ఊరక పెండ్లి యేమిటికి నొల్ల నటంటి వటంచుఁ బల్కినన్
వారల కాతఁ డిట్లనియె "వారిజనేత్రల నమ్మరాదు, మా
యారచనాప్రవీణలు పరానుగతేచ్ఛ లింకేమనన్ వలెన్
వారక యాఁడురూపములు వ్రాసిన యింటను నిలురే? బుధుల్. 266

క. కుల మెంచ రాడికోళ్ళకుఁ
దలఁకరు సడి వావి వరుసఁ దలఁపరు నీతిన్
దలకొనరు సత్య మాడరు
కలకంఠులు వారి నమ్మఁగా నెటు వచ్చున్. 267

ఉ. చన్నులకన్న మున్ పొడము సాహసముల్ బెళికించు దృష్టికిన్
మున్నుగఁ బుట్టుఁ బెద్దలను మోసము పుచ్చు మనీష యౌవనా
సన్నతకన్న మున్నె యగు సత్య మసత్య మసత్య మెన్నఁగాఁ
దిన్నగ సత్యమంచు ధృతి దీకొను ధీరత పువ్వుబోండ్లకున్. 268

ఉ. టెక్కులు నెమ్మెలున్ సొగసు తీవియు నాగరికంబు నిద్దపుం
జక్కఁదనంబు జవ్వనము సంపదసొంపు వినోదపున్ వగల్
చొక్కపు వైఖరుల్ వలపుఁ జూపఁగఁ జాతురి గల్గువారికిన్
దక్కిన యట్లు భర్తలకు దక్కరు నిక్కువ మింతు లెంతయున్. 269

తే. గరగరిక నుండు మోహనాకార విభవ
శుభవయః పాక పురుషులఁ జూచి నపుడె
దృష్టి వారలపై నిల్పి తెవులు లేని
దశలఁ గృశియింతు రింతులఁ దరమె తెలియ! 270

క. అని పల్కెడు తత్పుత్రునిఁ
గనుఁగొని తల్లిదండు లాప్తగణములు బంధుల్
వనితాభిముఖునిగాఁ దమ
యనుపమచాతురి నొనర్చి రతిసంప్రీతిన్. 271

క. కుల గుణ రూప ప్రజ్ఞా
దులు గల కన్యకల మానధూర్వహసంజ్ఞన్
జెలగిన యతనికిఁ బరిణయ
మలరఁగఁ గావించి రంత నతఁడు నిజాత్మన్. 272

తే. నెలఁతలను నమ్మరాదని నిశ్చయించి
పోఁతుటీఁగకు నైనను బోవరాని
యొంటికంబపు మేడలం దునిచెఁ దత్స
తీద్వయంబును హితసఖుల్ తెలిసి ప్రోవ. 273

వ. ఇత్తెఱంగున నన్యులఁ బొంద శక్యంబుగాని సౌధంబుల నిజభార్యాద్వయంబును వేర్వేఱఁ
గాపురం బుంచి తత్పరిపాలనార్థంబు పెద్దలగు హితవయస్యల నియమించిన
నచ్చెలికత్తెల తీరున నన్నపానాద్యుపచారంబులఁ బోషించుచుండునెడ
భువనమోహనాకారంబైన యౌవనోదయంబు సంభవించిన. 274

సీ. కంధర కమలారి కార్ముక కంజాత
కాంచనకంబుల గర్వ మణఁచి
పద్మరాగ పటీర పద్మారిఖండ ప

ల్లవపద్మముల సముల్లాస మెంచి
వజ్ర వల్లీద్వయ వసుమతీధర వార
ణారి వారణ వసుధాళిఁ గేరి
కదళికా కాహళ కచ్ఛప కలకంఠ
కనక కర్పూర సంఘముల మీఱి

తే. కచ ముఖ భ్రూ నయన నాసికా గళోష్ఠ
పరిమళ కపోల కోమలపాణి దంత
బాహు కుచ మధ్య గతి నితంబాంక జాను
పద వచోఽంగ స్మితము లొప్పు భామినులకు. 275

చ. తరుణుల కౌనులాకృతులు తళ్కు మొగంబులు చన్నవల్ సువా
క్సరణులు పాణులున్ మెడలు సారనితంబము లారురేకలున్
దరళవిలోచనంబులు పదంబులు మేలు ముణుంగు లారయన్
హరికమలాబ్జచక్రనివహంబు నయంబు రయంబునన్ నగున్. 276

సీ. ధరజయోన్నతి మించెఁ దనరు చన్నులు, కృష్ణ
వర్త్మ ఘనాకృతి వఱలె నెఱులు
కనుబొమల్ ధర్మవిఖ్యాతిఁ గైకొనె ముఖం
బులు నిశాచరకళాకలనఁ గనియె
జలవరసంభ్రమంబులఁ గేరి నాభులు
కటులు మహాబలోత్కటకతఁ దనరె
నీలకంఠప్రియ శ్రీలందె నారులు
గజవైరి గతిఁ దాల్చెఁ గలికికౌను

తే. లమరకాంతల లీలల నవయవములె
పరిహసింపంగ మెఱయు నప్పద్మపత్ర
సదృశనేత్రల కిఁక ధరాస్థలిఁ జెలంగు
చెలువలన నెంత హాసనిర్జితలతాంత! 277

సీ. మెఱుఁగుమోవులు ప్రభాకరబలంబు వహించె
లపనముల్ చంద్రబలంబుఁ గాంచె
జఘనముల్ వసుమతీజాత బలంబందె
గలితబుద్ధులు సౌమ్యబలముఁ జెందె
గురుబలంబు భరించె గుబ్బచన్గవలు న
ఖంబులు శుక్రబలంబుఁ బూనె
మందబలంబు సమ్యగ్యానములు దాల్చె
స్వర్భానుబలముఁ గచంబు లొందె

తే. నతనుకేతు బలంబూనె నలరుకన్ను
లిట్ల సకలగ్రహబలాప్తి నెనసియు సుమ
నోజ బలవేధఁ దత్సతుల్ నైజనాథ
బలము చాలక కోరిరి పరబలంబు. 278

వ. ఇవ్విధంబున నివ్వటిల్లి యౌవనగర్వాతిరేకంబున నిర్మానుష్యంబులగు సౌధాంతరంబుల నుండుటంజేసి పంజరబద్ధకీరంబులదారిని నపారజారవిహారవిచారపూరితమానసలైన యా మానసకాసారగభీరనాభులు స్వాత్మగతంబున. 279

క. పతిరతిఁ దీఱదు తమి పర
పతిరతి యేరీతి దొరకు భావంబున సం
గతమగు నీవెతఁ దీర్చెడి
హితవరు లెవరని తలంచి రెంతయు వంతన్. 280

సీ. అమరఁ దిర్యగ్జాతులందైన వేయక
నరజన్మమేల యందఁగ నొనర్చె
నొనరించుఁగాక నింపొదవంగఁ బురుషులఁ
జేయక మమ్మేల స్త్రీలఁ జేసెఁ
జేయుఁగాక రతీచ్ఛఁ జెందువానికిఁ గూర్ప
కీరీతి నిర్మోహి కేల కూర్చెఁ
గూర్పుఁగాక యథేచ్ఛగొని చరింపఁగ నుంచ
కీ దుర్గమస్థలి నేల యుంచెఁ

తే. గటకటా! మాయెడఁడా పాపకఠినహృదయుఁ
డాయెఁగాఁబోలు వాణీశుఁ డటులఁగాక
యున్న నిట్లేల చేయ నం చువిద లాత్మఁ
బరితపింతురు మరుజారి విరహమొదవ. 281

వ.ఇట్లు తమకు వలయునెడఁ బడఁతులగొడవ తడవని తమ యొడయఁడు తమ్ము
మిగులఁ గూడిమాడి యుండమికి దుర్గమస్థలసంస్థితలగుట జారక్రీడకుఁ బొసఁగమికిఁ
గంతుశరసంతతసంతాపమ్మునకు సంతపించుచుఁ జిన్ననాఁటనుండియును
దమ్మునెత్తిపెంచిన దాదులకు సైతము నెఱుంగనీయక యొండొకతెఱంగున
నయ్యంగనలు మెలంగుచుండి రయ్యెడ సువర్ణయను తదగ్రభార్య మోహంబున
మదనాదుల నుద్దేశించి తన మనంబున. 282

సీ. నీ సుమశరముల నీసుమ సమ హాస
నీ సుమతిని నేయ నేల? మదన!
నీరాక కులుకు నన్నీరాఁక విడక పో
నీరా! కళాకర! నీరజారి!
ఘనమార్గ ముడిగించి ఘనమా? వధూవధ
ఘనమా విషాపాది వనరె? నిన్నుఁ
బవమాన! కరుణ నింపవ! మానగతిఁ జరిం
పవ మానమున కల్కుపడవు నీవు

తే. మధురధర్ముఁడు సర్వజ్ఞమౌళి సురప
థానువర్తి మహాబలుం డనెడు నిజమ
హత్త్వములు మాని యిట్లు స్త్రీహత్యఁ జేయు
చున్న మీరీతి నెవరైన విన్న నగరె? 283

క. తారాధిప! రజనీకర!
కైరవ భేదన సమర్థ! గౌరీశ శిరోఽ
దూర! కమలాభి శంసన
కారణ! వారాశి భంగ కార్యభ్యుదయా! 284

చ. పరిధి మిషంబు, మూలికల బంతి కళంకపుఁ గావుబొట్టు భీ
కరకిరణంబులన్ జడలు కౌముది భూతియుఁ దాల్చి మంత్రివై

విరహులఁ జంప సాగితివి వేయన నేమిటి కూరు ముక్కఁడిం
బరఁగిన తోడుబోఁతుల రవం బనుమాట నిజంబె పో! శశీ! 285

క. కీరమణీ! నీ కోడక
కీరమణీ రత్న మిదియ కిల్బిష మతివే
కీ రమణీయపుఁ జనవు శు
కీరమణా! కాని వారె కీరాలాపల్. 286

మాటి మాటికి వేఁడు సీమాటి యెడలఁ
బాటి దప్పిన వార లేపాటి వారు?
కావున దయార్ద్రబుద్ధి నన్గావు నీకుఁ
దేఁటి! నామీఁదఁ గోప మింతేటి కరయ. 287

క. పికమా! ఘోరాకృతి చూ
పిఁక మాదృశ విరహిణుల రతీశ మహోద్ధీ
పకమార్గము చూపఁగ నో
పిక మానసమూని యేఁచి బింకమె నీకున్? 288

వ. అని వెండియు నయ్యండజయాన పెక్కుతెఱంగుల నయ్యనంగుని సైన్యసమేతంబుగఁ
బలుకుచున్న సమయంబున దైవయోగంబున 289

ఆ. ఆ సువర్ణమందిరాంగణమున నొక్క
పాదుకాద్వయంబు పడియె నంత
దాని వెంబడిన మహీనిర్జరుం డొకఁ
డతిరయఘునఁ బడియె నంగ మద్రువ. 290

వ. ఇట్లు పడిన యప్పుడమి తెఱగంటి కొమరు నత్యనుపమమోహనాకారు నిరీక్షించి
భయవిస్మయహర్షాదులు ముప్పిరిగొనుచిత్తంబున డాయంజని యొంటిపాటగుట
వివిధోపచారంబుల సేదఁ దీర్చి, నీ వెవ్వండ? :విట్లిందుఁ బడుటకు నిమిత్తంబేమి యనిన
నా సువర్ణకు నతం డిట్లనియె. 291

మ. హిమవత్పర్వతమందు మందుఁడను మౌనీంద్రుం డొకండుండు సం
యమిచంద్రుండు తపఃప్రభావుఁ డల సన్న్యాసిన్ వెసన్ మోసపు
చ్చి మహాభ్రస్థలి వాయువేగమున వేంచేయన్ సమర్థంబులై
యమరం బావలు, వానిఁ బూని చనుచో నాకాశమార్గంబునన్. 292

ఉ. మున్నలవాటులేమిఁ బదముక్తములై పడె నిందుఁబావ, లే
ను న్నిలుపోపలేక దివినుండిట వ్రాలితి నట్టి పావలెం
దున్నవొ చూపుమంచనిన నుగ్మలి యందొకచోటఁ గాంచె మేల్
సొన్నపుసన్నపుంబనుల సొంపుఘటింపఁగఁజాలు పాదుకల్. 293

వ. వాని గ్రహించి యచ్చంచలాక్షి యాహారాదివిధుల సంతుష్టుం జేసి యా బ్రాహ్మణకుమారు
నెత్తుకొని తత్పాదుకాసామర్థ్యంబున నిలయనికటనిజపతికేళికారామంబు చేరి
తదనంతరంబ. 294

ఆ. తగిన ప్రహరిగోడ దక్షిణోత్తరముల
నలరు వెడఁదకూట మందమొందు
మందిరంబుగాంచి యందొక్కయఱఁ దన

పడకటిల్లు చేసెఁ బద్మనయన. 295

ఉ. అందొకయింతసేపు వసుధామరపుత్త్రునితోడ వేడుకన్
గెందలిరాకువిల్తురణకేళిని దేలి యజస్రమిట్లు పొ
ల్పొందిన యిప్పురంబున శుభోన్నతిచే వసియించినన్ రతిన్
జెంది సుఖింపు నీ వితరచింతలు మానుము భూసురాగ్రణీ! 296

క. నీ కితరభయంబులు రా
నీక మెలంగుదునటంచు హితవుఁగఱపి బి
బ్బోకిని యతనికి వ్యయమున
కై కొంతపదార్థ మిచ్చి యనిచెన్ బురికిన్. 297

వ. ఇట్లతనిఁ బ్రియపూర్వకంబుగా నాదరించి సెలవొసంగి క్రమ్మరఁ దనయిల్లు చేరె
నివ్విధంబునఁ దత్పాదుకాసామర్థ్యంబున. 298

క. కేళీవనమున సముచిత
కాలంబున నతనితోడఁ గంతురణక్రీ
డాలలితసౌఖ్యవారిధి
నా లోలమృగాక్షి యోలలాడుచునుండెన్. 299

వ. ఇవ్విధంబునఁ బ్రథమభార్య సుఖించె నంత ద్వితీయభార్యయగు సుప్రభయు
సపత్నిరీతినుండియుఁ బరపురుషవాంఛ వొడమి కడుమిడుకుటంజేసి యేచందంబునం
బ్రొద్దువోక యొక్కనాఁడు సౌధాగ్రంబున. 300

క. ఆ సుప్రభ సంగీతక
ళాసరసత గలదియౌట లలితముగ సము
ల్లాసమున వీణమీటుచుఁ
జేసెన్ గానంబు సౌధశిలలు స్రవింపన్. 301

క. సురపథమున నపుడొక ముని
యరుగుచు నిజగాననిస్వనాకర్ణనవి
స్ఫురితానందంబున నట
కరుదెంచిన లేచి చూచి యతనికి మ్రొక్కెన్. 302

ఆ. మ్రొక్కి నిలిచి వనిత మునితో స్వవృత్తాంత
మంత మనము గరగునటులఁ దెలిపి
“దేవ! నీవు రతులఁదేలించి ననుఁ బ్రోవు”
మనుచు వేఁడుకొనిన నబలఁ జూచి. 303

“నేను విజితేంద్రియుండను గాన సతులఁ
జెందఁగారాదు నాకుఁ బూర్ణేందువదన!
యైన నీయిష్ట మీడేరునట్టి నేర్పు
తెలియఁజెప్పెద విను”మని తెఱవకపుడు. 304

వ. కారుణికాగ్రేసరుండై యొక్క సిద్ధమంత్రంబు చెప్పి యీ మంత్రస్మరణంబున
వలయునెడకుం బోయిరావచ్చుఁ గావున నీవాంఛితంబు దీనం దీర్చుకొమ్మని యానతిచ్చి
మౌని విచ్చేయుడు, నంత నాకాంత యత్యంతసంతోషంబున నొంటిపాటైన
సమయంబున. 305

క. ఆ రాజన్మంత్రస్మృతి
నారామముఁ జేరియున్న యపు డచ్చటికై
చేరిన తద్వనపాలుని
మారసమాకారుఁ జూచి మది ముద మొదవన్. 306

తే. ఓరచూపులఁ జిన్నెల బేరజముల
మనసుఁ గరఁగించి తనమీఁద మరులుగొలిపి
వానిఁ దోడ్కొనిపోయి యా వాలుఁగంటి
కడమయఱలోన రతికేళిఁ గలిసి చనియె. 307

క. అది మొదలు వానిఁ గవగొని
మదవతి యారామమధ్యమందిరమున నిం
పొదవఁగ రమింపఁ దొడఁగెను
మదనుఁడు విల్లెక్కుడించి మరలిచనంగన్. 308

ఉ. అంతట నొక్కనాఁటి నిశియందు శశిగ్రహణంబుగానఁ ద
చ్ఛాంతికి స్నానదానములు సల్పను వేకువజాము వచ్చు ప
ర్యంతము పట్టు నందనుక రాఁడిపు డింటికి నాథుఁడంచు దా
దెంతయు వచ్చి చెప్పిన మృగేక్షణ ఆత్మల వేడ్కలూనుచున్. 309

వ. ఒంటిపాటైయున్న సమయంబున. 310

తే. జలక మొనరించి జిలుగు వల్వలు ధరించి
కమ్మనెత్తావి కలపంబు కలయనలఁది
యరవిరుల కొప్పులమరించి యారగించి
తమ సమర్థతఁ దద్వనాంతరముఁజేరి. 311

క. ఒకరి నొక రెఱుఁగనీయక
సకియలు పడకిండ్లు చేరి చౌశీతిసుబం
ధకళానైపుణి నుపనా
యకులతో రతికేళిఁ బెనఁగులాడెడివేళన్. 312

సీ. ఫణిరాజతల్పంబుపైఁ బద్మనాభుండు
తిన్నగా శయనించు వన్నెఁదెగడి
తనరు శ్వేతద్వీపమున గాఢతమ మొక్క
దెసనుండి పర్వెడు పస హసించి
క్రమమునఁ బుష్పగుచ్ఛముమీఁద మగతేఁటి
మొత్తంబు వ్రాలెడు దత్తు మీఱి
హిమశైలతుంగశృంగమున నీలాభ్రంబు
పర్యాయమునఁ గప్పు భాతి మెఱసి

తే. సారకర్పూరడిండీరహారహీర
తారకోదారధవళాంశువారకలిత
నీరజారాతిబింబ మున్నిద్రరౌద్ర
గతి గ్రసించెను రాహు వక్కాలమునను. 313

సీ. మంత్రికుమారుఁ డామానధూర్వహుఁడు ది
వ్యౌషధం బవ్వనందిందుఁ గలుగు

టెఱిఁగియుండుటఁజేసి హితమిత్రపరిజనా
న్వితముగ దివ్వటీ ల్వెలుఁగ నేఁగి
బదనికగల పాదపముఁ జూచి యది తీసి
కొనిరండు పొండని కొందఱ హిత
వరుల నంపించి వారరుదెంచు నందాఁకఁ
దా విశ్రమింపఁగాఁ దలఁచి తనదు

తే. సతుల కెప్పుడు సంకేతసదనమైన
తద్వనీమధ్యసద్మంబు దండకరుగఁ
బ్రస్ఫురత్కరదీపికాప్రభలు చూచి
పరులెవరొ వచ్చిరని యుపపతులు వడక. 314

తే. వెఱవకుఁడటంచు వెరవుచే వెన్నుఁ జఱచి
యుపపతుల నిండ్లలోననే యుండఁజేసి
నిలయములనుండి వెలువడి నెలఁతలు తన
కెదురుగా రాఁగ మదిఁ గోప మొదవఁ జూచి. 315

తే. పరులకటు తొంగిచూడను బాటుగాని
దుర్గమస్థలి నుండెడి తోయజాక్షు
లివ్వనంబున కేరీతి నెమ్మె మెఱసి
వచ్చినారను సందియం బిచ్చఁబూని. 316

తే. "ఇమ్మహానిశి నిచ్చోటి కేమిపనికి
వచ్చితి?"రటంచు గద్దించి హెచ్చరించు
వల్లభునితోడ నవ్వేళ వనిత లెట్లు
బొంకిపోవలె? నెఱిఁగింపు పంకజాక్షి! 317

క. అని యడిగిన హేమావతి
తనతలఁ గదలించి తెలిసి తానిది వివరిం
పనుజాల నీవె తెల్పుము
వినియెద నన హంస మపుడు వెలఁదికి ననియెన్. 318

తే. మానధూర్వహుఁ డప్పుడా మానవతులఁ
గాంచి వీరలు మత్కులకాంతలనుచు
నిశ్చయించుక రౌద్రనిర్ణిద్రబుద్ధి
"మీర లివ్వేళ నిట కేల చేరినారు? 319

ఉ. చెప్పుఁడు చెప్పకున్న మిముఁ జిత్రముగా వధియింతు"నంచు ఠేఁ
డప్పుడు తమ్మురొప్పిన భయంబు వహింపక యాసువర్ణ సొం
పొప్పఁగ భర్తకిట్లను సుఖోన్నతలీలల నివ్వనంబునన్
దప్పక సంచరించు వనదైవతకాంతల మమ్ముఁ జుల్కఁగన్. 320

క. నీమనమున మద్భామిను
లీ మగువ లటంచు మమ్ము నెంచితి వాదిన్
మేము భవదీయసతులము
గా మస్మత్కళలు నీదు కామిను లనఘా! 321

వ. అదియునుం గాక. 322

క. ఈయెడ మేము చరింపను
మాయంశమ్ముల జనించు మదిరేక్షణలన్
నా యిల్లాండ్రని పల్కితి
వే! యేమి నిమి త్తమనిన నెఱిఁగింతు మొగిన్. 323

తే. చైత్రరథమున మును మేము సరసగతుల
సంచరింపఁగ నవ్వేళఁ జైత్రుఁ డచటి
కరుగుదెంచినఁ గాంచి యనాదరమున
లేవకుండిన సక్రోధలీలఁ జూచి. 324

తే. సాపరాధల మమ్మా వసంతుఁ డరసి
మర్త్యసేవను నూఱేండ్లు మహిని మెలఁగుఁ
డని శపించినఁ బ్రత్యక్ష మటుల నుండఁ
జాలమని మేము ప్రార్థింప సదయుఁడగుచు. 325

సీ. ఆరీతి మీరు ప్రత్యక్షంబున మెలంగ
కున్న నేరంబేమి? యువిదలార!
మీయంశములఁ బుట్టు మెలఁతల మానధూ
ర్వహుఁడను బహుమానవరకుమారుఁ
డగు విప్రునకు భార్యలై యుండ నియమింపుఁ
డని తెల్సి యావేల్పు చనిన, నచటఁ
గూర్మితో నీకు మే ల్గోరుచునున్నవా
రము సుపర్ణయన సుప్రభయనంగ

తే. మామకాంశముల జనించు మనుజసతులు
నీకుఁ గులకాంత లైనారు నిక్క మిదియ
రూపయౌవనసంపదారూఢి నీదు
చానలకు మాకు భేద మింతైనలేదు. 326

తే. ఇట్టి చుట్టఱికం బుండు టెఱిఁగి కాదే
నిను సహించితి మితర భూజనులు మేము
మెలఁగుచోటికి నివ్వేళఁ బొలసినపుడె
చెడ శపింతుము నీవింక నుడియరాకు. 327

క. చుట్టఱిక మెంతగలిగిన
రట్టున రారానియెడకు రా వారలపై
నెట్టి సుబుద్ధులకైనను
బుట్టును రోషంబు దానఁ బుట్టున్ జెట్టల్. 328

క. కావున నీ విచటికి నిఁక
రావలదు వసంతశాపరాహితలమై మా
దేవవని కేఁగినంతట
నీవిట నెమ్మదిఁ జరింపు నీయాప్తులతోన్. 329

క. అని సంతోషము భీతియు
జనియింప సువర్ణపలుకుజాడనె పలికెన్
వనితామణి సుప్రభయును

విని తద్వాక్యములు మాని విభుఁ డపు డాత్మన్. 330

ఆ. ఏపు జవ్వనంబు రూ పొక్కటైయుండు
టాత్మసతులు వీర లనుచు నుండి
నేము నీసతులను గా మస్మదంశజ
లీ లతాంగులని రిదేమొ సతులు. 331

క. ఇంటికిఁ జని కనఁదగు వా
ల్గంటుల నీపలుకు లాత్మకామిను లింటన్
దొంటిగతి నున్న సత్యం
బింటను లేకున్నఁ గల్ల యిది దృఢ మరయన్. 332

ఆ. అనుచు నిశ్చయించి యతఁ డింటి కేఁగెను
వానికన్న మున్నె వనజముఖులు
నిజసమర్థతాప్తి నిలయంబులకుఁ బోయి
పవ్వళించియుండి రవ్విభుండు. 333

చ. వెసఁ జనుదెంచి యింట నళివేణులఁ గన్గొని తద్వధూవచో
విసరము సత్యమౌననుచు వేడుకఁగైకొని తప్పునిద్రలం
బసగలహంసతూలికలపాన్పులపై శయనించియున్న యా
త్మసతుల లేపి తొంటి వనితావిముఖత్వము మానె మానినీ! 334

తే. అరమరలులేని కూటమి నధిపుఁ డపుడు
కులవధూటుల నెంతయుఁ గుస్తరించి
పచ్చివగదేరు రతులతో నిచ్చనిచ్చ
లిచ్చకము పుట్టఁజేయుచు నెనసియుండె. 335

క. ఈమహిమ నీకుఁ గల్గిన
భూమివిభున్ రతులఁ గలయఁబొమ్మని హంస
గ్రామణి వినిపించిన విని
హేమావతి మెచ్చుకొని ఖగేంద్రుని కనియెన్. 336

తే. జనపతిని జేరఁబోనీక దినముదినము
కతలు చెప్పఁగ సాఁగితో కతలకారి!
చిన్ని రాయంచ! యిఁకనైన సెలవొసంగు
పోయివచ్చెద నన హంస పొలఁతి కనియె. 337

క. ఇరువది దినముల కింటికిఁ
బరతెంతునటంచు నీదుపతి చనుచో నా
కెఱిఁగించె రేపవశ్యము
బరతెంచునుగాన నీకుఁ బఱవం దగునే? 338

చ. నరపతిఁ జేర దర్శకరణక్రియలన్ దగఁ బ్రొద్దువుచ్చి ని
ద్దురగొనియైన రాజు నినుఁదోడనె పొయఁగలేనికూర్మి మం
దిరమున కేఁగు మంచనక నిల్సిన నిల్చుటలైన నింటిలో
దెఱవరొ! నీవులేమి నరుదెంచిన నీపతి కేమి దోఁచునో! 339

క. కావున భూవిభుఁ జేరం

బోవుట కార్యంబుగాదు పొమ్మింటి కటం
చా వనజాక్షికి హంసధ
రావరమణి దెల్పునపుడు రవి యుదయించెన్. 340

తే. అంత హేమావతియు హృదయాంతరమున
భూమివిభుమీఁది మోహంబు పొంగిపొరలఁ
బడకయిలు సేరి వేఱొక్క పగిది నుండె
నపుడు తత్పతి సహచరుం డరుగుదెంచె. 341

క. అదిగో! నీపతి వచ్చెన్
ముదమున నగరోపకంఠ భూమిని విడిసెన్
సుదతి! నినుఁ జూచి రమ్మని
పదరక ముందుగను నన్నుఁ బనిచెన్ వేడ్కన్. 342

క. అని చెప్పినఁ దద్వాక్యం
బనలశిఖాతప్తకీలమై చెవి నాటన్
ఘనభయ విస్మయ లజ్జా
తను హర్ష భరాదు లాత్మఁ దగిలిన వగతోన్. 343

ఉ. దిగ్గున లేచినిల్చి సుదతీమణి భూవిభుమీఁది బుద్ధితోఁ
దగ్గుచు మ్రగ్గ నిగ్గు సిరి తగ్గని తామరమొగ్గదోయి బల్
జగ్గుల మొగ్గు లింపెసఁగు చక్కని చిక్కని గబ్బి గుబ్బలున్
సుగ్గడితంపుఁ బయ్యెదయు సొంపగు క్రొమ్ముడిఁ జక్క దిద్దుచున్. 344

ఆ. ఓడ బేరమాడ వేడుకఁ దానేఁగి
నదియు మొదలు శుభమె యందఱకును?
ననుచు బాంధవాది జనుల యోగక్షేమ
మడుగ భద్రమఖిల మనియె నతఁడు. 345

క. వెండియు నిట్లను మదవే
దండ లసద్గమనతో సుధారసధారా
పాండిత్య మండితోక్తులఁ
బండితమండలికిఁ జెవుల పండువు గాఁగన్. 346

క. జనపదములు పురగిరులున్
గనులు వనులు నదులు నిధులు కట్టల్ మిట్టల్
కనుమలు పేఁటలు తోఁటలు
మునుకొని కనుఁగొనుచుఁ బోయి మ్రొలన్ లీలన్. 347

సీ. ముజ్జగంబును బూతముగఁ జేయనగు ధౌత
వనభంగ గంగ యెవ్వనికి భార్య
దేవావనోత్సాహ దృఢకళాసందోహ
మున ముంచు చంద్రుఁ డెవ్వనికి సుతుఁడు
కడలేని సిరులీనఁగల రమా గజయాన
యలరారు నెవ్వాని యనుఁగుకన్య
బహుళ పద్మభవాండ పరిపాలనా ఖండ ,
వాత్సల్య శౌరి యెవ్వనికి నల్లు

తే. డట్టి నక్ర ఢులీ కుశీరాళి వాశ్చ
రావళీయాన కేళీ మహాబహూర్మి
మాలికా డోలికా పాళికా లసన్మ
రాళికోల్లాసి కలశవారాశి డాసి. 348

వ. సభయభక్తి నమస్కారంబుఁ గావించి, తదుత్కట తటంబున. 349

సీ. జాతి విలాయతి సకలాతు మేల్కట్లు
కాబల పసకి ముఖాబులోవఁ
బైరిణీ జర బాబు పసల గోడ సరాలు
మేలరబ్బీ మొకమాలు దిండ్లు
గోవ బూర్నీసు నిగ్గుల బిల్ల సంతన
బలుచీనీ హొంబట్టు ప్రగ్గములును
దగటు రుమ్మీ తాపుతా నవారు కసీదు
నేస్తు బందరు చీటి లస్తరీలు

తే. ఖాతువా జంబుఖాన మఖ్మా తివాసు
లరల సుగదాసుల బనాతు లమర దిండ్లు
కాంచనస్తంభములు రత్నకలశతతులు
వాళ్లులును గుజ్జుగుండాగు త్రాళ్లు మెఱయ. 350

క. హితవరులతోడ యుష్మ
త్ప్రతి వేడుక విడిసి సకల పరిమళ వస్తు
ప్రతతులు మౌక్తిక విద్రుమ
వితతులు మొదలైన రస్తు వెలఁదీ! కొనియెన్. 351

## విదేశముల నుండి దిగుమతియగు వస్తువులు

సీ. తళ్కుటద్దంపు నిద్దపు నిల్వుటద్దముల్
దంతపు దువ్వెనల్ తావులొల్కు
నత్తరు పునుఁగును నంబరు గౌళ క
చ్ఛూరముల్ నఖము గంబూర చోవ
జల్లి సవరములు జిల్లరసము కదం
బము గోవ జవ్వాజి పచ్చిపునుఁగు
కురువేరు పచ్చకప్పురము పన్నీరు బే
డెము మలాకెలు కుంకుమమును మంచి

తే. బుక్క కస్తూరి వీణెలు చొక్కటంపు
టగరు సంపెంగనూనెలు నాదియైన
మెచ్చుఁగల దీవులందుండి తెచ్చినట్టి
వివిధ పరిమళ వస్తువుల్ వెలకుఁ దీసి. 352

సీ. గర్గరికలును బింగాండ్లు తాంబాణాలు
గిన్నెలు తంబిగల్ గిండ్లు స్నపన
పాత్రలు చట్లును బానపాత్రలు మేలు
చట్టువంబులు మంచి మట్టిగిండ్లు
సంపుటంబులు గొప్పస్థాలీలు తబుకులు

కంచముల్ తట్లు గంగాళములును
జెంబులు పడిగముల్ చిప్పలు హస్తావ
ళులు కంకణములు ఘంటలును గజ్జె

తే. లాదిగాఁ గల్గు దీవులయందు వెలయు
కంచరపు జాతి వగవగల్ మించఁ జేసి
నట్టి సామగ్రి బహు వెల ల్వెట్టి కొనియెఁ
గాంత! భూకాంతమణులకుఁ గాన్క జేయ. 353

తే. లేటి కొదమల వింతయౌ నేటి పునుఁగు
పిల్లుల జవాజి పిల్లుల బెట్టు రురుల
ముంగిస సివంగి జోణంగి యింగిలీషు
కుక్క గుంపులఁ గ్రోతులఁ గొన్ని గొనియె. 354

సీ. సింపంగి కావులు జందురు కావులు
వెలిపట్టు పుట్టముల్ వేఁట చాళ్లు
జిలుఁగు బొమ్మంచుల లీరలు నాచులు
నుదయరాగంబులు నుడుత వన్నె
లొప్పు ముయ్యంచుల పుప్పాళ్లు హొన్నంచు
వలువలు గరకంచు వస్త్రతతులు
ముత్తేల పందిళ్లు నుత్తర గోగ్రహ
ణములు నిగమగోచరములుఁ బద్మ

తే. పు లతికలు నిండువన్నెలు బొడలు పచ్చ
లును హరిణవళ్లు హంసవళులును రంగ
వళ్లు పొదలును సామంతపదులు ననఁగఁ
దనరెడు పసందు పటములు గొనియె వెలకు. 355

రగడ. చౌకట్లు నొంట్లు బేసరులునున్ మొలకట్లు
రాకట్టు చుట్టుంగరములు బల్చేకట్లు
మురువు లొప్పు కిరీటములు మేటి తాళీలు
సరిపణలు మించులును సాటిలేని తురాలు
రంగుగల ముంగాముఠాలు నాభరణములు
నంగదంబులు మంచి హంవీర తాయెతులు
కంఠమాలికలు జిగిగట్లు చేకడియములు
కంఠసరములు బిరుదు గండపెండేరములు
నందంపు టుత్తరిగెలలరు చిఱుగజ్జియలు
కుందనపుఁ జక్కడము గుల్కు మణిఘంటలును
[3]మితి లేని వెల లిడిన మేఖలలు నందియలు
చకచకల్ గల జాతి సకలమణి నికరములు
నకలంక వర్ణ పట్టాంబర ప్రకరములు
పీతాంబరంబులును బేర్వడిన బురుసాలు
జాతి నీలాదులును సాలువులు చీనీలు
పచ్చపట్టులు తగటు పాగలును నంగీలు
నచ్చపు మెఱుఁగుగల యపురంగజేబీలు
బురుసకాసీలు మహముదులు నిరాసీలు

సరి సేయరాని హంసావళులు లాకీలు
మాదళంబులు వెన్నమడుగులు ముసజ్జీలు
చాదరలు పైఠిణిలు చక్కని కబాయీలు
నడరు చిల్లాని తేంట్లమరు బుర్నీసులును
నడికట్లు మేఘవర్ణంబులును ద్రోపులును
మొకమాలులును సూర్యపుటములు బనాతులును
సకళాతులం దెలుపు చలికప్పడంబులును
హొంబట్టు లోడీలు హొనకా దుకూలాలు
కంబావతులు డాలుగల్గు జిరబాబీలు
వింతవింతలుగాఁగ వెలసిన బవంతీలు
కాంతితతి వెదచల్లఁ గల్గిన సరంతీలు
దుద్దుకంబళ్లు చందువలు తివాచీలు
పద్దులకుఁ గైకొన్న బలుజంబుఖానాలు
ప్రతిలేని పట్టంచు పలురత్న కంబళ్లు
నతులితములైన చతురంగముల వల్వలును
తళుకు పగడపుఁ గోళ్లఁ దగు పట్టె మంచములు
కులుకు నెత్తావి కుంకుమపువ్వు తల్పములు
ఏకరంగి తలాట లిడు గోర లేజీలు
ఢాక చూపట్టు సురతాణి సింగాణీలు
కళలుదేరు పిరంగి కత్తులును జూరీలు
పొలుపొందు నందలపు బొంగులును గేడీలు
వీరికై కొనిన హరబ్బీకెలును వన్నియలు
పేరైన సూరత్తు పింగాణి గిన్నియలు
రాయంచ లైదు వర్ణములైన కీరములు
మాయురే యని యెంచ మరుపట్టు జీనీలు
చీర్ణంపుఁ బనుల మించిన పిరగి పీఠములు
నిర్ణయింపఁగరాని నిఖిల సద్వస్తువులు. 356

క. స్వరమండలములు కిన్నెర
లురజాబులు దండవీణ లురు జారుతరా
ల్వర రావణహస్తంబులు
మఱి తంత్రులు తంబురలు సమస్తము గొనియెన్. 357

వ. అయ్యవసరంబున. 358

## భారతదేశ పుర గ్రామములు

సీసమాలిక. రాయదుర్గము గుత్తి రాయవేలూ రానే
గొంది మాహురి కాశి గోలకొండ
ముంగిపైరిణి ఢిల్లీ ముళువాయ జాబురా
శాదు మఖ్ఖా మహామూదు మచిలి
బందరు సూరతు చెందరు గోవేరు
శ్రీరంగపట్నంబు జింజి కాంచి
బాదయు నౌరంగబాదు దౌల్తాబాదు
కప్పర గాగర గదగు బిదరు

కోట కల్యాణము గొందాన మహాముదా
సగరంబు బంగాళ నరవ గోన
పన్నాళ చదరంగపట్నంబు గలగర
గజరాజధాని బంగాపురంబు
కాంబాగర ప్రయాగ ద్వార కాయోధ్య
లక్ష్మీశ్వరంబు షోలాపురంబు
మధుర కొల్లాపురి మగధ మా యావంతి
కా పురాణపురముల్ కాబలగయు
నాదవేని కళింగ మాదూరు వినుకొండ
కొండవీడును నేలకొండపల్లి
పొదిలి తంజాపురం బుదగిరి కైసూరు
మైసూరు పెనుగొండ మంగళగిరి
బనువపట్నము సీర్సి భద్రాచలము పాల
పంచ నిజాంపురి వందవాసి
కుందుర్తి బెల్లంకొండ దేవరకొండ
రాచర్ల మునిమడ్లు రాయపురము
సైదాపురము గోవ సాళ్వాక దూపాడు
రాపర్తి మాచెర్ల రాచవీడు
బనగానిపల్లె కంబము పోరుమామిళ్ల
ధారాపురము చీని తాడిపర్తి
నంద్యాల చిరువళ్ళి నందవరము కందు
కూరు రామయపట్న మారుబండ
హంపి విరూపాక్ష మారణి వెంపల్లి
కాంపిల్యనగరంబు కందనూరు
కడప సిద్ధవటంబు గండికోట కసూరు
సింహాద్రి పుట్లూరు చింతకుంట
గయ చెన్నపట్నంబు గండవరం బోరు
గల్లు దామెనచెర్వు వెల్లటూరు
కల్లూరు కలువాము నెల్లూరు వేలూరు
రాచూరు చడుమూరు రాచకొండ
కదిరి కూటాగుళ్ల గంగేరు శృంగేరు
రామల్లకోట వజ్రగిరి నొసుము
సూగూరు చోబాడ బాగూరు కొళ్ళాల
గుడిబండ బళ్ళారి కొత్తకోట
గుమినేనిపాళెంబు గొబ్బూరు బళ్ళాపు
రము పుంగనూ రౌకు రామటెంకి
మాసవ కౌతాళ మానుకొండైనూరు
జలవూరు పెదవలి జల్లికోట
కుంభకోణము కోటకొండ తంజావూరు
పెరవలి దువ్వూరు బెంగళూరు
నొత్తూరు చిత్తూరు హుణి తిర్చనాపల్లి
రాజనోల్ గద్వాలు రాచనగరు
తిరుతని కాళహస్తి సినూరు మధ్యార్జు
నము తిరునామల నాముకొండ

పాకల కావేరిపాక మోహనగిరి
చదుకూరు మల్లూరు చాదుకొండ
పాగొండ వావిలి నాగోలు తాళ్లూరు
మైలాపురము పెద్దమంగళంబు
రామసముద్రంబు రామాపురము జట
ప్రోలూరు వెల్లారి భువనగిరియు
హర్పణహల్లి కొండాపు
రము గౌరి మాయలూ రమరవీడు
నడిగల్లు కొక్కల్లు కడవకొలను రత్న
గిరి వెలిగోడు తంగెళ్ల దర్శి
కంగొంది తరిగొండ గడవనెత్తము దూసి
శివనగ ళ్ళలవంది సింహాళంబు
మన్నారుకోవెల సొన్నగలు చిదంబ
రము వాగె నగరి పురాణపురము
నడియారుపాళెంబు నుడిపి సుబ్రహ్మణ్యా
ముజ్జంగి మండువా హొసవగల్లు
రామనాథపురంబు మాముగోళ్ల బెడంద
ధర్మవరంబును దాడిగోళ్ల
మవణికె మందము మారికాపురి కుంభి
హోరంగ ముజ్జారి హాళికెహళ్ళి
రెట్టిహళ్ళి కురంజి రేపణి సన్నక్కి
పామూరు కనిగిరి పాలువాయి
రామచంద్రాపుర మామూరు బెజవాడ
కొండూరు కాండూరు కోటకొండ
తే. మొదలుగాఁ గల్గు జనపదమ్ములను దుర్గ
ములను బేఁటలఁ బాళేలఁ బురుల వెలయు
వర్తకులు వచ్చి రచ్చటి వస్తుతతులు
బేరసారంబు లాడెడు పేర్మి మెఱసి. 359

క. ఆరీతి వచ్చువారల
కారయఁ దాఁ బిన్నపెద్దయై నీ విభుఁ డిం
పారఁగ వస్తువు లన్నియు
బేరము పొసఁగించి చేసి వెల కిప్పించెన్. 360

ఉ. అంచితబుద్ధి వర్తకజనావళి కిట్లు సమస్తవస్తు లి
ప్పించి తదీయభూములకు వేడ్కఁ జనుండని వారి నెల్ల నం
పించి వృషోష్ట్రవాజిరథబృందముపైఁ దనకొన్న రస్తుఁ బొం
దించి సమిత్రుఁడై యరుగుదెంచెను నీ విభుఁడూరు చేరఁగన్. 361

వ. అనిన విని హేమావతీకాంత సంతోషంబున భోజనాదుల సంతుష్టుఁజేసి తన
యోగక్షేమంబులఁ బతి కెఱిఁగింపు మని యతని నంపి తదనంతరంబ. 362

తే. కథలు రేల్ తెల్పుటయే కాదు కరుణఁ బ్రొద్దు
పోనియపుడెల్ల రాయంచ పూని చెప్పి
నట్టి నయవాక్యముల చేతనైన సన్మ
నీష హేమవతి మంజుభాష యపుడు. 363

క. పరపురుషసంగమం బిహ
పరసుఖదూరంబు గానఁ బాతివ్రత్య
స్ఫురణగల సతులు మదిఁ గో
ర రటంచును నిశ్చయించి ప్రమదంబెసఁగన్. 364

తే. చిత్రభోగునిపైఁ బ్రేమ చిందఁ జేసి
నిజవిభుని రాక కలరి యన్నీరజాక్షి
తనదు గృహకృత్యములు దీర్చుకొనుచు నుండె
నంతఁ దత్పతి యింటికి నరుగు దేర. 365

క. కుందనపు బిందియల హరి
చందన తరుఖండ వహ్ని సంతప్తంబై
క్రొందావు లొల్కు పన్నీ
టం దగ జలకం బొనర్చి తడయక యంతన్. 366

ఉ. ఆ జవరాలు కీలుజడ నంబురుహోత్పల కేసరాలు వ
క్షోజధరాలఁ గప్పుకొను క్రొమ్మగరాల సరాలు నంగుళీ
రాజ వినూత్న రత్నముల రంగు చెలంగెడి యుంగరాలు వి
భ్రాజిత నూపురాలు పదపద్మములన్ సవరించి వెండియున్. 367

సీ. వనచరంబులు గాన వచ్చె మైత్రికి నన
వేణి కాళిశ్రేణి విరుల దుఱిమి
నీటఁ బుట్టిన వోట నెమ్మిడాసె ననంగ
గళ శంఖమున హారములు ధరించి
జలజంబు లౌటనె చెలిమిఁ జెందె ననంగఁ
గర వారిజములఁ గంకణము లుంచి
సారంగజము లౌట సఖిత నొందె నన వ
క్షోజ కుంభములఁ గస్తూరిఁ బూసి

తే. కనకరుచులౌట మిత్రత ననఁగి పెనఁగె
ననఁగ దను హేమలతను మిన్నగు పదాఱు
వన్నె బంగారు పువ్వుల వలువఁ దాల్చి
పతికి నెదురుగ నేఁగె నప్పద్మగంధి. 368

వ. ఆ సమయంబున. 369

సీ. మిసమిస చూపులు మిరుమిట్లు గొలుపంగఁ
గిలకిల నవ్వులు చెలువొనర్ప
ఘలుఘల్లుమని చిఱుగజ్జెలు రొద సేయ
దళధళ ద్యుతులఁ గమ్మలు చలింప
ఝుణ ఝుణం కృతులఁ గంకణములు మెఱయంగ
ఘనఘన ధ్వనుల మేఖల నటింప
ధగధగద్దీప్తి రత్నపు సొమ్ము లలరార
నిగనిగ బావిలీల్ నీటుసూప

తే. భుగభుగలు గల్గు మైపూఁత సొగసు గుల్క
గమగమలఁ గప్రపు విడెంబు గంధ మొలయ

మినమినల్ కుంకుమపు రేఖ మించులొల్క
ఖణిఖణిల్లని మెట్టియల్ కడు రహింప. 370

క. తన కెదురుగ వచ్చిన తన
వనితామణి నపుడు చూచి వదనాంభోజం
బున ఁ జిఱునవ్వొలయఁగ నె
మ్మనమున నానందమొందె మానిని యంతన్. 371

తే. విభుని పదములు పన్నీట వేడ్కఁగడిగి
నెచ్చెలులతోడ వెస నివాళిచ్చి వైచి
యింటిలోనికిఁ దో డ్తెచ్చి యింతులెంచ
భర్తతోఁ గూడ నతిసుఖప్రాప్తి నుండె. 372

వ. అంత హేమావతీకాంత వృతాంత మంతయు నాత్మీయదూతి విన్నవించిన విని
కంపితశిరస్కుండై కొంత తడవు చింతించి, మహారాజచంద్రుండును నీతిజ్ఞుండును
నకళంకుడును వివేకధురంధరుండును గావునఁ జిత్రభోగనృపాలుండు దన మనంబున.
373

ఉ. మున్నల రావణాదులు సముద్ధతి సాధ్వులఁ గోరి యేమి సౌ
ఖ్యోన్నతిఁ జెంది రిట్లగుట నుర్విజనావళు లన్యకాంతలన్
బన్నుగఁ గోరరాదు కడుఁబాతకమంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబు ద్రెక్కొని యథోచితపద్ధతి నుండె భూవరా! 374

క. అనుచుఁ బురోహితుఁ డెఱిఁగిం
చిన నలరాజన్యమౌళి చిత్తాంభోజం
బున నద్భుత ప్రమోదము
లెనయఁగ మెచ్చుకొని రాజ్యమేలుచు నుండెన్. 375

మ. నత సంజీవన! జీవనేశ భయకృన్నారాచ! నారాచర
వ్రత బృందారక! దారికత్యన పదారక్షోభి రక్షోభట
శ్రుత సంధారణ! ధారణార్హమణి భాసుగ్రీవ! సుగ్రీవము
ద్ధతలాలాపన! లాపనద్యుతి చితా తారాప! తారాపహా! 376

క. అక్ష ద్విడ్లక్ష క్షి
ప్తక్షేమ కటాక్ష దక్ష! దక్ష తనూజా!
ధ్యక్షనుత పక్ష! పక్ష
ప్రక్షుణోర్క్షే.మ విపక్ష రక్షా శిక్షా! 377

స్రగ్విణి. పద్మ పత్రేక్షణా! భక్త సంరక్షణా!
పద్మ గర్భస్తుతా! భాను బింబస్థితా!
పద్మ బాణాకృతీ! భవ్యశౌర్యోన్నతీ!
పద్మ సర్వేశ్వరా! పాలితోర్వీశ్వరా!

గద్యము

ఇది కౌండిన్యసగోత్ర పవిత్రాయ్యల రాజాన్వయ సుధావార్ధి పూర్ణిమాచంద్ర
నిస్సహాయ కవిత్వ నిర్మాణ చాతుర్య నిస్తంద్ర శ్రీరామనామ పారాయణ
నారాయణామాత్య ప్రణీతంబైన హంసవింశతి యను
మహాప్రబంధంబునందు సర్వంబును

—: o :—

[1] యతిభంగము
[2] యతి దుర్బలము
[3] ఈ పాదమునకు జతగా మఱొక్క పాదము ఉండవలెను. లేదు.